ఓం　　శ్రీగురవేనమః　　ఓం

# బృహద్వాసిష్ఠము

అను

## శ్రీ శివరామ దీక్షితీయము



సంపాదకులు :

శ్రీ నిత్యానంద కూర్మాచల ప్రభువుల వారి ప్రియశిష్యులు

**శ్రీ బోధానంద కంద్యానం సుదర్శనాచల రాజయోగి**

ఓం

శ్రీగురవేనమః

శ్రీమద్ బృహద్వాసిష్ఠ అచల సిద్ధాంత నిర్ధారణులును

శ్రీమించునచల పరిపూర్ణ బోధ ప్రతిష్ఠాపనాచార్యులు నగు

శ్రీమద్రామడుగు శ్రీశ్రీశ్రీ శివరామదీక్షితాచల ప్రభువుల

వారిచే రచియింపబడిన

# బృహద్వాసిష్ఠము

అను

# శ్రీ శివరామ దీక్షితీయము

## పరిపూర్ణ బోధ అచల సిద్ధాంత గ్రంథము

## జనన మరణ భ్రాంతి రహిత మార్గము

సంపాదకులు :

శ్రీ నిత్యానంద కూర్మాచల ప్రభువుల వారి ప్రియశిష్యులు

**శ్రీ బోధానంద కంద్యానం సుదర్శనాచల రాజయోగి**

ప్రకాశకులు

**దక్షిణామూర్తి అచలాశ్రమ చారిటబుల్ ట్రస్ట్**

గ్రా॥ నర్సప్పగూడ, మం॥ నందిగామ, జి॥ రంగారెడ్డి. తెలంగాణ రాష్ట్రం

# బృహద్వాసిష్ఠ శ్రీశివరామ దీక్షిత - అచల గ్రంథము

ప్రథమ ముద్రణ : 08-04-2022

ప్రతులు : 1000

వెల : రూ॥ 350-00

డిటిపి & ముద్రణ : శ్రీకృష్ణ గ్రాఫిక్స్ & ఆఫ్‌సెట్ ప్రింటర్స్
గౌలిగూడచమన్, హైదరాబాద్.
సెల్: 9966271579, 9177201088

గ్రంథము లభించు స్థలము :

శ్రీ బోధానంద కంద్యానం సుదర్శన్ గౌడ్
శ్రీదక్షిణామూర్తి అచలాశ్రమము
గ్రా॥ నర్సప్పగూడ, మం॥ నందిగామ, జి॥ రంగారెడ్డి. తెలంగాణ రాష్ట్రం
సెల్ : 9705765180

# విషయ సూచిక

## మొదటి భాగము - ప్రకరణములు 12

# అచల గురు పరంపర


శ్రీదక్షిణామూర్తి


శ్రీమహావిష్ణు


శ్రీసూర్యభగవాన్


శ్రీయాజ్ఞవల్కి


శ్రీజనక చక్రవర్తి


శ్రీశుకమహర్షి


శ్రీసాందీపులు


శ్రీకృష్ణ ఉద్ధవులు


శ్రీవేమన


శ్రీ శ్రీధర స్వాములు


శ్రీ శివరామదీక్షితులు


శ్రీ కంబాలారి అప్పబ్రహ్మం


శ్రీపరశురామ సీతారామస్వామి


శ్రీభాగవత కృష్ణప్రభువు


శ్రీమతి శేషమాంబ


శ్రీ బారలింగ ప్రభు


శ్రీమోముల కృష్ణమాచారి


శ్రీకస్సా సిద్ధాచలస్వామి


శ్రీ కూర్మాచల ప్రభు


శ్రీ సుదర్శనాచల రాజయోగి

## రెండవ భాగము - ప్రకరణములు 7

## మూడవ భాగము - ప్రకరణములు 14

## నాలుగవ భాగము - ప్రకరణ 1, అధ్యాయాలు 12

ఓం

శ్రీగురవేనమః

# అవతారిక

శ్రీమద్ వేదవేదాంత సారాసార విచారకుండును, ప్రస్థానత్రయ భాష్యా పరిశీలకుండును, సర్వదర్శనవీక్షిత దార్శనికుండును, షడ్శాస్త్ర విద్యాకోవిదుండును, సర్వమత పరిశోదకుండును, తర్క శాస్త్రంలో మహాప్రావీణ్య నిపుణుడును, తాత్త్వీక వైదిక మార్గములను ఆపోసన చేసినవాడును, సర్వమానవాళికి అతి సులభముగా జనన మరణ భ్రాంతి రహిత మార్గమును తెలియజేయుటకు, అచల సిద్ధాంతాన్ని ప్రతిష్టాపన చేసిన శ్రీమద్రామడుగు శివరామ దీక్షితాచల ప్రభువులునైన మహాశయులు, బృహద్వాసిష్ఠము, అను అచల సిద్ధాంతమునకు ప్రామాణికమగు మూల గ్రంథముగా బృహద్వాసిష్ఠము అను పేరుతో వ్రాసినారు. దానినే శ్రీశివరామ దీక్షితీయము యను నామంతో కూడా పిలువడమైనది.

అయితే ఇట్టి గ్రంథమును వారి యొక్క గురువుగారు అయిన శ్రీధర స్వాముల వారు మహారాష్ట్రము వారు, గనుక ఆయన కాలంలో శ్రీ శివరామదీక్షితులవారు, బృహద్వాసిష్ఠ గ్రంథమును సంస్కృతభాషలో వ్రాసినారని దాని వివరాలు తెలిసిన పరంపర పెద్దలు తెలిపినారు, అట్టి గ్రంథమును మరియు అచ్చతెలుగు మాండలిక భాషలో అందరికి అతి సులభముగా అందజేయుటకు శ్రీశివరామ దీక్షితులవారే వారియొక్క స్వహస్తములతో వ్రాసియుంచిరి.

ఇట్టి గ్రంథమును చాలాకాలం నాటికి అచల సిద్ధాంతం శ్రీశివరామ దీక్షిత పరంపర వాసులైన శ్రీమత్ శ్రీఫీల్ఖాన లక్ష్మణ ప్రభువుల వారికి ప్రియశిష్యులైన శ్రీ సచ్చితానంద పగడాల వెంకటేశ్వర అవదూత స్వాములవారు, అట్టి చేతివ్రాత గ్రంథము అచ్చువేయుటకు బహు శ్రమకోర్చి, తగిన ధనాన్ని సేకరించి, బృహద్వాసిష్ఠ గ్రంథాన్ని ఉన్నది ఉన్నట్లుగా, 1912 కొంతభాగాన్ని, 1915లో కొంత భాగాన్ని, 1927, 1928లో పూర్తి సంపూర్ణంగా నాలుగు భాగాలుగా ముద్రణ గావించినారు. అటు తరువాత బృహద్వాసిష్ఠము యను గ్రంథమును అచల సిద్దాంత పరంపర పెద్దలు యెవరికి వారుగా దానిని ఉన్నది ఉన్నట్లుగా ప్రచురణలు చేసుకొనిరి.

అయితే అచల సిద్దాంత ప్రామాణిక గ్రంథము ఇప్పటి వరకు గ్రంథమును పోషిస్తూ ప్రింటు చేయిస్తూ వచ్చినటువంటి వారు శ్రీమత్ ఫీలుఖాన లక్ష్మణప్రభువుల మందిరము వారు.

అయితే ఈ గ్రంథములో భాగవత కృష్ణ ప్రభువులు చేసిన సంచికలను చేర్చి మరియు వాటిని తొలగించినారు, గనుక ఈగ్రంథమందు ఇంకేమయిన దోషములు ఉన్నవోయేమో యను సందేహముతో కొందరు అచల పరంపరలో ఉన్న పెద్దలకు అనుమానం చోటు చేసుకొన్నది.

గనుక, దాని యొక్క పూర్వగ్రంథములను చూసిన యెడల బాగుండునేమోయని నేను, నాప్రయత్నము సాగించి, పూర్వపు ముద్రణలు యెక్కడెక్కడ యున్నవో వాటిని సేకరించినాను, అందులో 1912, 1915, 1919, 1927, 1928, 1935, 1956, 1988, 2000 నుండి 2016 సంవత్సరముల నాటి ప్రింటువేసిన పుస్తకములను పరిశీలన చేసి చూడగా, అందులో కొన్ని ప్రకరణములు అనగా, భావాభావరహిత ప్రకరణము, ఉత్తరాల ప్రకరణము, సంకల్పనివృత్తి ప్రకరణములు 1935లో గ్రంథము మళ్లీ ప్రింటు వేసినప్పుడు వేసినారు, అంతకు పూర్వము లేవు, అయినను దానిలో కొన్ని శ్రీశివరామ దీక్షితుల వారు చెప్పినట్లు కొన్ని ఉన్నాయి, కొన్ని మహావాక్య ప్రబోధయను వాటిని చేర్చినారు, అవికూడా అసంపూర్తిగా ఉన్నందున వాటిని తొలగించడం అయినది. తాను వ్రాసిన భాషను అర్థము చేసుకొని అన్ని అంశాలను ఉన్నది ఉన్నట్లు ప్రింటు వేయడము జరిగినది. మరియు మూడవ భాగంలో శరీరరహిత ప్రకరణము మొదలుకొని ఒక్క ప్రకరణమునకు నాలుగు అధ్యాయములు ఉన్నాయిగాని, వాటిని క్రమముగా లేనందున నేను వాటిని ఏయే ప్రకరణ అధ్యాయాలను ఆయా ప్రకరణమునకు క్రమముగా చేర్చడము అయినది.

నేను సేకరించిన పురాతనమైన గ్రంథములు, 1912 గొడువర్తి శేషయ్య గారు కాకినాడ వారి అచ్చువేసినది, ఇది శ్రీ సుబ్బరాయస్వాముల వారి ప్రియశిష్యులగు శ్రీ అచలానంద మఠం రవిచెంద్ర, కర్నాటక వారితో మరియు, 1915-1935 నాటివి రాజమండ్రి శ్రీవెంకట్రామాచల ఆశ్రమం శ్రీ వెంపటి లక్ష్మీనర్సింహ్మాచల స్వాములవారి నుండి వీరి పరంపర శ్రీ మల్లేపల్లి గురుచరణం కుమారుడు వటపత్రసాయి గారితో మరియు శేషమాంబ ప్రియశిష్యులైన గుముడవెల్లి భారలింగం ఆశ్రమం నుండి శ్రీ నర్సిములు అయ్యగారి నుండి 1915, 1919 నాటివి మరియు 1956, పంచదశి దుర్గానంద సరస్వతి స్వాముల ఆశ్రమం నుండి మరియు 1935-1987 వరకు గలవాటివి మరియు శ్రీ కాడిగే నారాయణ, కార్వాన్ వారు పాత నమూనాలను వారు చేతి వ్రాతతో వ్రాసుకున్న గ్రంథాలను సేకరించాను.

మరియు శేషపాణి గారు 1988లో వేసినది మరియు శ్రీమత్ ఫీలుఖాన లక్ష్మణదేశిక మందిరమువారు 1912, 1915, 1919, 1927, 1928, 1935, 1956, 1987,

1988, 2000 నుండి 2016 వరకు గల వాటిని పూర్తి వివరాలతో అచ్చువేయుచు వచ్చిన అన్ని రకాల గ్రంథాలు సరిచూడడమైనది, అందులో కూడా మొదటి భాగమందు కందపద్యాలు కొంతవరకు కొన్ని ఆంశాలు ఎక్కువగా ఉన్నట్లు, కొన్ని యుక్తి చేసి గ్రంథంలో చేర్చినట్లు కనపడినవి, గనుక వాటిలో కందపద్యాల యొక్క భావార్థం, విచారించగా గ్రంథంలోని వచనంలోనున్న భావమే ఉన్నందున వాటిని తీసివేయడం జరిగింది, అయిన శివరామ దీక్షితుల వారు యెటువంటి కవిత్వములను బృహద్వాసిష్ఠములో చేర్చలేదు, స్వచ్ఛందంగా వచన గ్రంథముగానే వ్రాసి యున్నారు, వాటినే ఉన్నది ఉన్నట్లుగా సరిజూచి నేను, వాటిని వాక్యములగా విడగొట్టి పాఠకులకు సరియైన రీతిలో అతి సులభముగా ముద్రణ వేయించడమైనది గాని నేను ఇందులో కొత్త విషయాలను యేమి చేర్చలేదు.

అయితే మహాశయులారా! అచల సిద్ధాంత పరంపర పెద్దలారా ! ఈ బృహద్వాసిష్ఠము అను శ్రీ శివరామ దీక్షితీయమును నేను వేయుటకు కారణము యేమి అంటే?

దానిని స్థూలాక్షరి గాను, విడివిడిగా వాక్యములు గాను, మరియు దానిలోని ప్రతి అంశాలను చూసి ఆంశానికి తగిన పేరు హెడ్డింగును పెట్టడం జరిగింది. ఎందుకంటే ఈ మూలగ్రంథాన్ని అందరూ చదివినచో జననమరణ రహిత భ్రాంతులగుదరని ఇతర సర్వమత భ్రాంతులు తొలగించుకొనగలరని ముద్రణ వేయడం జరిగింది. అందులో నా స్వంత విషయాలు యేమిలేవు ఉన్నది, ఉన్నట్లే ఉన్నది, ఇందుకు సందేహం యేమియులేదు.

ఈ గ్రంథాన్ని డిటిపి శ్రీకృష్ణగ్రాఫిక్స్ & ఆఫ్‌సెట్ ప్రింటర్స్, నాగుల శివకుమార్ గారు డిటిపి చేయుటయందు రాత్రి సమయాన్ని శివరాత్రి జాగరణ చేసినట్లు సరిచూసినప్పుడల్లా నిద్రకు వోర్చి శారీరకముగా అలసి చాలా శ్రమను పొందినారు, గనుక వీరిని శ్రీసద్గురుమూర్తి యెల్లవేళలో ఆయురారోగ్య, ఐశ్వర్య, ధన, కనక, వస్తు, వాహన ఆభరణాది, భోగభాగ్యములతో సద్గురు ఆశీస్సులు ఉండును గాక.

ఇట్లు

అచల సిద్ధాంత శ్రీశివరామ దీక్షిత పరంపరయందు

శ్రీశేషమాంబ శాఖలోని శ్రీనిత్యానంద కూర్మాచల ప్రభువుల వారి ప్రియశిష్యులు

**శ్రీ బోధానంద కంద్యానం సుదర్శన్ గౌడ్ అచలరాజయోగి**

దక్షిణామూర్తి అచలాశ్రమం

గ్రామం॥ నర్సప్పగూడ.

ఓం

శ్రీగురుభ్యోనమః

# ఉపోద్ఘాతము

శ్రీమద్ బృహద్వాసిష్ఠ అచల సిద్ధాంత, పరిపూర్ణబోధ ప్రతిష్ఠాపనాచార్యులైన, శ్రీశ్రీశ్రీ శివరామ దీక్షిత అచలగురు ప్రభువరేణ్యులకు నాయొక్క ద్వాదశి నమఃసుమాంజలులు, మద్గురు శ్రీశ్రీ నిత్యానంద కూర్మాచల ప్రభు పాద పద్మములకు ద్వాదశ నమస్కారములు, అలాగే ఆదిగురువు శ్రీ దక్షిణామూర్తి మొదలుకొని పరంపరాగతమై వచ్చుచున్న గురువులందరికి నమస్కారములు.

అయ్యలారా! భారతదేశ సంస్కృతి సంప్రదాయాలు, సిద్ధాంతాలు ఆనాటి నుండి ఈనాటి వరకు మానవజాతికి భక్తి, జ్ఞాన, వైరాగ్య, తత్వవిచారణ, ముముక్షువుల తరుణోపాయమునకు వేదాంత విజ్ఞానమార్గము యెంతో కృషిచేయుచున్నది.

అందులో అచల సిద్ధాంతం, మహా విశిష్టతను సంతరించుకొని యున్నది. సర్వమానవాళికి సర్వభ్రాంతుల నుండి విడువడుటకు సహకరించుటలో ముందుగానే యున్నది, ఈ సిద్ధాంతమందు గురుభక్తిని, మాతాపితృ భక్తిని, అతిథి అభ్యాగతులను ఆధరించుట సమాజసేవ, దేశభక్తిని సంస్కృతి సాంప్రదాయాలపై సద్గుణపోషణను సమాజంలో యెవరెవరి సిద్ధాంతాలు యేలాగున యున్నాగాని, వారివారి అభిప్రాయాలు మాత్రమే దెలుపుకున్నారు. గనుక యెవరి అభిప్రాయాలు వారివారికే వదిలేసి, ఈ అచల సిద్ధాంత ప్రతిపాదకులైన శ్రీ శివరామదీక్షితుల వారు, అచలసిద్ధాంత పరిపూర్ణ బోధను తెలియజేస్తూ మానవుడు ఈ అచలసిద్ధాంత ప్రబోధను విన్నట్లైతే వారు జననమరణభ్రాంతి నుండియే గాక మంత్ర, తంత్ర, యంత్రముల యొక్క భ్రాంతులనుండి బయటపడగలరు అనియు ఆయన చేసిన సిద్ధాంతము.

ఈ అచలపరిపూర్ణ బోధ ఇది గురుశిష్యన్యాయముగా చెప్పబడినదేగాని, అన్యముగా చెప్పుటకు వీలుపడదు, గనుక ఇది గురు రహస్యమైనది, మహాగూడమైనది, గురు పరంపరాగతమైనది.

అయితే దీనిపై కొందరి మతవాదులకు అనుమానము ఉన్నది అదేమనగా? ఈ సిద్ధాంతాన్ని నవీనమే యనుకొనువారు కూడా గలరు. గనుక ఇది నవీనముగాదు, ప్రాచీనమే, ప్రాచీనమనుటలో అతిశయోక్తి యేమిలేదు, అది యెట్లనగా క్రీస్తుకుపూర్వం 500

సంవత్సరాలకు ముందుగా కొన్ని ఉపనిషత్తులు లభించాయి, అందులో ప్రాచీనమైన ఉపనిషత్తుల యొక్క పేర్లు, అనంతోపనిషత్, సర్వసార పూర్ణోపనిషత్ గలవు, వాటిలో అనంతోపనిషత్ యందు పరమశివుడు బ్రహ్మదేవునికి ఇలాగున ఉపదేశించారు.

శ్లో: అతశ్శివ ఏవ సనాతనం । బ్రహ్మభగవాన్ అచలమేవ సత్యం ।
నిరంజనం నిర్వికల్పం నీరంధ్రంచ పరాత్పరం । బాహ్యముపైతి విద్వాన్ ॥
అన్య జ్ఞానం నాస్తి జన్మ ప్రవృద్ధి నాస్తి జ్ఞప్తి సర్వదా సత్యవాక్యం ।
భక్తిజ్ఞానే కర్మశక్తేచ రహితం సర్వవ్యాప్తం । సచ్చిదానంద రహితం ॥ అనియు,

శ్లో॥ సద్రూపం నాస్తి సర్వత్ర చిద్రూపం నాస్తి సర్వదా ।
ఆనంద రూపగం నాస్తి అచలం చాస్తి సర్వదా ॥

అని, పరమశివుడు బ్రహ్మదేవునికి ఉపదేశం చేశారు.

ఆలాగే, రెండవది సర్వసార, పూర్ణోపనిషత్ యందు, పరమశివుడైన దక్షిణామూర్తి మహావిష్ణువునకు ఇలాగున అచలబోధ చెప్పారు.

శృతి॥ అధవైకుంఠో నీలకంఠం ప్రణమ్య స్వామిన్ సర్వలోకైకనాథో
బ్రహ్మైవాహం భ్రాంతినాశం కురుష్వ ఈశ ఏతద్వ్యపోహ్యా పరాత్పరం
పూర్ణముపైతి నాథో । విష్ణుర్భక్త్యా సమాధరాత్పంచ వక్త్ర ఉవాచ.

శ్లో॥ శృణు శిష్య మహాశ్రేష్టం । వేదవేదాంత నిశ్చితమ్ ।
తాత్పర్యం కృపయా వక్ష్యే । సద్భక్తి మానసః ॥

శ్లో॥ నిర్దేహం నిర్మలం పూర్ణం । తల్లింగ మచలం భవేత్ ।
మాయాపి వందితం బాహ్యమ్ । తధ్యానం కురు సర్వదా ॥**19**

తా॥ శరీరము లేక మలినము గాక అంతట నిండియున్న బట్టబయలునకు లింగమని కూడ చెప్పినారు, అదే అచలమై ఉంది, ఇటువంటి అశరీరమగు బట్టబయలునకు మాయయగు యెరుక చేత వందనము చేయబడినది గనుక దానినే యెప్పుడు ధ్యానించ వలెననిరి.

ఈలాగున అచలపరిపూర్ణబోధ జననమరణభ్రాంతి రహితము చేయుటయందు రాజమార్గమై యున్నది, అనాయాస మార్గము, ఇది గుహ్యాత్ గుహ్యముగా దాచబడినదై నుండెను. ఈలాగున అచలగురు పరంపర పరమశివునినుండి, శ్రీమహావిష్ణువునకు, బ్రహ్మకు సూర్యభగవానునికి, యాజ్ఞవల్కికి, జనకచక్రవర్తికి, శుకమహాఋషికి, సాందీపునికి,

శ్రీకృష్ణుడికి, రుక్మిణీదేవికి, అర్జునునికి, యుద్ధవునికి మరియు అచలావధూత, బ్రహ్మానంద స్వామి, అమలానందులు, దత్తానందులు, రామానందులు మొదలగు నంభీరుగారు, వేమన్నగారు, తిరువెంకటాచార్యులు, యాళ్వారుగారు, శ్రీధరస్వాములవారు, శ్రీశివరామ దీక్షితులవారి వరకు పరంపర కొనసాగింది గనుక ఇది నవీనము గాదు, ప్రాచీనమైన అచల పరిపూర్ణబోధ. ఇందుకు సందేహము లేనేలేదు, అయితే

శ్రీ శివరామదీక్షితుల వారికి పూర్వము యున్నవారు గురుపరంపరగా గురువాక్యమును రహస్యముగా నుంచుకొని యుండగా ఇది ఇలాగున ఉంచినట్లైతే సర్వమానావళికి తెలియదని దానిని తెలియజేయుటకు శ్రీశివరామదీక్షితుల వారు, ఆలోచించి, సమాజానికి అందునట్లు, సంస్కృతంలో యుండిన అచలబోధను అచ్చతెలుగు భాషలోనికి వ్రాశారు, వ్రాసినదే గాక, అచల సిద్ధాంతముగా ప్రతిష్టాపన చేసి సర్వమానావళికి అందజేసినారు, గనుక శ్రీ శివరామదీక్షితుల వారే అచల సిద్ధాంత ప్రతిపాదకులుగా పేరు గాంచినారు. ఆయన సంస్కృతం, ఆంధ్రం, మరాఠి, కన్నడ మొదలగు భాషా ప్రావీణ్యముగలవారు, అయినప్పటికిని తెలుగువారై యున్నందున బృహద్వాసిష్టముయను గ్రంథాన్ని మాండలిక భాషలో సాధారణమైన జనులకు కూడ సులభముగా తెలియుటకు బృహద్వాసిష్టము అనుపేరుతో వ్రాసి యున్నారు.

ఈ గ్రంథమును వ్రాసిన కాలమానము, శాలివాహన శకము, 1634 ఆశ్వీయుజ శుద్ధ దశమి నాటికి పూర్తి బృహద్వాసిష్ఠ చేతి వ్రాత గ్రంథమునుండి 4 భాగాలుగా లభించింది. దానిని కాపాడుతు వచ్చినారు మరియు పరంపర పెద్దలలో కొందరు నిజప్రతి నుండి చేతి వ్రాతతో వ్రాసి, భద్రపరచి దానిని 1912 నాటినుండి ముద్రణలు కొనసాగించి ఇప్పటివరకు మనకు అందజేసినవారు శ్రీమత్ ఫీలుఖాన లక్ష్మణప్రభువుల వారి ప్రియశిష్యులైన శ్రీసచ్చితానంద వెంకటేశ్వర అవదూత స్వాములవారి యొక్క ఆధ్వర్యంలో సరిచూడబడి అక్కడినుండి ముద్రణలు వేయడం జరిగింది. గ్రంథము నుండి యెత్తి వ్రాసుకున్నవారు కూడా చాలాపెద్దలు గలరు.

బృహద్వాసిష్ఠము అను పేరు పెట్టుటకు కారణము ఏమనగా? వసిష్టులువారు శ్రీరామచంద్రునికి, ఉపదేశం చేస్తూ, యోగవాసిష్టము, జ్ఞానవాసిష్టములుగా పూర్వోత్తర భాగాలు చేసి శ్రీరామునికి యోగమార్గాన్ని పూర్వభాగంగాను, జ్ఞానమార్గాన్ని ఉత్తరభాగంగాను ఉపదేశం చేసినారు. అందులో జ్ఞానమార్గమైన మోక్షమార్గము, ఆత్మానాత్మల యొక్క వివరాలు, ఆత్మయొక్క సగుణత్వాన్ని, నిర్గుణత్వాన్ని బోధిస్తూ ఆత్మ సర్వత్రా గలదు, అది నామరూప రహితమై యున్నది. అదియే నీవైయున్నావు యని తత్త్వమసి మహావాక్యాన్ని బోదించారు.

నీవే పరిపూర్ణమై యున్నావు అని బోధించారు. గనుక అలా చెప్పకూడదు, అది ఇదిగాదు, ఇది అదిగాదు యని శివరామదీక్షితులవారు చెప్పినారు గనుక, యోగవాసిష్ఠమందు విషయాన్ని తెలుసుకుందాం.

శ్లో॥ తాం స్వసత్తాంగతః । సర్వమసర్వం భావయోదాయీ ।
తాదృగ్రూపోఽసి । శాన్తో-సి చిదసి బ్రహ్మరూప్యసి ॥

తా॥ నీవు నీయొక్క పరిపూర్ణత్వ స్వరూపాన్ని స్మరించుకొని శాంతుడవై యుండుము, నీ చిద్స్వరూపమైన బ్రహ్మరూపమే నీవైయున్నావు. నిరాకారుడివి, నిర్గుణుడివి, ఇదియే నీ స్వస్వరూపంబని చెప్పినారు. ఇది శ్రీవాసిష్ఠ నిర్వాణ ప్రకరణంతో విశ్రాంతి సుదృడీకరణంలో ద్వితీయ సర్గఃలోనిది.

అయితే వాసిష్ఠులవారు శ్రీరామచంద్రునికి 32వేల శ్లోకములతో అనేకాంశములు ప్రబోధించారు, వారు తెలియని విషయం ఏమియుండదు గాని, శ్రీ శివరామ దీక్షితులవారు, బృహద్వాసిష్ఠమును పేరుతో వ్రాసిన అంతర్యము ఏమిటి యనగా? వేదాలు, ఉపనిషత్తులు, ఇతిహాసాలు, పురాణాలు, దర్శనాలు, ఇలాగున యెన్నియో కలవు. వాటికి అనుగుణముగా సిద్ధాంతాలు ఆవిర్భావము బృహద్వాసిష్ఠమందు ఇలాగున చెప్పినారు.

మతాల లక్షణం చూడవచ్చును, ఇలాగున చెప్పబడిన కర్మమార్గములు, జ్ఞాన మార్గములు, జనులకు సముచితమే అయినా । వాటియందు జనన మరణ భ్రాంతి తొలుగలేదు, కేవలము మానవుని యొక్క ఆశయం ఏమిటంటే జన్మరహితం, యేలాగు అని విచారించుట చాలా అవసరమై యున్నది. గనుక పైమార్గమందు, నీవే యుంటావు, జ్ఞానమార్గమందు నీవే యుంటావు, నీవనగా మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం, దీనినే ఉపనిషత్తులయందు బ్రహ్మము, పరబ్రహ్మము, చైతన్యము, ఆత్మ, పరమాత్మ యని చెప్పి సృష్ఠి, స్థితి, లయాలకు ఇదే కారణమని అదే నీవైతివని ఉపదేశము చేసినారు.

ఇది శాస్త్ర సమ్మతమే గావొచ్చును గాని, ఆత్మవైన నీవు మిగిలి ఉంటే అనగా విత్తనం ఉంటే చెట్టు అవుతుంది, గనుక విత్తనం పోవాలె అన్నారు, గనుక ఆత్మభ్రాంతిని కూడా తొలగించారు దీక్షితులవారు, గనుక మతభ్రాంతిలో బ్రహ్మమును సగుణంగాను, నిర్గుణంగాను చెప్పబడినది, దానిని సగుణమైన సాక్షిగాను నిలిపి పరమాత్మ అంతర్యామియని, మబ్బపెట్టి పరమాత్మను వేరుజేసి, నీవు జీవుడవు, దేవుడు వేరేయున్నాడు అని, చెప్పుతూ ప్రచారము చేయుచున్న మతాలు కోకొల్లలుగా ఉన్నాయి.

అయితే ఇక్కడ గుర్తించవలిసింది ఏమంటే నిజము, అబద్ధము యని రెండు గలవు, అది దేనికి చెప్పినారు, అంటే బ్రహ్మము యను పదార్థమును వాచ్యార్థముగా విచారించినట్లైతే సాక్షిగాను, జ్ఞానముగాను, ప్రతిపాదించినారు, రెండవది బ్రహ్మము యొక్క లక్ష్యార్థము నిర్గుణము, నిరాకారము, సాక్షిరహితము, శూన్యము నామరూపములు లేనిదియని నిష్కర్షగా ఇతర సిద్ధాంతాలు చెప్పలేదు. ఈ విషయము వారికి తెలియదని కాదు, వారికి బ్రహ్మపదార్థ జ్ఞానం లేదని కాదు, దీనిని రహస్యముగా పెట్టినారు, పరమాత్మ లేదు, అంటే మన వ్యాపరం జరుగదని వారికి భయం, గనుక, ఉపనిషత్ ధర్మాన్ని శ్రీ శివరామదీక్షితులవారు, నిష్కర్షగా బ్రహ్మము యను చైతన్యాన్ని నీ స్వరూపముగా భావించు నీవు లేనివాడవని భావించు.

నీవుయనే జ్ఞానం ఉన్నంత కాలం జననమరణాల భ్రాంతి తొలుగదు, నీవే బ్రహ్మము అదే నిరాకారం, లేనివాడవు గనుక సృష్టిలేదు, స్థితి లేదు, లయము లేదు, సృష్టి స్థితి లయాలకు మూలమైన పరమాత్మలేదు ఇది నిజగురు ఉపదేశం గురుశిష్య న్యాయంగా తెలియవలెను అన్నారు.

బృహద్వాసిష్టం, అంటే బృహత్, చాలా పెద్దది, నశించనిది, జనన మరణాలు లేనిది, చలించనిది, చలనరహితమైన అచలము. అదే బట్టబయలు, అదే పరిపూర్ణము. ఇదే బృహత్ శబ్దానికి తగినది, గాని సగుణ నిర్గుణములుగా యుండు ఆత్మగాదు, ఇది లేనిది, ప్రత్యక్షముగానిది, శూన్యమైనది, గనుక బృహత్ శబ్దానికి తగదు, బట్టబయలు సత్యమైనది, గురుసౌజ్ఞచేత ప్రత్యక్షమైనది, బయలే పరిపూర్ణము. అది నీవు కాదు, నీవు అది కాదు, గనుక బృహద్ శబ్దార్థము, అచలపరిపూర్ణ బట్టబయలునకే సరిపడును. వాసిష్ఠం పదము యొక్క అర్థము ఇలాగున యున్నది. వాసి యన నివాసము చేయునది, వ్యవహరించునది, సగుణ నిర్గుణ మార్పులు గలది. యెరుక యొక్క నివాసము బయలులో వచ్చినట్లు వ్యవహార చేసితేనట్లు ఉన్నట్లు తోచింది. గనుక, కృష్ణప్రభువు ఇలాగు అన్నారు.

*కం॥ మేలుక సుషుప్తిలోపల యేలీలంతనకు దాను యేతెంచునో గుర్తాలీల బయలు లోపల వాలయము తనకు దానే వొచ్చునోయన్నా । వొచ్చిహెచ్చి చచ్చునోయన్నా । యీలోపలనే బట్టబయలున్న దెరిగితే । యీలోపలనే బట్టబయలున్న దెరిగితే । యేలోకమున నిల్వజాల్వ జాలదెరుగకుంటే । వొచ్చునోయన్నా । వచ్చిహెచ్చి చచ్చునోయన్నా ॥*

యెరుకయొక్క విశిష్టత వాసిష్ఠతయగు నివాసం బయలులోనే జరిగి పోవుచున్నవి గనుక యెరుకను బ్రహ్మము అన్నా, చైతన్యమని యన్న పరమాత్మయని యన్న బట్టబయలగు కేవలాత్మతో సమానత్వం గాదు, గనుక బృహద్-కరమైన బయలులో యెరుక నివాసం,

రాకపోకలు ఉన్నాయి గనుక ఈ యెరుక యెటువంటిదో స్థాన, స్వరూప, స్వభావాల యొక్క విశిష్టత అచలగురు సూచనచేత తెలియును, గనుక ఇదే వాసిష్ఠం. యెరుక యొక్క విశిష్టం, గనుక ఇదే వాసిష్ఠపద నిర్వచనము. బృహద్వాసిష్ఠముయను నామమందు, సత్యమైనది బట్టబయలు నసత్యమైనది యెరుకయని నిర్ధారించింది గనుక బృహద్వాసిష్ఠము యను నామం సార్థకమైనది, అలాగే దీక్షితులవారు వ్రాసిన గ్రంథము గనుక శ్రీశివరామ దీక్షితీయమని కూడా చెప్పబడినది.

## భగవద్గీతలో అచల సూచన

ఇది అచలగురువు సూచన అయిన వారికే దెలియును. ఇతరులకు తెలియదు, ఇదే అచలగురు రహస్యము.

**శ్లో॥ నైనం ఛిందంతి శస్త్రాణి నైనం దహతి పావకః ।**
**నచైనం క్లేద యంత్యాపో । న శోయతి మారుతః ॥**

**శ్లో॥ అచ్ఛేద్యోయ మదాహ్యోయమ్ । అక్లేద్యోశోష్య ఏవచ ।**
**నిత్యః సర్వగతః స్థానుః । అచలోయం సనాతన ః ॥**

ఈ రెండు శ్లోకాలు, యెరుక యొక్క నిర్గుణత్వాన్ని, నిరాకారాన్ని ప్రబోధిస్తాయి, అచల పరిపూర్ణానికి సమన్వయం చేస్తూ యెరుకను అఖండమైన వస్తువుగా గుర్తించు, అర్జునా, ఇది నిరాకారం అవినాసిగా గుర్తించు అదే నీవైయున్నావు యని అర్జునునికి యుద్ధ సమయంలో మరణ భయాన్ని దొలిగించారు. అనగా జననమరణాలు నీకు లేవు, నీవు ఆత్మ స్వరూపుడివి యని బోధించారు. ఇది ఇంతవరకు వాస్తవమే, ఈ వాస్తవాన్ని అచలగురు సూచనలో మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు యని యెరిగిన వారికి నేను లేనివాన్ని, నాకు రాకడ పోకడ లేదు, నేను నిరాకారమైన వస్తువును, గనుక నేను లేనివాన్ని యని జననమరణాలు లేవుయని దృడమైతే చాలు, ఉన్నది బట్టబయలే.

పై రెండు శ్లోకముల యొక్క అన్వయము అచలమనె బట్టబయలునకు కూడ సరిపోవును. బట్టబయలు అస్త్ర శస్త్రములచేత హతమయ్యేది గాదు, యెటువంటి నష్టము లేదు, నరుకబడదు తడువబడదు, యెండిపోదు, తడిసిపోదు, కదలదు గనుక చలన రహితమైన అచలము, ఇది సనాతనమైనది, అనగా? సృష్టికి పూర్వం సృష్టి యున్నప్పుడు సృష్టిలయమైన తరువాత కూడా బట్ట బయలే శాశ్వతమైనదని చెప్పవచ్చును, మొదట

నిరాకారమైన యెరుకకు, రెండవ మాట బట్టబయలునకు, సమన్వయం చేసుకోవాలి, గనుక ఇది గూఢమైనది మహారహస్యమైనది, ఇది గురుసూచనైన వారికే తెలియును.

శ్రీకృష్ణ భగవానులు, నేను జనన మరణాలు లేనివాన్ని నన్ను జనన మరణాలు గలవానిగా చూడకు, నన్ను జనన మరణాలు గలవానిగా చూచినట్లైతే నీకు నిజము తెలియదు, ఇది గురు సూచనైన వారికే తెలియును అన్నారు.

యెరుక యొక్క స్వస్వరూపాన్ని అనగా తన యొక్క నిజస్వరూపాన్ని విచారించినట్లైతే నిరాకారమైనది లేనిది గనుక, దానికి జనన మరణాలు లేవు, అందుకే భగవానులు ఇలాగున అన్నారు, "అజోఽపి సన్నవ్యయాత్మా" అనగా నేను జనన మరణాలు లేని వాన్ని అన్నారు, గనుక గురుసూచన మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదని తెలిసితే వానికి జనన మరణ భ్రాంతి తొలుగుతుంది. అందుకే కృష్ణప్రభువులవారు, యెరుక చేతలు వింటే విన్నో విచిత్రాలు అన్నారు,

గనుక, ఈ అచల సిద్ధాంతము గురుశిష్య న్యాయముగానే రహస్యాన్ని చెప్పుటకు అవకాశము కలదుకాని, రామాయణ, భారత, భాగవత, భగవద్గీతల వలె టీవిలోను, పత్రికలలోను, వీడియోలలోను, ఇట్టి రహస్యములను చెప్పుటకు యెటువంటి అధికారము లేదు, ఒకవేళ అచలగురువులు టీవీలోను చెప్పిన శాస్త్రములయందుబడినదే చెప్పవచ్చును గాని, గురుదీక్ష మంత్రోపదేశముల రహస్యాన్ని చెప్ప సాధ్యం కాదు.

ఇట్లు
అచల సిద్ధాంత శ్రీశివరామ దీక్షిత పరంపరయందు
శ్రీశేషమాంబ శాఖలోని శ్రీనిత్యానంద కూర్మాచల ప్రభువుల వారి ప్రియశిష్యులు
**శ్రీ బోధానంద కంద్యానం సుదర్శన్ గౌడ్ అచలరాజయోగి**
దక్షిణామూర్తి అచలాశ్రమం
గ్రామం॥ నర్సప్పగూడ.



ఓం

శ్రీసద్గురవేనమః

# అభినందన - ఆశీర్వాదము

అశరీర నిజగురు సాంప్రదాయ సార్వభౌములు శ్రీమత్ బృహద్వాసిష్ఠ అచల సిద్ధాంత నిర్ధారణోద్ధారకులు శ్రీమద్రామద్గు శ్రీశివరామదీక్షిత ప్రభువుల వారు, అచలబోధను సర్వమానవాళికి అందించదలచి యెన్నో దేశములు తిరిగి, యెంతో మంది మత గురువులతో, మత వాదులతో, తర్క వితర్క పండితులచే నానా ఆగచాట్లుబడి కష్టించి, యెన్నో శ్రమలకు వోర్చి, ముముక్షులమైన మన అందరికొరకు గొప్పనైన పరమార్ధ సాహితి సంపద అందించిన మహాబాగేయుడు.

ఈనాడు మతిస్థిమితమును పోగొట్టే స్వామీజీల బోధలను చాలా సులభముగా చేదించుకొని పరమశాంతిని, ధైర్యమును పొందగలిగే బోధ శ్రీబృహద్వాసిష్ఠ శివరామ దీక్షితీయము యను గ్రంథరాజమును రచించి మనకందరికి అందించిన పరమపురుషుడు దీక్షితులవారు. యిట్టి మహానుబావుడు రచించిన ఈ పరమగ్రంథమును యింతవరకు యెంతో మంది సాంప్రదాయ పెద్దలు చాలాసార్లు ముద్రణ చేసినారు. కొన్ని భాగాలుగ చేసి కొందరు ముద్రించినారు, మరికొందరు 4 ప్రకరణములు, 12 ప్రకరణములు, 16 ప్రకరణములు యిలా ముద్రించినారు.

యిప్పుడు మన రంగారెడ్డి జిల్లా, నందిగామ మండలము, నర్సప్పగూడ గ్రామ నివాసియైన బోధానంద కంద్యానము సుదర్శనదాసు సదరు గ్రంథమును అచలసాంప్రదాయమునకు మూల గ్రంథమంటే యీ విధంగా ఉండాలి యని హృదయములో సుమారు 9 సం॥ల నుండి నిలుపుకొని సర్వాంగసుందరముగా మంచి బైండింగు, కాగితము పెట్టి ఒకే ప్రకరణము 3, 4 స్థలములలో ఉండకుండా ఒక దగ్గరచేర్చి, బాగా కష్టపడి తిరిగి భక్తజనులతో విరాళములు ప్రోగుచేసి ముద్రించినందులకు బోధానంద సుదర్శనము గారిని అభినందించుతు ఆశీర్వాదిస్తూ అనుగ్రహిస్తుయున్నాను. యిటువంటి శాశ్వితమైన మంచిపనులు చేయుచు, సౌమ్య, సహనపరుడై యుండగలందులకు, ఇతనికి ఆయురారోగ్య, ఐశ్వర్యము యివ్వగలందులకు దేవదేవుడైన సద్గురుదేవుని ప్రార్థిస్తూ..

మీ శ్రేయోభిలాషి

**దయానంద నాగుల వెంకటేశం రాజయోగి**

శ్రీమదచల గురుపీఠ రాజయోగాశ్రమ సేవాసమాఖ్య అఖిలభారత అధ్యక్షులు

శ్రీ సాందీప ఆశ్రమం, గొల్లగూడెం.

శ్రీదక్షిణామూర్తి గురవేనమః

## ❁ అఖండ గురుస్తుతి ❁

శ్లో॥ గురుర్ బ్రహ్మాః । గురుర్విష్ణుః । గురుర్దేవో మహేశ్వరః ।
గురుర్ సాక్షాత్ పరబ్రహ్మాః । తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో॥ మన్నాథా శ్రీ జగన్నాథా । మద్గురో శ్రీ జగద్గురో ।
మమాత్మ సర్వ భూతాత్మా । తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో॥ అఖండ మండలాకారం । వ్యాప్తం । ఏన చరాచరం ।
తత్పదం దర్శితం । ఏన । తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో॥ స్థావరం జంగమం । వ్యాప్తం।యత్కించిత్ సచరాచరం ।
త్వం పదం దర్శితం । యేన । తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో॥ చిన్మయం వ్యాపితం । సర్వం త్రైలోక్యం సచరాచరం ।
అసిత్వం దర్శితం । ఏన । తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో॥ చైతన్యం శాశ్వతం । శాంతం ।వ్యోమాతీతం నిరంజనం ।
నాద బిందు కళాతీతం । తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో॥ గుకారంచ, గుణాతీతో । రూపాతీత రుకారకః ।
గుణరూప విహీన త్వం । తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో॥ అజ్ఞాన తిమిరాంధస్య । జ్ఞానాంజన శలాకయ ।
చక్షురున్మీలితం । యేన । తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో॥ త్వం, పితా త్వంచ మే మాత ।త్వం బంధు త్వం చ దేవత ।
సంసార ప్రీతి భంగాయ । తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో॥ ధ్యాన మూలం గురోర్మూర్తి । పూజా మూలం గురోర్పదం ।
మంత్ర మూలం గురోర్వాక్యం । ముక్తి మూలం గురు కృపః ॥

శ్లో॥ గురుణాం అర్చయే నిత్యం । గురు పాదాభి వందితం ।
గురుణాం అగ్రజం శ్రేష్టం । తస్మై శ్రీ గురవే నమః ॥

శ్లో॥ కాయం కాశి కురుక్షేత్రం జాహ్నవీ చరణోదకం ।
గురుర్ విశ్వేశ్వరం సాక్షాత్ । తస్మై శ్రీ గురవే నమౌ ॥

## ❁ శ్రీమదశరీర నిజగురు పరంపరా ధ్యానం ❁

శ్లో॥ ఓం నమో బ్రహ్మాదిభ్యో । బ్రహ్మ విద్య సాంప్రదాయ కర్తృభ్యో ।
వంశ ఋషిభ్యో । మహద్భ్యో । నమో గురుభ్యః
సర్వోపప్లవ రహిత । ప్రజ్ఞాన ఘన ప్రత్యగర్థో
బ్రహ్మై వాహ మస్మి । అహం పదార్థ రహితః

శ్లో॥ గురువే సర్వలోకానాం । బిషజే భవరోగిణాం
నిధయే సర్వవిద్యానాం । దక్షిణామూర్తియే నమ:

శ్లో॥ శ్రీబ్రహ్మ విద్య గురువిష్ణు సూర్యం శ్రీ యాజ్ఞవల్క్యం జనకం శుకంచ
సాందీప మీశం కృష్ణంచ అర్జునం వందే గురున్మే గురు పాదుకాంతం ॥

శ్లో॥ శ్రీధరస్వామినం నిత్యం । బోధకారణ మవ్యయం ।
భావాతీతమహంవందే । సుఖజ్ఞానైక నిర్మలం ॥

శ్లో॥ వందారుజనమందారం వందేహంతన్నిరంతరం ।
రామదుగు వంశజం శుద్ధం శివరామాఖ్యదీక్షితం ॥

శ్లో॥ యస్యబోధో దయాత్సర్వం । బ్రహ్మైవేత్వమగమ్యతే ।
శివరామే విధిఖ్యాతం । తద్దేవత ముపాస్మయే ॥

శ్లో॥ కామాదిరిపుహంతారం । కారుణ్యామృతసాగరం ।
కంబాలూరప్పరావాభి । దానం వందేద్యమద్గురుం ॥

శ్లో॥ శ్రీమత్ పరుశరామాన్వ । యాబ్ది చంద్రమనోరమం।
నిత్యానంద మహం వందే । సీతారామ గురుం పరం ॥

శ్లో॥ పరశురామాన్వయంబోధి । హిమాంసశ్చ మనోరమం ।
సీతారామాస్య భక్తానాం । శేషాచల గురుంభజే ॥

శ్లో॥ దాసపోషదయాహృదయం । ఆశపాశ వినాశకం ।
దోషరహితం సదాపూర్ణం । శేషమాంబ గురుంభజే ॥

శ్లో॥ శేషాచలాన్వయంబోధి । భారదేశికముత్తమం ।
నిరంజనం నిరాకారం । భారలింగం గురుంభజే ॥

శ్లో॥ భారదేశికాన్వయం బోధి । కృష్ణదేశిక ముత్తమం ।
నిర్మోహి నిజానందం । కృష్ణదేశికం గురుంభజే ॥

శ్లో॥ కృష్ణదేశికాన్వయం బోధి । భక్తాభీష్ట ఫలప్రదం ।
శుద్ధాంభర సమాదృశ్యం । సిద్ధాచల గురుంభజే ॥

శ్లో॥ సిద్ధాచల పరాంబుధి । సుజనాభీష్ట జయప్రదం ।
పరిపూర్ణ సేవానితరం । కూర్మాచల గురుంభజే ॥

శ్లో॥ కూర్మాచల పరాంబుధి । విమలబోధ ప్రచారిణాం ।
బోధానంద దీక్షాణాం । సుదర్శనాచల గురుంభజే ॥

శ్లో॥ అస్మద్గురు సమారంభం । కృష్ణ సాందీప మధ్యమాం ।
ఓంకారపీఠ పర్యంతాం । వందే గురుం పరం పరాం ॥

## ❁ లఘుపూజ ❁

శ్లో॥ బ్రహ్మానందం పరమ సుఖదం । కేవలం జ్ఞానమూర్తిం ।
ద్వంద్వాతీతం । గగన సదృశం । తత్వమశ్యాది లక్ష్యం ।
యేకం నిత్యం । విమల మచలం । సర్వధీ సాక్షి భూతం ।
భావాతీతం । త్రిగుణ రహితం । సద్గురుం తన్నమామి ॥

శ్లో॥ ధ్యాన మావాహనం । సింహాసనం ।పాద్యం తదైవచ ।
అర్ఘ్యం మాచమనీయం చ । స్నానం పంచామృతై స్సహః ॥

శ్లో॥ శుద్ధోదకం వస్త్ర యుగ్మం । యజ్ఞ సూత్రం విభూషణం ।
విలేపనం చాక్షతాం చ । పుష్పం స్వర్ణవి నిర్మితం ॥

శ్లో॥ ధూప దీపం చ నైవేద్యం । పానీయం ఫల మేవ చ ।
తాంబూలం దక్షిణార్థిక్యం । మంత్ర పుష్పం ప్రదక్షణం ॥

శ్లో॥ నమస్కారం దేశికేంద్ర । మయా తుభ్యం నివేద యేత్ ।
కృపయా గృహ్యతాం స్వామిన్ ।న్యూనాధిక్యం న చింతయా ॥

శ్లో॥ లఘు పూజా విధిం । భాగవత కృష్ణ ద్విజన్మనా ।
రచితం శ్రోతృ వక్త్రూణాం । మిదం మోక్ష కరం పదం

  

ఓం
శ్రీగురవేనమః

శ్రీమద్బృహద్వాసిష్ఠ అచల సిద్ధాంత నిర్ధారణలును
శ్రీమించునచల పరిపూర్ణ బోధ ప్రతిష్ఠాపనాచార్యులగు
శ్రీమద్రామడుగు శ్రీశ్రీశ్రీ శివరామదీక్షితుల వారిచే రచియింపబడిన

# బృహద్వాసిష్ఠము

అను

# శ్రీ శివరామ దీక్షితీయము

## పరిపూర్ణ బోధ అచల సిద్ధాంత గ్రంథము
## జనన మరణ భ్రాంతి రహిత మార్గము



**మొదటి భాగము**



# 1. గురుశిష్య ప్రభావ ప్రకరణము

## 1. గ్రంథకర్త నిర్ణయము

1. అందరు ప్రబంధ కల్పనాకథ (కట్టుకథ) యని పలుకుచునే యుందురు. అది అబద్ధమా, నిజమేకదా !
2. గురువులేని యెడల గురి తెలియదు. (గురువు అంటే జనన మరణ భ్రాంతి రహితం చేసేవారు) మేము అనుభవము వల్లనే తెలుసుకున్నాము.
3. అనుభవమనగా తిండిగాదు. ఆలోచనే చక్కగా చేయవలెను. వంకర ఆలోచన చేయరాదు.
4. మొదలు వంకర అయితే తుదనెల్లా వంకరే అగును గనుక వంకరలేని మార్గము తెలియవలెను.
5. గురువు యెటువంటివాడనగా? ఓడ నడుపుటయందు సారధిగానగు చున్నాడు.
6. గురువునకు పదిరెండు సంవత్సరములు సేవచేయవలెను.
7. దీర్ఘకాలము గురువు సేవచేతనే గాని భ్రాంతిరహితులుకారు.

## 2. శిష్య ప్రభావము

1. ఈ ఉపదేశము కోరినవారు గురువు దగ్గరకు వెళ్లవలెను. ఆ గురువు నడతలు ఆ ఊరి వారిని అడిగి తెలుసుకోవలెను. వారు యుక్తముగా చెప్పిరా, ఆ గురువు యొక్క శిష్యులను చేరవలెను. వారిని విహితపరచుకొనవలెను.
2. గురువు దర్శనము చేయించుమని ఆ గురువు యొక్క శిష్యులను అడుగవలెను.
3. ఆ గురువు యొక్క శిష్యులు యేలాగున వందనాది క్రియలు చేయుదురో, వారివలె తాను జరుపవలెను.
4. ఆ గురువును తండ్రిగాను, ఆ గురువు భార్యను తల్లిగాను భావించవలెను. భక్తిశ్రద్ధలు గలిగి యుండవలెను.
5. అహంకారము వదల వలెను.
6. అభిమానము విడువ వలెను.
7. గురు నింద వినరాదు

8. గురు ద్రోహము చేయరాదు.
9. కుల త్యాగము, ఆచార త్యాగము చేయరాదు.
10. కుల దూషణ చేయరాదు
11. కుల గురువులను నిందించరాదు.
12. పర స్త్రీలను తల్లిగా భావించ వలెను.
13. పర ద్రవ్యము మంటి పెళ్లవలె చూడవలెను.
14. సకల భూతములను తనవలెనే భావించ వలెను.
15. దేహార్థ ప్రాణములు గురువునకు సమర్పించవలెను.
16. దేహముతో గూడిన ఆత్మను తెలియరాదు. ఇందుకే గురువు అవసరమయ్యి యున్నది.

## 3. అచల గురు ప్రభావము

1. శిష్యుడు యేమైన తొందరపడనీగాక, గురువునకు సహనము గలిగి ఉండవలెను.
2. మాటల వల్లననే బోధ చేయుచుండవలెను. తొందరపడకూడదు.
3. తొందర పడుటకు అహమును నమ్మిన మార్గమా ! లేకపోతే కండ్లు ముక్కు చెవులు మూసుకొని చూడమని యనడమా !
4. నాదము వినుమని అనడమా, నడినెత్తిన చెయ్యి పెట్టి నీవే నేను, నేనే నీవు అని పలుకడమా,
5. తననీడ చూచుకొని మీద ఆకాశమందు (చాయ పురుషలక్షణం) చూడమని అనడమా, యిది ఆ మార్గము కాదు. యీ మార్గము తెలియడము దుస్తరము. తెలిసిన తరువాత సులభము.
6. ఈ అచల మార్గము తెలిసిన తరువాత తాను నిత్యమనే ఆశవుండదు. అపుడు నరకము లేదు స్వర్గము లేదు. అనుభవము లేదు, యేదిలేదు,
7. ఈ ఉపదేశమునకు మంత్రము లేదు, తంత్రము లేదు. యోగములు గావు. ధారణములుగావు, క్షేత్రములుగావు, వ్రతములుగావు, తపములుగావు, యజ్ఞములుగావు, మహాసూక్ష్మ సులభము.
8. ఈ సులభము అది పది రెండు సంవత్సరములు శోధించవలెను. ఆ వాక్యము మరువక యుండవలెను ఆవరణాంతము యుండవలెను.

9. తాశూన్యము కావలెను. తాననే భావము కూడదు. శంకరుల వారికి అహంభావము లేదు. శివోహమనుట వారి వాచ్యార్థము, శుకులవారికి అహంభావము లేదు.

10. జనకుల వారికి అహంభావము లేదు. వాచ్యార్థమందే గాని లక్ష్యార్థమందున అహంభావము లేదు. లక్ష్యార్థ మందు అహం భావము కలిగితే ద్వైతమే సిద్ధించెను. ద్వైతము లేదనే యనిరి.

11. అద్వైతమందు ఒకటి కలదన్నారు. ఒకటి కలిగితే అద్వైతమేకాని, ఒకటి యెప్పుడుగలదో రెండోది అప్పుడే గలదు.

12. ఒకటి రెండవుచున్నవి. రెండేమూడవుచున్నవి. ప్రపంచమందు చూడలేదా? ఒకరికి యిద్దరై యిద్దరికి ముగ్గురై ముగ్గురికి ఆరుగురై అనేకులై యీలాగున అంతటా నిండుదురు.

13. అంతా శూన్యమయ్యే యున్నది. శూన్యము అనగా తానే శూన్యము. తాను యెప్పుడు లేకున్నాడో అన్నీ అప్పుడే లేవు.

14. తాను ఉండేవాడు తక్కినవి లేకపొయ్యేవికాదు. తాను ఉంటే అన్ని కలవు తానే లేకుంటేయేది లేదు శూన్యవాదమని కొందరు అందురు.

15. తాను గలిగినపుడు శూన్యము యేలాగున అయెను? తనకు ఒకరు కనపడకపోయిరా తాను లేకపోవుట శూన్యము తన్ను నమ్మితే నాశమేగాని నాశము లేని తాను గాబోడు.

### 4. తాననే యెరుక లేనేలేదు, ఆగామి సంచితాలను చెప్పకూడదు.

16. తనకు తానే కాని తనకు యేదిలేదని కొందరందురు. అది నిజం కాదు. తానే లేడు తానులేకుంటే ఆగామి సంచిత ప్రారబ్ధకర్మములు యెట్లు గలుగును?

17. ప్రారబ్ధమెక్కడి నుండి వచ్చెను? మోక్షము యేవంక నుండి మొలచివచ్చెను? ఈ భ్రమలన్నియు అహంకార ధర్మములు, శరీరధర్మములు. ఈ అహంకారమే నరకము.

18. ఈ అహంకారమును, యెవరూ వదల జాలరు. అహంకారము దేనివలన గలిగెనో దానిని విడువవలెను.

19. అహంకారమునకు మూలము యేమైనది గురువువలన తెలియును. అహంకారముగల గురువును వదలవలెను. తిరిగి చూడరాదు.

20. అహంకారము వలననే అందరు నరకమును పొందుచున్నారు. అహంకారమును

వదలకనే కదా రావణాసురుడు నశించిపోయెను. అహంకారము వలననే గదా శత్రుమిత్రులు గలుగుచున్నారు.

21. అహంకారము లేని వారికి జనన మరణములు లేవనే సిద్ధాంతము అహంకారము లేనివారిని తెలిసికొనుట దుర్లభము అవుచున్నది. అహంకారమును గురూపదేశము చేతనే వదులగలరు.

22. అహంకారమును వదలినవాడు త్రిమూర్తుల కన్నను అతిశయుడు. అహంకారము నరకమును పొందించును గాని సంశయములేదు.

23. అహంకారము జనులకు యమధర్మరాజు, వైతరణీనది గదా, అహంకారముగలవారిని జూచి శరణుపొందియైన విడువవలెను. అహంకారముగల వారు పైకొనివత్తురు. వివాదపడుదురు,

24. అహంకారము లేనివారు నశించినవారే వారు లేకనే ఉన్నవారు.

25. గురువునకు అహంకారములేదు. త్రిగుణములు లేవు మనస్సు లేదు. గురువునకు సేవచేయని వానికి సూచన గలుగనేరదు. గురువు చెప్పిన యుక్తిని మనస్సున మరువకూడదు.

## 5. గురువు కన్న దైవము హెచ్చని చెప్పరాదు.

26. గురువుకన్నను దైవము హెచ్చని పలుక కూడదు. దైవముకైనా అహంకారము కలదు గాని గురువున కెన్నటికి అహంకారము గలుగదు. ఎరుకలేదు; మరుపులేదు.

27. గురువు యొక్క ఋణము యెవరు తీర్చుకోగలరు? దుస్తరము గురువు జననమరణముల యొక్క భ్రాంతిని పోగొట్టును.

28. గురువు అనుగ్రహము పొందినవాని పాదరేణువు నెవరు బోలరు. గురువు చెప్పిన వెనుక గురువు లేడు, శిష్యుడు లేడు, యెవరు లేరు.

29. గురువును నిందించినవానికి నరకమే శాశ్వతము, చాండాలుడు. గురువు అనుగ్రహము పొంది దూషించు వానికంటే గాడిద మేలు.

30. గురువునకు గుణముగలదా, కుక్కకున్న గుణము గురువుకు లేదనే అన్నాడు. గురువును కుక్కని అనరాదు. గురువు కుక్క అయితే కుక్క బ్రతుకే యగును.

31. గురూపదేశము గలవారికే ఈ వాక్యగ్రంథము యివ్వవలెను ఇతరుల కివ్వరాదు.

ఒకరు వినరాదు. (గురుపుత్రులు ప్రార్థించితే తాత్పర్యము దెలియుటకు బోధించవలెను). ఈ గ్రంథ వాక్యములు మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం అనే అహాంకారము లేనివారలకు మాణిక్యములు, యితరులకు నల్లబొగ్గులు, చిల్లపెంకులు.

32. ఎవరైనా గురూపదేశమై యీ వాక్యములు వినుచు మనస్సునకందక చలన చిత్తమొందువారిని లెస్సగా వినుమని బోధచేయవలెగాని అసూయపడరాదు.

33. అసూయపడువారే అహంకారులు వారికి అహము వదలనే లేదు.

34. కలదోచిన శరీరాలు యేలాగో ఆలాగే, మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు, ఈ ఉత్త బట్టబయలు యేమిలేదు, ఇదే సిద్ధాంతము, సిద్ధాంతమే రాద్ధాంతము.

గద్య:

ఇతి అచలగురు శ్రీశివరామ దీక్షిత ప్రభావే వేదాంత విచారణే
పూర్వభాగే గురు శిష్య ప్రభావ ప్రథమ ప్రకరణం సమాప్తం.







# 2. నిజగురు లక్షణ ప్రకరణము

## 1. నిజగురు లక్షణము

1. "నిజగురువు కావలె, నిజగురువు దొరికేది దుస్తరం, నిజగురు, దొరికితే భ్రాంతి వుండదు, మొదట ఒకటి, తుదను వొక్కటి ఆయనకు యిన్ని విధములు తెలియవు, యెప్పటికీ వొక విధమే, అడగగానే చెప్పరు, డబ్బుకాశ పడరు".

2. గుర్తెరిగే శరీరానికి మూలం లేదు, మూలం కలదనే వారు మూర్ఖులు, వారే గురు సాంప్రదాయం దొరకని వారు.

3. డబ్బు కాశపడేవారు డబ్బు మాటలే కాని, యెంతయిస్తే అంతే చెప్తుతారు, అన్ని కలతమాటలే, ఆమాటలవల్ల మనస్సునకు కలతే, కలతదీర్చే గురువు కావలెను.

4. దేహం మేడిపండు, జీవుడు వేపకాయ. మేడిపండు విచ్చరాదు, వేపకాయ తినరాదు, రెండూ నిషేధములే, గనుక దేహిదేహములు రెండూ వొక్కటే, ఒకటి లేకపోతే, ఒక్కటి కానరాదు.

5. "కన్నులు చెవులు ముక్కులు మూసేదికాదు, అందువల్ల కొందరు చెడిపోయినారు, ప్రాణానికే హానివచ్చును.

6. క్రిందిగుడ్డు మీదికి, మీదిగుడ్డు క్రిందికి త్రిప్పేదికాదు, అందువల్ల కండ్లు లొత్తలే పోవును.

7. తలమీద చెయ్యిపెట్టి ప్రమాణము చెయ్యడముకాదు, అది అప్రమాణమే, అందువల్ల యేదిలేదు."

8. "మంచి సాంప్రదాయం తెలియవలె, మాటలు మాటలదారె, రాజమార్గం సూచన కావలె, రాజమార్గం చెప్పేవారు తొందరపడరు.

9. దయాదాక్షిణ్యాలు లేవు, తనవాడు నావాడు లేదు, బీదాబక్కలేదు, డబ్బుయేమి లేదు, చిన్నాపెద్దాలేదు, నిజగురువునకు బంగారు వెండిలేదు మురుగులు గొలుసులు లేవు, వస్త్రాలు వాహనాలు లేవు, చదువులు ప్రసంగాలు లేవు, యేమోతీరుగా వుంటారు,

10. చచ్చిన వారివలె వుంటారు, ప్రతిమవున్నట్టే వుంటారు, గురిగింజల బంతివలె వుంటారు, కాలినబట్టవలె వుంటారు, కొండవలె వుంటారు, కొయ్యవలె వుంటారు."

11. "కొట్టినా పలకరు, తిట్టినా పలకరు, నెత్తికొట్టుకున్నా పలుకరు, తెలియనప్పుడు మహాకఠినుల వలెనే వుంటారు, తెలిసితే నవనీతమే,

12. దాహం తీర్చేవారు సంగీతాల సాహిత్యాల, ఆటల, మాటలపాటల, ఆశ్రయాల, అనాశ్రయాల, దంబాచారాల, ఠక్కుల, తాటోటుల, నక్కవినయాల, చాకర్ల, చూకర్ల, మహిమల తెచ్చుకుంటారు, అది అటువలెకాదు." మా మార్గము రాజమార్గము.

13. "దీర్ఘకాలము గురుసేవ చేయవలెను, అప్పుడుగాని భ్రాంతిరహితము కాదు, యీ భావం తెలిసినవారివద్దకి యెవరైనా తెలుసుకోవలెననిపోతె, వీరితో వారు మాట్లాడనే మాట్లాడరు, విని చెవుడు కనిగుడ్డిగానుంటారు, రహస్యముగా ఉంటారు,

14. అందరూ మెచ్చే మాటలనుకోరు, అవి విన సహ్యతంగా నుండవు, ఆది యందున విషమే, అంతమందున అమృతమే. వీరికి వారుబోధ చేసేవరకు, చీమలు బారు కట్టినట్లు వుంటారు,

15. మొండి వేసుకొని వారి మాటలు వింటూ, వారి జాడలు తెలుసుకుంటూ వుంటే తనంతట తనకే తానులేని సంగతి తెలుస్తున్నది."

16. యీ గుర్తెరిగే శరీరానికి మూలంలేదు, యీ శరీరం వుండేదికాదు, నీటి బుగ్గ వంటిది, కలలో శరీరం వంటిది, యీ దేహి దేహములు యేమీలేదు, బట్టబయలే శాశ్వితము.

17. యీ దేహం నిరాధారం, దీనికి మూలంలేదు, దీనిని నమ్మరాదు, దీనిని యెప్పుడు లేకుండా చెయ్యవలె. దీనిని నమ్మితె అనేకాలు తోస్తుంది,

18. యిదిలేనేలేదు, యిదియెవరికి తెలియదు, అందరు అతుకు మెత్తని వ్యాపారమే, పెట్టుకున్నారు.

19. నామార్గం వొక్కరైనా యెంతమాత్రం విచారించరు, నా మార్గము నమ్మినవారికి నరకమే సంప్రాప్తము, నా మార్గము అంటే? నేనని అహంకారం, ఇది వదలినవారికి అంతా వైకుంఠమే. ఇదే నిజ గురు లక్షణం.

## 2. మాయ గురు లక్షణము

1. 'ఆకు అలము మేకలవలె తినడముకాదు, కొంగలవలె మునగడము కాదు, మలమూత్రములు తినడముకాదు, మధుమాంసములను భుజించడము కాదు,

2. వావివరసలు తప్పడముకాదు, పుల్లెఆకులు నాకడముకాదు, పూనకాలు తెచ్చుకోవడం కాదు,

3. గంజాయి తాగడముకాదు, కాకులవలె దేశముమీద తిరగడముకాదు, వాద కొట్లాటలు గావు.'

4. "నీవు నేను వొకటే ననడము కాదు, కులం చెడడము కాదు, అందరి యిండ్లల్లో తినడము కాదు, అందరికాళ్ళు పట్టుకోవడము కాదు, అన్ని పుస్తకాలు వ్రాయడము కాదు,

5. అందరిగూర్చి అడుక్కు తినడము కాదు, మనుష్యుల చూచినచోట గొణగడము కాదు, మనుష్యులతో మాట్లాడక పోవడము కాదు, దిగంబరులై జగమంతా తిరగడము కాదు,

6. సన్యాసియై యెద్దు మోతబరువు కట్టుకోవడముకాదు, మాటలు నేర్చుకొని మనుష్యులను ఓడించుటకాదు

7. చదువు అనేది చదువుకొని అందరితో చండితనంబుడుగనట్టు కాదు," యిందులో యేదీకాదు, యీజాడలు యెందుకు కొరగావు. ఇదంతా మాయ గురువులు చేసే పని మాత్రమే.

## 3. అద్వైత బోధ లక్షణం

1. **అద్వైతము అహంకార మతము,** నేను బ్రహ్మను, నేను విష్ణువును, నేను శివుడను, నేను దేవుడను, అని అనుకోవడమే కాని, మరేమి లేదు.

2. బ్రహ్మ కాలేదు, విష్ణు కాలేదు, శివుడు కాలేదు, దేవుడు కాలేదు. యెప్పటి దేహమే, యెప్పటి మనసే కాని కోరికల కోరడమే గాని యేమికాదు.

3. మాలవాడు కూడా నేను బ్రాహ్మనుని అని అనుకుంటాడు. అనుకుంటే అయినాడా, తాను యేది అనుకుంటే అది అవుతాడట,

4. తాను బ్రహ్మ కానేకాడు, మాట మాత్రము అంటాడు, తానన్నమాట వెంబడి నిజమేనని భూషిస్తే సంతోష పడుతాడు, దూషిస్తే తగని కోపము,

5. తన కోపము తనను చంపుచున్నది, తాను వికారాలు పడుతాడు, ఆ వికారాల ప్రకారము జరగదు, అద్వైతమందు నేననే వాదము బలమై యున్నది.

## 4. ద్వైత బోధ లక్షణం

1. **ద్వైతము భ్రాంతి మతము,** యెందుకంటె, నాకు విమానము వస్తున్నది. దానిమీద కూర్చుంటాను. ఆకాశమునకు పోతాను, దేవుని యెదుట కూర్చుంటాను,

2. అక్కడ ఆకలి దప్పులు లేవు. నాకు మహాసుఖము కలుగుచున్నది, నాయంత వారు యెవరూకాబోరు, అని భ్రాంతి పెడుతారు,

3. యిందులో వొకటీ నిజం లేదు, అవి అన్ని కలలో ముచ్చట్లు, యిందుకేనా భ్రమ,

4. యీ భ్రమను వదలవలె యీ భ్రమకే భ్రమ పడుతారు,

5. భ్రమ వదలమంటే ముణిగి పోతామని అనుకుంటారు. భ్రమ రహితమే కావలెను.

6. ఈ ద్వైతమందు దైవం ఉన్నదని భ్రమ, గనుక దాసత్వము గలదు.

## 5. నేను నేను అనే నా మార్గం నానా విధాలు

1. నేను యెప్పుడు వచ్చినానో; నాకు యెవరు ఆధారమో, నా సంగతి విచారించవలెను. నా మార్గం వదలవలెను. ఈ నేననే నా మార్గం నరకం నా మార్గమే బంధం నా మార్గం విడిచినవారికి నరకము లేదు. స్వర్గము లేదు,

2. నా మార్గం విడుచుటకు నిజగురువు కావలెను, నామార్గం నానా వికారాలు, నానారూపాలు, నానానీచాలు, నానా మురిపెములు, నానా విశేషాలు, నానా పారమార్థికాలు, నానా విధాలుగాను నున్నది.

3. నా మార్గం అంటే అహం బ్రహ్మాస్మియనే భ్రాంతి మార్గము.

**శిష్యు :** అయ్యా నా మార్గం చెప్పండి, నేను వుండేవాడనా, పొయ్యే వాడనా, నాకు దేహానికి సంబంధము కలదా లేదా.

**గురు :** 1. ఈ దేహం కలలో దేహంవలె వచ్చినది, దేహాన్ని విడిచి నేను వుండను, నన్ను విడిచి దేహం వుండదు, యీ వుత్తబట్టబయలు అలాంటి కాదు,

2. నశించే దేహము వొకప్పుడు వుండేదికాదు, నిత్యమైన వస్తువ వొకప్పుడు లేకపొయ్యేది కాదు,

3. సమస్త ధర్మములతో కూడుకొని యున్న యెరుకను విడిపిస్తాను, లేకపోతానని భయపడబోకుము,

4. నీవు యెప్పటికి లేనివాడవే, నీవు లేవు, నీకు దేహం లేదు,

5. నీవు వుంటే దేహం వున్నది, నీ వునికికి రాకడకు పోకడకు జాగా లేదు, నీవు యేలాగున వచ్చినావో అలాగుననే గురువాక్యం విన్న అనంతరము లేకపోతావు, అందుకేమి సందేహము లేదు,

6. నీకు నిజగురూపదేశమయితే కలలో వచ్చిన శరీరము మేలుకుంటే యేలాగున యేమీలేదో అలాగే మూలంలేని యీ గుర్తెరిగేశరీరం యేమీలేదు,

7. యీ వుత్త బట్టబయలు యేమీలేదు, కోటిమాటలకు యిదే జ్ఞాపకం, యింతకంటే యెక్కువలేదు గనుక ఇది మరువవద్దు.

గద్య :

ఇతి అచలగురు శ్రీ శివరామదీక్షిత ప్రభావే । వేదాంత విచారణే ।
పూర్వభాగే నిజగురు లక్షణ ద్వితీయ ప్రకరణం సమాప్తం





# 3. ద్వ్యా లక్షణ ప్రకరణము

## 1. ద్వ్యా అంటే రెండు, ఈ రెండు గానిది అచలం

1. ద్వ్యా, అంటే మహాగూఢముగా నున్నది, యెటువంటి వారికి తెలియదు, అది తెలియవలె, తెలియకుంటే యేమీ తెలియదు.

2. ద్వ్యా, లోకమందు ప్రసిద్ధము, లేకపోతే కొందరికి ఒకటే ప్రసిద్ధము. ద్వ్యా, వున్నదికాదు,

3. ఒకటి వున్నది కాదు, లేదు అంటే ఎవరికి గిట్టదు, ఉన్నదన్నా లేదు, లేదు అన్నా లేదు, తానే ఒకటి అని అంటారు.

4. తానే లేకపొయ్యేది యెంత వారికి తెలియదు, నిజము వొకరికిన్నీ రుచిలేదు. అందరికి అబద్ధమే రుచి, అబద్ధమే అబద్ధమును నిజమని అనుచున్నది. అబద్ధమును యెరిగేవారే అందరు, అది. అబద్ధము గనుకనే అందరికి ప్రయాస, అలవికాదు, అగోచరము.

5. ఆలోచనకు చిక్కదు, మనస్సుకు అతకదు. చేటు పాటు లేనిది చెప్పితే తెలిసేది, ఆశ పొయ్యేది, ఆయాసము లేక పొయ్యేది, అందరియందు వుండేది, అన్ని దేశాలయందు వుండేది, అహంకారము లేనిది, ఆపదలేనిది,

6. తానని యెరగనిది, తన్నుతా తలచనిది, యితరుల కెరుగరానిది, ఏకమై యుండేది, రెండుగానిది, వొకటిగానిది, గురువువల్ల తెలిసేది, తెలియనేరక ద్వ్యా అంటారు.

7. ద్వ్యా అంటే యిటువంటిదని తెలియవలె, ఆ ప్రకారం దానికి వున్నదని చెప్పరాదు, దానికి యేమి లేదు, గురుసూచన లేనివారు గురిలేని మాటలు చెప్పుతారు,

8. గురువు యెరిగినవాడైతే శిష్యుడికి యెరుకే, గురువు ఎరుగని వాడైతే, ఆకోవంతా యెరుగనివారే, అందరికి అదేమార్గము, అదే ఒక మతము, అదే సిద్ధాంతము.

9. బలవంతులైతేసరి, అంగబలము వుంటే సరి, అందరిమతాలు అలాగే మతాలన్ని తెలియవలె, భ్రమదీరవలె, తెలిసినవాడు చూపినదారి సరే, తెలియనివాడు చూపేదారి గుడ్డివాడి వెంబడిబోతే అందరు అడుసులనే పడుతారు, ఆ అడుసే అందరికి అగమ్యాం, అది తప్పించుకోలేరు. అడుసులో వున్నారు, ఆవలకి పొయ్యే మార్గము అడుక్కోవలెను,

10. అందుకు అచల గురువు అనుగ్రహం కావలెను. అడగగానే చెప్పడు, చెప్పకపోయినాడని రాకూడదు, ఆయన భావనకు శిష్యుడు పోవలె, శిష్యుడు తరువాత పోవునేమో గాని గురువు యితనితో పాటుపడవలెను,

11. యెందుకంటే చదువుకునే వానితో కూడా ఆచార్యులు ఓనమాలు వ్రాయవలె, వాని ప్రయాస వీరికే, అందుకే అడగగానే చెప్పడు. అతికితే చెప్పుతాడు.

12. ఒకటి వుంటేనే రెండోది, వొకటి లేకపోతే రెండోది యెక్కడవున్నది, ఓ వుంటే నా వున్నది, విత్తు వుంటే చెట్టు వున్నది, కొమ్మలు వున్నవి, పండ్లు వున్నవి, పండ్లు కొయ్యబోయి కొమ్మ విరిగి పడ్డాడు, మృతిబొందినాడు, యేమి వున్నది? తాను వుంటే అన్ని తిప్పలే గదా.

## 2. దృష్టాంతములు

1. మనిషి వుంటే పాప వున్నది, గుర్తెరిగే పాప లేకపోవలెను,
2. విత్తు వుంటే చెట్టువున్నది, విత్తు లేకపోవలెను
3. చీకటి వుంటే వెన్నెల వున్నది, చీకటి లేకపోవలెను,
4. దేహం వుంటే సుఖఃదుఖాలు వున్నావి, దేహం లేక పోవలెను,
5. జ్ఞానం వుంటే అజ్ఞానం వున్నది, గుర్తెరిగే జ్ఞానం లేకపోవలెను,
6. జీవుడు వుంటే బ్రహ్మ వున్నాడు, బ్రహ్మం లేకపోవలెను,
7. తాను వుంటే స్వర్గము, నరకము వున్నది, తాను లేకపోవలెను,
8. స్త్రీ వుంటే పురుషుడు వున్నాడు, పురుషుడు లేకపోవలెను,
9. చిత్తం వుంటే చలనం వున్నది, చిత్తము లేకపోవలెను,
10. తాను వుంటే అభిమానం వున్నది. తాను లేకపోవలె, తాను యెక్కడవున్నాడు, యెప్పుడు లేక పోతున్నాడో అదే తెలియవలెను.
11. సుషుప్తిలో తాను వున్నాడా? లేదు గదా
12. మూర్ఛలో తాను వున్నాడా? లేదుగదా
13. మరుపులోను తానువున్నాడా? లేదుగదా.
14. సమాధిలోను తాను వున్నాడా ? లేదుగదా,
15. మరణములోను తాను వున్నాడా ? లేదుగదా
16. గురూపదేశానంతరం తాను వున్నాడా ? లేదుగదా
17. జాగ్రతలో, కలలో, సుషుప్తిలో వున్నాడని అన్నారు. అంటేనేమి ?
18. తెలిస్తే అప్పటికప్పుడు కలవలెనే వున్నాడు, అంతేకదా !

19. అద్వైనను గురువుచేత కలదీరితే లేకపోవును గదా !

20. యెరుకయను కలలో వారే గురుశిష్యులు. నేననే నిద్రను యెరిగి విడిచినారు, గనుక ఇద్దరు మేల్కొన్నారు, మేల్కోనగానే గురుశిష్యులు ఇద్దరులేరు,

## 3. తాను లేని స్థితి గలిగిన వారి యొక్క ద్రాష్టాంతములు

**అహంకారము వున్నదని చెప్పరాదు, గురువు లేకుంటే వున్నది, గురువునకు లేదు**

1. కాలినబట్ట మడతలు మడతలుగా కనుపడుతూ వున్నట్టు, వుంటేనేమి?

2. యేనుగ మ్రింగిన వెలగపండు కనుపడుతూ వున్నట్టు, ఉన్నది వుంటేనేమి?

3. యేగిన గింజలు కనుపడుతూ వున్నట్టు, ఉన్నారు వుంటేనేమి?

4. చల్లారిన బూడిదె కచ్చిక కనుపడుతూ వున్నట్టు ఉన్నారు, వుంటేనేమి,

5. అహంకారము లేని గురువు కనుపడుతూ వుండును, వుంటేనేమి. లేనివారె గదా!

6. నేతిబీరకాయ అంటే నెయ్యికారునా ? కారదే, అంటనేమి,

7. బెల్లం కొండ అంటే బెల్లం వుండునా ? వుండదే, అంటేనేమి,

8. అప్పచ్చికొండ అంటే భక్ష్యములు వుండునా, లేవే, అంటేనేమి,

## 4. అహంకారం శాశ్వితం కాదు

1. అహంకారం గల వారలు, అందరు అహంకార స్వరూపులే అని అంటారు, లంజ, పతివ్రతను తనవంటిదేనని అంటుంది. అంటేనేమి, అంటే సరే, లేనివారు లేకనే వున్నారు. ఉన్నవారు వారిని ఎవరు కనలేరు, అహంకారము నిలిచేది కాదు.

2. అహంకారానికి మూలంలేదు, కల వలెనే వచ్చినది, అహంకారానికి కులగోత్రాలు లేవుయని చెప్పవచ్చును ఉన్నావి యని చెప్పవచ్చును.

3. అహంకారం వుంటే అన్ని కులాలు, అహంకారానికే శాస్త్రాలు కలిగినవి, అహంకారమే కావ్యాలు చెప్పినది, అహంకారానికే పెండ్లిండ్లు వడుగులు స్త్రీ స్వరూపాలు పురుషస్వరూపాలు వేసుకొన్నది.

4. అహంకారానికే నియమాలు, అనియమాలు, అహంకారానికే స్నానాలు, సంధ్యలు, అహంకారానికే చిన్నా పెద్దలు, అన్ని జీవులు అహంకారమే,

5. అహంకారము నిలిచేది కాదు, శాశ్వితముగా యెప్పుడు వుండేది కాదు,

6. నీటిబుగ్గ వంటిది, నీటిబుగ్గ యెంతసేపు వుండును నిముషములో పోవును,

7. నిప్పు మీద పొగ వంటిది, పొగనిలుచునా, నిముషములో యెక్కడిది అక్కడనే పోవును,

8. మేఘము వంటిది మేఘము యెంతసేపు నిలుచును. అంతసేపే అహంకారము,

9. మిరుగుడు పువ్వు వంటిది, నిముషములో కనుపడి కనుపడక పోవును,

10. తామరాకు మీది నీటి బిందువు వంటిది, ఆకు కదిలితె అంతలో పోవును,

11. మంచు వంటిది, మంచు యెంతసేపు నిలుచునో అంతసేపు ఉండును.

12. అహంకారము ఉరుము వంటిది, గబగబా ఉరిమిపోవును, మెరుపువంటిది, తళుక్కున మెరయును, అటువంటిదే అహంకారము,

13. యెక్కడపుట్టునో, యెక్కడ పోవునో, కలవంటిది, కలలో వస్తువులు యెంతసేపు నిలుచునో, అంతసేపే, ఈ గుర్తెరిగే యెరుక యొక్క వ్యవహారము.

14. మంటికుండ వంటిది క్రిందపడి పక్కున పగిలిపోవును, మట్టి పనికిరాదు, కుండా పనికిరాదు.

15. అద్దం మీది పెసరగింజ వంటిది, యెంతసేపు నిలుచును.

16. రెప్పపాటు వంటిది, కంటిరెప్ప యెంతసేపు మూతపడక నిలుచును, అటువంటిదే యెరుక.

17. సంకల్ప వికల్పముల వంటిది, సంకల్పమైనా వికల్పమైనా యెంతసేపు నిలుచును, కనుకనే అహంకారము నిజమని నమ్మితే నిష్ఫలమే యగును.

18. యెరుకను నమ్మితే మట్టిగుర్రమెక్కి నీళ్ళలో దిగినట్టే,

19. యెరుకను నమ్మితే వెంపలితోను యేనుగను కట్టినట్టే,

20. యెరుకను నమ్మితే మునుగకొమ్మ పట్టుక వ్రేలాడినట్టే,

21. యెరుకను నమ్మితే నీళ్ళలో ఉప్పును దాచినట్టే,

22. యెరుకను నమ్మితే మిద్దెమీద, పరుగెత్తినట్లే,

23. యెరుకను నమ్మితే వడగండ్లు దాచుకున్నట్టే,

24. యెరుకను నమ్మితే చెట్టు ఎక్కి చేతులు విడిచినట్టే,

25. యెరుకను నమ్మితే పాసిన అన్నము మూతపెట్టుకున్నట్టే,

26. యెరుకను నమ్మితే ముల్లు మీద అరిటాకు పడ్డట్టే గనుక యెరుకను నిత్యమనరాదు.

## 5. గురూపదేశానంతరం అహంకారం వుండదు

1. సింహమును చూచిన యేనుగు చందము,

2. గరుత్మంతుని చూచిన సర్పము చందము,

3. మంటను ముట్టిన కర్పూరము చందము,

4. చంద్రుని గన్న తామరపుష్పముల చందము,

5. సూర్యునిగన్న నల్లకలువల చందము,

6. దీపశిఖయందు దగులు కొన్న మిడుతల చందము,

7. వానలేని పయిరుల చందము

8. పులినిగన్న మేకల చందము,

9. గూరూపదేశానంతరం అహంకారం లేదుయని నిశ్చయమవును.

10. పరిపూర్ణము తెలియవలె, అందరికి, తెలియదు, అంతటా వున్నది, సూర్యోదయమయి యుండగా గుడ్డివాడు కానలేడు, క్రిందవుండి తామర పుష్పమును కప్పకానలేదు,

11. అటువలెనే గురువు లేకుంటే అది యెవరు కానలేరు, గురువులేక సంసారసాగరమును దాటలేరు, ఓడలేక మహానదిని దాటలేనట్లు.

12. ఓడ నడిపేవాడు గట్టివాడు కావలె, అస్తవ్యస్తమయితే తిప్పలే వుంటుంది. నట్టేట పుట్టిముంచును, అందుకేమి సందేహం లేదు.

## 6. తాను లక్షణము, ఈ తాను లేకపోవలెను

1. అంతా తానేనని శాస్త్రం చెప్పింది, తానే ప్రకృతి, తానే మహత్తు, తానే అహంకారము,

2. తానే ఆకాశము, తానే వాయువు, తానే అగ్ని, తానే జలము, తానే భూమి, తానే ఓషధులు,

3. తానే అన్నము, తానే జీవుడు, తానే జ్ఞాత, తానే జననము, తానే మరణము,

4. తానే అన్నమయము, తానే ప్రాణమయము, తానే మనోమయము, తానే విజ్ఞానమయము, తానే ఆనందమయము, తానే హిరణ్మయము,

5. అంతా తానులేని నిశ్చయము కావలెను, కల వలె తాను లేకపోవలెను,

6. గురువు వల్ల తాను లేకపోవలెను, తాను లేకపోతే యేది లేదు, తాను లేకపోయ్యే మార్గమే తెలియవలెను,

7. తాను యెప్పుడు లేకపోతే అప్పుడే యేదిలేదు,

8. నిదురే దృష్టాంతము, నిదురలో తానులేడు, అప్పుడు యేమి వున్నది. అటువలెనే యెప్పుడూ తానులేకనే వుండవలె, యెప్పుడు తాను లేకపోతే అప్పుడు ప్రపంచము లేదు.

9. యెప్పుడు తాను వుంటే అప్పుడే ప్రపంచము వున్నది, తాను గురువువల్ల లేకపోతాడు, యేమతములోనయినా తాను లేకుంటేనే ముక్తి,

10. ముక్తి అనగా విడవబడడము, బంధమును విడుచుట, తానే బంధము, తాను లేకుంటే యేబంధము లేదు,

11. జీవ బ్రహ్మైక్యమనగా భ్రమ, యెందుకంటే తాను లేకుంటే ఐక్యములేదు, తాను వుంటే జీవత్వమే, జీవేశ్వరైక్యమందు తాను మిగిలి ఉంటాడు. ఎందుకంటే అన్ని తనలో కలువవలె గదా !

## 7. అచల గురు లక్షణము

1. అందరు లేనికథ కావించుతారు, మేము కావించము, మాకు రాచకార్యము లేదు, కట్టె కొట్టె తెచ్చె, అంతే, మేము రాచకార్యాలు అంగీకరించము,

2. మాకు శిష్యులు లేరు, యెవరైన మేము గురువులమని అనుకున్నారా, మాకేమి, అతనితో పనియేమి, భయములేదు, మాకు ఒకరి ప్రస్తావము లేదు. మాకు మేమే ఉంటాము.

3. కలలో మాటలు లెక్కకు రావు, కలగా విచారిస్తాము, విచారిస్తే యిప్పుడే లేదు. విచారించరా. యింకా కొన్నాళ్లకు లేదు. జొన్నగింజ కాదు, ప్యాలపు గింజ మొదటి పేరు.

4. **గు॥** కలలో ఒక శిష్యుడు. మా వద్ధికి వచ్చెను. యెవరయ్యా మీరంటిమి. బ్రాహ్మణులమనె. యెందుకు వచ్చినారంటిమి. మీతో పని వుండి వచ్చినామనె. అంతట వారికి మాకు

కలలో అనేక ముచ్చట్లు జరిగే, అవి చెప్పుచున్నాను.

5. శి॥ మీరు తెలిశినవారు అని చెప్పిరి. మాకు భ్రమ పుట్టినది. సంసార మందు భ్రమలేదు, ధ్యానమందు భ్రమలేదు, తల్లిదండ్రులయందు భ్రమలేదు.

6. నాకు నరకము లేకుండా స్వర్గమందున వుండేటట్టుగా అనుగ్రహము చేయవయ్యా. మీకు వందనము చేశేము. చెప్పినట్టు వినేము అని మాతో భాషించె,

7. గు॥ అతనికి భ్రమతీర్చవలెననే వుద్ధేశము కలిగెను.

## 8. గురుశిష్య సంవాదము

గు॥ యేమోయి శిష్యుడా ! నరకము స్వర్గము రెండు వున్నవని నీకు తోచుచున్నవా? ఒకటి వున్నదని తోచుచున్నాదా? అని అడిగితిమి.

శి॥ రెండు తోచుచున్నవనెను.

గు॥ యేలాగు తోచుచున్నవి ? యెవరైనా చెప్పినారా, నీకే తోచెనా అని అడిగితిమి.

శి॥ వారికివారు అనుకోగా వింటిమనెను.

గు॥ వారికివారు యేలాగున అనుకొనిరి. వారికి యేమి ఆధారము. అని అడిగితిమి.

శి॥ శాస్త్రాధారమనెను.

గు॥ శాస్త్రములు యెవరు చెప్పినారు అని అడిగితిమి.

శి॥ తలావొకటి చెప్పినారనెను.

గు॥ అందరు వొక తీరుగా చెప్పినారా, అనేక విధములుగా చెప్పినారా ? అని అడిగితిమి, ఆ శాస్త్రములు యిప్పుడు చెప్పినవా, వెనక చెప్పినవా అని అడిగితిమి.

శి॥ యిప్పుడు చెప్పినారు. వెనుకను చెప్పినారు అనెను.

గు॥ యిప్పుడు చెప్పినవారు యే ఆధారముచేత చెప్పినారని అడిగితివి

శి॥ వెనుకటివి జూచి ముందు జెప్పినారనెను.

గు॥ వెనుకవారు యేలాగున చెప్పినారు, అని అంటిమి.

శి॥ అందరు వొకరు జెప్పినవి జూచి వొకరు జెప్పినారుగాని యెవరుచూచి చెప్పినవారు లేరు అనెను.

గు॥ అయితే యిప్పుడు యేమంటావు అని అడిగితిమి.

## 9. ద్వైతం ఇటువంటిదని దీక్షితుల వారు తెలుపుట

శి॥ ద్వైతమంటే యేమి అనెను.

గు॥ ద్వైతమనగా రెండు, రెండు అంటే జీవుడు, దేవుడు.

శి॥ జీవుడు యెటువంటివాడు ? దేవుడు యెటువంటివాడు ?

గు॥ జీవుడు అంటే అణువు. దేవుడు అంటే విభువు.

శి॥ జీవుడు యెక్కడవున్నాడు, దేవుడు యెక్కడవున్నాడు ?

గు॥ జీవుడు శరీరములో వున్నాడు, దేవుడు స్వర్గమందు వున్నాడు.

శి॥ దేవుడు అంటే విష్ణువా, శివుడా?

గు॥ విష్ణువు దేవుడే, శివుడు దేవుడే.

శి॥ యెవరు యేమి ఆనందమును యిస్తారు.

గు॥ యిద్దరు యిచ్చేది వొకటే ఆనందము.

శి॥ అయితే యిద్దరిని నమ్మవలెనా?

గు॥ శివుడయినా విష్ణువైనా వొక్కడే దేవుడని నమ్మవలెను,

శి॥ యేతీరున నమ్మవలెను?

గు॥ ధ్యానించవలెను శి॥ దేవుని యొద్దికి యెప్పుడు పోతారు?

గు॥ ప్రారబ్ధక్షయమైతె పోతారు.

శి॥ వీరికి వీరే పోతారా? యెవరైనా వెంట బెట్టుక పోతారా ?

గు॥ వీరికి వీరూ పోతారు, ఆ దేవదూతలు వచ్చి వెంటబెట్టుకొని పోతారు.

శి॥ అక్కడ పోయి యేమి చేయవలెను?

గు॥ సాన్నిధ్యమందు వుంటారు. శి॥ ఆకలిదప్పుడు కలవా?

గు॥ లేవు. శి॥ అపేక్ష లైమైనా కలవా?

గు॥ లేవు శి॥ తను దాదెలిసి వుంటారా, తెలియకవుంటారా?

గు॥ తన్ను మరచి ఆనందముచేత వుంటారు.

శి॥ స్వర్గమందు యెన్నాళ్ళు వుంటారు?

గు॥ పుణ్యం అయిపోయె వరకు వుంటారు.

శి॥ యేమైనా సుఖదుఃఖములు దోచునా?

గు॥ యేమీ తోచవు. శి॥ స్వర్గానికి పొయ్యేది యీ దేహమేనా ?

గు॥ కాదు. శి॥ మరి యేమిటిది ?

గు॥ జీవుడు శి॥ జీవుడు యెప్పుడు వుండేవాడేనా ?

గు॥ వుండేవాడె. శి॥ యే విధముచేత మోక్షమును పొందుతాడు ?

గు॥ భక్తిచేతను. శి॥ భక్తి యెటుల చేయవలెను ?

గు॥ అచంచలభక్తి. శి॥ అది యెటుల చేయవలెను ?

గు॥ సకలభ్రమలు విడిచి యితరచింత లేకుండా, సకల కాలాల యందు స్వామిని ధ్యానించవలెను, ధ్యానించకుంటే నరకము.

శి॥ నరకమందు యేమి అనుభవము ?

గు॥ సకలనిర్బంధాలు

శి॥ యేలాగు తొలగును ?

గు॥ భక్తిచేతను.

శి॥ స్వర్గమందు జేరి సృష్టి స్థితి లయములకు తాను కర్తయగునా?

గు॥ కాదు. శి॥ యిచ్ఛా విహారముగా తిరుగునా ?

గు॥ తిరగడు. శి॥ తన్ను తాతెలిసి వుండునా ?

గు॥ తెలిసి వుండడు. శి॥ ఆనందమనగా యేలాగు?

గు॥ తన్నుతా మరచుట ఆనందము. ఇదే ద్వైత సిద్ధాంతము యొక్క నడుక.

## 10. అద్వైతము ఇటువంటిదని దీక్షితుల వారు తెలుపుట

శి॥ అద్వైతమంటే యేమి ? గు॥ అంతా పరమాత్మ జీవుడు పరమాత్మే.

శి॥ జీవుడనే పేరు ఏలాగున వచ్చెను.

గు॥ బింబము పేరు పరమాత్మ, ప్రతిబింబము జీవాత్మ.

**శి॥** దృష్టాంతముతో చెప్పండి ? **గు॥** సూర్యుడు జలఘటములో ప్రతిఫలించినట్లు.

**శి॥** జీవునికి జననమరణములు కలవా, లేవా? **గు॥** లేవు.

**శి॥** సుఖదుఃఖాలు అనుభవించేవారు యెవరు ? **గు॥** సూక్ష్మదేహము.

**శి॥** యెన్ని దేహములు ? **గు॥** మూడు.

**శి॥** దేహములు ఏవేవి ? **గు॥** స్థూలము, సూక్ష్మము, కారణము.

**శి॥** యే దేహము యెంత మట్టుకు వుండును ?

**గు॥** ప్రారబ్ధక్షయ పర్యంతం స్థూలదేహము వుండును. ముక్తి పర్యంతం సూక్ష్మ దేహము వుండును

**శి॥** జన్మముకు పొయ్యేది ఏమిటిదీ ?

**గు॥** సూక్ష్మదేహము. **శి॥** స్థూలదేహము పోగానే సూక్ష్మదేహము యెక్కడికి పోవును ?

**గు॥** మరియొక దేహములో జొచ్చును. గర్భనరకమును పొందును.

**శి॥** యీ సూక్ష్మదేహము యేలాగున లేకపోవును?

**గు॥** జీవబ్రహ్మైక్యాను సంధానము కలిగినప్పుడు లేకపోవును అన్నారు.

**శి॥** జీవబ్రహ్మైక్యాను సంధానము ఎలాగు?

**గు॥** యోగాభ్యాసము చేయవలెను.

**శి॥** అట్టి అభ్యాసమువలన జీవుడు పరమాత్మయగునా? **గు॥** అవును.

**శ్లో॥ లోకేస్మిన్ ద్వివిధా నిష్ఠా । పురాప్రోక్తా మయానఘ ।**
**జ్ఞాన యోగేన సాంఖ్యానాం । కర్మయోగేన యోగినామ్ ॥** **(గీత 03-03)**

తా॥ ఈ లోకమున రెండు నిష్ఠలు గలవు, వానిలో సాంఖ్య యోగులు జ్ఞానయోగం ద్వారా, యోగులకు కర్మయోగం ద్వారా అభ్యాసము చేయవలెనని ఉన్నది.

**శి॥** జీవుడు అయినప్పుడు యేమి అనుభవము? పరమాత్మ అయినప్పుడు యేమి అనుభవము?

**గు॥** జీవునికి అనుభవము లేదు. పరమాత్మకు అనుభవము లేదు. సూక్ష్మ దేహమే సుఖదుః ఖములనుభవించేది. సూక్ష్మదేహభంగమే జీవన్ముక్తి అని అద్వైత సిద్ధాంత నిర్ణయము.

## 11. అచల బోధ చిక్కులు లేని మార్గమని దెలుపుట.

శి॥ ద్వైతాద్వైతము యను యీ రెంటిలో మీ మార్గము యేది?

గు॥ యీ రెండు మార్గములు మావి గావు.

శి॥ మరియే మార్గము? మీది ?

గు॥ మాది భ్రాంతిలేని మార్గము. అనాయాస మార్గము. అడవి మార్గము కాదు.

శి॥ అది యేలాగు?

గు॥ ద్వైతము కాదు. అద్వైతముగాదు. "పరిపూర్ణ భావము". తాను యెప్పుడు లేనని తెలియడము

శి॥ అది యెక్కడనున్నది ? గు॥ అంతటానున్నది.

శి॥ యెటువలెనున్నది ? గు॥ యెటువలెనున్నదో అటువలెనే యున్నది.

శి॥ ఏలాగున తెలియవలెను.

గు॥ గురువాక్యముచే, దృఢాభ్యాసముచేత, చిక్కులేని మార్గము తెలియవలెను.

శి॥ అయ్యా మీ మార్గమే బాగా ఉన్నది. యిది మాకు చెప్పండి. నేను తెలుసుకుంటాను.

గు॥ యిది యిప్పుడే చెప్పకూడదు. చెప్పితే నిస్సారము. అతకదు, పాట్లన్ని పడవలెను.

శి॥ ఆ పాట్లన్ని మీరే పెట్టండి.

గు॥ మాకేమి, చిక్కుల పెట్టము. దీర్ఘకాలము గురుసేవచేయవలెను "గురుసేవ అనగా సాంగత్యమే."

శి॥ గురు సేవ చేసెదము. మీ భావమే సాధించెదము. మిమ్మే నమ్మి కష్టపడెదము.

గు॥ కష్టానికే ఫలము. శి॥ యేమి కష్టము చేయవలెను?

గు॥ శాంతముతో నుండి తెలుసుకోవలె. తెలిసే పర్యంతము ఉండవలెను. తెలిసేది మహాదుస్తరం, తెలుసుకునే యెరుక నిత్యముకాదు, నిత్యము నిత్యమయ్యే వున్నది. నిత్యమునకు నిలకడ కలదు.

శబ్ధముకాదు. స్పర్శకాదు. రూపము కాదు. రసముకాదు. గంధముగాదు. బ్రహ్మకాదు. విష్ణుకాదు. యేదికాదు.

శి॥ యేదిగాకపోతే యెటువంటిది ?

గు॥ అదే అన్ని దిక్కులా యున్నది అదికదలదు, మెదలదు, పలుకదు, పుట్టదు, గిట్టదు, ఒకదాన్ని పుట్టించదు, అన్నీ అందులోనే తోచినవి. అందులోనే పోతావి, బట్టబయలు అంతటా ఉన్నది.

యెవరు గురుసేవ చేస్తే వారికి తెలుసును గాని, యితరులకు యెవరికి తెలియదు. వాదభేదములు కాదు. వాదము చేయరాదు. అది సులభముగానే తెలియును. తానే లేకపోతేసరి,

శి॥ తాను లేకపోయ్యేది యేలాగు ?

గు॥ 1. యోగముల యందున తానేవుంటాడు, మంత్రముల యందున తానే వుంటాడు, ధ్యానముల యందున తానే వుంటాడు, అన్నిటా తానే వుంటాడు, గురువు చెప్పితేగాని తాను లేకపోడు, సూచన చెయ్యంగానే కనుక్కునే శక్తి వుంటే చెప్పవలె, లేకపోయెనా చెప్పేవారే తెలియనివారు,

2. "ధనమును యిచ్చి తెలుసుకుందామంటే తెలియనే తెలియదు, ధనము తీసుకొని చెప్పితే బాగానే వుండదు, ఒకరిమాట ఒకరికి అతకనే అతకదు."

3. మనస్సు తేటకావలెను, మనస్సు లేకపోవలెను, మనస్సు కరగవలెను, చెప్పే గురువుకు మనస్సు యెంతమాత్రము లేనేలేదు. కలలో చెప్పినట్లు వుంటుంది, అన్నీ కలలో ముచ్చట్లేను, కలకు మూలంలేదు.

4. దానికి అదే పుట్టుచున్నది. దానికి అదే పోవుచున్నది. యెరుకకు మరియాదలేదు. తాను వుంటే కల, తాను లేకపోతే కలలేదు, కలదోచిన శరీరం యేలాగో అలాగే. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు. యీ వుత్త బట్ట బయలు యేమీలేదు. ఇదే అచల సిద్ధాంతము, సిద్దాంతమే రాద్దాంతము.

గద్య:

ఇతి అచలగురు శ్రీశివరామ దీక్షిత ప్రభావే । వేదాంత విచారణే ।
పూర్వభాగే ద్వైలక్షణము తృతీయ ప్రకరణం । సమాప్తం



# 4. పరిపూర్ణ బోధ ప్రకరణము

## 1. పరిపూర్ణ లక్షణము

1. సకల దేశములయందు వున్నది. సకల కాలములయందు వున్నది.
2. సకల వస్తువులయందు వున్నది, చలనము లేకుండా వున్నది.
3. చావు పుట్టుక లేకుండా వున్నది, వుత్త బట్టబయలై వున్నది. రెండోది లేకుండా వున్నది.
4. అవనిలో నున్నది, నీరులో వున్నది. అగ్ని హోత్రములో వున్నది.
వాయువులో వున్నది, ఆకాశములో నున్నది, ఆకార వికారాములు గాక నున్నది,
5. ప్రకృతిలో నున్నది, మాయలో నున్నది, ప్రకృతి మాయ గానిది,
6. మహత్తులో నున్నది, కన్నులలో నున్నది,
7. ముక్కులో నున్నది, చెవులలో నున్నది,
8. వాక్కులో నున్నది, చేతులలో నున్నది, కాళ్ళలో నున్నది,
9. కడుపులో నున్నది, తలలో నున్నది,
10. తలపులలో నున్నది, తనువులలో నున్నది,
11. తత్త్వాలలో నున్నది, అక్షరాలలో నున్నది,
12. అహంవృత్తులలో నున్నది, అంతటా నున్నది,
13. సురులలో నున్నది, గిరులలో నున్నది,
14. చెరువులలో నున్నది, తరువులలో నున్నది,
15. హరులలో నున్నది, కరులలో నున్నది,
16. వూళ్ళలో నున్నది, గుళ్ళలో నున్నది,
17. రాళ్ళలో నున్నది. రోళ్ళలో నున్నది,
18. వేళ్ళలో నున్నది, గోళ్ళలో నున్నది,
19. తేళ్ళలో నున్నది, నోళ్ళలో నున్నది,

20. మళ్ళలో నున్నది, పళ్ళలో నున్నది, దళ్ళలో నున్నది,

21. గొడ్లలో నున్నది, గుడ్లలో నున్నది,

22. బుడ్లలో నున్నది, వడ్లలో నున్నది,

23. చీమలలో నున్నది, దోమలలో నున్నది,

24. పాములలో నున్నది, వేములలో నున్నది,

25. ఆములలో నున్నది, సాములలో నున్నది,

26. కాలత్రయములలో నున్నది, లోకత్రయములలో నున్నది,

27. దేహత్రయములలో నున్నది, కారణ త్రయములలో నున్నది,

28. సకల దిక్కులలో నున్నది, సర్వత్రా నిండి నిబిడీకృతమై బట్టబయలే యున్నది.

29. కల దోచిన శరీరం యేలాగో ఆలాగే.

30. మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు, ఈ ఉత్త బట్టబయలే స్వతః సిద్ధము.

గద్య:

ఇతి అచలగురు శ్రీ శివరామదీక్షిత ప్రభావే, వేదాంత విచారణే
పూర్వభాగే పరిపూర్ణబోధ చతుర్థ ప్రకరణం సమాప్తం







# 5. అచల ప్రబోధ ప్రకరణము

1. సృష్టికి పూర్వము, సృష్టికి పరము, సృష్టి లేనప్పుడు సృజన లేక యున్నది. సకల దేశముల, సకల కాలముల, సకల వస్తువుల చంచలము లేక యున్నది.

2. నీకు యెనిమిది దిక్కుల యందును, మీదను క్రిందను లోపల, బయట నడుమను నిండియున్నది. చలనములేక, మలినము లేక, ఆది మధ్యాంతములు లేక పరిపూర్ణమైన బట్టబయలే యున్నది.

3. ఈ బట్టబయలే ఏకమై బాధ రహితమై కేవలాత్మయై యున్నది. అది సగుణ నిర్గుణము గానిది. అది సదసత్తులుగానిది. అది సాకార నిరాకారములు గానిది.

4. అది జీవజగంబులు గానిది, అది క్షేత్రజ్ఞ క్షేత్రములుగానిది, అది నామరూపములు గానిది. అది కారణ కార్యములును గానిది. అది పాప పుణ్యములు బంధ మోక్షములు గానిది. అది ద్వయదోషము లేనిది.

5. అది జ్ఞాన కర్మములు గానిది. అది క్షరమక్షరములు సత్యాసత్యములు గానిది. అది ఖండ అఖండములు గానిది. అది రాకడ పోకడ లేనిది. గనుక అచలమై యున్నది.

6. అది వసుధలో నణగదు, నీళ్ళలో మునగదు. అగ్ని చేతకాలదు. గాలికి గూలదు. చేతులకు చిక్కదు. కన్నులకు కనబడదు. గురు సూచన చేత కనపడును.

1. కలదోచిన శరీరాలు యేలాగో అలాగే.
2. మూలం లేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు.
3. యీ వృత్తబట్టబయలు యేమీలేదు.

ఈ మూడే గురువుతో తెలుసుకొని యుంటే చాలు. ఇంతకన్న యెక్కువ లేదు.

గద్య:

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే, వేదాంత విచారణే, పూర్వభాగే అచలప్రబోధ పంచమ ప్రకరణము సమాప్తం.**



# 6. యోగ నిరసన ప్రకరణము

## 1. ఈ యోగమార్గము వలన యే ప్రయోజనం లేదు.

1. యోగము చేయవలెనంటారు, యోగముచేస్తే కణతలు తీపే పుట్టును, అందువల్ల మరణమే సంభవించును, మరణానికే వొప్పుతారు.

2. మంచి యోగులైతే మరిచావే, ఆఖరకు తలపగులును. అందువల్ల ముక్తియట, ఆ ముక్తిగాక పోతేనేమి. కొంగయెప్పుడు తపస్సు చేస్తున్నది గదా !

3. ఆ తపస్సు అందరూ చేయవచ్చును, దొమ్మరవాడు యెప్పుడున్నూ చేసేది సాధనే, ఆసాధనతో యేమి ఫలము. అందువల్ల యేమీలేదు.

4. పాము యెప్పుడున్నూ వాయుభక్షణే చేస్తున్నది, ఆఖరికి అదిచస్తున్నది, అందువల్ల యేమీ లేదు,

5. యెప్పుడున్నూ మేకలు ఆకులనే మేస్తున్నవి, అందువల్ల యేమిలేదు అందువల్ల కాయసిద్ధి అగుచున్నదా?

6. లోకులు పొయ్యేవన్నియు వెఱ్ఱి వెఱ్ఱి పోకడలు, ఆ పోకడల వల్ల యేమికలదు?

7. రాతిని దేవుడు అని అనుకున్నారు, ఆరాయి నడిచిరాలెదే? అందువల్ల యేమిగలదు?

8. ఆ దేవుని తాళ్లు బెట్టి కదలకుండా కట్టుతారు. కటకటా అనరు, యీ సంగతి యెందుకు తెలియరు. రాళ్లు దేవుళ్లయితే రాసులు మ్రింగవా? అని వేమన్న గారు అన్నారు.

9. అందువల్ల వేమన్నను వెఱ్ఱివాడు అని అన్నారు. లోకుల వాక్యాలు వెఱ్ఱివాక్యాలు అయెను

10. ద్యానమున్నూ ప్రయాసే, జపమున్నూ ప్రయాసే, ఇట్టి ప్రయాస యెందుకు పడవలెను.

11. అన్ని ప్రయాసలే, యీ అన్యాయము యేమి? యిది బాగా వుండలేదు, యిందువల్ల యేమీలేదు, అంటే యెవరికి తెలియదు.

12. యోగమార్గములో నేననే గుర్తెరిగే యెరుక యున్నది, జ్ఞానమార్గములో నేననే గుర్తెరిగే యెరుక యున్నది, ఈ నేననే మూలం లేని గుర్తెరిగే శరీరం యేమిలేక పోవలెను.

**గద్య: ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే, వేదాంత విచారణే,**
**పూర్వభాగే యోగనిరసన షష్ఠమ ప్రకరణం సమాప్తం**



# 7. సమాధి నిరసన ప్రకరణము

## 1. యోగ మార్గము వలన మనోలయమని చెప్పుదురు.

1. రాజయోగ సమాధిలేక హఠయోగము సిద్ధించదు, హఠయోగములేక రాజయోగము సిద్ధించదు. అని వేదాంతవార్తికము మొదలైన, గ్రంథముల యందు జెప్పబడుచున్నది.

2. రాజయోగమనగా, సంసారముననుండి, దారా పుత్రాదుల సంరక్షణచేయుచు, ఎరుకను మరువక ఎరుకేనిత్యమని తలంచుచు దేహాసక్తి వదలి మనోలయము జేయుచుండుట రాజయోగమని చెప్పుచుందురు.

3. అందుకు మనోలయమైతే, ఎరుక ఎక్కడున్నదో ఎరుకయే తానైయుండిన దేహాసక్తి యేలాగున వదలునో, ఎరుకకు దేహమునకు బేధమని చెప్పుచున్నారుగదా. ఎరుకకు దేహమునకు బేధమైతే సుఖదుఃఖములు ఎరుకకుయేల దోచవలెనో ఇందుకేమి సమాధానమో, ఇది ఎవ్వరికిన్ని తెలియదు

4. అందరు ఎరుక, ఎరుక, ఎరుక, యని, ఎల్లప్పుడు కలవరింపుచుందురు ఆ ఎరుక యేలాగున గలిగెనో ఎలాగునలేకపోయెనో, ఎలాగున ప్రవర్తింపుచుండునో ఈ కారణములు చక్కగా విచారించనేరరు.

5. అందరికి జ్ఞానం జ్ఞానంయని ఒకటే కలువరింత అట్టి జ్ఞానం త్వరగావచ్చి వడిలోబడునని తాత్పర్యమా, ఎవరో ఎదుటవచ్చి కనబడుదురనె తాత్పర్యమా, జ్ఞానమనగా పప్పుబువ్వయై యుండును, అనుభవించ వలెనను తాత్పర్యము గలదు.

6. మేమనుభవజ్ఞులమని యందురు. ఆ యనుభవమెటువంటిదో, ఇతరులకు దెలియదు. ఈ యనుభవములు ఆయాసకరము, అసహ్యాకరములైనవి.

7. ఆనందమని యందురు, ఆనందము ఎపుడు గలదో అపుడే ఆయాసము గలదు. ఆయాసము లేని ఆనందము లేదు. ఆనందము లేని ఆయాసము లేదు. దొంతరులుగా నున్నవిగాని, సాధారణము గాదు.

8. ఒకటి ఉన్నదనిన రెండవది అపుడే గలదు. "ఏకమేవ అద్వితీయం బ్రహ్మ" యని చెప్పుదురుగాని ఒకటి యే మార్గము ఎటువంటిది? ఒకటి గలిగితే రెండవది వెంబడే గలదు.

9. ఈ మార్గము వివాదములకు విశదముగా నున్నది. ఈ వివాదములమీద విశేష ఆదాయమును పొందవలెనేగదా? ఆ ఆదాయభ్రాంతి సంసారసంరక్షణకే గదా!

సంసారసంరక్షణము తన సుఖమునకేగదా! తనసుఖమైనను, ఎంతకాలము స్థిరముగా నిలుచును? శరీరమున్న పర్యంతముగలదు.

10. అయితే జననమున ఏమిసుఖముగలదు. మరణసమయమున ఏమి సుఖముగలదు? జననమరణములకు మధ్య ఆసక్తి సంభవించినపుడు ఏమి సుఖముగలదు? ఈ సుఖము నెరుగక ఎందుకాయాస పడవలెను? అనగా ఈ సుఖదుఃఖములు ఎటులైనను దప్పవుకాని, పైనుండి యోగాభ్యాసముల వలన గలిగే ఆయాసములను ఎందుకు పొందవలెను?

11. యోగాభ్యాసమువలన ఆయాసము గలుగునా యనిన యెడల గలుగును. ఏలాగున అనగా?

## 2. ఎరుక వలన ఆయాసమే గాని ఆనందము ఎప్పుడు లేదు

1. ఆహార నియమము వలన క్షుద్బాద మొదటి ఆయాసము.

2. ఇచ్ఛావిహారముగా దిరుగుచుండేవానికి దేహము నిక్కబెట్టి కదలక కూర్చుండుట రెండవ ఆయాసము గలుగును.

3. కనులు, ముక్కు, మొదలైనవి మూసి కొనుటవలన కనులకు విరోధము. మూడో ఆయాసము.

4. యోగాభ్యాసము వలన దుఃఖములు గలుగునుగదా! ఆనందము గలుగుననుటకు, ఆ యానందము అతనికేమి దృష్టమోకాని ప్రపంచమునకు ఏమియు కనబడదు.

5. ఆనందపరుండని యందురు. విషయానందమునే ఆనందమనవలెగాని బ్రహ్మానందము లేనేలేదు. ఎందుచేననగా బ్రహ్మమునకు రూపమైనాగలదని ప్రతిపాదించితే ఆ రూపమునైనా చూచి, ఆనందపడుచున్నారని అనవచ్చును. అందుకు అదియునులేదుగదా !

6. బ్రహ్మము అవాఙ్మనస గోచరమని చెప్పుచుండిరి. బ్రహ్మము నిరాకారమే నాయెను గదా!

7. వాక్కుచేత జెప్పనలవి గాక పోయెను. గనుక బ్రహ్మానందమను మాటనే గాని మరేమిలేదు.

8. కనుల జూడ నలవి గాక పోయెను. దానిచే ఆనందమేలాగున ఉన్నది.

9. మనసున దలచినలవి గాక పోయెను. అదియేలాటి ఆనందము? గనుక అంతా మాయ మాటలేనని తెలియవలెను.

## 3. మహావాక్య అనుభవము నీవే నేను, నేనే నీవు.

1. ప్రజ్ఞానం బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి, తత్వమసి బ్రహ్మ, అయమాత్మా బ్రహ్మమని వేదవాక్యములు నాలుగు గలవనియు, అవి గురూపదేశమున విచారించవలెనని చెప్పుచున్నారు.

2. అదే ముందుగా విచారించెదము. ఆ మహా వాక్యమునకు చిగురుకొమ్మ చాయలుగా ఎంత అర్థమున్నను, క్రియాపర్యవసానము బ్రహ్మమేనీవు, నీవేబ్రహ్మమని చెప్పుచున్నది.

3. ఇందుకే తామసము గలుగుచున్నది. ఇది విచారించినచో ఆకాశమును పిడికిటబట్టి, పదేపదే పొడిచినట్టుగును,

4. ఆకలిగొని పొట్టుదంచుకున్నట్టుగాను, ఉన్నది గనుక దాని వలన వృధా ప్రయాస.

5. గొంగడిలో అన్నము తిని దాహమై ఎండమావులు జూచి, పరుగులెత్తినట్టుగానున్నది. గాని మహా వాక్యములందు సంతోషమేమియు కనుబడలేదు.

6. ఆ సంతోషము కనుబడకపోవడము చూడబడుటచేతనా? వినుటచేతనా? తర్కించుటచేతనా? ఉపదేశమగుట చేతనా? ఒకరికి చెప్పుటచేతనా? ఎందుచేత కనుపడలేదని యందురు.

7. చూచుటచేత కనులు లొట్టలుపోయెనుగాని అందువలన నొక గాడిదగానైనా, నొక కుక్కగానైనా, నొక ఎనుబోతుగానైనా, ముసలి బాపని వలెనైనా, పరమాత్మ కనుపడలేదు

8. అయితే, కుక్కవలె, పందివలె, గాడిదవలె, ఎనుబోతువలెనైనా, కనుబడలేదని ఇంత అపహాస్యముగా ననుట యేలయని అందురేమో? అపహాస్యముగాదు.

9. చెప్పుకొనుచుండు మాటలు వినుచుండలేదా? నాకు అలాగునయేమైన కనపడతారేమో ననుకొని పూర్వము ఇటువంటి రూపములచేతనే యగుపడితే, మనసు పరిపక్వములైన వారు తెలిసికొని ముక్తులైనారనియు, అ పరిపక్వచిత్తులు ఆదర్శమైనపుడు దెలసుకొనజాలక తరువాత దెలిసి విచారగ్రస్తులైనారని చెప్పుకొన్నారు.

10. కనుకనే నేను పొరబాటు లేకనే కనిపెట్టుకొని కూర్చున్నాను. ఒక రూపమైన కనబడక పోయెనని యనుకున్నానుగాని ఆక్షేపణగాదు, ఆయాసముగాదు.

## 4. చేసిన భక్తికి సార్థకము లేకపోవుట.

1. అందుకందురుగదా అటువంటి భక్తి నీకు కుదరనందున కనపడలేదని యందురు. నా భక్తి నాకు తెలిసియే యున్నది. ఇతరులు అనుకోకపోతే నేమి?

2. ఏ విధముగానైనా భక్తికీ ప్రబలముచేసి స్వామిని చిక్కించుకొని యందరిలో ఘనముగా దిరుగవలెననే యత్నము చేసితినిగాని ఆ యత్నము సిద్ధించక పోయెను.

3. తన లోపముచేత కనబడకపోయెననుటకు అది ఫలాని లోపమని తోచితే ఆ లోపమువల్లనే కనబడకపోయెననే సందేహముండును. ఆ సందేహమేమియు లేదు.

4. నా యందు యత్నలోపమున్నది, లేనిది లేని స్వామి కెరుకలేదు ఉన్న స్వామికైతే ఎరుకేయుండును. ఉన్నస్వామి ఎవరో, లేని స్వామి ఎవరో ఎందుకింత నాచేత ననుపించవలెను.

5. చేసిన భక్తికి సార్థకము లేకపోయెను. ఏది చేసినను ఏమిలేకపోయెను. ఏది వినినను ఏమి లేకపోయెను. ఇందుకేమి జెప్పుకొందును? సిగ్గు చేటు.

6. నేను భక్తిచేతనే ప్రవర్తించినానని యంటే నీవు అట్లు చెప్పుకొనుట చేతనే నీకే దెలియకపోయెననియు ఆత్మస్తుతి పరనింద జేయుటవలన నరకమేగాని మోక్షము గలుగునాయనియు నందురు.

7. అయితే ఇక వేదాంతమే మానుకొనవలెను. ఎందుచేతననగా ఆత్మస్తుతి పరనింద కూడదని యందురు గదా. అందుకు మొదలెత్తుకోవడము లోనే వేదాంతమునందు ఆత్మస్తుతి ముఖ్యమయ్యే యుండెను.

8. పరనిందగూడ గలిగియేయుండెను పరనింద విడుచుట ఎట్లు, ఆత్మస్తుతి లేకపోవుట ఎట్లు?

**శిష్యుడు:-** ఓ గురుమూర్తి! వేదాంతమునందు ఆత్మస్తుతి పరనింద లేనేలేదు. ఒకరిని దూషించినవాడు చండాలుడని చెప్పబడుచున్నది. కర్తవ్యము లేనివాడే ఆత్మవేత్తయని చెప్పబడుచున్నది. స్వామీ! వేదాంతము మహామార్గములుగా నున్నదని యనగానే

**గురువు :-** 1. ఓయి శిష్యుడా, నీవు గురువునకు పంగనామాలు పెట్టే వాడవుగా కనుపడుచున్నావు గాని గురువుచెప్పిన యుక్తిని దెలిసికొని మనసు స్పష్టపరచుకొనేవాడవు గావు. నీకు ఇంకా ఇలాగున ఎవరు చెప్పగలరు?

2. బెల్లము ఏలాగున నుండునని యడిగితే తియ్యగా నుండునని చెప్పవచ్చు. తీపి ఏలాగునుండునని అడిగితే ఎట్లు చెప్పుదురు?

**శిష్యుడు :-** హే గురుస్వామి; ఎందుకయ్యా మీకు ఇంతకోపము రావడమునకు కారణమేమి?

**గురువు :-** ఓయి శిష్యుడా, కోపము రావడమునకు కారణము ఏమనగా, నీవల్లనే పుట్టెను నీవు లేకపోతే నేనులేను, నేను లేకపోతే కోపమెందుకుండును నీ వల్లనే కోపము గలిగెను?

**శిష్యుడు :-** అయ్యా, ఇందుకు మీరు చెప్పిన సమాధానము సరిగానే యున్నదిగాని, వేదాంతమందు ఆత్మస్తుతి పరనింద గలదంటిరిగదా. దానిని తెలుపగలరు, నాపై కరుణా కటాక్షముంచగలరు.

**గురువు :-** ఓయి శిష్యుడా!

## 5. ఆత్మ స్తుతి, పర నింద.

1. నేనే బ్రహ్మను, నేనే శివుడను, నేనే విష్ణువును, నేనే జగత్తును, నేనే గురువును, నేనే శిష్యుడను, అన్నియు నేనే అనియనుట ఆత్మస్తుతి యనుపించుకొనెను గదా!

2. ఆత్మస్తుతి యనగా ఇంతకన్నను వేరుగలదా! నేను శివుడను, నేను దేవుడను, నేను బ్రహ్మను అని యనుట యాత్మస్తుతిగాదా! అది అహంవృత్తిగాదా!

3. తానే బ్రహ్మదేవుడా! సకల జగత్తును తానే కల్పనజేయుచున్నాడా!

4. తానే విష్ణువా! అందరిని తానే పోషించు చున్నాడా!

5. తానే శివుడా! అందరిని తానే లయము చేయుచున్నాడా!

6. అందరిని తానే లయము చేయువాడైతే తన మనోలయమునకు ఇన్ని అగచాట్లు ఎందుకు?

7. తానే బ్రహ్మమని అంటుయున్నాడుగదా, బ్రహ్మము నిర్వికారుడు గదా, నిర్వికారమునకు నేనను అహంవృత్తి లేదుగదా,

8. **శి॥** అయితే నేననే అహం వృత్తి బ్రహ్మమైన తనకు ఏలాగున గలిగెను?

9. **గు॥** ఈ మొదలగు సందేహములచేతనే వేదాంతము ఆత్మస్తుతి యని చెప్పుచున్నాను. ఇందుకేగదా నీకు సంతోషముగా నున్నది.

**శిష్యుడు :-** హే గురుస్వామి ! గురువునకు పంగనామాలు పెట్టే వాడవని యంటిరి, అందుకు నాకు విచారముగానున్నది.

**గురువు :-** ఓయి శిష్యా ! వేదాంతమందు గురువునకు పంగనామములు పెట్టడమనగా అందుకు విచారపడవలసిన పనిలేదు. అందు ఒప్పుదల అయ్యేయున్నది. ఏలాగనగా గురువు శిష్యుడాయె శిష్యుడు గురువాయె ననుట వినుచుండలేదా?

1. ఇదిగాక మహావాక్యార్థమే అలాగు బోధించుచున్నది? ఎట్లనగా నీవే నేను, నేనే నీవని బోధించు చుండలేదా? వేదాంత మందు ఇది వొప్పిదమేయైనది. ఇది యెగ్గుగాదు గదా !

2. ఈ వేదాంతము నీవు చాలా శ్లాఘించుచుంటివి గనుక అందులోని అర్థము త్వరగా నీ మనస్సునకు దోచగలందులకై అంటినిగాని నీ మీద పగగలిగిగాదు. తెలిసికొనుమా.

**శిష్యుడు :-** ఓ గురుస్వామీ !

1. మీరు యీ అర్థమును సూచన చేయగానే తెలిసినది. ఎందుచేత మీతో నేను దానిని శ్లాఘించినదేమనగా నాకు ముగ్గురు విహితులుగలరు. వారు నాతో నొకానొకప్పుడు యీ వేదాంతపు మాటలు కొన్ని కొన్ని యాడుచుందురు అందువల్ల నేననుటకు కారణమైనది.

2. ఆ ముగ్గురైనను యేకవాక్యముగా మాట్లాడరు. ఆ ముగ్గురిలో నొకరిమాట యొకరికి గిట్టదు కనుక నాకందులో నొకరిమాట నా మనస్సునకు కొంచము నాటినది. దానిని బట్టి నేను వేదాంతమని అన్నాను.

3. ఆ ముగ్గురెవరనగా "నొకని పేరు ద్వైతవాది, ఒకని పేరు అద్వైతవాది, ఒకనిపేరు విశిష్టాద్వైతవాది" కనుక నాకు యేది దెలిసినదిగాదు.

4. వారు ముగ్గురు యెప్పుడును యెడతెగని వాదము జేయుచుందురు. నన్ను తెలయనివాడవని వారందురు. ఇంతేగాని నాకేమి తెలియును? ఆ మాటలు విని నేను మీతో అన్నానుగాని మరి యొకటిగాదు.

5. ఎవరైనాగాని యీ మాటలాడుకొనుచుండగా నేను అక్కడకు వెల్లి తెలసి తెలియని మాటలాడుదును. వారందుకు బాగా శంకజేతురు. వారు శంక జేయగానే నాకు యెటుదోచక యూరకుందును యింతే నా వృత్తాంతము.

**గురువు:-** ఓయీ, యీ ముచ్చట నిజమే. వారి సాంగత్యము నీకు యేలాగున తటస్థపడెను? వారితో నీవు యేమి మాట్లాడగలవు? ఇకను వారికి నీకు సహవాసము గలదా?

**శిష్యుడు :-** అయ్యా,

1. మేమందరము నొకచోటనే యుండువారము. ఎందుకు సహవాసము లేకపోవును.

2. స్వామీ, యింకొకటి చేయండి. వారు మిమ్ములను యెరుగరు. మీ సన్నిధికి వారిని తీసుకొని వచ్చెదను. వారందరిని పరిశోధనచేసి అందరికి ఒకే మార్గము గలుగజేయు మని ప్రార్థించి యింటికి పోయెను.

**హితులు :-** (ఆ ముగ్గురు స్నేహితుని దగ్గరకు వచ్చి), ఓయి స్నేహితుడా యిన్ని దినములు యెక్కడెక్కడికి వెళ్లినావు? ఎక్కడనైనా మహాత్ములు గలరా, వారికి నీకు యేమైన సంభాషణ జరిగెనా? యని యడిగిరి.

**స్నేహితుడు :-** ఓ స్నేహితులారా ! నేననేక దేశములు తిరిగితిని. ఒక మహాత్ముడు కనబడెను. కొన్ని దినములు వారి సాంగత్యము జేసితిని. వారడిగిన ప్రశ్నలకు నొకదానికైనా సమాధానము చెప్పలేకపోతిని. కనుక మిమ్ములను వారి దగ్గరకు తీసికొని వెళ్లుదామని వచ్చినాను.

**హితులు :-** ఓయీ, అలాగే వెళ్లుదాముగాని ఆయన నీకు చెప్పిన ముచ్చటలు యేమి, నీవు ఆయన నడిగిన ముచ్చటలేమి, నీవు ఒకటిగాక పోయినా నొకటియైనా అడుగలేదా? ఆయన యొకటైన సమాధానము చెప్పలేదా? ఆ సంగతులు చెప్పుమని యడిగిరి.

**స్నేహితుడు :-** నేను అడుగకపోవడమేమి? చెప్పుతాను వినండి.

ప్ర॥ మీరు సదానందపరులని నేనంటిని.

ఉ॥ ఆనంద మెప్పుడుగలదో దుఃఖమప్పుడే కలదని ఆయనవలన నే వింటిని.

ప్ర॥ మీకు దైవము ప్రత్యక్షమే గదా యని నేనంటిని.

ఉ॥ అనేక విధముల భక్తి శ్రద్ధలతో ప్రవర్తించినను నొకనాడైనను నొక గాడిదగానైనను నొక కుక్కగానైనను నొక యెనుబోతుగానైనను నొక ముసలి వానిగానైన నాకు కనబడలేదనగా నేనింటిని.

ప్ర॥ వేదాంతవిచారము నిర్మలమైన మార్గమని నేనంటిని.

ఉ॥ గురువునకు పంగనామము పెట్టెవాడనని నన్ననగ నేవింటిని.

ప్ర॥ ఆత్మస్తుతి పరనింద కూడదని నే నంటిని.

ఉ॥ నేనే బ్రహ్మను, నేనే విష్ణువును, నేను శివుడను యనుట యాత్మస్తుతి గాదా యననే వింటిని.

ప్ర॥ గురువునకు పంగనామములు పెట్టేవాడవని యనుటకు మహా విచారపడుచున్నానని నే నంటిని.

ఉ॥ గురుశిష్యులు నీవే నేను నేనే నీవనుట వేదాంతమందు గలదన నే వింటిని.

**హితులు :-** ఓ స్నేహితుడా, యిక నీ వడుగనిది ఒకటేగదా ఏది యనగా దైవము ప్రత్యక్షమే గదా యని నీవనగా కుక్కగానైన కానరాలేదు, గాడిదగానైన కానరాలేదు, యెనుబోతుగానైన కానరాలేదు, ముసలి వానిగానైన కానరాలేదు, యని యీ ఒకేదానికే గదా నీవు ఆయనను అడుగకపోయినది, నీకు చెప్పక పోయినది.

1. అందుకు ఆయన చెప్పబొయ్యే సమాధానము నాకు దెలిసేయున్నది. ఏమనగా,

2. కబీరుదాసునకు భగవంతుడు కుక్కవలెను,

3. రామదామనకు యెనుబోతు రూపముగాను,

3. కౌండిన్యునకు అనంత పద్మనాభస్వామి ముసలివాని వలెను కనబడినాడని గ్రంధములయందు ఈ లాగున చెప్పబడుచుండెను గదా,

4. అలాగుననే నాకున్ను ఒక గాడిద రూపముగానైన కనబడరాదాయని నా అభిప్రాయము అని చెప్పినారు.

5. అనగా యీలాగున భగవంతుడు వారివారికి ప్రత్యక్షముగా కనబడుటకు అవాఙ్మనసగోచరుడు నామరూపరహితుడు యేలాగున ప్రత్యక్షమని వారి తాత్పర్యము.

**హితులు :-** 6. అవునురా, ఆయన నడిగితే చెప్పబోవు సమాధానమునకును నీవు చెప్పిన సమాధానమునకును సరిగానే ఉన్నట్లుయున్నది.

7. మనము నలుగురము ఆయనదగ్గరకు వెళ్లి ఈ శంకనే యడుగుదము. అందుకాయన చెప్పబోవుసమాధానము యేది గలదో దెలియునని నలుగురు అదే ప్రకారము ఆలోచనచేసికొని ఆ గురుసాన్నిధ్యమునకు జేరి యిట్లని స్తుతింయించిరి.

## 6. గురు స్తోత్రం

శ్లో॥ సచ్చిదానందరహిత నపశ్యతి, నశృణోతి, నకరోతి, నవిజానాతి,
నస్థితి, నజననమరణాది శూన్య లయాది ఆవరణస్త్యాగరహితాత్మ
సుఖదుఃఖ, పాపపుణ్య రహిత, క్షరాక్షర భావభావ రహితః
ధర్మాధర్మ, సత్యాసత్య శాంత్యాశాంత, మిత్రామిత్ర, శుభాశుభ రహిత
కార్యకారణ, ద్వయదోష అహంకారరహిత గురవే నమస్తే నమస్తే నమః

యని వినుతించి, స్వామీ! మా స్నేహితుడు మిమ్ము నడిగిన సంశయములను, మీరు జెప్పిన సమాధానములను విని ఆత్మానందపరులమైనారము.

**శిష్యులు :–** హే గురుస్వామి! యింకొక శంకమాత్రము నిలచి యున్నది. అది యేదియనిన మా స్నేహితుడు మీకు దైవము ప్రత్యక్షమే గదా యని యడుగగా నాకు కుక్కవలెగాని, గాడిదవలెగాని, యెనుబోతువలె గాని, ముసలివానివలెగాని, కనుబడలేదని మీరనినారని చెప్పెను. అట్టి శంకకు మాత్రము సమాధానమడుగ వలసి వచ్చెను, ఇందుకు శంకజేసికొని యడిగి సంశయనివర్తుల మయ్యెదమని ప్రార్థించగా !

**గురువు :–** వినరోయీ, మీరొకరికన్నను నొకరు బుద్ధిమంతులు. యుక్తి యుక్తము గలవారలు, యోగ్యులు, సహవాసయోగ్యులు, సచ్చిదానంద అతీతులగువారలు, యని మెచ్చుకొని, చెప్పెద వినరోయీ,

## 7. గ్రంథములయందు భగవంతుడు ప్రత్యక్షమని దెల్పినారు

1. గు॥ రామదాసునకు యెనుబోతు రూపముగాను,
2. కబీరుదాసునకు కుక్క రూపముగాను,
3. కౌండిన్యునకు ముసలి బ్రాహ్మణ రూపముగాను కనబడెనని చెప్పిరి గదా !

నాకు ఒక గాడిదె రూపముగానైన కనుబడరాదా యని అభిప్రాయము గలవాడనై యంటినిగాని మరియొకటిగాదు.

1. వేదాంత నిష్టగల వారలు భగవంతుడు నామరూపరహితుడు అవాఙ్మానస గోచరుడని చెప్పబడుచున్నారు గదా! పై వారి కొరకు నామ రూపము లెక్కడినుండి యుత్పత్తియాయెనో యని శంకజేసికొని యివి కల్పితములుగా నెంచి వచించిన అర్థములే సుమా,

2. శి॥ యని యనగానే, వీరిలో నొకరొకరు తలలెత్తి చూచి ఆశ్చర్యపడి తమకు గల శంకలనన్నియు శంకించుకొని ద్వైతాద్వైత విశిష్టాద్వైతవాదులు ఒక ప్రత్యేక వాదంబుగా సమాధానంబుల నడుగుకొనిరి.

3. అదెట్లనగా, సచ్చిదానంద అతీత సగుణనిర్గుణ క్షరాక్షరద్వయ దోషరహిత ఆవరణస్వాగ్య పరమాత్మాతీతులైన సద్గురు పాదపద్మముల సన్నిధికి. ద్వైతాద్వైత ప్రతిపాదకులైన శిష్యులు సకల కాలముల యందు ధ్యానభజన వందనాదులు జేయుచు మనవి జేసికొన్న విన్నపము.

**గురువు :-** వినరోయి, యెరుకకు దేహమునకు అబేధముగాని బేధము లేదని మా తాత్పర్యము. మీరడగవలసిన దేమైనను నుండిన యెడల సంశయము లేక విచారించండి, సంశయము గూడదు. సంశయాత్మావినశ్యతి యని చెప్పుచున్నది గనుక యడుగు, మనిన

**శిష్యుడు :-** ఓ గురుస్వామీ, మీరు అక్కడక్కడ వేదశాస్త్ర పురాణములే ప్రమాణములుగా జెప్పుచున్నారు. ఆ వేదశాస్త్ర పురాణముల ననుసరించి విషయము లడుగుట హర్షమా లేక అశాస్త్రీయముగా దోచినట్లడుగుట హర్షమా? శాస్త్రంబులు నిజమా, అబద్ధమా? యని యడుగగా,

**గు॥** వినరోయి, శాస్త్రములు అబద్ధములు గావు నిజమే. శాస్త్రముల ననుసరించే యడుగవలయు ననగా,

**శి॥** హే గురో, ప్రబంధః కల్పనాకథయని చెప్పుట యెటువంటిది? శాస్త్రము లెవరి కబద్ధములు? అనగా,

**గు॥** ఎవరికి అగత్యములేదో వారికే అబద్ధము.

**శి॥** ఎవరికి అగత్యములేదు, యెవరికి అగత్యము గలదు? అనగా?

**గు॥** ఎవరైతే ఆరురుక్షువులో వారికి అగత్యము. ఎవరైతే ఆరూఢభావము గలవారలో వారికి అగత్యములేదు.

**శి॥** ఆరూఢ భావజ్ఞులెటువంటి వారలు, అరురుక్షువులు యెటువంటివారలు ?

**గు॥** శాస్త్రముల వలన, తమ మనస్సు వలన విచారించుచు స్థిరపరచుకొను వారలు ఆరురుక్షువులు. శాస్త్రము వలన, ఆచార్యోపదేశమువలన, ఆత్మానుభవము వలన

లెస్సగా విచారించి స్థిరపడిన వారలు ఆరూఢభావము గలవారలు.

**శి॥** వారి కెందువలన గురూపదేశము, శాస్త్రములతో పని లేదు?

**గు॥** నదిని దాట నిశ్చయించువాడు ఓడను, ఓడ నడిపేవానిని ప్రార్థించుచు వాని సహాయము వలన ఆ నది దాటిన తరువాత ఆ ఓడతోను ఆ ఓడ నడిపేవానితోను పనిలేనట్టుగా నుండును.

**శి॥** మనసు స్థిరపరచిన పిమ్మట గురువు యింటిని తటస్థముగా వచ్చిన యెడల ధ్యాన, భజన, వందనాది క్రియలందు నతిభక్తి గలుగ వలెనా? వద్దా ?

**గు॥** యథోచితముగానే నుండవలెను. ఇదిగాక ధ్యాన భజన వందనాది క్రియలందు నతిభక్తి ఆరురుక్షువులకే గాని అరూఢులకు తోచనే తోచదు.

**శి॥** ఎందువలన తోచకపోవును?

**గు॥** సుషుప్తినొందినవారికి ఎటువలె ఏమియుదోచదో అటువలెనే సుమా

**శిష్యులు:-** గురూపదేశానంతరము యెరుకలేదుగదా, శిష్యుల ముక్తి ఏలాగున గలుగుచున్నది?

**గురువు :-** సింహమును గన్న ఏనుగు చందముగా గురువును సేవించగానే శిష్యుని అహంవృత్తి నశించి ముక్తులగుచున్నారు.

**శిష్యులు :-** శిష్యుడు గురువుదగ్గర నుండి తనివిదీర శిశ్రూషల జేయుచు శ్రవణమనన. నిధిధ్యాసలచేత తృప్తినొందవలెగాని నిమిత్తమాత్రము చేతనే ముక్తులయ్యే యెడల చాతుర్విధ శిశ్రూషసిద్ధి యేలాగునగలుగును? ముక్తులు యేలాగుననగుదురు?

అలాగున ముక్తులయ్యే యెడల అందరు ముక్తులు గావచ్చును. అదియేలాగుననో, ఈ సంశయము మాకు నిండుగా గలుగుచున్నది. అనగా?

**గురువు:-** శిష్యులారా! మీరు మహాబుద్ధిమంతులు గాని సామాన్యులు గారు. నాకుదెలియును. మిమ్ముకొనియాడుట గాదు. మీ ధనధాన్యములు మాకగత్యములేదు. మీరు కృతకృత్యులగుదురు. సందేహము లేదు. గురు దర్శనము మాత్రము చేతనే ముక్తులగుదురాయను సందేహమేగదా!

## 8. శ్రీశైలం శిఖరం దృష్ట్వా పునర్జన్మ వినశ్యతి

"శ్రీశైలే శిఖరం దృష్ట్వా పునర్జన్మ వినశ్యతి" యని చెప్పబడుచున్నదిగదా! అది నిజమా, అబద్ధమా? నిజమే, అబద్ధమనవచ్చునా! అబద్ధమనరాదుగదా! అనేక లక్షల ప్రజలు ప్రతిసంవత్సరము శ్రీశైలమునకు వెళ్లుచున్నారుగదా! అందరికి శిఖర దర్శనమవునుగదా! వారందరు ముక్తులగుదురు గదా.

**శిష్యుడు :-** అందరు యేలాగున ముక్తులగుదురు? మనసు కుదిరిన వారే ముక్తులగుదురు.

**గురువు :-** మనసుకుదరకయే వెళ్లుచున్నారా?

**శిష్యుడు :-** మనసు కుదిరే వెళ్లుచున్నారనుటకు సందేహముగా నున్నది.

ఎట్లనగా, కొందరు దేవతాభక్తిచేతను, తిండికొరకు కొందరు, ధనార్జనకొరకు కొందరు. విచిత్రములు చూచుటకు కొందరు వెళ్లుచున్నారు. అందులో దేవతాభక్తిగలవారలు కొందరుగలరంటిమి గదా ! వారు ముక్తిని పొందుదురు. ఇతరులకు ముక్తిగలదా!

**గురువు :-** క్రమక్రమముగా ముక్తిని బొందుదురుగాని, భక్తిగల వారలతో సమానులుగారు కావున అందరు ముక్తులుగారని, తాత్పర్యము. అయితే గురుదర్శనమైన మాత్రముననే ముక్తిగలుగునా యను సందేహము మాత్రమే మీకు దోచుచున్నదేమొ.

ఆ సందేహవిరహితమునకే **'శ్రీశైలే శిఖరం దృష్ట్వా పునర్జన్మ వినశ్యతి'** అంటే గురుదర్శనము వలన నీయొక్క స్వరూపజ్ఞానం గలుగజేయును. అందుకు మేము ఈయుక్తి చెప్పుటయు గలిగినది.

**శి॥** పునర్జన్మమునకు, యేది లేచిపోవునో, అది యేమిటిదో ?

**గురువు :-** అయితే యిందు అనేక శంకలు రాగలవు.

1. అవియన్నియు యెన్ని సంవత్సరములు విచారించినగాని సిద్ధాంతముగాదు. అయినను దేహమునకు మూలము లేదనియు, జన్మకు మూలములేదనియు చెప్పబడుచున్నదిగదా దీనిని విచారించితే చాలును.
2. శరీరమునకు మూలము లేకపోతే యీ దేహము యేలాగున గలిగెనో యనగా కలదోచిన శరీరముయేలాగో అలాగే. అనగా కలలోదోచిన శరీరమునకు యేమి మూలమో అదే మూలమని చెప్పబడినది.

3. అందుకు సిద్ధాంత వాక్యమున్నది. అది యేదియనగా కలదోచిన శరీరము యేలాగో అలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరము యేమీలేదు.

**గురువు:-** 1. కలలోదోచిన శరీరము ఎటువలెనో, అటువలెనే. మూలంలేని ఈ గురుతెరిగే శరీరముయేమిలేదు. ఇదే సిద్ధాంతము. ఇందుకేమి సందేహములేదు. అన్ని గ్రంథముల యొక్క సారాంశము నిదియే సుమా !

2. ఎటువలెననగా బీజనాశనమైతేగదా, వృక్షనాశనమగుచున్నది. అందుకీశరీర వృక్షమునకు సూక్ష్మశరీరమే బీజము. ఆ బీజమును నశింపజేయవలెను. ఆ బీజనాశనమునకు యత్నమును చేయవలెనుగదా?

3. ఆ యత్నమునకు యోగసాధనములు ముఖ్యములుగావు. యోగసాధనములు రోగాస్పదములు. ఇక యెటువలె నాశనమవుననగా గురువాక్యమే ముఖ్యకారణము.

4. ఆ దృఢమునకు గురువాక్యమే ముఖ్యము. అదియేలగు ననగా కలదోచిన శరీరము మేలుకొంటే యేలాగున యేమిలేదో, అలాగుననే ఈ శరీరమునకు మూలము లేదనియు, ఈ ఉత్తబట్టబయలే స్వతః సిద్ధంబని తెలియవలెను.

5. ఈ ఉత్తబట్టబయలు వృత్తాంతము చెప్పుచున్నాము కలదోచిన శరీరము ఎలాగో అలాగే మూలములేని ఈ గుర్తెరిగే శరీరము ఏమిలేదని బాగా నమ్మవలెను.

## 9. బట్టబయలు లక్షణము

1. శూన్యం గానిది బట్టబయలు
2. క్రియాశూన్యమైనది బట్టబయలు
3. ఒక్కటైన భ్రాంతి లేనిది బట్టబయలు
4. మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం తోటి సంబంధం లేనిది బట్టబయలు
5. అచలమనే ప్రసిద్ధి చేత ఉన్నది బట్టబయలు

6. **గు॥** ఈ ఉత్తబట్టబయలు అర్థమేమనగా పుట్టనది, చావనిది, సకల దేశముల యందు సర్వకాలముల యందు సమస్త వస్తువులయందు మొదలు కొనలేక చలించక ఉన్నదేదో, అదే చలనరహితమైన అచలము, అదే యెరుక మరుపులు లేని బట్టబయలు.

**శిష్యుడు :-** అది బట్టబయలైతే ఉత్తబట్టబయలని ఎందుకనవలె? బయలు అనరాదా?

**గురువు :-** ఆత్మయంటే చాలునుగదా! కేవలాత్మయని ఎందుకనవలెను? కేవలాత్మ అనగా

నిర్మలమైనదని తాత్పర్యము. అలాగుననే ఉత్తబట్టబయలనిన అర్థము సుమా! "ఉత్త బట్టబయలనగా కేవలాత్మయని అర్థము".

## 10. కేవలాత్మ లక్షణము

1. ఆ కేవలాత్మకు సత్వగుణములేదు, రజోగుణములేదు, తమోగుణము లేదు, శబ్ధములేదు, స్పర్శలేదు, రూపములేదు, రసములేదు, గంధములేదు, జననములేదు, మరణములేదు, ఏమిలేదు. సర్వము శూన్యమైనది.

2. ఆ సర్వశూన్యము నందు ఎవ్వరు ఏమి దెలియగలదు, ఏమి చెప్పగలరు, ఏమి వినగలదు, ఏమి చేయగలరు, దానికేమి పూజగలదు, ఏమి ధ్యానముగలదు, అదియేమి ఇవ్వగలదు?

3. బట్టబయలు యందు అహంకారము లేదు ఆ అహంకారము ఎటుల గలిగినదో, గలిగిన గాని నిలవరమైనది గాదు. నిలవరము గాని దానిని ఎంతనమ్మినా ఏమిలేదు, నీటి బుగ్గ యెందాక నిలుచును.

4. ఏటి యొద్దునగల మ్రాను ఎందాక నిలుచును, మునగకొమ్మను బట్టుకొని ఎందాక వ్రేలాడును? కనుక ఈ అహంకారమును నమ్మరాదు. అహంకారము నిత్యమనగానే నిత్యమగునా, చనిపోవుభార్యను మోహవశమున తల్లీ అమ్మా, యనగానే జీవించునా?

5. అటువలెనే ఈ ఎరుకను దైవమనగానె దైవమగునా? అది దైవముగానేరదు. దైవమనగా నిత్యమైనది ఏదో అది నిజమైనదైవముగాని మరియొకటిగాదు. ఆ నిజమైన దైవమును గూర్చియత్నము జేయవలెను. అయత్నమునకు గురూపదేశమే మూలము.

**శిష్యులు:-** అయ్యా, గురువులు యోగ్యులుగావలెనని అనుచున్నారు గదా. ఆ గురువు యోగ్యతలు ఏ విధమున దెలియును?

**గురువు:-** వినరోయి, గురువులనగా శిష్యులయొక్క ధనమున కాశపడనివారలు. శిష్యులచేత నుపచారములు చేయించుకొననివారలు. శాంతమూర్తులు. ఎల్లప్పుడు ప్రపంచ మనిత్యమని తలచుచుండువారలు గావలెను. వారల జేరినవారికి పరమార్థము కలదు.

**శిష్యులు॥** అయ్యా, గురువులకు అర్థము ప్రాణము లర్పించవలెనని చెప్పుచుందురుగదా! వీరి ధనమునకు ఆశపడకను వీరి ఉపచారములనంగీకరించక పోయినట్లైతే శుశ్రూషసిద్ధి యేలాగున గలుగును? కృతార్థులెటువలె నగుదురు? యని యడుగగా.

**గురు:–** ఎరుక అఖండమైన పక్షమందున కాలికి తెలుకుట్టితే కంటికి నీరుగారినట్టుగా నొకరికి తేలుకుట్టితే అందరికి బాధగలుగవలయునుగదా, ఒకరు ముక్తులైతే అందరు ముక్తులు గావలెను. అందరు ముక్తులైతే నరకమునకు యెవ్వరులేరు. అట్లనుటకు చెల్లదు.

1. ఎరుకలేనివారు యెవరు గలరనగా, ముక్తులైనవారికి యెరుక లేదు. అముక్తులకు యెరుకగలదు.

2. ముక్తులైనవారికి యెరుకలేదు, మరుపులేదు. వారికి జగత్తులేదు, యెవరూ లేరు. అయితే అందరు ముక్తులేనని కొందరు వాదించుచున్నారు. అందరు ముక్తులైతేనేమి, బద్ధులైతేనేమి, తనమాట తాను విచారించుకొనవలెనుగాని ఒకరితో నేమిపని.

3. గురూపదేశము ముఖ్యము. గురువువలన ముక్తిని బొందవలెను. గురువును నమ్మవలెను గురువు కలదోచిన శరీరాలు యేలాగో ఆలాగే, మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు, ఈ ఉత్తబట్టబయలు యేమిలేదు, అని దెలుపవలెను, ఇది దప్ప రెండోది తెలుపకూడదు.

## 11. పరిపూర్ణ అచల లక్షణము

గు॥ 1. ఎరుక గలది అచలముగాదు. గుణముగలది అచలముగాదు.

2. రూపము గలది అచలముగాదు, కోపమగలది అచలముగాదు.

3. తాపము గలది అచలముగాదు, సత్వగుణము గలది అచలముగాదు.

4. స్పర్శ గుణము గలది అచలముగాదు ఎరుక మరుపులులేనిది,

5. సగుణ నిర్గుణములుగానిది, క్షరాక్షరములు గానిది,

6. దేహిదేహముగానిది, త్రిమూర్తులుగానిది, త్రిశక్తులుగానిది,

7. దేహ త్రయము గానిది, కారణ త్రయము గానిది, కార్య త్రయము గానిది,

8. మల త్రయము గానిది, రూప త్రయము గానిది, పాప త్రయము గానిది,

9. జగద త్రయము గానిది, లోకత్రయము గానిది,

10. పర త్రయము గానిది, యీశ్వర త్రయము గానిది,

11. యెరుక త్రయము గానిది, జ్ఞాన త్రయము గానిది,

12. ప్రకృతి త్రయము గానిది, జననమరణము లేనిది, ఆది అంత్యములు లేనిది,

13. మనసునకు దెలియరానిది, వాక్కుచేత చెప్పనలవి గానిది,

14. కనులచూడ నలవిగానిది, గురుసూచన చేత తెలియునది. పరిపూర్ణము అచలము అనబడును.

## 12. దురహంకార లక్షణము

గు॥ 1. ఆ దురహంకారమే నరకము, ఆ దురహంకారమును మనము విడువకయున్నను అది పొయ్యేదేగదా.

2. ఎందుచేతననగా, యేనుగులు, గుర్రములు, ఒంటెలు కలలో అనేకములు గలిగినవి. అందులో నొకటైన నిలచెనా?

3. నిలువ కుంటే యేల పుట్టవలెనో? పుట్టినవి. పుట్టినందుకు విచార పడవలెనా,

4. పోగలవని విచారపడవలెనా యెందుకు? విచారమే అవసరములేదు.

5. మఘ కార్తియందు పుట్టినది, పుబ్బ కార్తియందు పోయినది.

6. పోతే యెక్కడ గలసినారో, యెక్కడికి పోయినారో తాను ఉన్నంతమట్టుకు అన్నియు సహజముగానే యున్నవి, తాను లేకపోతే యేమిలేదని నిజం తెలియవలె.

7. తాను లేకపోవడ మేమనగా, యెపుడో యేమో ఇంట్లనో మంట్లనో కరి మ్రింగిన వెలగపండు వలెనే మాయమై పోవుచున్నది.

8. లేకపొయ్యేదే ఎరుక । ఎరుకను విడవవలసినదే గాని దానితో ప్రయోజనము లేదు.

9. ఆ యెరుక బహుచిత్రవిచిత్రములుగలది, అనేక రూపులు గలది. పామరత్వము గలది. పాపము దోచదు, పుణ్యముదోచదు. దాని మనసేమనసు దానిని నమ్మినవారు, ఎవరున్నూ బాగుపడలేదు.

10. అది స్త్రీరూపమై పురుషులను జెరుపుచునర్నది. పురుష రూపమై స్త్రీలను జెరుపుచున్నది.

11. ఆ యెరుకను ఎవరుసన్మానించగూడదు. ఎరుకను విడవనివారిదే పాపము.

12. అది విడిపోవుచునేయున్నది. గాని, దానినే విడువలేరు. దానిని ఎంతో గట్టిగా చేయుచున్నారు.

13. ఎరుక ఒక అరణ్యము. ఈ యరణ్యములో ప్రవేశించువారు ఎన్నటికిన్ని బయట పడజాలరు.

14. బ్రతుకని బిడ్డ బారెడు అన్నట్టు సామెత గలదు. ఎరుక అనేక రూపములు అనేక నామములు పెట్టుకున్నది దీనిని నమ్మితే నరకము.

15. యెరుకే సత్యము అని కొందరు అన్నారు యెరుక సత్యము గాదు, యెరుకే అసత్యము. యెరుకకు మరుపు గలదు. యెరుక గలిగితేనే జగములు గలవు ఎరుక లేకపోతే యెరుక జగములు యేమిలేవు.

16. ఎరుక అహంకారము దేహము ఒక్కటేగాని వేరే లేనేలేదు. ఎరుకను విడచి దేహముండదు. దేహమును విడచి ఎరుకయుండదు ఎరుకను దైవమని తలచరాదు.

17. ఎరుకకు హానిగలదు ఎరుకకు హానిగలిగి లంకణాలు జేయునపుడు హీనస్వరము గలుగుచున్నది గదా? అందువలన ఎరుకకు హానిగలదని దెలియవలయును.

18. ఏ విధముగా జూచినను ఎరుకకు హానిగానే యున్నది. ఇటువంటి యెరుకను నిత్యమనరాదు. ఎరుకను సత్యమనుట గురుద్రోహము. ఎరుకపుట్టనేలేదు ఏమి లేని ఈ ఉత్తబట్టబయలందు జగత్తు గలుగనేలేదు.

19. ఈ పరమందు ఏలాగున ప్రపంచము కనుబడుచున్నదని యడిగిన యెడల కలలో అనేకములు గలుగుచున్నవి. అవియన్నియును కలలోనె నశించుచున్నవి గదా! కలలోగనిన వస్తువులు ఎంతనిజమో, ఇవి అంతే నిజము. ఈ నిజమునకు ఎవరు మురియగలరు.

20. బాలురు మురుతురు? బాలులకు వృద్ధులకు సంబంధములేదు. బాలురు బహుగావినోదింతురు. క్రమక్రమముగా ఆ బాలత్వము నశించవలెను. అపుడుగాని తెలియదు.

21. పిల్లలు బొమ్మరిండ్లు గట్టుకొని వినోదముగా నాడుకొనుచుందురు గదా. వారికి వారివిలాసమే బాగుగా నుండునుగాని మరియొక విలాసము ఏలాగున దెలియును.

22. అది వినియోగకారిగాదని యెవరైనను విఘాతపరచినయెడల వారలమీద ఎంతనో కోపము వచ్చును గదా?

23. అలాగుననే బాలురకు బాలుర కార్యములు హర్షములు. అబాలత్వము వదులగలదు. కొందరికి వదలక యుండుటయు గలదు.

24. అందుకు మనము సంతోషించగూడదు. అది యుక్తముగాదు.

25. బట్టబయలును నమ్మితే బ్రతుకుగలదు. పరిపూర్ణమనగా ఈ కనుపడునది పరిపూర్ణము! ఈ కనుపడేది పరముగాదని యందురేమొ.

26. ఇది బట్టబయలు గాకపోతే దీనిని మాత్రము నిషేధించ బడుచున్నదా? ఇది సృష్టికి పూర్వమును ఉండలేదా?

**శిష్యుడు :-** ఉండను ఉంటే !

**గురువు :-** అప్పుడుదీని పేరు యేమనవచ్చును.

**శిష్యుడు :-** యేమనరాదు.

**గురువు :-** ఓయీ! బట్టబయలని యనుట ఎందుకనగా, సూచనకు అనుటయేగాని యెరుకపోయిన పిమ్మట అనుకునేవారు యెవరుగలరు? ఎరుక వున్నంత వరకే పరమని బట్టబయలని యనవలసి వచ్చెను." గాని యెరుకలేకపోతే పరమని బట్టబయలని ఎవరందరు అంతా యెరుకతోనే నున్నది. యెరుక దేహమైయుంటే దేహము నశించును గదా? ఈ గుర్తెరిగే శరీరము గురూపదేశము వలన లేనిదేనని నిశ్చయమగుట చేత దేహిదేహములు రెండు లేకపోవును.

## 13. గురూపదేశ ప్రభావము

1. గురూపదేశము ఎటువంటిదనగా సింహము వంటిది. సింహమును ఏనుగు కలలో చూడగానే ఎటులనశించునో అటువలెనే ఈ దేహి దేహములకు గురూపదేశమే సింహము.

2. ఎరుక యనే ఏనుగుకు గురూపదేశమనే సింహము స్వప్నమైతే ఏనుగు నశించును.

3. గురు వుపదేశమైనవారికి ఏ చింతలేదు, గురువుపదేశమైన వారికి బాకీదీరినట్టేగాని మరేమియు సందేహములేదు,

4. రుణము దీరినవెనుక పత్రమును తలచించినట్లుగా నుండును, తలచించిన పత్రము ఎవరిదగ్గర నున్ననేమి? పత్రమున్నదని వ్రాసియిచ్చినవానికి భయములేదు.

5. రుణము తీరిన వెనుక పత్రము వ్రాయించుకున్న వారికి ధనము రాగలదని ఆశలేదు.

6. కలలో శరీరమునకు మూలములేదు ఆలాగునే ఈ గుర్తెరిగే శరీరమునకున్నూ మూలము ఏమి లేదు యని గురుసూచనైతే చాలు.

7. ఈ శరీరమునకు తల్లిదండ్రులే మూలము. వారికి వారివారి తల్లిదండ్రులే మూలము. గాని యెరుకకు మూలం ఏమిలేదు.

8. ఈ ఎరుకకన్నను వేరే దైవము లేదని యందురుగదా? అది నిజమని అందురేమో? అది ఎంత మాత్రము నిజము గాదు.

9. ఎరుకను దైవమని యనకపోతేనేమి. యెరుక యెపుడులేదో? అపుడె శరీరములేదు. శరీరమెపుడులేదో యెరుక అపుడేలేదు. యెరుకను విడచి శరీరము వుండదు. శరీరమును విడచి ఎరుకయుండదు. రెండు లేనివే !

**శిష్యుడు :-** అయ్యా ఎరుక బిందువు ఒకటేనా? ఏమైన బేధము గలదా?

**గురువు :-** 1. ఎరుకకు బిందువునకు ఎంతమాత్రము బేధములేదు. ఎరుకే గుణమాయెను. బిందువు రసమాయెను, రసమే బిందువాయెను. బిందువు యందే ప్రకృతి పురుషులు గురు శిష్యులు గలరు, ఈ బిందు నాశనమే గురూపదేశము.

2. ఈశంక చేయవలసినదిగాదు. ఎరుకను విడువవలెను. ఎరుకకు మరుపుగలదు. గనుక ఎరుక నిత్యముగాదు. బట్టబయలే నిత్యసత్యం.

## 14. పరిపూర్ణ బోధ

1. ఈ ఉత్త బట్ట బయలు యేమి లేదు. ఈ ఉత్తబయలునకు ఎరుకలేదు. మరుపులేదు.

2. ఈ ఉత్తబట్టబయలు మాయగాదు, ప్రకృతిగాదు, గుణములేదు, రూపములేదు,

3. ఈ ఉత్త బట్టబయలు నందు పంచభూతములులేవు. బ్రహ్మలేదు, శివుడులేదు, విష్ణువులేడు, యేలాంటి వికారము లేదు.

4. ఎవరు నమ్మినా ఈ బయలునే ఉన్నదని నమ్మవలెనుగాని, మరివకటిలేదు. ఈ బయలును నమ్మక ఏది నమ్మిననూ జన్మనివారణమైతే గాదు.

5. ఈ ఉత్తబట్టబయలు మహాశ్రేష్ఠమైనది, అతి రహస్యమైనది, జన్మనివారణమైనది.

6. ఇందుకేమి సందేహములేదు, ఇదే నమ్మదగినది. బాగా శోధించదగినది, విచారించ దగినది, విమర్శించదగినది, ఇది శిష్యులకు దెలుపదగినది ఇందు కేమిచింతలేదు.

7. మూలములేని ఈ గుర్తెరిగే శరీరం చేసిన కార్యములు ఏదిన్ని నమ్మదగినది గాదు. మూలములేని ఈ గుర్తెరిగే శరీరమును నమ్మినవారికి ఉపదేశము చేయరాదు.

8. మూలములేని ఈ గుర్తెరిగే శరీరమైయున్న పతితులతో మాట్లాడనేరాదు.

9. మూలములేని ఈ గుర్తెరిగే శరీరము చేసిన శాస్త్రములు దీనికే నిజము. మూలములేని ఈ గుర్తెరిగేశరీరము మునిగిపోవుచున్నది. గాని నీటిలో ఆకువలె తేలేదిగాదు.

10. మూలములేని ఈ గుర్తెరిగే శరీరము భ్రాంతియనే ముసుకువకటి వేసికొని యున్నది.

11. మూలములేని ఈ గుర్తెరిగే శరీరము కప్పుకున్న ముసుకును తీసివేసినవారు గురువులు గాని ఇతరులు గురువులు గారు.

12. మూలములేని ఈ గుర్తెరిగే శరీరము భ్రాంతులను చిగురు కొమ్మ ఛాయలుగలిగి శిఖా తాల వాలాలుగా నుండి, ఈ అంతటితోను ఎపుడో మునుగుచున్నది.

13. మూలములేని ఈ గుర్తెరిగే శరీరము, బెల్లము పూసుకున్న వారికి ఈగలు ఏలాగున ముసురు కొనునో అలాగున యెరుకకే చాలా మంది ముసురకొని యున్నారు.

14. మూలములేని ఈ గుర్తెరిగే శరీరమైయున్న అనుభవజ్ఞులకు యెరుక కాళ్లకువేసిన సంకెళ్ల వంటిది.

15. మూలములేని ఈ గుర్తెరిగే శరీరము చేసిన శాస్త్రములే బొందలు. వాటిలో బోర్లపడుదురు. కనుక యెరుకను నమ్మరాదు.

## 15. బయలు లక్షణము

1. ఈ ఉత్తబట్టబయలును ఎవరెరుగుదురు. కేవలాత్మ ఈ ఉత్తపరము ముంజేతి కంకణమువలె నగుపడుచున్నది.

2. ఈ కేవలాత్మ గజ్జలు కట్టుకొని ఆడేది గాదు. ఈ ఉత్తబట్టబయలు ఏమిలేదని ఎరుగవలెను.

3. ఈ ఉత్తబట్టబయలును గుర్తెరిగిన యెడల ఈ ఉత్తబట్టబయలువలెనే మనసుకూడా ఉండును.

4. ఈ ఉత్తపరమును ఉన్నదని, యెరుకను లేదని దెలిసినవారే నిజమైన జ్ఞానులగుదురు.

5. ఈ పరిపూర్ణమును ఎంతవరకు నెరుగరో అంతవరకు నరకము తప్పదు. భ్రాంతులు వదలవు.

6. ఈ ఉత్తబట్టబయలును ఎరుక యెరుగ నేరదు. ఈ ఉత్తబట్టబయలును ఎరుగుటయనగా ఎరుక లేక పోవుటయని అర్థము

7. ఇది పరిపూర్ణమని అందరితో చెప్పగూడదు. ఈ రహస్యము అందరికి మనస్సునకు పట్టదు. మహాగూఢమైనది.

## 16. కల లక్షణము

1. ప్రాతఃకాలము, సాయంకాలము, మధ్యాహ్నములుగాను, ఆహార నిద్ర భయ మైధునములు గలిగినట్లుగాను, యెరుక తటస్థమైతూ ఉంటుంది, విచారిస్తే అప్పుడే యేమి లేదు.

2. ఒక్కొక్కనాడు, తాను గుర్రమెక్కినట్లుగాను, అందాల మేడ యెక్కినట్లుగాను,

3. తగవులాడినట్లుగాను, తిట్టినట్లుగాను, కొట్టినట్లుగాను! ఉంటుంది, వెంటనే ఏమిలేదు.

4. కోడండ్లు గలిగినట్లుగాను, కొడుకుల గన్నట్లుగాను, కూతుళ్ళను గన్నట్లుగాను, వివాహములు చేసినట్లుగాను, పడుతుంది మేల్కొంటే లేదు,

5. అశుభములు జరిగినట్లుగాను, స్త్రీలు అయినట్లుగాను, పురుషులైనట్లుగాను, మాలలు, వున్నట్లుగాను, మాదిగలు వున్నట్లుగాను, తురకలు వున్నట్లుగాను, దూదేకులు వున్నట్లుగాను, తోస్తూ ఉంటుంది. మేల్కొంటే యేమిలేదు.

6. నానాజాతులు వున్నట్లుగాను, నానాపక్షులు వున్నట్లుగాను, నానామృగములు వున్నట్లుగాను, నానాపురుగులు వున్నట్లుగాను, నానాబాధలు గలిగినట్లుగాను, తోస్తూ ఉంటుంది, మేలుకొంటే యేమిలేదు.

7. చచ్చినట్లుగా, బ్రతికినట్లుగా, రుణమిచ్చినట్లుగా, రుణమడిగినట్లుగా, దొంగలించినట్లుగా ఉంటుంది. మేల్కొంటే యేమిలేదు.

8. రంకులు జేసినట్లుగా, గాయిది తనము చేసినట్లుగా, ధొర అయినట్లుగాను యెన్నెన్నో విధములుగా దోచుచున్నది, మేలుకొంటే యేమిలేదు.

9. కలలను యెల్లప్పుడు యెడతెగక గనుచున్నాము గాని నొకప్పుడైనా తెరిపి లేదు. యెపుడోనొక ఘడియ, నిదురబోదుమేమోగాని, యెల్లప్పుడు యీ కలలే గంటున్నాము, ఇదియేమి ఆశ్చర్యమో!

10. యీకలలు యేలాగున పోవునో, కన్నులు మూసుకొన్న కలలే, కన్నులు దెరచినా కలలే, పడుకొన్నను కలలే, నిలుచున్నను కలలే, నేను లేనని మెలకువ గలిగితేసరి, ఒక్కటి ఉండదు.

11. గుర్తెరిగే యెరుక ఉన్నంతకాలం అన్నియు కలలే. ఈ కలలు యేలాగున పోవును? ఈ కలలు రాకుండ యేలాగున చేయను యని బెంగగా ఉన్నది.

12. ఇటువంటి కలలు యేల దోచవలెనని యెవరినైనా అడిగితినా, కలలు అబద్ధము, దాని పేరే కల, కలలన్ని అబద్ధమే పొమ్మని యందురు.

13. వారు అలాగున యనినను, ఆ కలలు పోనేపోవు, ఆకలలను నరుకుదామని చూస్తానుగాని, నాకేమి స్వాధీనముకాదు.

14. నా కలలు యితరులకు గోచరముగావు. ఇది యెందువల్లనో, దీనికేమి యుపాయమో, దీని నేలాగున సాధింతును?

15. దీనిఫలమేలాగు? దీనికి నాశనమేలాగు చెప్పండి. చూడబడువస్తువులలో కలగానిది యేదిగలదు? కలగానిది వకటి వున్నదా! అంతాకలే. వినబడుపలుకులలో కలగాని దేదియులేదు.

16. చెప్పుచున్న మాటలలో, కలగానిదేదిగలదు. ఈ చెప్పుచున్న మాటలెన్ని గలవో, అన్నియు కలలే, చదువులలో యేమైన కలగాని దొకటిగలదా? అంటే అన్ని కలలే!

17. మోయజాలని శాస్త్రములన్నియు కలలే, సంగీతసాహిత్యములలో, నేమైన కలగానిదిగలదా?

18. వ్యవహారముల యందు గూడా కలగానిదొకటి గలదా? సర్వ ప్రపంచమంతయు, కలగానిదిలేదు గదా. సర్వము కలలే, అన్నియు అబద్ధాలే. అన్నియు అసత్యములే. ఇందుకు సందేహములేదు. సంశయము లేదు.

19. మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేని సంప్రదాయం దొరికేనా ! వారి సూచన చెవిన పడేనా ! మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు యని తెలిసే పరియంతం కలలే !

20. కల దోచిన శరీరాలు యేలాగో ఆలాగే, ఈ ఉత్త బట్టబయలు యేమిలేదు యని తెలిసితే కలలన్ని సమూలంగా నాశనమగును. ఇదే యెరుకను సమాది చేయుట.

**గద్య:**

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే**
**పూర్వభాగే సమాధి నిరసన సప్తమ ప్రకరణం సమాప్తం**



# 8. వర్ణ నిరసన ప్రకరణము

## 1. స్వప్న దృష్టాంతము

1. కలలో తన గర్భమున బ్రాహ్మణుడు, రాజు, కోమటి, తురక, చాండాలుడు కొమారులుగా గల్గినట్టు తోచినది.

2. ఇందులో యే వర్ణము గలవాడు తన కొడుకగును, ఏయే కులమువారు నిషేధింప బడుదురు, తనది యేకులము.

## 2. వర్ణ సంకరము

3. తల్లిని అజ్ఞాన కాలమందు తెలియక పోయెను. జ్ఞాన కాలమందు తెలియబడెను.

4. కొందరు పెత్తండ్రి పినతండ్రుల కుమార్తెలను వివాహము చేసికొను చున్నారు. వారికి నరకములేదట.

5. కొందరు భార్యలకు శుశ్రూష కులాచారము ననుసరించి చేయుచున్నారు. వారికి నరకము లేదట.

6. కొందరు స్త్రీలు పెనిమిటి చనిపోయిన వెనుక మరియొకరిని అంగీకరించి సుఖమును పొందుచున్నారు. వారికి దోషములేదట.

7. కొందరు స్త్రీలు కడగా నున్న రోజుననే స్నానము చేసి యింట్లో కలియుచున్నారు. వారు మహా ఆచారపరులట.

8. కొందరు మూడు రోజులకు కలియుచున్నారు. ఈలాగున కడగా ఉండుట సహజమేకదా! ఏయే వర్ణములకు ఏయే నియతములో ఆయా నియతములు తప్పితే ఆయా వర్ణములకు దోషములట. అది ఆలాగు ఉండనిమ్ము.

9. జననమరణములు యెటువంటివి? జననములు భేదించుట యేలాగు? సంగమక్రియలు మూలము. మిధున కర్మమువల్ల రేతోజనితమైతేకదా శరీరములు గలుగుచున్నవి.

10. ఆ శరీరములకు అన్నముగదా కారణమగుచున్నది. అన్నము అందరికి ఒకటే అయెను. అన్నరసమే యింద్రియమాయెను. ఇంద్రియమే దేహములాయెను. ఇందులో తారతమ్యము యేలాగునగలిగెనో గాని దానితెలియరాదా?

11. భక్షణకు కొందరు పశుమృగాదులను అనుభవించుచున్నారు. కొన్ని మృగాదులు మనుష్యుల భక్షింపుచున్నవి.

12. కొందరు **'అహింసః పరమో ధర్మః'** అని స్వల్పజీవుల అనుభవించుచున్నారు.

13. ఏలాగనగా ధాన్యములు జీవులే. **'జీవోజీవస్య భక్షణః'** అని ఉండనే వున్నది గనుకనే భేదము లేదు. యేది తినేది అది తినేను, దానికి కొందరికి ఇష్టము కొందరికి ఇష్టము లేదు.

14. సకల జీవులు కలలో వస్తువుల వలెనే పుట్టుచున్నారు. కలలో వాటివలెనే లేకపోవుచున్నారు. కులములను యెవ్వరు చూచినారు? గోత్రములను యెవ్వరు చూచినారు? వారికి వారే నియమించుకున్నారు. కలహము చేసుకొనుచున్నారు.

## 3. గుర్తెరిగే అహంకారమే కులములకు కారణము

1. కుల గోత్రములను అహంకారమనే తెలివియే ఏర్పరచినది. అహంకారము ఒకటేగాని అహంకారమునకు యేమికులము గలదు? అహంకారము యేకులము కాదుగదా? యే కులమునకు ఆ కులమే.

2. కులములు అనగా గుణములుగాని రూపమునకు యేమిగుణములు? యెనబదినాల్గులక్షల వన్నెలు. వన్నెలన్నవి కులములే.

3. ఆ కులములన్నవి గుణములే రూపములకు కులములులేవు అహంకారము రూపమై ఆ రూపమునకు అనేక రూపము లాయెను.

4. అట్టి అహంకారమునకు రూపములనుబట్టి కులములని, గోత్రములని అహంకార భేదములనేర్పరచి తానేర్పరచిన కట్టుదిట్టములలో అహంకారము గలసి నెత్తికెక్కి మోటుబారి తిరుగుచున్నదిగదా.

5. అహంకారమునకు గురూపదేశము వలన గలిగిన దృఢమనే అహంకారమనే ఒక గొడ్డలిగా ఏర్పరచి దేహమునకు మూలమైనట్టి అహంకారమును మొదటికి బాగా తెగవేయవలెను.

6. అహంకారము కొంచమున్నను గొప్పదై దేశమంతా నిండి అహంకారము కనులగప్పి యెదురు తన్నెరుగనియ్యదు గనుక అహంకారునకు నాశముగలదు.

7. నాశము గలిగినగాని అహంకారము నాశముగాదని తెలియనేరని మూర్ఖులు

అహంకారమును లెస్సగ పాదుచేసి దానిని వదలకుండాజేసి అహంకారము బ్రహ్మమనియు ఆ బ్రహ్మమే తానని తానే శాశ్వతమని అహంకారము చేత అనుకొనుచున్నారు.

8. తెలియనేర్చుకొన్న వివేకికి అహంకారము లేదు. ప్రపంచములేదు, పరమాత్మలేదు జీవుడులేదు. అహంకారమును యెవరూ గురుతెరుగరు. అహంకారము లేనేలేదు.

9. బ్రాహ్మణ కులము శ్రేష్ఠమని చెప్పుదురు. **"శ్వపచోపిమహావాల విష్ణుభక్తిర్వి హీనతే"** అని చెప్పుచున్నది.

10. బ్రాహ్మణుడైనను విష్ణుభక్తి లేనివాడు కుక్కను వండుకొని తినువారితో సమానమని చెప్పుచున్నారు.

## 4. పురాణ గాధ ఉదాహరణలు

1. నారదుడు దాసీ పుత్రుండట. అతను భగవద్భక్తి వలన బ్రహ్మఋషి అయినాడట.
2. విదురుడు శూద్రుండట. అతని యింట భగవంతుడు భోజనము చేసెనట.
3. వాల్మీకులు బోయవాడట అతను మహాఋషియై రామాయణాది గ్రంథములు జేసెనట.
4. జనకుడు రాజట. అతను కులశ్రేష్ఠుడైన శుకులకు గురువాయెనట.
5. వాణిజ్య వృత్తిజేయువాడు తులాధారుడట. అతను వైశ్య కులమట. మహాత్ముడైనాడట.
6. కటికెవాడు మాంసము విక్రయము చేత జీవనము జేయువాడు ధర్మ వ్యాధుడట. అతను శూద్రుడట మహాఅతిశయుడైనాడట.
7. ఈలాగున అనేక హీనకులములు ఘనమైన కులములాయెనట. అనేక ఘన కులములు హీనకులములాయెనట. ఈ కులములకు నిర్ణయము లేదు.
8. యెరుకయనే కలలో మునిగి తేలు వారికి ఒక జన్మమందు బ్రాహ్మణుడైతే మరియొక జన్మమందు మాలవాడగునట.
9. ఒక జన్మమందు మాలవాడైతే మరియొక జన్మమందు బ్రాహ్మణుడగునట.
10. ఒక జన్మందు కుక్క అయితే మరియొక జన్మమందు నక్క యగునట.
11. ఒక జన్మయందు యేనుగు అయితే మరియొక జన్మమందు పంది అవునట.
12. మేము కులనిరసనను ద్వేషముగల వారలమై చేయలేదు. శాస్త్రములు నిరోధించి

వాటిని చదువకను పోలేదు. శాస్త్రములు చదువుట వల్లనే మాకు యీ తిప్పలు గలిగినవి.

13. చదువని శూద్రాదులకు చలన మొకప్పుడును కలుగదు. అందులో వివేకులు చదివినవారి మాటలు విని చలనమును పొందుచున్నారు. ఈ కులములో మనుష్యులు గాడిదలైనారు. కుక్కలైనారు. పందులైనారు, చెట్లైనారు, గుట్టలైనారు. అని చెప్పితే కోపమేమో.

14. అది నేచెప్పితే కోపమే. నేను యెదుటనున్నాను. కనుకనే అందరితో మాట్లాడుతాను. కనుక కోపము.

15. నేను లేకుంటే యెవరికి కోపములేదు. నేను లేనేలేను. నాకు కోపము లేదు.

## 5. గుర్తెరిగే అహంకారం లేనివారికి కులమత బేధాలు లేవు

1. మీరు గలరు మీకు కోపము గలదు. మీకు అన్ని గలవు. మీకు దేహము గలదు. అది శాశ్వతమేమో అది వెండికొండేమో, అది బంగారపు కొండేమో, అది ఒక చెట్టేమో, అదియొక బండేమో, అది పురుగుల గుంటేమో, మీ దేహము వంటి దేహము గాదేమో, యీ దేహము మట్టి పాలుగాదేమో, యీ దేహము కలవలె గాదేమో,

2. ఆహా మీ మనస్సు కుదిరికకు మీ యొక్క చింతకు, మీ గట్టిపట్టుకు, మీ దృఢమునకు, మీ నిశ్చలనమునకు మీ ఆపేక్షకు మీ ముచ్చటలకు, మీచమత్కృతులకు, వేరుగా ఆలోకము గలుగక యేలాగునపోవును? మాకు ఆలోకము లేదు. ఈ లోకములేదు. ఆ ముచ్చటాలేదు. ఈ ముచ్చటాలేదు. చలనములేదు. నిశ్చలములేదు. మాకు జ్ఞానమైనలేదు. అజ్ఞానమైనాలేదు. మాకు యేది లేదు.

3. కష్టేఫలిః అన్నారు. మేము వ్యవసాయము చేయలేదు. దున్నకనే పెట్టినాము. కొయ్యకనే పండెను.

4. మాటల పందిరి పెట్టినాము. అది మాకు చల్లగానే యున్నది.

5. అందులోనే మేము యున్నాము. మాకు యెండ తగులనే లేదు. మాటల పందిరిగనుకనే మాకు ఆ పందిరి విచ్ఛిన్నముగాదు. ఎప్పుడు యెండ తగులదు. మాటలకు పేదరికము గలదా?

6. మీవలె మాకు కష్టములేదు, మేము ఒకనాడు అద్దాల మేడ ఎక్కనూలేదు. బోర్లపడనూలేదు,

7. విరుగపడనూలేదు, విసుగు పుట్టనూలేదు, ముసుకు పెట్టనూలేదు, పేర్లు తిప్పనూలేదు.

8. మేము బ్రాహ్మణులముగా బుట్టి శ్రీమంతులము గావలెనని, యోగులము కావలెనని, సన్యాసులము కావలెనని కలలో నైనా మేము కోరనూలేదు, కానూలేదు.

9. కొందరు అలాగున అయినారట. ఎవరు చూచినారు? శాస్త్రము చెప్పినవారు చూచినారట. వారు మాత్రము చూచినారా? చూడకపోతే అబద్ధాలు చెప్పినారా? వారికే వదులవలె !

## 6. మేము కలలను నమ్మము, అబద్ధాలు చెప్పము

1. అబద్ధాలు చెప్పినారని మేము అనము. మేము ఏమీ అనము. ఊరికనే ఉంటాము. కలలో శాస్త్రములను కలలోనే నిజమని అంటాము. మేలుకుంటే యేమిలేదు.

2. మీకు కలరాదా అంటే దేహమువుంటే కల రాదా? కల గనేటప్పుడు కల గంటాము. ఆ వెనుక అబద్ధమని అంటాము.

3. మేము కలలను నిజమని నమ్ముతామా? కలలు మాకు రావని అబద్ధాలు ఆడుతామా? అటువంటి మాటే లేదు.

4. అబద్ధాలు ఆడి పశువులమగుతామా? మాకు అంత బాధలెందుకు? మేము అబద్ధాలాడి జీవించే వారము కాము. జరిగితే జరిగెను, జరగకుంటె మానెను.

5. మామాటలు యెవరు నమ్మరా? నమ్మకుంటె తరుగవునా? నమ్మితే హెచ్చవునా? తరుగు విరుగులు లేనిది, తలవ కొలవరానిది, కొద్దిగొప్ప గానిది, అంతటా నిండి ఉన్నది ఏదో దాన్నే మేము సత్యమని నమ్ముతాము.

6. కొంచము గానిది, లోనికి రానిది, కూతలు పెట్టనిది, కోతిగంతులు వేయనిది, కోపతాపము లేనిది, వేళాకోళము గానిదే బట్టబయలు. అట్టి బట్టబయలులో మూలంలేని గుర్తెరిగే శరీరం యేమిలేదు. యిందుకేమి సందేహము లేదు.

## 7. పురాణ గాథ - అనంతుని కథ

1. అనంతవ్రత కథ వినలేదా? పూర్వమొక బ్రాహ్మణుడు సకల విద్యలను నేర్చుకొని గర్వించి యెవరికి విద్య చెప్పకపోవుటచేత అడవిలో నెవరికి నుపయోగముగాని మామిడిచెట్టయి పుట్టినాడనియు చెప్పినారు.

2. పూర్వమొకడు మహా భాగ్యవంతుడై బ్రాహ్మణులకు ఎన్నడును సత్కారముతో గూడుకొన్నట్టుగా అన్నము పెట్టలేదు గనుక అతడు ఆవు అయ్యి పుట్టి గడ్డి తిననోరాడక పచ్చిగడ్డిలో తిరుగుచు ఉన్నాడనియు చెప్పినారు.

3. పూర్వమొకరాజు గర్వించి బ్రాహ్మణులకు చవిటి భూమిని దానముచేసెను గనుక నతడు వృషభమై పుట్టి అడవిలో తిరుగుచున్నాడనియు చెప్పినారు.

4. ఒక పురుషుడు పరులను నిందించుచుండెనుగాన వాడు గాడిదయై పుట్టినాడనియు చెప్పినారు.

5. పూర్వము పెద్దలు చేసిన ధర్మము అమ్ముకొనిన పురుషుడు ఒకడు గలడు. వాడే యేనుగై పుట్టినాడనియు శాస్త్రములు చెప్పుచున్నవి

6. **మేము యిలాగున కలలో జన్మములు యెత్తనూలేము మరణబాధలను బొందనూలేము.**

7. కులానికి కులమే తెగులన్న మాటనిజమే వేమన గారన్న మాటనిజమే. ఏమన్నాడనగ,

గీ॥ **కులము నీరుజేసి గురువును వధియించి**
**పొసగ యేనుగంచు బొంకుబొంకె**
**పేరు ధర్మరాజు పెను వేపవిత్తయా**
**విశ్వదాభిరామ వినురవేమ.**

అనియన్నాడు గనుక అది నిజమే అన్నాడు. కులము అకులము గుణమువల్లనే కలిగినది. గుణము దేహమువలన గలిగినది.

8. కులములన్ని ఒకటేనని గ్రంథములలోనే ఉన్నది. ఆ గ్రంథము భగవద్గీత. ఆ గ్రంథము నమ్మినను కులములే లేవు. ఏలాగనగా?

శ్లో॥ విద్యావినయ సంపన్నే బ్రాహ్మణే । గవి హస్తిని ।
శుని చైవ శ్వపాకే చ పండితాః సమదర్శనః ॥ (5-18)

తా॥ 9. ఆత్మజ్ఞానులు, విద్యావినయము గల బ్రాహ్మణుని యందును గోవు, ఏనుగు, కుక్క కుక్క మాంసము వండుకొని తినువారి యందునూ కూడ ఆత్మనే దర్శిస్తాడు గనుక, కులమత బేధాన్ని వర్ణించడు యని భగవానులు అన్నాడు.

10. **'ఆత్మనత్సర్వ భూతాని'** యనియు కులమును మరచినవాడే గుణములేనివాడు. కులానికి కులమే తెగులు కులములన్నియు కులద్రోహములే. గుణాదులన్నియు గుణద్రోహములే

11. కులము గుణము కానిది, తలప కొలుపరానిది తాత్పర్యం ఆయెనా, కలలో వచ్చిన శరీరం మేలుకొంటే యేలాగున యేమిలేదో, ఆలాగే మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు, ఈ ఉత్తబట్టబయలు తప్పమరి ఏమిలేదు ఇదే జ్ఞాపకం ఉంచుకోవాలె, నా వర్ణము పలానదియని అనుటకు యెరుకే లేదు గదా !

గద్య :

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే పూర్వభాగే వర్ణ నిరసన అష్టమ ప్రకరణం సమాప్తం**







# 9. అహంకారకుల నిరసన ప్రకరణము

## 1. గుర్తెరిగే యెరుకయే అహంకారము

1. అహంకారము దేహము వలననే గలిగినది సందేహములేదు. అహంకారము వలననే ఆశపాశములు సంభవించినవి. అహంకారము లేకపోతే నరకములేదు.

2. అహంకారము ఆవలయీవల తిరుగదు. తిరుగుచున్నదా దేహము తిరుగవలె. దేహము తిరుగక అహంకారము తిరుగుచున్నదా అంటే అహంకారమునకు కాళ్లుగలవా? అహంకారము సూక్ష్మమైయున్నది.

3. అహంకారము అహంకారమును పుట్టించుచున్నది. అహంకారమునకు రూపము లేదు. పేరులేదని నిర్గుణమని, నిరాకారమని గ్రంథములలో వ్రాసియే యున్నది.

4. అహంకారమే శరీరము. అహంకారమునకే అన్ని పేర్లు. అహంకారము లోపల వెలుపలనిండి సంపూర్ణమై ఉన్నదని కొందరు అన్నారు.

5. శరీరములయందే కనుపడుచున్నదిగాని శరీరములేని ఆకాశమునకు అహంకారము కనుపడలేదు. వాయువునందు కనుపడలేదు. అగ్నియందు కనుపడలేదు. జలమందు కనుపడలేదు భూమి యందు కనుపడలేదు.

6. భూతములందు అహంకారము లేకుంటే భూతముల వల్ల గలిగిన శరీరమునకు మాత్రము యేలాగున గలుగుననే పక్షమందు కలుగుటకు కారణము కలదు అందురు.

7. ఆ కారణమేలాగంటే దేహమునకు బాధ గలిగితే యావద్దేహములకు గలుగవలెగదా! అలాగున కనుపడలేదు. దేహమునందుగల గోళ్లకున్నూ రోమములకున్నూ యెంతకొట్టినా, గిల్లినా, కరచినా, బాధగలుగనేరదు గదా.

8. అలాగుననే దేహములందు అహంకారము కనుపడుచున్నది గాని మహాభూతములందు కనుపడలేదు గదా !

9. అహంకారము అన్ని కులములయందు కలదు. అహంకారము లేని కులములేదు. అహంకార మంటే మూలం లేని ఈ గుర్తెరిగే శరీరమే.

10. అహంకారములేని కులము మహోత్తమము. అహంకారము లేని వారలకు బాధలేదు. ఏ బాధలకైనా యీ అహంకారమే మూలము.

11. ఈ అహంకారము చెట్టునకు విత్తనము. ఈ చెట్టుగాలి వల్లనే కదలుచున్నది. ఈ చెట్టుమీద పంచవన్నెల చిలుకలు రెండు కలవు. రెండు సారంగములు గలవు. రెండు కోనేర్లుగలవు. ఒక చలువ బండగలదు. ఒక కోటి నక్కలు కలవు. ఇటువంటి వృక్షము యెంతవరకోగాని నమ్మకములేదు అందుకే గదా **"యేటియొడ్డుమ్రాను యెందాక నిలుచు"** నని అన్నారు.

12. ఈ దేహము నిత్యమని యెవ్వరును అనుకొనరు. ఇందుకు యెవ్వరు తెలుసు కొనగలరు? ఈ భావమెవ్వరికి లేదు, ఈ అహంకారమును వదలుట దుర్లభము. ఈ అహంకారము వదిలినవారే మహాత్ములు.

## 2. అహంకారము యోగాదుల వలన వదలదు

1. అహంకారము లేకపోవుటకే అనేక సంవత్సరములు ప్రాణాయామము మొదలైన యోగములు చేయబడినవి అలాగున ప్రాణాయాయము మొదలైనవి యెన్ని యోగములు చేసినను అహంకారము వదలినట్టు కనుపడలేదు.

2. అహంకారము యోగాదులవల్ల వదలనేరదు. అదేమనగా శంకరాచార్యుల వారేగదా అద్వైతస్థాపనజేసినది. వారికి అహంకారము వదలనేలేదు.

3. అహంకారము అనేక మార్గములైయున్నది. గాని ఒక మార్గముగా నుండలేదు. అహంకారము యెవ్వరికిని వదలనేలేదంటే అందరికి కోపమేమో. అందరు అహంకారమునే నమ్మియున్నారు.

4. మీరు నమ్మినా అది ఉండదు. మీరు నమ్మకున్నను అది ఉండదు. అందుకే గదా అమనస్కమని అందురు. మనసు లేకపోతే అహంకారము గలదా? లేదుగదా? అందుకే గదా అమనస్కము గావలెను అన్నారు.

5. అమనస్కము అందరికి ముఖ్యమే అందుకు వాయువు నిరోధము చేయవలెనని అందురు. ఆ వాయు నిరోధమునకు బలాత్కారముగా ప్రయాస పడవలెనట.

6. అదియేలాగనగా రెండు కన్నులు, రెండు ముక్కు రంధ్రాలు, రెండు చెవులు, రెండు అధోరంధ్రములు గట్టిగ బిగించి దొంగ ప్రొద్దువేళలేచి యెవరిని చూడకుండా యెవరితోను తానుపలుకకుండా తనను ఒకరు పలుకరించకుండా యోగాభ్యాసము చేయవలెనని గురూపదేశమును చేయును. ఊపిరి ఆడక చనిపోయెనా గురువుకు వచ్చే తిప్పలు చెప్పశక్యముగాదు.

7. ఇది వెట్టితనముచే చెయ్యడమేకాని వాయువు లయమైనవారు గలరా? వాయువు లయమైతే తరువాత లేచి తిరుగగలరా? ప్రేతశరీరము తిరిగితేనే యీ శరీరము తిరుగునుగాని లేకపోతేయెట్లు తిరుగును.

8. కనుక వాయువు నిరోధము కానేకాదు. కాదంటే కొట్టవత్తురు. లేకపోతే తిట్టవత్తురు. గాని నిజము విచారించరు.

9. విచారించితే మనసులేనివారుగలరా? మనసు లేనివారు యెవరూలేరు. మనస్సులేనివారు గలరని లెస్సగా వాదించెదరు. గురువుకైన మనసుగలదు గాని లేకపోలేదు.

10. గురువునకు మనసు లేకపోతే శిష్యున కేలాగున ఉపదేశము చేయును. మనసులేనివాడు చచ్చినవానితో సమానము.

11. ఇంతమాత్రమునకే కదా, లేనిది లేదని యనక, ఉన్నదని భ్రమ గలుగజేయుట మరియాదగాదు. కనుక యీ అమనస్కమునకు దృష్టాంతము లేదు, వాడుకమాత్రము కలదు.

12. అమనస్కము ఉపకృతిగాదు. అమనస్కము గలదని అంగీకరించిన యెడల అందుకు యేమి దృష్టాంతములేదు.

## 3. అహంకారం ఉంటే అనుభవం ఉండును.
## అహం రహితులకు అనుభవము లేదు

1. దృష్టాంతము లేకపోతే, అనుభవమున్నూలేదు. అనుభవమన్నను ఆకలి తీరదు. ఆకలి తీరుటకు పండుగాదు, పిండి పదార్థం గాదు, తిండిగాదు, నీళ్లుగావు, పాలుగావు. అనుభవమన్నను యేమిలేదు.

2. అనుభవము గలవారికి ఆకలిగలదా లేదా? అనుభవజ్ఞుడనని చెప్పుటకు ఆ మనుష్యునికి అందరి వలెనే ఆకలి ఉన్నదిగదా? దప్పిక ఉన్నదిగదా? ఆకలి దప్పికలు లేకపోతే అనుభవజ్ఞుడని అనుకోవచ్చునుగాని అందరివలెనే వున్నాడు.

3. అనుభవమనినను యేమిలేదు. అనుభవమే అనుభవము. అందరు అనుభవజ్ఞులే. అందరికి భూమి అన్నిరూపులై అనుభవపత్ని యగుచున్నది. అనుభవము గలదని చెప్పెనా, ఆశపడరాదు. అనుభవము లేదు.

4. అహంకారము గలవారికి అనుభవముగాని అహంకారరహితులకు, అనుభవములేదు.

5. అనుభవము లేకపోవడములేదు. అలాగు అనుభవము అన్నమాట అతి విచిత్రముగా నున్నది. అదియేలాగో తెలియదు.

6. అనుభవమని చెప్పేవారలు, వర్ణసంకరులు, అహంకారము లేనివారలు కారు.

7. అహంకారము అందరికికలదు, అహంకారము అతివిచిత్ర రూపములుగా వున్నది. అహంకారము మాలవానికి గలదు, మాదిగవానికి గలదు, తురకవానికి గలదు, దూదేకులవానికి గలదు, బ్రాహ్మణునికి గలదు, బట్టుకుగలదు, రాజుకుగలదు, రంగప్పకు గలదు, యెల్లికి గలదు, మల్లికిగలదు, మాచికిగలదు. ఈ అహంకారము నరకము.

8. ఈ అహంకారమునకు నియమములేదు. గురిలేదు. కులములేదు. గోత్రములేదు. ఈ అహంకారము శరీరము వలన గలిగినది.

9. శరీరము లేకపోతే అహంకారములేదు. శరీరమునకు మూలము అహంకారము, అహంకారమును విడచి శరీరము ఉండునా? అహంకారమునకు శరీరమునకు భేదములేదు. అహంకారమే జీవుడు అని అన్నారు.

10. జీవునికి అహంకారము ఆధారము. అహమునకు జీవుడు ఆధారము. అహమే దేహము, దేహమే అహము. అహమునకు కాళ్లు, చేతులు, ముక్కు, చెవులు, లేవని అందరు ప్రతిపాదిస్తూనే ఉందురు. లేదని అంటూనే ఉన్నదియని యందురు.

11. ఈ తీరున యేలాగున తెలియును? ఒక కార్యము కొరకు యొకరియందున దృష్టిగలిగి వెళ్లి ఆ మనిషినే ఫలానవారు యెక్కడనున్నాడని అడిగితే నేనేనన్నట్టుగా ఉన్నది.

12. నా ముక్కు, నా కాళ్లు, నా చేతులు, ఆ నోరు అని చెప్పుచూ నాకు లేదనడము యెటువంటిది. ఒకరు చెప్పితే తెలిసేదే కష్టము. తానే ఆలోచించవలెను. తనకు తోచకుంటే యితరుల నడుగవలెను. అది యోగ్యుల నడుగవలెను. లేకుంటే అది చెడిపోవును.

13. గురువు అయోగ్యుడాయెనా, అజ్ఞానకార్యములలోనే ప్రవేశించును ఆ అజ్ఞాన కార్యములే, అనేక దోషములకు ఆధారమైయుండును. ఆ యజ్ఞానము కార్యముల యందు శ్రేష్టమని బోధించును. ఏ తీరుగానైనా, అనుభవమునకు కారణమగును. అజ్ఞానమే కారణ శరీరము, అదిరహితము కాకనే అనేక నరకములలో ప్రవేశించుట జరుగును.

# 4. గృహస్థాశ్రమ గురువులు

1. అహంకారము లేని గురువు అందరివలనే ఉండును. ఆయన సన్యాసిగా యుండడు. గృహము గలిగే యుండును. దారాపుత్రాదులున్నూ గలరు.

2. ఆయనకు అహంకరములేదు. అహంకారము కలదో-లేదో యేలాగున తెలియుననగా ఆయనకు కోపములేదు. కొట్టినను పలుకదు, తిట్టితే మరల తిట్టడు, ఆక్షేపించితే ఆక్షేపించడు.

3. అయితే యింకొక మార్గముగలదు. ఒకటి కొట్టితే తిరిగి పదికొట్టును. ఒకటి తిట్టితే పదితిట్టును. అందరికన్న యెక్కువగా తిరుగును. అందరికన్న యెక్కువగా ఆశపడును. ఈలాగున కొందరు పెద్దలుగలరు.

4. వారికిన్నీ అహములేదు. వారి గుణములు గనుట కష్టము. కొట్టితే కొట్టక, తిట్టితె తిట్టక ఒకరిని అడుగక యుండునట్టి పెద్దలు యుక్తిలేనివారు. దుర్మార్గుల వలన అతిబాధలు పొందుదురు.

5. ఒకటి కొట్టితే పదికొట్టేవారు, ఒకటి తిట్టితే పదితిట్టేవారు ఒకరిని పదిసార్లు యడిగి యాచించేవారు. ఒకరు అడుగవస్తే పెట్టనివారు కొందరు గలరు.

6. యుక్తిగలవారు దుర్మార్గులచేత బాధపడనివారు ఏలాగనగా దున్న, శునకము, సర్పము, గాడిద, తేలు యివి మొదలైనవి నరులకు అపాయము గలుగచేయును. అపుడు సన్మార్గులైనవారు ఊరికె యుండరుగదా.

ఊరుకున్న యెడల బాధకరములు, తనకు బాధకరమే కాకుండా యితిరులకున్నూ బాధకరమే కలుగుచున్నది. కనుక సన్మార్గులైనను దుర్మార్గుల బాధకోర్వజాలరు. కావున జ్ఞానులున్నూ అజ్ఞానులకు అజ్ఞానులవలెనే కనుపడుచున్నారు. గాని మరియొక విధముగాదు,

7. ఇందుకేమి సందేహం లేదు. కనుక "యద్భావం తద్భవతి" యని ప్రమాణవచనము గలదు. సన్మార్గులకు సన్మార్గులవలెనే యుండవలెను. దుర్మార్గులకు దుర్మార్గులవలెనే యుండవలెను. కాని కేవలం సన్మార్గముగా ప్రవర్తించుటకు అనుకూలముగా యుండదు.

8. దుర్మార్గులైనను సన్మార్గులైనను గురువును జేరిన వారికే జన్మసాఫల్యము గాని వేరే మార్గములేదు.

9. గురువుకన్నను వేరే దైవము లేదు. ప్రపంచమందు గురువు ఏ వృత్తిగల వానిగా నగుపడినప్పటికిని ఆయన విచారణ అపరిమితమై యుండును. ఆవిచారణను దెలియవలెను.

10. ఆ విచారణ ముముక్షువులు తెలుసుకొందురు. ఆముక్షువులకు యెప్పుడు అదే ఆలోచనయే. అదే దృష్టి కనుక వారికి తెలియును.

## 5. గురువునకు శిశ్రూష విధానం

1. గురువుదగ్గరకు శిష్యుడు వెళ్లి, పదిరెండు సంవత్సరములు వారికి శిశ్రూష చేయవలెను.

2. గురువునకు ప్రతిదినము, ప్రదక్షిణముచేసి, దీర్ఘ నమస్కారము పదిరెండుసార్లు, చేయవలెను.

3. గురువుభార్యకున్ను, అదే విధముగా నమస్కారము చేయవలెను.

4. గురువుయెంగిలి తినవలెను గురువును దైవముగా నెంచవలెను. గురువాజ్ఞకు బద్ధుడై యుండవలెను.

5. అందుకు శిష్యుడు యోగ్యుడైతేగాని, జన్మ సాఫల్యముగాదు. గురూపదేశము త్వరగా కాకపోయెనని తామసపడరాదు. అందువలన సార్ధకములేదు,

6. గురువునకు యెప్పుడు అనుగ్రహము గలుగునో అప్పటికే ఉపదేశము చేయనిమ్ము! ఏమితొందర పడరాదు.

7. అర్థము ప్రాణము ఆచార్యునికి సమర్పించి, వారికి బద్ధులై యుండుటే మంచిది. వారికి నరకములేదు. వానికిన్ని జన్మరహితమే.

8. గురూపదేశమైతేగాని జననమరణ భ్రాంతి రహితము గాదని అనుకోవలెనా? అనుకోవలసిన పనిలేదు ఎందుకు యీ సందేహము గలుగును? ఈ సందేహమునకు అవకాశములేదు.

9. గురుసేవ, దేవతాసేవ యెటువంటిదో అటువంటిదేగాని అన్యముగాదు, గురువునకు సేవజేసిన వారికి యెంత మాత్రము జన్మలేదు.

10. ఈ జన్మయందు యెన్నడు గురువనే దృష్టి గలుగునో, తాను చండాలుడైనను జనన మరణ భ్రాంతి రహితమగును, సందేహములేదు.

11. గురువు దైవముకన్నను మించినవాడు. దైవము, మనతో సంభాషించదు. మనము ఎవరిని దైవమని చెప్పుచున్నామో వారికి కూడా గురువు కలదు.

12. గురువు మనకు మార్గము తెలుపును. గురువు తెల్పిన మార్గముననే శిష్యుడు నడువవలెను. నడిచిన యెడల కడతేరును.

13. "నగురోరదికం" అని శాస్త్రములయందు కలదు. శాస్త్రములు సిద్ధాంతములే. శాస్త్రదృష్టము గలుగవలెను. శాస్త్రదృష్టములేని గురూపదేశము యెన్నడు చేయరాదు.

14. ఉన్నయూరిలో గురువును కొలిచేవాడు అందరికన్నను అతిశయుడు. అయితే ఆ గురువుని ఏలాగున జూచుకొన వలెననగా తల్లిదండ్రులకు దారాపుత్రాదులకు, విరోధి కాకుండను స్వధర్మమునకు హానిలేకుండను జూచుకొనవలెను.

15. ఆ గురువు చెప్పిన మాటలు వినవలెను. ఆ గురువుకు శక్తికొలది ఉపచరింపు చుండవలెను. ఆ గురువు భార్య గయ్యాళిదైనను మాతృభావము కలిగి ప్రవర్తించవలెను.

16. ఆమెను చక్కగా పూజించవలెను. తమయింట శుభకార్యములు జరుగునెడల ఆగురువును ప్రార్థనజేసి నూతన వస్త్రములు యిచ్చి వారిని సంతోషపెట్టవలెను.

### 6. గృహస్థుని భార్య కూడ గుణవతి కావలెను.

17. గురువునకు తన భర్త నేలాగు పూజచేయునో అలాగే భార్యయు జరుపవలెను. జరుపనియెడల చక్కగా తాను బోధించవలెను.

18. శక్తివంచన లేకుండ చెప్పగా తరువాత ఆమె దాని కర్మమనుకోవలెను. అది బుద్ధిమంతురాలాయెనా బాగానే యుండును. కాకపోయెనా ఆమెకే నరకముగాని యితనికి నరకములేదు.

19. పురుషునికి పరమార్ధ చింతలేక స్త్రీలకు పరమార్ధచింత గలిగినయెడల అది సానుకూలము గావడము కష్టము. దానికి మహా బాధ గలదు. ఏలాగునైనా పురుషుని సమాధానపరచుకొనెనా యోగ్యురాలే. ఆమెకే ముక్తి సందేహము లేదు.

20. జారత్వము చేయకూడదు. పతితో కలహించకూడదు. ఎవరితోను కలహించకూడదు. అతిథికి అభ్యాగతికి తనకు గల కొద్దిలోనైన దానము చేయవలెను.

21. దానము చేయుటకు పెనిమిటి యాజ్ఞ కావలెనని నిలుపరాదు. పెనిమిటి ఊరిలో

లేనపుడు అభ్యాగతివస్తే లేదనిన భాగ్యశాలికి కీర్తిప్రతిష్టలు రానేరవు, పెనిమిటి ఊరిలో లేకున్నను తనకున్న కొద్దిలో ధానధర్మములు చక్కగా చేయవలెను.

22. బంధువులను సన్మానించవలెను. మరియాదగా నుండవలెను. పుణ్యకథలను వినవలెను. పుణ్యపుమాటలొకరికి చెప్పవలెను. ధర్మముల పాటించవలెను. దయాదాక్షిణ్యములు గలిగి యుండవలెను. ఆధరణ గలిగి యుండవలెను.

23. ఎన్ని ఆచారములైనను గురుభక్తి వంటిదికాదు. గురునింద వినరాదు. గురుసేవ మానరాదు. గురువును మామవలెను, గురువుభార్యను అత్తవలెను భావించవలెను. తన పెనిమిటికి యెవ్వరు గురువో ఆ గురువే తన గురువని యెంచవలెను.

24. గురువుకన్నను దైవము వేరే లేడనుకోవలెను. గురువునకు వందనాది క్రియలు జరుపవలెను. పతివ్రత లక్షణము యింతే. పతివ్రతలు కాని వారికి మరియాదలేదు, కీర్తిలేదు, చెప్పిన తెలిసికొనజాలరు.

25. గురువును ఏర్పరచుకొనుట, గురువునకు నమస్కారము చేయుట గురువాజ్ఞ ప్రకారము నడుచుకొనుట లోకమందున అమర్యాద కార్యముగాదు ఇది దేవతలకు కూడా గలదు.

## 7. అవతారమూర్తులకు కూడా గురువులు గలరు.

1. శ్రీరామచంద్రునికి విశ్వామిత్రుడు విలువిద్య గురువు, వసిష్టుడు బ్రహ్మవిద్యను బోధించిన గురువు.
2. శ్రీకృష్ణ భగవానునికి బ్రహ్మవిద్యను బోధించిన గురువు సాందీపులవారు
3. జనక మహాచక్రవర్తికి యాజ్ఞవల్క్య మహాఋషి గురువునాయెను.
4. శ్రీ శుకమహాఋషికి జనకచక్రవర్తి గురువునాయెను.
5. పరీక్షిత్తు మహారాజునకు శుకులవారు గురువై భాగవతము బోధించినారు.
6. దేవతలకు గురువు బృహస్పతి.
7. రాక్షసులకు శుక్లాచార్యుడు గురువునాయెను.
8. ధర్మరాజునకు వ్యాసులవారు, అర్జునునికి కృష్ణస్వామి గురువునాయెను.
9. నారదులవారికి బ్రహ్మ యీలాగున అందరి కందరు, గురువులై పరమార్థమును దెలిసియున్నారు.

10. కనుక లోకమందు గురువు కలగడము విపరీతముగాదు, విధాయకమే, లోక సహజమే. కనుకనే, ఒకరితో పనియేమి? గనుక గురువును జేరినవారికి గురిదెలియును.

11. దరిద్రులైనవారు, కులాభిమానములు వదలుకొని, సేవకావృత్తికి ఒప్పుకొని యేలాగున జీవింప బడుచున్నారో, ఆలాగుననే మోక్షాపేక్ష గలవారలు, తమకుపయోగములయ్యే పరమార్థము లెక్కడెక్కడ గలవో, అక్కడక్కడకు పోయి, యెక్కడ మనసు కుదురుచున్నదో అక్కడ వారి ననుసరించి, అది సంగ్రహించే పర్యంతము, వారికి బద్ధులై యుండవలెను.

12. గురువు అనుగ్రహమునకు పాత్రులై, వారికి దాసులై, వందనములు చేయుచు, భక్తి విశ్వాసములు గలిగియుండి కృతార్థులుగావలెగాని, అభిమానములు కలుగజేసికొని, మనసు కుదురక చెడిపొయ్యే సాధనలను విచారించగూడదు, చేయకూడదు.

## 8. గురుశిష్య అన్యోన్యత

1. గురువు అప్పుడప్పుడు శిష్యునికి అభిరుచిని కలుగజేస్తు జనన మరణ భ్రాంతి రహిత బోధ చేయుచుండవలెను.

2. గురువు శిష్యునికి తన యింటి కార్యములు చేయించక అతని ధనమును గోరక యుండుట మంచిది.

3. శీఘ్రకాలమందుననే ఫలితమయ్యేలాగున శిక్షణలు ఇవ్వవలెను. సాధనాతీతమగు మార్గము గురువు దెలుపవలెను.

4. గురువు శిష్యుని క్షేమ వర్తమానములే విచారించుచు మన్ననజేసి, అతనిని రొష్టుపెట్టక, ధర్మాధర్మ మార్గముల నుపదేశించవలెను.

5. అప్పుడప్పుడు ఆ శిష్యుని యింటికిపోయినప్పుడు, భోజన కాలమందు జిహ్వాచాపల్యము గోర కూడదు. పెట్టిన దాంట్లోనే సంతృప్తి పడవలెను.

6. పరమార్థ విషయమై ప్రస్తావనముల జేసి అతని సందేహములకు, తగినట్టుగా సమాధానములను జెప్పి మనసంతోషము చేయుచు రావలెను.

7. ఆ సమయములో అతనిని ధనమడుగకూడదు, పశువస్త్రాదుల నడుగకూడదు.

8. అడుగక పోయినప్పటికైనా యేమైనా యివ్వకపోయెననే ఆశ నుంచుకోగూడదు.

9. అతని శక్తి కొలది యేమైనా ఇచ్చినయెడల అది తెచ్చుకోవలయును. వద్దనకూడదు. వద్దనినయెడల ఆశిష్యునికి యేలాగున దోచుననగా, చాలక వద్దననేమోయని తోచును.

10. శిష్యుని సంశయ రహితునిగా జేసి వారి కుటుంబీకులందరిని ఆశీర్వదించి జనన మరణ భ్రాంతి రహితుల జేసి, అన్య భ్రాంతి దొలిగించి రావలెను.

11. గురువునకు శిష్యుడు శక్త్యానుసారము పూజచేయవలెను. లోకానుసరణిగానే జరుపుకోవలెను.

12. అయితే తెగించినవానికి యేమియులేదు. బాగు చేయుటకు ప్రయత్నించవలెను.

## 9. నేను యనే అహమే, నా, నేనులతో యున్నది.

1. నా మతము రూఢిగా నమ్మవలెను, అందుకు ఒకటిగలదు. నేను సన్యసించితిని, ఏలాగనగా నామనసు నే విడిచితిని, నన్ను నేను నమ్మను, నేను ఒకరిని నమ్మను. అనేకులు నన్ను నమ్మమందురు. అనగా? అహంను నమ్మమందురు.

2. నన్ను అనగా, యెటువంటిదనగా నీవేనందురు. నీకు శరీరము లేదందురు. నా శరీరము నేను ఒకటేగాని రెండుగా నాకు తెలియదు.

3. నా ముచ్చట నాకు తెలియదు. నా పుట్టుక నాకు తెలియదు. నా సంగతి నాకు తెలియదు. నేను శరీరమేగాని శరీరముకన్నను. వేరేలేదు అందురు.

4. అందరి మాటలు నమ్మినాను; ఎవరిమాటలు విన్నను నేను శరీరమును గాదందురు నా శరీరమును విడచి నన్ను నేననేక కాలములు వెదకినాను, నాకేమియు తెలియలేదు.

5. ఒక మహాత్ముని కలుసుకొన్నాను. ఆయనకు పదిరెండు సంవత్సరములు శుశ్రూష చేసినాను, ఆయన అనుగ్రహమును సంపాదించినాను. ఆయన ఉన్నది దెలిపినాడు.

6. ఆయన చెప్పినదే సూటియైనది. ఆ సూటి నేదప్పినా, అది దప్పకయున్నది. అది మార్గముగానే యున్నది. అది బౌద్ధముగాదు, జీవాకారమైయుండె తానులేకపోవుట.

7. తాను శరీరము ఒకటేనని చెప్పినాడు అందుకు కొన్నిమాటలు అడిగినాను. ఆ మాటలు గురిగానే యున్నవి. అవి సరిగానున్నమాటలు, అనుభవముగానే యున్నవి.

8. అయితే బౌద్ధ మతముగాదు, పాషాండ మతముగాదు, అది మంచిమతమే. ఆ మతము అందరికి సమ్మతమే. ఆ సమ్మతము, పెద్దలు హర్షించేయున్నారు. అందుకేమి కొదవలేదు.

9. ఈ దేహమునకు, యెరుకకు భేదములేదు. ఎరుక యెన్నడులేదో నాడే దేహములేదు. దేహములేని నాడే యెరుకలేదు. ఎరుకలేక శరీరము మాత్రము యేలాగున గలదు? ఎరుకలేక శరీరము గలవారు యెవ్వరులేరు.

10. నేను అనేక మందిని చూచినాను. యోగులకు యెరుక గలదు, శరీరము గలదు.

11. ఋషులకు యెరుక గలదు, శరీరముకలదు.

12. అవతార మూర్తులకు యెరుక గలదు. శరీరము గలదు.

13. ఎరుకలేకపోతే శరీరము లేదు. ఎరుకను విడచి శరీరము ఉంటే, అది వట్టి శరీరము. మాట్లాడునా? అన్నాను.

14. అన్ని శరీరములు మాట్లాడుచున్నవిగదా? యని నేను అంటే ?

15. అందరికి అన్ని రూపములుగా, అహంకారమే యెరుకై యెరుకే శరీరమై శరీరమే మరణదేహమై మరణ దేహమేమన్నై, మన్నే నీరై, నీరే అగ్నియై, అగ్నియే వాయువై, వాయువే ఆకాశమై, ఆకాశమే అహంకారాత్మకమై, అహంకారతత్వమూ మహదహంకారమై, మహదహంకారమే ప్రకృతియై, ప్రకృతియే అచలమై, అచలమే శూన్యమై, శూన్యమే మహాశూన్యమై, మహాశూన్యమే అగోచరమై, నశించుచున్నది. అయితే మరణ మయ్యేవారందరు.

16. యీలాగుననే జన్మరహితులగుచున్నారా! యని శంకరాగా; అందరికాలాగున జన్మరహితము గాదు. అట్లైన, అందరు ముక్తులగుచున్నారని శంకరాగలదు. అలాగున ఒప్పుకొనిన, గురుశిష్యన్యాయము లేకపోవుచున్నది. పాపపుణ్యములు లేకపోవుచున్నవి.

17. ఈ వివరీతార్థములు అన్నియు కలుగుచున్నవి. ఇది ముక్తులైనవారు ఒప్పుకొనరు.

18. ఏలాగుననగా రజ్జుభ్రాంతి గలిగినంతసేపు, సర్పభ్రాంతి తోచదు. సర్పభ్రాంతి గలిగినంతసేపు రజ్జుభ్రాంతి దోచదుగదా; అలాగుననే ముక్తులకు అముక్తులు, అముక్తులకు ముక్తులు, గనపడరు. కనుక ముక్తులకందరు ముక్తులే. ఆముక్తులకందరముక్తులేగావున యిదే సిద్ధాంతముగాను, సాధారణముగా, నందరికి దోచదు.

19. అందులో నామాట యెంత మాత్రము నమ్మరాదు. నా జోలిపట్టదు నాముచ్చటగారాదు. నన్ను నమ్మరాదు. నన్ను నమ్మరు. నా పలుకులు నమ్మరు నా

చదువు వినరు. నా వృత్తాంతము గారాదు. నా గుణమెన్నరాదు. నా సలహాకూడదు. నాసంజ్ఞ నాకే తెలుసును. నాకు నా మాటలే విచిత్రములు. నాకు నా కథలే విచిత్రములు. నాకు నేనుగాను. నేను ఒకరికి గాను.

20. నా యందు కనికరముంచుమందురు. నేనందునుగదా నాయందు మీ అనుగ్రహ ముంచుమందును. ఆ నానాలు నానాలుగానే పోవును. నానాలు నానాలే, ఆనానాలు అనేక నానాలు. ఆ అనేక నానాలు అనేక నానాలే ఆ నానాలకు నానాలే అనర్థకములు. ఇది నిజం.

21. మొదటి నా ఒకటిగలిగెను. నాకు నా ఒకటి గలిగెను. ఆ రెండు నానాలకు మూడు నానాలు గలిగెను. మూడు నానాలకు మూడు అయిదులు పదిహేను నానాలు కలిగెను. ఇదిగాక యీ పదిహేను నానాలకు యిరువై అయిదు నానాలు కలిగెను.

22. కొన్నిటికి పదిహేడు నానాలు, కొన్నిటికి ఒక నా ఒకటి గలిగి, యనేకమై యిలాంటి నానాలను పెండ్లి చేసికొని అన్నిటికి అన్ని నానాలై, అనానాలనేక ప్రపంచములై, ఆనానాలకు నానాకులములై, నానా కులములన్నియు నానాలనే వరిమళ్లల్లో, నానాలనే దున్నలచేత, నానాప్రయాగాదున్నిన, నానామళ్లల్లో, నానానారు నానాల చేత పాతినట్లుగ, చెడక, నానాకారులై నానా గింజలై, నానాజనులై నానా అన్నములై నానాలుగా నున్నవి.

23. నాప్రకృతికి నా అహంకారము కలిగి, నా మహద్రూపంబాయెను. నా అహమునకు, నా త్రిగుణంబులు గలిగెను. నా సత్వంబున నింద్రియాధి పతులు గలిగిరి. నా రాజసంబున సూక్ష్మదేహంబాయెను. నా తామసగుణమున పంచభూతంబులై నా దేహంబాయెను.

24. నాకులమే వ్యాకులము, వ్యాకులమే నాకులము నాకులము విడువవలెను. నా కులము మాదిగకులము, మాలకులము, తురకకులము ఈ లోకమునందు నాల్గు కులములు యేలాగున ఏర్పడెనో నాలాగుననే యీ పరమార్థమందు నాల్గుకులములు గలవు. అవి వివరించుచున్నారము. విశదముగా వినవలెను.

25. అచలకులము బ్రాహ్మణకులము, ముఖ్యమైన కులము.

26. చలకులము శూద్రకులము. శూద్రకులముకన్న, శ్రేష్టకులముకన్న శ్రేష్టమైన క్షత్రియ కులము. భూతకులము అనగా వైశ్యకులము.

27. నాకులము శూద్రకులము చండాలపు కులము. అచలకులస్తులు నా కులస్తులను దాకితే స్నానము చేయవలెను.

28. నాకులస్తులు అచలకులస్తులగుదురు గాని, అచలకులస్తులు నాకులస్తులు యెంతమాత్రము కారాదు.

## 10. స్థిరమైన దేవుడు

1. ఈ ఉత్తబట్టబయలందు యేమియు పుట్టలేదు. పుట్టిందనుటకు యేలాగున నోరాడును బట్టబయలు అంతటాయున్నది ఆ బ్టబయలులో మనుష్యులు, పందులు, కుక్కలు, నక్కలు, యేమిన్ని పుట్టలేదు. ఇందుకు దృష్టము లేదు.

2. యెందుకనగా యీ భూమికంటే ముందు పరిపూర్ణముతప్ప యేమి లేదు. పరిపూర్ణము బయలుగాదని యెవ్వరనగూడదు. ఈ పరము సృష్టికి పూర్వమున్ను కలదు. ఇందుకు యేమి సందేహము లేదు. ఈ పరమునకు నామరూపములులేవు. యెరుకలేదు, మరుపులేదు.

3. ఈ యెరుకమరుపులులేని దానిని అందరు యెరిగియున్నను నమ్మరు ఇంతకంటె యెక్కువలేదు.

4. ఈ బయలే దేవుడని నమ్మవలెను. ఇదే స్థిరమైనది, గ్రంథములలోనున్న దేవత వంటిదిగాదు.

5. ఈ దేవతకు నోరు, చెవులు, ముక్కు, కన్నులు లేవు. ఈ పరిపూర్ణమునకు ప్రకృతిలేదు, మహత్తులేదు, అహంకారములేదు, ఆకాశములేదు, వాయువులేదు, అగ్నిలేదు, జలములేదు, భూమిలేదు, శబ్ధములేదు, స్పర్శలేదు, రూపములేదు, రసములేదు, గంధములేదు, జ్ఞాతలేదు, మనస్సులేదు, బుద్ధిలేదు, చిత్తములేదు, అహంకారములేదు, ప్రాణములేదు, అపానములేదు, వ్యానములేదు, ఉదానములేదు, సమానములేదు, శ్రోత్రములేదు, త్వక్కులేదు, చక్షువులేదు. జిహ్వలేదు, ఘ్రాణములేదు, వాక్కులేదు, పాణిలేదు, పాదములేదు, గుదములేదు, గుహ్యములేదు, యీ బయలు పుట్టదు, పుట్టించదు, రక్షించదు, చంపదు.

6. దీనిని యెవ్వరు యెరుగరు. గురు సూచనైతే అందరు యెరుగుదురు. చెప్పిన యెరుగరు. చెప్పకున్నను యెరుగరు. ఎవ్వరికి యీ జోలిపట్టదు. ఇది యెవ్వరు విన్నను యేమోనందురు గాని నిజమని అనరు.

7. ఏమి ఉన్నది? 'అతి రహస్యము బట్టబయలు' అందురుగాని ఆ బట్టబయలెటువంటిదో యెరుగరు.

8. ఆ పరమునకు నామరూపక్రియలు లేవు ఇది సకల లోకములయందు యున్నది.

9. యెన్నటికిని ఉన్నది. అందరిలోను ఉన్నది.

10. కొండలలోను యున్నది. గుహలలోను యున్నది. గుట్టలలోను యున్నది. చెట్లలోను యున్నది.

11. ఎవరులేదన్నను ఉన్నది. యెవరు కలదన్నను ఉన్నది. ఇది తప్ప యేదిలేదు.

12. ఎందరు యెన్నివిధముల విచారించిన యెరుక యేమిలేదు. అందుకే కలదోచిన శరీరములు యేలాగో ఆలాగే, మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు, ఈ ఉత్త బట్టబయలు తప్ప మరేమిలేదు అని గురువాక్యం ఉన్నది ఇంతకంటే ఎక్కువ లేదు.

గద్య:

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే
పూర్వభాగే అహంకారకుల నిరసన నవమ ప్రకరణం సమాప్తం









# 10. స్వప్న దృష్టాంత ద్రాష్టాంత ప్రకరణము

1. కలదోచిన శరీరముయేలాగో అలాగే మూలములేని యీ గురుతెరిగే శరీరము యేమిలేదు. ఇది సర్వాబద్ధమని ఇతరులకు దోచుట సహజం, నిజమే తెలియవలె.

2. గురువాక్యముచేత మేలుకొన్న వారికి నిజము తెలియును. గురుసూచన యెరుగనివారికి ఎంతచేసినా తెలియదు.

3. కలలో నరకులాడితే గాయములు మరునాటికి గనుపడవలెను గదా. అలాగున నేమి కనుపడలేదు.

4. అయితే కలలో నరుకులాడినపుడు బాహ్యమందు వాస్తవముగా నరుకులాడు సమయమందు యెంతబాధ యెంత దిగులుకలదో కలలో అంతబాధను అంత దిగులు అంత వ్యవహారముగలదు. గాని తక్కువలేదు.

5. ఆ కలలో ఆలోచన చేయుటకు అవకాశములేదు. అనుభవించ వలెను. సందేహములేదు, ఆ కల తనకు తాను తీర్చుకొనలేదు.

6. అతడు అనుభవించే కల యెవరికి తెలియదు. ఆ కలకు యేలాగున నివారణ కనుపడును? ఆ కలకు మూలములేదు. ఆ కల దీరిన పిమ్మట యేచింతలేదు.

7. ఆ కల దారిన ఆ కలయే పోవును. తన దారిన తానే పోవును. భయము గలుగదు. భక్తిలేదు.

## 1. స్వప్నములో జాగ్రత

1. బిడ్డలులేక పరితపించుచుండే దంపతులకు కలలో కుమారుడు కలిగినట్టు; ఆ కుమారునికి వివాహము చేసినట్టు దోచెను.

2. అద్దుముద్దు చూచుకున్నట్టు, కుమారుడు చనిపోయినట్టు, కోడలు మాత్రం విధవ యైనట్టు కలగని అందులోనే శుభాశుభములు అనుభవించి నట్లుండెను.

3. మేలుకొనిన పిమ్మట అవి అబద్ధమైనగాని యీలాగున కలదోచెనే యేమేమో ననుకొని ఆ కలను దలచుకొని ఆ శుభములను గురించి చింతయేలాగున కొంచెము కొంచెము దోచుచుండునో

4. అలాగుననే గురువాక్యము చేత మేలుకొని నప్పటికిని ప్రపంచ సుఖదుఃఖములు మనస్సునకు దోచుచుండును. ఇది మనసునకు సహజమే యగును.

## 2. స్వప్నములో స్వప్నము

1. దేశాంతరము వెళ్లిన కుమారుడు రావడమునకు ఆలస్యమై అతడు చనిపోయినట్టుగా తల్లిదండ్రులకు కలదోచిన యెడల వారు, విచారగ్రస్తులై యుండిరి.

2. వ్యసనగ్రస్తులై మనసు నిలుపలేక అతనిని చూచుటకు వెళ్లుచు సకల శ్రమలు బడుచు అతనిని జేరి చూచి సంతోషించినప్పటికిని ఆ కలను దలచి అప్పటికప్పుడు వ్యాకులము పొందినట్టుగా నుండును.

3. వివేకులకు ప్రపంచమే లేనప్పటికిని, అజ్ఞానకాలమునందు అనుభవమైయున్న వాసనలను దలచుకొని కొంచెము సుఖదుఃఖముల జెందినట్లుండుట సహజమే ఇదిగాక !

## 3. స్వప్నములో సుషుప్తి

1. కలలో పదిరోజులు విడువక చనిపోయిన భార్యను గలసి సుఖించినట్టు దోచుచుండి అనంతరము దేహమునకు రుగ్మత కనుపించిన యెడల ఆ భార్యదయ్యమై తనను వెంబడించినట్టుగా తాను ఆలోచించి అందుకు భూతవైద్యునిచే శరీరమునకు భయములేకుండా సంరక్షణ చేసికొన్నట్టుగా

2. ప్రపంచవాసనచేత తనకు లేని దుఃఖములు గలిగినట్టుగా తోచడమేగాని విచారిస్తే యేమిలేదు. ఇందుకు కలగనేటప్పుడు యథార్థముగానే యుండును. కల తీరగానే యేమిలేదు.

## 4. స్వప్నములో తురీయము

1. కలలో యేనుగులు, గుర్రములు, ఒంటెలు, అనేకములు కనుపడును. అవియన్నియు యేలాగున నిజముకాదో అలాగుననే యేది నిజముకాదు. ఇందుకు దృష్టాంతము యేమైనకలదా అంటే కలదు.

2. కలకు మూలములేదు. కలలో దోచినవస్తువులు యెంత నిజమో యీ దేహము అంతే నిజముగాని వేరుగాదు. ఈ తీరున యెవరు తెలుసుకొందురో వారికి అనుమానము లేదు.

3. కలలో తాను యేనుగునెక్కినట్టుగాను, పట్టాభిషేకమైనట్టుగాను దోచును. ఆ కలలో తనకు యెంత సంతోషమైనను యేమైనను అనుభవముగలదా? లేదుగదా?

4. అందుకే యీ భ్రమపడకూడదు ఈ భ్రమకు యెవరు కర్తలో వారికి యేమైన ఆశగలదా అంటే యేమిలేదు. కలకు దేహమే మూలముగాని మరియొకటిగాదు. అంతా కలేగాని కలకు అన్యముగాదు.

## 5. జీవభ్రాంతి లక్షణము

1. ఈ దేహము శాశ్వతముగాదు. ఈ దేహమునకు ఆధారములేదు.

2. దేహమునకు జీవుడు అన్యముగాదు.

3. జీవునికి నామరూపములు లేవు. జీవుడు జీవుడనే పేరేగాని వెదకితే వేరేలేదు.

4. జీవుడనగా వాయువగునా అంటే కానేరదు. ఆ వాయువునకు ఆధారము దేహము. దేహములో వాయువు గలదు. వాయువు స్థిరముగా నుండునా అంటే ఉండదు.

5. వాయువు మాట్లాడునా అంటే మాట్లాడదు. దేహముతో వాయువు లేకపోతే మాట్లాడదు. దేహమునకు నాశముగలదు. దేహములు రెండులేవు. మూడులేవు. ఈ దేహము పోతే సూక్ష్మదేహములేదు.

6. ఈ సూక్ష్మదేహము, యీ దేహము యెంత మాత్రము నిజము కాదు. ఈ దేహములకు నిలుకడలేదు.

7. ఈ దేహము నీరు బుగ్గవంటిది, వడిగళ్లవంటిది, మిరుగుడు పురుగు వంటిది. ఈ దేహమునకు మూలము లేదు. ఈ దేహము మధ్యనే పోయేది, మధ్యనే వచ్చేదిగాని దీనికి ప్రమాణములేదు.

8. గురూపదేశము వలన జననమరణ భ్రాంతి రహితులు గారాదా? దేహముల నమ్మి అనేక విధములైన భ్రమలు పడుచు ధనమునకై గురువులనైన జంపగోరుచు భ్రమలచేత దిరుగుచుందురు. గాని భ్రమను విడువనేరరు.

9. ఈ భ్రమలచేత తాను యెన్నాళ్లు ఉండును? ఈ భ్రమలను నమ్మియుండేవాడు వెఱ్ఱివాడు. ఎవరునూ నూరు సంవత్సరములకన్నను యెక్కువ బ్రతుకలేదు. అది దుర్లభము.

10. ఆ బ్రతుకులోను యీడు మిగిలిన బ్రతుకులు వ్యర్థము అది యెందుచేతననగా కొందరికి కన్నులు, ముక్కు, కాళ్లు, చేతులు, మొదలైనవి లేక బ్రతికి యుండగానే యేమైనా సార్థకము కలదా. కన్నులు, కాళ్లు మొదలైనవి యెందుచేత లేకపోవుననగా

దేహస్వభావమే కాదు, కర్మవలన నందురు. అది నమ్మరాదు.

11. ఆ కర్మ యెవరు చేయగలరు? అందరు సుకర్మనే చేయరాదా! అనేపక్షమందు కర్మ అనాదియని అందురు. అది నిజం కాదు.

## 6. కర్మ లక్షణము

1. అందుకే అంతా కర్మమే. కర్మమే దేహము. దేహమువలననే కర్మ అయినదనే పక్షమందు కర్మమువలననే దేహము గలుగును. దేహము వల్లనే కర్మకలుగును.

2. కర్మకు దేహమునకు బేధము లేదు. కర్మనే కర్మ చేయుచున్నది. కర్మనే కర్మ అనుభవించుచున్నది.

3. కర్మకు ముందు యీ దేహములకు కర్మయే రాజు, కర్మనే దేవుడు, కర్మనే మూలము.

గీ॥ **కర్మమున బుట్టుజంతువు**
**కర్మంబున వృద్ధిబొందు కర్మమునజెడు**
**కర్మము జనులకు దైవము**
**కర్మము సుఖదుఃఖములకు కారణమదిపా"**

యని భాగవత భారతాది పురాణముల యందు చెప్పబడియున్నది.

4. ఆ కర్మకు మేమున్నూ సంతోషించితిమి. ఈ కర్మకు దేహమునకు బేధములేదు గదా! కర్మమే దేహము దేహమే కర్మమని తెలిసే యున్నది తల్లిదండ్రులనే వారే కర్మ స్వరూపము.

5. ఆ తల్లిదండ్రులనే కర్మమువల్లనే జన్మ గలిగినది. ఆ తల్లిదండ్రులు అబద్ధమే. ఆ కర్మ అబద్ధమే.

6. యెందుకులేనిపోని భ్రమలజెందవలె. ఎందుకు బద్ధులుగావలె! వెనుకముందు గురుతెరుగక యెందుకు వెర్రియెత్తి తిరుగవలె? యేది తనతోకూడా వచ్చును? యేది నిత్యము?

7. పెండ్లాము బిడ్డలు కూడా వత్తురా? లేకపోతే ధనధాన్యములు కూడా యేమైనా వచ్చునా? గనుక కర్మరహితము జేసుకోవలెను. దీనికి అచల గురువే కావలెను.

## 7. నేను నాది యనె దురాహంకార లక్షణము

1. నాకు ఒకటి తెలియదు. నన్ను యెవరు అడుగరు. నాతో యెవరు పలుకరు. నన్ను చూచేవారు యెవరు లేరు. నామాట వినేవారులేరు. నాకేమి తెలియదు. నేనడిగిన యెవరు చెప్పరు.

2. నేననగ యేమొ నీవనగయేమొ? జాగ్రత్తకలవాడు నా అను మాట విచారించవలెను.

3. నాకు నేనే గావలె, నేను అంతా, నీవు నేను అనుట నేనే సుమీ అంటూ ఉంటారు.

4. దైవమే నేనని కొందరందురు. నీవేలాగున దైవమని కొందరందురు. నిజమును చెప్పుతాను వినుము అంటారు.

5. నామాట నేను చెప్పుతాను. అందరు నామాటే చెప్పెదరు. నాతో నావారే పలుకుదురు. నేను నాదారిలోనే ఉందును. అందరు నాచుట్టాలే అంటారు.

6. అందరికిగల ధనము నాధనమే. అన్నినాయిండ్లే అన్నిటికి నేనైయున్నాను. అన్నిటిని నేనేగురుతెరుగుచున్నాను. నాకులమే పాపిష్టికులము. నాకులమునే నమ్మరాదు.

7. **"యెవరికి వారే యమునా తీరే"** అందురుగదా! దీనిలో సంగతి యేమైనా దెలియరాదా. **"జాతస్యమరణంధృవం"** అందురుగదా! దీనిభావము దెలుసుకొనరాదా! ఎందుకింత దురహాంకారము? దురహంకారము వదలక పోతే యేలాగున ముక్తిని బొందుదురు.

8. ఎవరికైనా దురహంకారము వదలవలెననే తాత్పర్యము దెలియదా? ఈ దురహంకారమును యెవరువిడుతురో వారే దేవతలు.

9. దురహంకారమనగా అన్ని నేనే యనుట. దురహంకారము అందరికి నేననే ఉన్నది గదా! అదే దురహంకారము. అదే మొదలు చెడకుంటే వృద్ధియగు చుండదా? కొద్ది గొప్పగుచున్నది. కొద్దిగొప్పలు తెలియవలెను.

10. అహంకారము దేహమువల్ల గలిగినది అహంకారమువల్లనే జగత్తు గలిగినది. అహంకారమే దేవుడు. అహంకారమే మనుష్యులు? అహంకారమే పందులు, అహంకారమే కుక్కలు, అహంకారమే నక్కలు, అహంకారమే గాడిదలు. అహంకారమంటే గుర్తెరిగే దేహి.

11. అహంకారము లేనివారికి అనుభవములేదు, ఆయాసములేదు. అహంకారము నానా

విధములు నానాకులములు. అహంకారమునకు అనేక నామములు. అహంకారము లేనిదే పరమార్థము

12. అహంకారము విష్ణువుకు గలదు. బ్రహ్మకు అంతకన్న శివునికి చెప్పశక్యముగాదు ముప్పైమూడుకోట్ల దేవతలకున్నూ గలదు. గురువుకు మాత్రము అహంకారము లేదు.

13. 'తత్వమసి' మహావాక్యము క్రియాకారిగాదు. తత్పదమందు అహంకారము గలదు. త్వంపదము కేవల అహంకారమే. అసిపదము త్వంపదానికి తత్పదానికి ఐక్యమవునట. ఈయైక్యము గాకుంటేనేమి? కలిసితే సర్వం బ్రహ్మమయమనే యెరుక పోయిందా?

14. అహంకారము అహంకారములో గలియకుంటే నేమి? అహంకారము అహంకారములో గలియవలెనా? అహంకారమును నమ్మదగదు.

15. అహంకారమనగా యెరుక. ఆ యెరుక లేనియెరుక. ఆ లేని యెరుకను విడువవలెను. ఆ యెరుకకు మరుపుగలదు. యెరుక మరుపులులేక యుండేది యేదికలదో దానిని యెరిగిన వాడు యోగి.

16. యోగియైనవాడు యెరుకను వదలవలయును. యెరుక ఉంటే యే ధరితోచదు. యెరుకకు మరుపు సహజము. గనుక కలదోచిన శరీరాలు యేలాగో ఆలాగే, మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదు, ఈ ఉత్తబట్టబయలు యేమి లేదు అని నమ్మవలెను.

## 8. అచల లక్షణము

1. ఎరుక మరుపులు గానిది, సదసత్తులుగానిది, అచలము.
2. రూపారూపములు గానిది, జ్ఞానాజ్ఞానములు గానిది, అచలము.
3. గుణాగుణములు లేనిది; కోరికలు లేనిది, అచలము.
4. చలాచలములు గానిది. సంకల్ప వికల్పములు లేనిది, అచలము.
5. సాక్షిగానిది, బ్రహ్మగానిది, విష్ణువు గానిది, శివుడు గానిది, అచలము.
6. ప్రకృతిగానిది, ఆకాశము గానిది, వాయువుగానిది, అగ్నిగానిది, జలముగానిది, భూమిగానిది,
7. శబ్ధముగానిది, స్పర్శగానిది, రూపముగానిది, రసముగానిది, గంధముగానిది, యీలాగున యేదీ గానిది అచలమనబడును.

## 9. వృక్ష బీజ నిరసన

**శ్లో॥ అబీజం వృక్ష సంపన్నం శాఖా పల్లవ వర్జితం।**
**పుష్పం నాస్తి ఫలం నాస్తి సంపూర్ణం వృక్షవర్జితః॥**

తా॥ బీజము లేదు గనుక వృక్షము లేదు, వృక్షం లేదు గనుక శాఖోపశాఖలు లేవు, శాఖోపశాఖలు లేవు గనుక ఫలములు లేవు, గనుక ప్రకృతి యనే వృక్షం పురుషుడనే బీజం రెండు లేవని భావము.

1. మొదలులేదు, తుదలేదు, నడుమలేదు కొద్దిగాదు, గొప్పదిగాదు, చేతికిచిక్కదు, కట్టుపడదు, కొట్టుపడదు, తిట్టుపడదు, ఒకరిని మాట్లాడించదు, ఒకరితో మాట్లాడదు,
2. మన్ను మేడలైనా, మేడలు మన్ను అయినా రెండు ఒక్క మట్టే అన్నట్టు. ఈ రెండు అవస్థలు లేనిది బట్టబయలు.
3. అది కదలదు, మెదలదు, అతుకదు, గతుకదు, కొత్తది కాదు, పాతది గాదు, కోపములేదు, తాపములేదు, చావులేదు, పుట్టుకలేదు, అటువంటిదే అచలమై సంపూర్ణమై యున్నది.
4. దానికి కొమ్మలులేవు, ఆకులులేవు, చిగుళ్లులేవు, సంపూర్ణమై యున్నది, అట్టి సంపూర్ణమును, యెవడెరుగునో వాడు ధన్యుడు గాని, స్వాదీనుడుగాడు, సంశయము లేదు.

## 10. భ్రాంతి లక్షణము

**శ్లో॥ భ్రమే ణాహం భ్రమే త్వం భ్రమేనోపాసకోజనః।**
**భ్రమేణేశ్వర భావత్వం భ్రమమూల మిదంజగత్॥**

తా॥ నేను ఉన్నానను కోవడము నీవు ఉన్నావనుకోవడము భ్రమ గలిగినది కనుక, నీకు నాకు వేరుగా ఒక ఈశ్వరుదున్నాడని వాడు మనను రక్షిస్తాడని బావించి ఉపాసన చేయడం జరిగింది. ఈ భ్రమ చేతనే జగత్తు తోస్తూ ఉన్నది, గనుక భ్రమ యనగా గుర్తెరిగే యెరుక ఇది గురు సూచనచే లేకపోతే భ్రమ రహితమగును.

1. భ్రమ అనగా నేననేదే భ్రమ. నేననే భ్రమనుయెవడు వదులునో వాడు కేవల విరక్తిపరుడు వానికి చెప్పవలెను, మరియొకరికి చెప్పనే రాదు,
2. వానితో సమానమైన వారలు యెవ్వరునులేరు నేననేది చెడుది. ఆ నేను నేననేదే విషము. ఆ నేనును వదలడము దుర్లభము.

3. ఆ నేను ప్రపంచము ఒకేసారి పుట్టినవికాని, వేరుగా పుట్టినవిగాదు.

4. ఈ నేనును యే యుపాయము చేత తీసివేసుకోవలెనో. ఈ తెలివి తనచేతగాదు. గనుక అచల గురువు సూచన చేయవలెను.

## 11. దేహి దేహములకు భేద లక్షణము

1. దేహికి దేహమునకు బేధమని కొందరందురు. దేహికి దేహమునకు బేధమైతే సుఖదుః ఖములు యెరుకకేగాని, శరీరమునకు లేకపోవలె.

2. దేహికి దేహమునకు బేధమైతే, సుఖదుఃఖములు శరీరమునకు లేకుండా, యేలాగున నుండవలె ననగా పుట్టవంటిది దేహము పుట్టలోని పామువంటిది దేహి.

3. ఇల్లువంటిది దేహము. ఇంటిలోని మనిషివంటిది దేహి.

4. రాయివంటిది దేహము. రాతిలోని కప్పవంటిది దేహి.

5. కట్టెవంటిది దేహము, కట్టెలోని పురుగువంటిది దేహి గావలె గదా?

6. ఈలాగున యెరుకకు, దేహమునకు బేధమైతే, దేహమునకు బాధలేక పోవును. ఎరుకకు, బాధలేక పోవలెను.

7. ఏలాగనగా పుట్టమీద కొట్టితే, పుట్ట తనకు సుఖమని, దుఃఖమని, చెప్పుకొన జాలదుగదా? పుట్టలోగల పాము, యెక్కడనుండునో దెలియదుగదా!

8. అలాగే యెరుకకు సుఖదుఃఖములు లేకపోవును. దేహమునకు లేకపోవును. ఇండ్లతలుపులు వేసికొని లోపల, వానకు యిండ్లు తడిసినాగాని, మనుష్యులకు ఏ బాధలేనట్టుగా దేహమునకు యెరుకకు వేరైతే ఆలాగున బాధలేకపోవును.

9. రాతికి దెబ్బతగిలినాగాని రాతిలోని కప్పకు యేలాగున బాధలేదో, అలాగే శరీరమునకు బాధలేకపోవును. గనుక యెరుకకు దేహమునకు బేధముగా కనుపడుచున్నదన్నారు.

## 12. దేహి దేహములకు అభేద లక్షణము

అబేధలక్షణము యేలాగనగా

1. పాము, పాముకూసము కలిసి ఒకటైనట్టుగా,

2. నీళ్లు పాలు ఒకటైనట్టుగా,

3. కాయ విత్తు ఒకటైనట్టుగా,

4. పుష్పము పరిమళము ఒకటైనట్టుగా,

5. నూనె నువ్వులు ఒకటైనట్లుగా

6. అగ్నికాష్ఠము ఒకటైనట్లుగా,

7. యెరుక దేహము ఒకటైయున్నది. అందువల్లనే సుఖదుఃఖములు శరీరమునకు యెరుకకు కూడ గలుగుచున్నవి.

8. శరీరమును విడచి యెరుకయుండదు. యెరుకను విడచి శరీరముండదు. ఏలాగుననగా పాముకున్నూ పాము కుబుసమునకున్ను కూడ బాధగలుగునుగాని ఒక దానిని విడచి ఒకదానికి సుఖదుఃఖములు గలుగవుగదా!

9. అలాగుననే ఎరుకకున్నూ దేహమునకు అబేధము. ఎరుకను విడచి దేహముండదు; దేహమునువిడచి ఎరుకయుండదు. కనుకనే అభేదమన్నారు.

10. ఫలమును విడచి రసము, రసమును విడచి ఫలము,

11. నీరును విడచి పాలు, పాలను విడచి నీరు,

12. కాష్టమును విడచి అగ్ని, అగ్నిని విడచి కాష్టము ఉండనట్లుగా

13. దేహమును విడచి యెరుక, యెరుకను విడచి దేహము ఉండదు

14. అలాగుననే జననము, మరణము దేనికి తోచుచున్నాదో దానిని విడుచుట గురూపదేశము వలననే గాని ఏ సాధనచేత వదలదు.

15. సందేహములు మానుకుంటే జ్ఞానములేదు జ్ఞానములేకుంటే నిశ్చయములేదు. నిశ్చయము లేకుంటే అహంకారముపోదు. అహంకారము పోదనగా అహంకారము వదలదు.

16. అహంకారము వదిలెనేని అధికుడగును. అన్నిటికి అహంకారమే బలము. అహంకారము సామర్థ్యముగలది.

17. ఆ యహంకారము అనేక దినములనుండి అనేక శాస్త్రములనే త్రాళ్ళచేత కట్టబడియున్నది.

18. ఆ యహంకారము యెప్పుడు వదలునో అప్పుడే బంధము లేదు, ముక్తి లేదు. అహంకారమువంటి పాపిష్టిది అహంకారమేగాని మరియేదిగాదు. దీన్ని విడిపించే గురువు కావలెను.

## 13. పర బయలు లక్షణము

ఈ ఉత్త బట్టబయలును యెవరును గురుతెరుగరు. ఎందు చేతననగా?

1. ఈ పరిపూర్ణము యెన్నడును సాకారముగాదు ఈ పరిపూర్ణము యెన్నడును మనుష్యాకారము గాదు. పరము అంటే సాకార నిరాకారములకు వేరైనది బట్టబయలు.
2. ఈ పరము యెన్నడును అవతారములుగాదు. ఈ పరబయలుకు యెన్నటికి యెరుకలేదు. ఈ అచలమునకు యెన్నటికి మలినములేదు.
3. ఈ పరిపూర్ణము మనలను కప్పుకొనియున్నది.
4. ఈ పరములోనే మనము ఉన్నాము.
5. ఈ బట్టబయలు అనేది యెన్నటికి పోనేరదు.
6. ఈ పరిపూర్ణమునకు కోపములు తాపములులేవు.
7. ఈ అచలము నిత్యము, శాశ్వితము. ఈ అచలము యెన్నడు నశించదు. నిత్యము ఈ పరాపరము మహాగూఢమైనది.
8. ఈ పరిపూర్ణము మహా నిర్మలము, నిలుకడగలది. గనుక అచలము, పరిపూర్ణము, బట్టబయలు యనే పేర్లతో చెప్పబడెను.

## 14. అనిత్య లక్షణము

1. దేహి దేహములకు మూలము విచారించితే లేనేలేదు. గట్టిగా లేదు.
2. దేహి దేహములకు నిత్యత్వము యెన్నటికిన్ని కలుగనే కలుగదు.
3. దేహి దేహములకు నిలుకడలేదు. నిలుకడ గలిగితే దేహి దేహము నిత్యమే, దేహి దేహములకు నాశనము గలిగిన పిమ్మట, తిరిగి కలుగదు. దేహి దేహమునకు నాశము కనుపడుచునేయున్నది.
4. దేహి దేహములకు నిత్యత్వము చెప్పవలెనంటే నమ్మకము చాలదు.
5. దేహి దేహములకు నియమము లేదు. నిలుపులేదు. అండలేదు. దేహమునకు జీవుడులేడు, పరమాత్మలేడు, బ్రహ్మము లేదు
6. దేహి దేహమునకు తలవ్రాతలేదు. తలతిక్కలేదు. దేహి దేహమునకు తలతోక రెండును లేవు.

7. దీనిని యెరుగలేరు. దేహమునకు జడత్వమేగాని నిర్మలత్వము దొరకదు.

8. దేహమునకు ప్రాణాయామమువలన ఆయుష్యములేదు. దేహమునకు వికారములే కలుగుచున్నవి గాని మరేమిలేదు.

9. దేహి దేహమునకు యింద్రియములకు బేధము లేదు. కలదోచిన శరీరమేలాగో అలాగే మూలములేని యీ గుర్తెరిగే శరీరము యేమిలేదు.

## 15. ఆత్మ సన్యాసి లక్షణము

1. ఈ గుర్తెరిగే ఆత్మను వదలినవాడే నిజమైన సన్యాసి. ఈ సన్యాసము వలన పరమార్థచింత స్థిరమౌను. ఇదియే అంతర్ స్సన్యాసము. ఈ సన్యాసిని పూజించువారు ఉత్తములు.

2. ఆత్మసన్యాసికి యెవరులేరు. జగత్తులేదు, ఆకలిలేదు, దప్పికలేదు. అతను భోజనము చేయుట, దాహమడిగి పుచ్చుకొనుట, పరుండుట, స్నానముచేయుట, వస్త్రములు ధరించుట చూచువారలకు వారివారి నైజమునకు తగినట్టుగా దోచుచుండును, గాని అతనికి దోచదు.

3. తోచకుంటే యేలననుభవించ వలెననగా కలలో దోచినట్టుగా వాటికవే వచ్చుచున్నవి వాటికవే పోవుచున్నవి. కలవలెనే ఆ యోగికి సంప్రాప్తమగునుగాని మరియొకటిగాదు. ఇది ఆత్మ సన్యాసి లక్షణము.

4. ఇక బాహ్య సన్యాసము ముఖ్యముగాదు. ఆ బామ్యసన్యాసమును అంగీకరించుట ప్రయాసము కాదు. నిముషమాత్రములో సంభవించుచున్నది. ఆ బాహ్య సన్యాసములో రెండు విధములు. ఆ రెండు విధములెట్లనగా!

## 16. సహజ సన్యాసి లక్షణము

1. శాస్త్రములు చదువుకొని పెద్దలతో సహవాసము చేసి కొన్నాళ్ళు సంసారస్థితిలో నుండి పుత్రులు గలిగిన పిమ్మట వారలకు ఉపనయన వివాహాది కర్మముల జరిగిన వెనుక వెల్లుట.

2. తనవలన సంరక్షించబడే వారలు శక్తివంతులైన పిమ్మట, నేను వృద్ధునైతినిక నెక్కడనైన కూర్చుండి తపస్సు జేసుకొనియెదనని వారితో చెప్పి సహజ సన్యాసము పుచ్చుకొని సంచరించు వారలదే సహజ సన్యాసము.

3. అటువంటి వారల వృత్తి యే విధముగా నుండుననగా వినుము. వారు ఒకచోట నొకఘడియయైన నిలుచుండరు. ఒకరితో ప్రసంగము చేయరు.

4. అనగా వారికి దూషణ భూషణ తిరస్కారములు ఉండవు. వారినొకరు దూషించినాసరే భూషించినా సరే తిరస్కారము చేసినాసరే తామసపడరు.

5. భూషించిరని సంతోషపడరు. తిరస్కారము చేసిరని విచారపడరు. వారికి సుఖములు గలిగిన యెడల సంతోషమును పొందరు దుఃఖములు గలిగిన యెడల వ్యసనమును పొందరు ఇందుకు ఒక కథ గలదు, వినుము.

## 17. ఆనంద స్వామి కథ

1. ఆనంద స్వాములను వారు వెళ్లుచుండగా మార్గమధ్యంబున నొకరైనను అన్నము పెట్టుటకు మరియాద చేయకపోయిరి.

2. అస్తమానసమయమందు నొకయూరిలో, నొకదేవాలయముయొక్క ద్వారమందున నివసించి, ఓ యుదరమా! నీకు ఆకలి అయినయెడల చెప్పితే యిప్పుడే యెవరినైనా నడిగెదను. అపరాత్రివేళ యెవరున్నూ పలుకరని చెప్పుచూ సుషుప్తినొందెను.

3. ఆ యోగికి అపరాత్రికి జాగ్రత్తగలిగెను. ఆ సమయములో ఆకలి పట్టజాలక పోయెను. అప్పుడు లేచి అంధకారములో యిల్లిల్లు తిరుగగా తలుపులు వేసికొని అందరు నిద్రబోవుచుండిరి.

4. ఆ సమయమున ఒక యింటికి మాత్రము తడికెవేసి యుండెను. అతడికను మెల్లగా దీసికొని లోపలికి వెళ్లెను. ఆ లోపలకు వెళ్లి దొంగవానివలె అంతటవెదకెను. అప్పుడు ఒక ఉట్టిమీద చట్టిలో కొంచెము మజ్జిగ అన్నము దొరికెను.

5. ఆ యన్నము తీసికొని మజ్జిగ కలుపుకొని కడుపునిండునట్లు భుజించు చుండగా ఆ యింటివారు మేలుకొని, చప్పుడు ఆలకించి, దొంగ జొరబడినాడని అరవగా అయింటి ప్రక్కనున్నవారందరు పరుగెత్తివచ్చిరి. అంతలో ఆ యింటివారే అతనిని పట్టుకొని రెండు దెబ్బలు కొట్టగానే ఇంకా బాగా కొట్టుమనెను.

6. ఆ మాటకు ఆ యింటివారికి ఆశ్చర్యముగా దోచి దీపము ముట్టించి చూచే వరకు యోగి ఆహా! యతినింద కులక్షయమని ఉన్నది. గనుక అప్పుడు అందరున్నూ ఆయనకు నమస్కరించి నొక విశాలమైన గృహమునందు నివసింపజేసిరి, బుద్ధిమంతులైనవారు గనుక ధ్యాన భజన వందనాది క్రియల నెరవేర్చుచు అతిభక్తి గలవారలై మరుదినమున సమారాధన జేసి ఆ యోగిని తృప్తి పరచిరి,

7. అయితే ఆ యోగి అపరాత్రి దుర్ధశనొంది దెబ్బలుపడు సమయములో విచారపడలేదు. దేవునివలె పూజించునప్పుడు సంతోషపడలేదు.

8. కనుక క్రమమైన సన్యాసికి యిదే విధముగా సహనము, ఓర్పు, శత్రు మిత్ర సమత్వము, యిష్టా యిష్టములు, శుభా శుభములు, సుఖదుఃఖములు, ప్రియాప్రియయములు లేకపోవడము సంభవించుచున్నది.

9. అతను నిర్మలుడు, నిత్యుడు, నిర్వికారుడు, అసంగుడు, అక్రోధుడు, అనహంకారుండు, ఆనందపరుడు, అగుణుడు, అజన్ముడు, అతిశాంతుడు, అధికయోగ్యుడు, అచలుడు, అనాయాసపరుడు,

9. అమాయకుడు, అపరోక్షము గలవాడు, అందుకే సన్యాసి అనగా అందరు సన్యాసులుగారు. ఇటువంటివారే నిజమైన సన్యాసాశ్రమ యోగి. ఇంకొక విధము గలదు యేలాగనగా వినుము.

## 18. కపట సన్యాసి లక్షణము

1. భార్యతో కలహించుకొనిగాని, గ్రామములో అప్పులకుగాని, సంసార సంరక్షణ జేయలేకగాని, యింటిలో భోజనసదుపాయము లేక గాని సన్యసించువారు కపటసన్యాసులు.

2. వీరిని సన్యాసులే అందరుగాని, సన్యాసులుగారు మాచకమ్మలే. మాచకమ్మలేగాదు, ఎందుకు నన్ను అనిపించెదరు. వీరల ముఖమే చూడరాదు.

3. వీరలకు జారత్వమందే యెక్కువ భ్రాంతి. చివరకు నరకమే సంప్రాప్తమగును. జిహ్వా చాపల్యములను గోరెదరు. అందుకే గదా.

**శ్లో॥ జిహ్వోపస్థ పరిత్యాగి పృథివ్యాం కింప్రయోజనం ॥**

అని ఉన్నది గదా! జిహ్వోపస్థ భ్రాంతులు వదలని యోగులు యోగులా? జోగులె. ఆ జోగులకు యీ యోగులకు సమానమా? పేడ బెల్లము సమానమా?

4. శంకరాచార్యులవారికి పీర్లసరిగస్తుకు సంబంధమా? ఎద్దుకు గాడిదెకు సమానమా? తెల్లగా నుండగానే కొంగకు హంసకు సమానమా!

5. అయితే పంది బురదమెచ్చునుగాని పన్నీరు మెచ్చదు. అటువలెనే బూటకులని మెచ్చరు. వారికి బూటకములతో యేమిపని? మాటలతో యేమిపని? ఈ బూటక సన్యాసమువలన నేమిఫలమనిన వీరికి తగనికోపము.

6. తిండి సౌఖ్యము, స్త్రీల పరిచర్యలు స్త్రీలతో అవలంబమనముగా మాటలాడుట పరమార్థవిమర్శ చక్కగా దెలియకపోవుటయు రుచిపక్వములు బాగుండకపోయెనా, తగవులాడి లేచిపోవుట.

7. తపస్సు లేకపోవుట, యెల్లప్పుడు ఒకరితో వ్యవహారము లాడుచుండుట సత్కాలక్షేపము చేయకపోవుట శత్రుమిత్ర సమత్వము లేకపోవుట.

8. తననే పొగడ గోరుట. తన ప్రతాపమే చెప్పుకొను చుండుట తానందరిని భయపెట్టుచుండునట,

9. తనకందరు బద్ధులై నుండవలెననుట, సుఖముల గోరుట, యీవిధమైన వేషములతో ప్రవర్తించు సన్యాసులను, జేరరాదు.

10. నేను కొంత చూచినదే, నేను విన్నదే, నాకు తెలిసినదే. ఊరెందుకు పేరెందుకు? నడతవింటే చాలదా? ఆనడతవింటే అటువంటి వారలైతే అగ్ని హోత్రముతో గలసిన ఆజ్యమువలె మండుదురు మండితేనేమి? అనడత గలవారలకు పాదరక్ష ప్రయోగమే. నీకేమంటే నీకేమనేదే, యిర్రి కొమ్మంటే బర్రెకొమ్మనేదే, చూడిగొడ్డంటే పాడిగొడ్డనేదే, నా పద్ధతియింతే, వింటేవిను, వినకుంటెమాను అనే వారున్నారు.

## 19. దీక్షితులవారు స్వానుభవమును దెలుపుట

1. నేను చిన్నతనములోనే వేదములను చదివినాను, శాస్త్రములను చదివినాను, ముద్రలను చూచినాను, యోగములను సాధించినాను, మంత్రములను దెలుసుకొన్నాను, యెన్ని దెలుసు కున్ననేమి? అన్ని అడవి మార్గములుగానే యున్నవి.

2. అప్పుడు నాకు, దిగులు గలిగినది. నాకు యెవ్వరు చెప్పకపోయిరి. కాశికివెళ్లినాను. అందరిని చూచినాను, కొన్నిటికి సమాధానముల నడిగినాను వారు చెప్పినమాటలు పూర్వపక్షము జేసినాను.

3. అందులో కొందరు నా సిద్ధాంతమును నమ్మినారు. ఎరుకను తీసివేసినాను

4. గోల్కొండ పట్టణమునకు జేరినాను. తురకలతో వాదించినాను, అందరిది ఒకకులమేనని అన్నాను.

5. వారు అందరు నాతో జ్ఞానులవలె సంభాషించినారు. విందుకు రావలసినదని అన్నారు. రానియెడల సమాధానము చెప్పుమని అన్నారు.

6. మంచిదని నేను పోయినాను. అందరము కూర్చున్నాము. సకల పదార్థములు వడ్డించినారు, ఆరగించుమని అన్నారు.

7. నేను ఒకటి అడిగినాను. ఛీ ఛీ లేచిపొమ్మని అన్నారు. అందుకు మీకు అభిమానము ఉన్నదిగనుక నేను మిమ్ములను చేరరాదని అన్నాను.

8. అక్కడినుండి లేచి నా ఊరువచ్చినాను. నేను యెవరితోను చేరలేదు. నాకు యెవరూలేరు.

## 20. యెరుకయను అహంకారాన్ని విడిపించుటకు చేసిన యుక్తి.

9. నేను తురకలకు ఉపదేశము చేసినాను. వారి గ్రంథములే వారికి సమాధానము అయినవి. వారి భాషతో వారి గ్రంథముల సంగతులు వారికి చెప్పినాను. ఎరుకను పందియని వారికి చెప్పినాను

10. గట్టిగా చెప్పినాను. వారికి నాటినది. సమాధాన పడినారు. వారు పందినిదలచరు. వారికి ఆవాసనగిట్టదు. వారితో ఆమాటలాడే వారిని జూచిదూరము తొలగుదురు.

11. బ్రాహ్మణులకు ఉపదేశము చేసినాను. లెస్సగా ఆచారము జరుపుకోవలెనని చెప్పినాను కులములు వేరని అన్నాను. ఒక కులమును ఒక కులము ముట్టరాదని అన్నాను. లెస్సగా ఆచారములు చెప్పినాను.

12. అందులో చండాలకులమునకు నూరుబారల దూరము తొలగుమన్నాను వాండ్లను చూడవద్దనే అన్నాను. వాండ్లతో మాట్లాడవద్దనే అన్నాను. అంటేవారు నమ్మినారు. చండాలకులము అంటే పడిచస్తామని అన్నారు. వారికి ఆ కర్మకాండనే చెప్పినాను. చెప్పితే నమ్మినారు.

13. అప్పుడు వారికి యెరుక చండాలకులమని చెప్పినాను అప్పుడు గిజగిజ లాడినారు. ఆ కులమును జూచి దూరముగా వెళ్లుచున్నారు. దగ్గరకు రానివ్వరు. ఆకులమును విడిచినారు ఏకులమును పొందియున్నారో తెలియదు.

14. బ్రాహ్మణులకు యెరుక చండాలకులమని చెప్పినాను.

15. రాజులకు యెరుక మాదిగ కులమనిచెప్పినాను.

16. కోమట్లకు యెరుక గోసంగికులమని చెప్పినాను.

17. శూద్రులకు యెరుక మున్నూటి కులమని చెప్పినాను.

18. తురకలకు యెరుక పందికులమని చెప్పినాను.

19. పతివ్రతలకు యెరుక పరపురుషుడని చెప్పినాను.

20. విధవలకు యెరుక ముండగర్భమని చెప్పినాను. ఉన్నదున్నట్టుగా చెప్పినాను.

21. మరి యీ దోషములను విడచి నిర్మలులయ్యేయున్నారో లేక యీ దోషముల నాపాదించి చెప్పశక్యముగాని నిందలకు లోనయ్యేయున్నారో తెలియదు. తెలియకుంటే నాకేమి, తెలిసితే నాకేమి. తెలిసినవారికే తేట, తెలియని వారికి తెలియనే తెలియదు. ఇది శాస్త్రమే గాని అశాస్త్రముగాదు. ఎవరైతే అహంకారులో వారికి నరకమనే యున్నది.

## 21. తనను తానే విమర్శించుకొనుట

పుట్టినటువంటి యెరుక గిట్టునాగిట్టదా! ఎరుకనగానేమి? ఎరుకను విమర్శించవలెను. అలాగే విమర్శించుమా.

ప్ర॥ ఓ యెరుకా! నీకు నివాసమెక్కడ? ఉ॥ బయలు.

ప్ర॥ నీకు తల్లి ఎవరు? ఉ॥ నా తల్లి దేహమనుకున్నాను.

ప్ర॥ నీకు తండ్రి ఎవరు? ఉ॥ తండ్రికూడా దేహమేననుకున్నాను.

ప్ర॥ అనుకోవడమేకాని, నీకు బాగా తెలియదా? ఉ॥ తెలియదు.

ప్ర॥ నీకు చుట్టాలు ఎవరు? ఉ॥ కలలో పుట్టినవారు చుట్టాలు.

ప్ర॥ నీకు భార్య ఎవరు? ఉ॥ కలలో శరీరము భార్య కావలెను.

ప్ర॥ నీకు సంతాన మెంతమందిగలరు? ఉ॥ కలలో అనేకులు పుట్టినారు.

ప్ర॥ అందరు బాగా ఉన్నారా? ఉ॥ అందరు అప్పుడే నశించినారు.

ప్ర॥ ఒకరైనా లేరా? ఉ॥ ఒక్కరైనా నిలచినవారు కారు.

ప్ర॥ నీకు యింటి మొదలు యేమిలేదా? ఉ॥ ఏమిలేదు.

ప్ర॥ ఎవరినైన పెంచుకున్నావా? ఉ॥ నన్ను ఎవరు పెంచుకొనలేదు.

ప్ర॥ నీకు ఎన్ని సంవత్సరములు? ఉ॥ ఎన్ని సంవత్సరములు అయినది ఎరుగను. నా మూలము నాకు తెలియదు.

ప్ర॥ నీ వియ్యాలవారు ఎవరు? ఉ॥ స్వప్నదేశస్థులు

ప్ర॥ స్వప్నదేశస్థులనగా? ఆ స్వప్నదేశము ఎక్కడనున్నది? ఉ॥ నాలోనే యున్నది.

ప్ర॥ నీవు ఎక్కడనున్నావు? ఉ॥ నే నంతట నిండియున్నాను.

ప్ర॥ నీకు రూపము కలదా? ఉ॥ నాకు రూపము కలదు.

ప్ర॥ నీకులమేమి? ఉ॥ నా కులము ఎరుకలకులము.

ప్ర॥ నీవు ఎరుక చెప్పెదవా? ఉ॥ నేను ఎరుక చెప్పుచునేయున్నాను.

ప్ర॥ నీవు చెప్పిన ఎరుక నిజమేనా? ఉ॥ నిజము చెప్పితే నిజమే.

ప్ర॥ అయితే అబద్ధముకూడ చెప్పెదవా? ఉ॥ యేమీ చెప్పుచునే యున్నాను గదా !

ప్ర॥ అబద్ధము యెందుకు చెప్పవలెను? ఉ॥ నేను మంచిదాననని అనిపించుకొనుటకు అబద్ధము చెప్పుచున్నాను సుమా.

ప్ర॥ అయితే నిజమునే చెప్పి మంచిదానవని అనిపించుకొనరాదా? ఉ॥ నేను నిజము చెప్పితే యెవ్వరికిన్ని తెలియనే తెలియదు.

ప్ర॥ ఎందుచేత దెలియదు? ఉ॥ మమత వదలనందుచేత తెలియదు.

ప్ర॥ మమత వదలక తెలియకపోవడమేగాని, ఆ మమతను వదలితే తెలుసునా?

ఉ॥ తెలుసును. సందేహములేదు.

ప్ర॥ నీకు మమత వదిలినదా? ఉ॥ నాకు మమతయే దేహమాయెను. దేహమున్నంతమట్టుకు మమతగలదు, దేహము లేకపోతేగాని మమతలేకపోదు. మమత నాకు స్వభావమైయున్నది.

ప్ర॥ ఈ మమత యేలాగున లేకపోవును?

ఉ॥ సద్గురూపదేశమువలన మమత లేకపోవును. మమత యీలాగున గూఢముగానున్నది.

## 22. యెరుక ఉండీలేని విధానం

**గురువు** : గురువునకు మమతలేదు. దేహమున్నంత పర్యంతము మమత గలదని చెప్పినందుకే గదా

1. కాలిన పిడక బూడిదయైన కచ్చిక చందముగా ఉన్నది. గాని విచారిస్తే లేదు.
2. ఇదిగాక యేనుగ(మింగిన వెలగపండువలెనున్నది. మమతయనే యెరుక లేదు.
3. గురువుల వారికి దేహము కనుపడుచున్నను, వెలగ పండువలె పైకి మాత్రము నగుపడునేగాని లోపలనేమియు లేదు.
4. అలాగున నున్నది గనుక గురువుల వారికి దేహము గనుపడగానే ఆయనకు మమత కలదని యెంచరాదు;

5. మమతలు ఆయనకులేవు. ఆయన మమత గలవాడుగాడు. ఆయనను ఒకరు అనేవారు లేరు, ఆయనతో సమానులు ఎవరుగారు ఆయన ఒకరి మమత పోగొట్టేవాడు. గనుక సందేహములేదు.

## 23. ఇంద్ర జాలము

1. ఇంద్రజాలకుడు చేసిన విద్యనుజూచితే ఇతరులకు నిజమని తోచునే గాని ఆ యింద్రజాలకునికి భ్రమ దోచునా! తోచదు గదా !

2. ఆ యింద్రజాలకునకు ఎంత మాత్రము నిజమని తోచదు. అయింద్రజాలకునికి తానుజేయు జాలములన్నియు సర్వాబద్ధములని తోచుచుండును.

3. ఆ యింద్రజాలమెటువంటిదో యీ జగత్తు అటువంటిది. యింద్రజాలమున కొకడు కారణుడున్నాడు గాని ఈ జగత్తునకు నొకరైన కారణుడులేడు.

4. కారణములేని కార్యము గలదాయనగా లేదనిచెప్పుదురు. అందుకు ఇంకా శంకజేసికొని అడుగవలసిన వన్నియు ఒకసారే అడుగుము. అడిగితే అన్నిటికి ఒకసారి సమాధానములను జెప్పెదము గాని పదేపదే మేము జెప్పజాలము.

## 24. గురు శిష్య సంభాషణము

గు॥ ఈ అచల పరిపూర్ణ బోధ కొందరికి దృఢమవును కొందరికి కానేరదు.

శి॥ అయ్యా! కొందరికి దృఢమవును, కొందరికి కానేరదని అంటిరిగదా? గురువులకు అందరియందు సమభావము గలిగియుండరా?

గురూపదేశము పొందిన పిమ్మట, దృఢముకాకపోవడము శిష్యునికిగల నైజము వల్లనా? గురువునకుగల నైజమువల్లనా? నాకు తెలియటం లేదు.

గు॥ శిష్యునిమనసు పరిపక్వముగాక వారి నైజము వల్లనేగాని, గురువునకు నైజముగలదని చెప్పగూడదు. వినగూడదు.

శి॥ స్వామీ! శిష్యునికి నైజము గలిగి, మనసు పరిపక్వము గానిదే గురుస్వామి యేలతొందరపడి ఉపదేశము చేయవలెను?

గు॥ శిష్యునికి గలిగియున్న పరితాపమునుజూచి, గురువులు పశ్చాత్తాపము గలవారుగనుక, ఉపదేశము చేయుచున్నారు.

శి॥ అయ్యా! ప్రేమాస్పదుడైన కుమారునికి రుగ్మత గలిగినపుడు, వైద్యుడు

పదిలంకణాలతోగాని ఈ రుగ్మత నివారించదని చెప్పినపుడు, తల్లిదండ్రులు, ఎంత పశ్చాత్తాపము గలవారైనను, అన్నము పెట్టుదురా?

గు॥ అన్నమును పెట్టరుగాని, యెవ్వరులేని సమయమందు విలపించుచున్న కొమారుని చూచి తల్లియెంగిలి పరచినట్టు. కొంచము పెట్టుదురు.

శి॥ 1. స్వామీ, పది లంకణములు చేయవలసిన రోగికి ఆపేక్షచేత తల్లియెంగిలిపరచినను రోగము బలమై అవస్థలు జెందునుగదా.

2. అలాగుననే యీ గురువులు తొందరపడి చేసిన ఉపదేశము వలన మనస్సు కుదరక దరిదెలియక తిరిగి గురుశుశ్రూష భావము దెలియక ప్రయత్నము సేయగలిగిన కారణములుండి ఆయాసమును బొందుచుండును.

3. శిష్యునికి కారణము దెలియకపోవడము సహజమైయున్నను కారణము గురుతెరిగిన గురువులు సహనవంతులు గావలెగాని తొందరపడుటవలన యేమి ఆదాయము గలుగును శిష్యునికి ఆనందమేలాగున గలుగును?

గు॥ 1. ఓయీ! యిటువంటి గురూపదేశము గురువుల నైజముగాదని చెప్పితినిగదా. అయినను యిది గురువుల నైజమే. ఆ గురువులకు గల నైజమేమనియనగా యీ గురువులలో రెండు విధములు గలరు.

2. ఎట్లనగా శిష్యులధనము అపహరించవలెననే అభిప్రాయము గలవారలు కొందరు. వారి ధనమున కాశపడక ముక్తులను జేయవలెననేవారు కొందరు గలరు.

శ్లో॥ **గురవో బహవః స్సంతి శిష్య విత్తాప హారకః ।**
**త్వమేకం దుర్లభం మన్యే శిష్య హృత్తాప హారకః ॥**

1. అనే ప్రమాణము వలన గురువులు బహుమంది గలరు. అందులో శిష్యులకుగల సంశయములను నివారణచేయగల గురువులు దుర్లభము.

2. శిష్యులకు మనసు కుదిరితేనేమి కుదరకపోతే మనకేమి? ఉపదేశమైన తరువాత యేమైన యిత్తురో యివ్వరోయను సందేహము చేత తొందరపడి ఉపదేశము జేయుచుందురు.

శిష్యుడు:- 1. అయ్యా, అర్థము ప్రాణము ఆచార్యుని స్వాధీనమని చెప్పుచున్నది గదా, శిష్యుల ధనము గురువులు అంగీకరించుటకు విధాయకమై యుండగా శిష్యవిత్తాపహారులని ఎందుకు ధూషించవలెను?

2. ఇదిగాక లోకమునందు దానధర్మములు ముఖ్యములేగదా, ఇదియునుగాక, పూర్వోక్త గ్రంథముల యందుగూడ కరులనేమి, హరులనేమి, సుందరులనేమి విడచిన మోక్షాసక్తి గలవారలయ్యెదరని చెప్పుచుండగా ఏల శిష్యార్థహారులనే పేరు ప్రసిద్ధమైయున్నది.

**గురువు:–** 1. ఓయీ, శిష్యునికి మనసు పరిపక్వమై బోధ సాంగోపాంగమును బొందినపిమ్మట గురుసంరక్షణ తనకున్నంతలో ఎందుకు చేయకమానును? గాని అతనిమనస్సునలేనిదే గురువు బలాత్కారముగా అర్జనజేయవలసిన అవసరములేదు.

2. గురువు అడుగవలసిన పనియేమి లేదు. ఆ గురువులపై శిష్యులు భక్తిభావములున్న యెడల యివ్వక మానరు.

3. వారు ఎంత యిస్తే అంతేచాలును. వారిని కొసరకూడదు, కసర కూడదు. బయటికి కొసరక పోయినను ఇంకా యివ్వకపోయెననే సందేహము వలదు.

4. శిష్యులు తమకున్నంతలో గురువునకు అన్నపానాదులు తరుగులేకుండ జరుపవలెను. అలాగున జరుపుతూ ఇంతఖర్చులు అయెగదాయని తలచగూడదు. మనస్సులోనైన యెంచగూడదు. గురువు గుడిలో దేవునివలె నుండవలెను.

5. ఆ దేవునికి అల్పకానుకలు కొందరు, అధిక కానుకలు కొందరు సమర్పించినను అందుకాదేవునికి ప్రియాప్రియములు లేనట్టుగానే శిష్యులు పూజలవిషయమై ఎవరికి ఏలాగున శక్తిగలదో వారాలాగున చేయగా ప్రియాప్రియములు లేక స్వల్పమునకుగాని అధికమునకు గాని ఊరకుండవలెను. ఇది సద్గురువుల విషయము.

**శిష్యుడు:–** అయ్యా, గుడిలో దేవుని వలె పోలిక చెప్పితిరిగదా, ఆగుడిలో దేవునికి ఆకలిలేదు, దప్పిలేదు, కోపములేదు, తాపములేదు, జనన మరణముల భ్రాంతి లేదు, దేవుడు జననమరణముల భ్రాంతిని దొలగించలేదు గనుక ఆయనకు అల్పమైనాసరే లేకపోయినా సరే.

ఈ దేహధారియైన గురువునకు ఇది ఏలాగున సరిపోవును? పదిమంది శిష్యులుగలిగితే అందులోనొకనిని మహాబుద్ధిమంతుడని అనుచుందురుగదా, అలాగుననిన ఆ గురువునకు ఏమైనా దోషమువచ్చునా? చెప్పండి.

**గురువు:–** ఓయీ, గుడిలో దేవునికైనను అలంకారములవలన రూపములు, గుణములు ఉన్నట్టుగా దోచబడునుగాని ఈ గురువు కేవల అచలస్వరూపుడు ద్వయదోషరహితుడైన జ్ఞానాతీత ధురంధరుని వలె ఏమియు దోచక నిర్వికారుడై యుండును.

**శిష్యుడు:-** అయ్యా, గురువులవారు ద్వయదోష రహితుడైన ధురందరునివలె ఏమియు దోచక కేవల అచలస్వరూపులై యుందురని చెప్పితిరిగదా, ఈ అచలస్వరూపునికి శిష్యుడు తన్ను ప్రార్థించినది ఏలాగున దెలుసును.

ఆ శిష్యునికి చలనస్వరూపుడై ఏలాగున బోధించును? ఇది అన్నిటిలోను నా మనస్సునకు గొప్ప సందేహముగానున్నది.

**గురువు:-** కలలోదోచిన గురుశిష్యులవలెనని తెలియవలెను.

**శిష్యుడు:-** అయ్యా! కలలోదోచిన గురుశిష్యులవలెనని చెప్పితిరి గదా? గురువునకు అవస్థాత్రయ భంగమాయెనా? కాలేదా?

**గురువు:-** ఓయీ! అవస్థాత్రయ భంగమయ్యే అచలమును పొందెను. ఆ గురు దర్శన మాత్రము చేతనే సింహమునుగనిన, యేనుగు తనంతటతాను నశించిన చందముగా, శిష్యుడు తనను జేరినచో అహంకారవృత్తి తనకుతానే నశింపుచున్నది.

కలదోచిన శరీరాలు తన నిద్రమేల్కొంటే యేలాగో ఆలాగే। మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదు యని నిశ్చయమగును.

ఈ ఉత్త బట్టబయలే సత్యం యని స్థిరత్వం గలుగును. ఇదే నిజం.

గద్య:

**ఇతి అచలగురు శ్రీశివరామ దీక్షిత ప్రభావే వేదాంత విచారణే**
**పూర్వభాగే స్వప్న దృష్టాంత ద్రాష్టాంత శంకానివృత్తి దశమ ప్రకరణం సమాప్తం**





# 11. సకల మత నిరసన ప్రకరణము

## 1. యెరుక యనెటి కలలో జరిగిన తతంగము

1) **వైష్ణవుడు వచ్చినాడు :** దేవుడు తిలకము గలవాడు, శంఖుచక్రములు గలవాడు, పీతాంబరము ధరించినవాడు, తులసిమాలికలు గలవాడు. బ్రహ్మసురేంద్రవందితుడు, వైకుంఠ నిలయుడు, లీలామానుష విగ్రహుండు, జగద్వ్యాపకుడైన **విష్ణువే దైవము,** అని యీలాగున పలికినాడు.

2) **శైవమతస్థుడు వచ్చినాడు :** జటలు ధరించినవాడు, పులితోలు గప్పుకున్నవాడు, విభూతిచేత అలంకరింపబడిన దేహము గలవాడు. రుద్రాక్ష మాలిక ధరించినవాడు, వేదవందితుడు, సృష్టి స్థితి లయములకు కర్త అయినవాడు జగత్ సాక్షికారకుడైన **శంకరుడు** అని యిలాగున పలికినాడు.

3) **శాక్తేయుడు వచ్చినాడు :** శిరస్సున పుష్పములు ధరించుకున్నటు వంటిది, ముఖమందు రక్తమును తిలకముగా ధరియించినది, మహిషాసురమర్ధని, పరాశక్తి, సృష్టికర్త, లోకమాత, యింతకంటే అమ్మవారుని మించిన వేరే దైవము లేదు, అని పలికినాడు.

4) **మహమ్మదీయుడు వచ్చినాడు :** దేవుడు వున్నాడు, అతని పేరు **అల్లా,** అతనినే నమ్మవలయును, యితరము నమ్మకూడదు, మహమ్మదు మతోద్ధారకుడు, అదిపురుషుడు, **ఖురాన్** అను వేదమును నమ్మవలెను. కల్మా అనుమంత్రమును నమ్మి అయిదుపూటలు నమాజు చేయవలెను. అబద్ధము, చోరత్వము, వ్యభిచరించుట, మత్తుపదార్థ స్వీకారము కూడదని అన్నాడు. పీరు, పైగంబరు, వలీ, అనువారిని గౌరవించవలె అన్యోన్యభావము గలిగి వుండవలె **అల్లాయే దైవము** అని అన్నాడు.

5) **క్రైస్తవుడు వచ్చినాడు :** దేవుడు వున్నాడు, అతనినే నమ్మి ప్రార్థించవలె యేసుక్రీస్తు మతోద్ధారకుడు, **బైబిల్** అను వేదమును నమ్మవలెను, విగ్రహారాధన చేయకూడదు, అన్యోన్యభావము గలిగి వుండవలెను **యేసుప్రభువే దైవము** అని అన్నాడు.

6) **బౌద్ధుడు వచ్చినాడు :** దేవుడు వున్నాడేమో చూడలేదు. సర్వప్రపంచము స్వాభావికము, బుద్ధియే ప్రదానము, అహింసయే పరమధర్మము, పరోపకారబుద్ధి గలిగి వుండవలెను అన్యోన్యభావము గలిగివుండవలెను అన్నింటిని గౌరవమిచ్చు **బుద్ధిగలవాడే దైవము** అని అన్నాడు.

7) **నైయాయికుడు వచ్చినాడు :** సృష్టికర్త బ్రహ్మ, స్థితికి కర్త విష్ణువు, లయకర్త శివుడు, ప్రపంచము త్రిమూర్త్యాత్మకమై యున్నది, యింతకంటె నితరములేదు, **త్రిమూర్తులే దైవము** అని పలికినాడు.

8) **మీమాంసకుడు వచ్చినాడు :** యాగాదుల కధిపతి దేవేంద్రుడు. దేవతలు, సూర్యుడు మొదలైన నవగ్రహములు ప్రపంచానికి అధిపతులు, కర్మ జనులకు దైవస్వరూపమైయున్నదని **సుకర్మయే దైవము** అని పలికినాడు.

9) **వేదాంతి వచ్చినాడు :** సమస్త భోగములు నిరర్థకములు, సకల ప్రపంచము నీటి బుగ్గలవలె నిత్యముగాదు, గనుక సన్యసించి దండ కమండలములు ధరించుకుని విరక్తిచేత నుండుట వుచితము, **పరమాత్మ జ్ఞానానంద స్వరూపుడు,** నిర్మలుడు, నిర్వికారుడు, నిత్యుడు, నిర్గుణుడు, నిశ్చలుడు, నిరాకారుడు, నిష్కాముడు, నిరీహ్యుడు, నిష్కళంకుడు, నిష్కపటుడు, నిష్క్రియుడు, నిష్కల్మషుడు, నిష్కలుడు **పరమాత్మను మించిన దైవము లేదు,** అని పలికినాడు.

10) **సాంఖ్య మతస్థుడు వచ్చినాడు :** శరీరము, చీము, నెత్తురు, యెముకలు, కండలు, ప్రేవులు, మలము, మూత్రము, పురుగులు, నరములు, మొదలయిన హేయశరీరము, దీనియందు, ఆశవదిలి మహత్తరమయిన **పరమాత్మను** నమ్మి ప్రవర్తించవలెనని పలికినాడు.

11) **పౌరాణికుడు వచ్చినాడు :** దుష్ట నిగ్రహ శిష్ట సంరక్షకుడు, రాక్షసాంతకుడు, భోగిశయనుడు, సకల జగదధిపతి అయిన **శ్రీమన్నారాయణ మూర్తి** తప్ప వేరే యితరములేదు, అని పలికినాడు.

12) **జ్యోతిష్కుడు వచ్చినాడు :** లోకమందు భూత భవిష్యద్వర్తమానముల గుర్తెరిగిన వాడు, దూరదృష్టి గలవాడు, **సూర్యచంద్రాది గ్రహములు** గావున వారికంటె యితరము లేదు అని పలికినాడు.

13) **వైద్యుడు వచ్చినాడు :** సమస్త రోగములు నివారించును, దేహదారుఢ్యము కలగజేసును, గనుకే వస్తు స్వరూపమైన, **భూమికంటె** యితరమైనది లేదు, అని పలికినాడు.

14) **నైయాకరణుడు వచ్చినాడు :** శేషావతారుడైన **శ్రీమన్నారాయణ మూర్తి** తప్ప వేరే దైవము లేదు అని పలికినాడు.

15) **అలంకారికుడు వచ్చినాడు :** 1. శృంగారరసము, 2. హాస్యరసము, 3. అద్భుతరసము,

4.రౌద్రరసము, 5.వీరరసం, 6.కరుణరసం, 7.భయానక రసం, 8.బీభత్స రసం, 9.శాంతరసం యీ మొదలైన రసములతో, జగత్తు కూడుకొని యున్నది గనుక, **అలంకారమే దేవస్వరూపమని** పలికినాడు.

## 2. నాస్తికునికి మీమాంసకునికి సంవాదము

**నాస్తికుడు :** దైవము కలదని, జన్మాంతర సంప్రాప్తమని యాగాదులవలన స్వర్గాది భోగములని పలుకుట విచారించగా, అప్రత్యక్షము, నిజముకాదని పలికినాడు, యజ్ఞమందు పశువును జంపుట హింస గనుక **హింసాకార్యములకు మోక్షము** లేదని అన్నాడు.

**పూర్వ మీమాంసకుడు :** యాగమందు పశువును జంపుట వలన, స్వర్గమునందుండే దేవతలు, పరివారములు తృప్తినిపొంది, యాగము చేసినవారి కోరికెను తీరుస్తూవున్నారు, అంధువలన యజ్ఞమందు పశువును జంపుట హింసగాదు, అందువలన **యజ్ఞమే శ్రేష్టమని** అన్నాడు.

**నాస్తికుడు :** స్వర్గమెక్కడ, దేవతలుయెక్కడ, కులమెక్కడ, జన్మాంతరము యెక్కడ, అన్నీ అబద్ధమని పలికినాడు.

**ఉత్తర మీమాంసకుడు :** వేదశాస్త్ర పురాణముల యందు ప్రసిద్ధముగా యజ్ఞము చేయమని చెప్పబడి యున్నది దానిని యేలానిందింపుచున్నావు.

**నాస్తికుడు :** వేదశాస్త్ర పురాణాదులు కల్పనలేకాని నిజము కాదని పలికినాడు.

**పూర్వ మీమాంసకుడు :** జన్మాంతరములు అబద్ధమయితే పురుషుడు, సుఖదుఃఖములు భాగ్యములు యేతీరున అనుభవింపుచున్నాడు?

**నాస్తికుడు :** కర్మ యెటువంటిది, యేలాగున దృష్టమగుచున్నది. జన్మాంతరములు వున్నట్టు ప్రమాణము లేదు, శరీరములు ప్రవాహమువలె వాటికవియే వచ్చుచున్నవి పోవుచున్నవి, సకలము భ్రమతప్ప యేమీలేదు.

**ఉత్తర మీమాంసకుడు :** వేదాంతముగా పలుకుచున్నాడు. "బ్రహ్మసత్యము జగన్మిధ్య" అని పలుకుచున్నాడు.

**నాస్తికుడు :** పరమాత్మ యెటువంటిది జగత్తు యేలాగున అబద్ధము అని అడిగెను.

**వేదాంతి :** పరమాత్మ క్రియాహీనము, అనాకారము, నిర్గుణము ఆనందస్వరూపము అవాఙ్మానస గోచరము.

**నాస్తికుడు :** జగత్తు అబద్ధమాయెను, పరమాత్మవుండి నిరర్ధకమే, లేక నిరర్ధకమే ఆయెను, కాదా, ఆ పరమాత్మ క్రియాహీనుడాయెను, అనాకారుడాయెను, నిర్గుణుడాయెను, అందువల్ల పరమాత్మ లేకనేపోయెను, ప్రపంచము అంతకుముందే లేకపోయెను, అందువల్ల యేమీ లేదుకదా, యిక ఆలోచన యెందుకు అని అడిగెను.

**తార్కికుడు (తాత్వికుడు) :** పరమాత్మ స్వతంత్రుడు యేలాగంటే అలాగే కాగలడు గనుక పరమాత్మ యెప్పుడు కలవాడే, ప్రపంచము గలదే, గనుక ఒకటి అబద్ధము కాదు.

**నాస్తికుడు :** వర్షప్రదమయినట్టి ప్రళయ వాయువు గొట్టినట్టు దృశ్యము కనుపడును, స్వర్గములేదు, జన్మములేదు, నరకములేదు, ధర్మములేదు అధర్మము లేదు, కర్తలేడు, భర్తలేడు, హర్తలేడు, సమస్తము అబద్ధము, పాపపుణ్యములు లేవు, స్వదార పరదార దోషములున్నూ లేవు హింస అహింసలులేవు గావున యదేచ్ఛగా విహరించవలయు, అని నాస్తికుడు అయిన చార్వాకుడు పలికెను.

**తార్కికుడు :** పాపపుణ్యములు లేకపోతే విధవ మనుష్యులకు వివాహము చేయవచ్చునుగదా.

**నాస్తికుడు :** చెట్టుకు గాలికొట్టి ఆకులు రాలితే, రాలిన ఆకు తిరిగి యిగురు పెట్టినదా.

**తార్కికుడు :** శాస్త్రములు ప్రతిపాదిస్తూవున్నవి. అవి అబద్ధమనడానికి సూర్యచంద్ర గ్రహణములు నిజమగుచుండగా అబద్ధమని చెప్పరాదు అని అన్నాడు.

**నాస్తికుడు :** భగవంతుడనే పేరుతప్ప, ప్రత్యక్షము యేమీలేదు అని అన్నాడు.

**తార్కికుడు :** భగవంతుడు ఉండుటచేతనే జగత్తుకలిగినది, లేకపోతే జగత్తు యేలాగున కలిగెను, కారణములేని కార్యముగలదా అని తార్కికుడు అన్నాడు.

**నాస్తికుడు :** ప్రపంచము యెన్నటికి యీలాగునే వున్నది. గానీ ఒకప్పుడు పుట్టనూలేదు గిట్టనూలేదు.

**తార్కికుడు :** తండ్రిలేని కొమాళ్లుగలుగుదురా, కుమ్మరివాడు లేని కుండలు యేర్పడునా, పొగ వున్నప్పుడు అగ్ని వుండదా, కనుక పరమాత్మ గలడు అన్నాడు.

**అచల గురువు :** 1. యిలాగే సకలమతాలవారు వూరికే వాదింపుచున్నారు. ఒకరిమాట ఒకరికి గిట్టదు, ఒకరుచెప్పితే ఒకరు వినరు, ఒకరి యుక్తికంటె వొకరియుక్తి అధికముగానే వున్నది, యుక్తులతో యేమి కారణము, యుక్తి లేని యుక్తిగలగవలె, సాధనలేని సంగతి తెలియవలె,

2. మతాలకేమి యెవరి మతము వారిదే, యెవరి మాటవారిదే, యెవరికి తోచినట్టు వారు చెప్పుతారు, యెందుకు యిన్ని అగచాట్లు, యెవరివల్లను యేమీ తెలియదు, గురువు కావలె, గురువు మంచివాడు కావలె,

3. దేహము యెవరివల్ల కలిగెను, దేహమునకు ఆధారంయేమి, దేహము వున్నదోలేదో, వుంటే యెన్నటికీ వున్నది, లేకుంటె మొదట లేనేలేదు, మధ్య లేకపోయినదన్న మాట కాదు, దేహము నిత్యమా, నిత్యమైతే నిత్యమే, నిత్యమని యెవ్వరు అనరు,

4. ఒక దేహము మాత్రము వున్నదని అంటారు, ఆ దేహము యేలాగున నిత్యమో, అది నిత్యమైతే యిది నిత్యముకాదు? మూలం లేదని, చెప్పేవారు యెవరు, మూలంలేదంటే నమ్మినవారు యెవరు, యెవరునమ్మినారో వారినే నమ్మవలె, వారిమాటనే వినవలె, వారితో హితమే చెయ్యవలె, యివ్వనక్కరలేదు, పుచ్చుకోనక్కర లేదు, అన్నిటికీ గురువే ముఖ్యము.

ఆ గురువు పరమ గురువే, ఆ గురువు మహాశక్తిమంతుడు, అతను కలలో అందరికి స్వరూపము చేతను వచ్చి అగుపరుస్తాడు, జాగ్రత్తలో నలుగురివలెనే మనుష్య రూపమయి వున్నాడు,

5. పరిపూర్ణమెరిగిన వాడు, పరిపూర్ణము తలచినచోట వున్నది, తలవనిచోట కూడా వున్నది, తలచేది, తలవనిది మూలం లేని గుర్తెరిగే శరీరం. దీనికే చేటు, యిది నిలచితే అన్ని కొనసాగును, గురూపదేశము యేలాగు, తానువుండి తాను పరిపూర్ణము కావలెనంటే కాబోదు, తాను లేక పోవలె. గురూపదేశమువల్ల తనువుతాను కూడా లేకపోవలెను.

6. కొంతమంది తనువులేదు తాను వున్నాడని ఉపదేశము చేస్తారు. అది చాలదు, తాననేముణక తాలేకపోయ్యేవాడైనా తానే తనకు బంధం తాననే బంధం తొలగవలె, తాననేముణక లేకపోయ్యేవాడైనా తానుంటాననే తలుస్తాడు.

7. ప్రవాహము మీద పరున్నట్టే, జలమందు ఉప్పును దాచుకున్నట్టే, తాననేవాడు దేవుడట, యెవరైతేనేమి, తాను దేవుడయితేనేమి జీవుడయితేనేమి, మనిషి అయితేనేమి, కుక్క అయితేనేమి? ఏలాగున అనుకుంటే నేమి కష్టసుఖాలు దప్పునా?

8. దేవుడైతే, శ్రీరాములు దేవుడు కాడా బాధలు దప్పెనా,

9. కృష్ణస్వామి దేవుడు కాడా, యెరుకలవాని చేత చావలేదా, యెవరైతేనేమి, యేలాగున

అయితేనేమి, అనేక జన్మాదులు గలవు అంటారు.

10. ఆ జన్మాలు లేకపోవలె, దేనికి జన్మాలు అంటే దేహానికే జన్మలు, చస్తే దేహము పోలేదా అని అందురేమో, కుబుసము వూడితే పాము చచ్చినదా? విత్తువుంటే చెట్టుకానేరదా? చెట్టువుంటే విత్తుకానేరదా? చెట్టుపోతే విత్తుపోదు. విత్తుపోతే చెట్టుపోవును, విత్తుకు చెట్టుకు బేధమా, రెండు ఒకటేను, గురుసూచన వలన రెండు లేకపోవును.

11. యీ శరీరము యేలాంటిదనగా, అరటి చెట్టువంటిది, అరటి చెట్టుకు అన్నీ పొరలే, వకపొరపోతె అన్ని పొరలు పోవును, ఆ పొరపోయినట్టే ఉంటుంది. యెన్ని పొరలు పోతేనేమి, యే పొర పోయినా ఆ పొర తిరిగి ఉండనే ఉన్నది.

దానికి అనేక పిలకలు పుట్టుతావి. ఆ పిలకలన్ని వనమైనది. ఆ వనములో మొదట చెట్టు యేదో తరువాతది యేదో, యేలాగు కనపడుతుంది, అన్ని మొదటిచెట్లే, అన్ని చివరి చెట్లే అందుకు ఒక దృష్టాంతము.

ఒక వనమందున వకటి అరటిచెట్టు, దానికి కొమ్మలనేకాలు, అనేక సంవత్సరములనుండి ఉన్నది, అనేక సార్లు చెట్టె పొరలన్ని విడిచిపోయెను, గుట్టలు గుట్టలుగా యేర్పడెను, యెన్ని పొరలు విడిపోయిన, యెన్ని గుట్టలు పడిన చెట్టు అలాగే ఉన్నది, చెట్టు విస్తరించి దొడ్డెల్లా చేవుకొనెను, చెట్టు ఆకులు కొట్టిరి, నడిమికి కొట్టిరి, కొట్టి కొన్ని రోజులకు యథాప్రకారముగానే వుంటే, నేల త్రవ్వి బొత్తిగా తీసివేసిరి,

12. అలాగే శరీరము వకటేకాని రెండులేవు, మూడులేవు, అచలము వకటి, శరీరము వకటి, శరీరం వున్నంత సేపు చలనము గలదు, శరీరము లేకపోతే అచలమే, శరీరము ఉన్నాకూడా అచలమే యున్నది, అది చెప్పవలెనా తెలిసేవున్నది.

13. ఒక శరీరమునకు అనేక తొడుపులు ఊడిపోవుటే మరణమని అంటారు, అది మరణముకాదు, కూకుడు వేళ్లతో పోవలే శరీరము నిత్యమని నమ్ముతారు వారి మాటలు మాత్రము అనిత్యములని చెప్పవలెను.

14. అహమును యేల నమ్మవలె. మూలం లేనిది ఈ గుర్తెరిగే శరీరం. అదియేమి, బంగారమా, వెండియా, యినుమా, యిత్తడా, సీసమా? బంగారమైతే దాచుకొన వచ్చును, వెండి అయితే సొమ్ములు అయిన చేయించుకోవచ్చును. యిది యేది కాదు. విచారిస్తే యేమి లేదు.

15. యెరుక నీటిబుగ్గ వంటిది, వడగండ్లను దాచుకుంటే నిలుచునా, శరీరము వట్టిదను కోరాదా, దాన్ని గట్టి చేయరాదు, గురుసూచనైతే మూలము లేని ఈగుర్తెరిగే శరీరము తెలిస్తే జనన మరణములు లేనేలేవు గదా!

16. నిదురబోయి తిరిగి లేచినట్లు, మూర్ఛపోయి, ఆ మూర్ఛ తెలుసుకొన్నట్లు, యెందుకు యింతభ్రమ పడుతారు యీ దేహము రక్త శుక్లములు గావా? రక్తశుక్లములచూచి మురియవలెనా, బురదగుంటలో యీదులాడవలెనా, సముద్రములో బడి చావవలెనా, యింత వెర్రి యెందుకు?

17. దేహము పోతే విముక్తిలేదు, అంకురమును పోగొట్టువలెను, అంకురము నేటిదికాదు, అది యేలాగున వచ్చినదో తెలియదు, అది యేలాగున పోవుచున్నదంటే, ఆవరణము లేని గురువు కావలె, ఆవరణము లేని గురువైతే పోతుంది,

18. ఆవరణము లేని గురువును కనుక్కొనేదే దుర్లభము, అతను దొరికితే భ్రమ పోతున్నది. లేకపోతే, పొట్టు దంచుకున్నట్లు వుంటున్నది, ఆకాశము గుద్దినట్లు వుంటున్నది, నీళ్లమూట కట్టుకున్నట్టు వుంటున్నది, నలుపుకాదు, తెలుపుకాదు, యెరుపుకాదు, పసుపు వర్ణముకాదు.

19. మా మతము అద్వైత మతము కాదు, ద్వైతము కాదు, విశిష్టాద్వైతము కాదు, చలము కాదు, అచలము కాదు, యేదీ కాదు, సులభ సూక్ష్మము, యిది తెలిస్తే వారులేరు, బ్రహ్మ కాదు, విష్ణు కాదు, శివుడు కాదు, యెవరూ గాదు, యిది వకరికి చెప్పరాదు,

20. దీనికర్హులు వేరైయున్నారు, వారు యెవరంటే చెప్పుచున్నాను. "చెప్పినామని చింతచేయబోకుము.

## 3. అచలబోధకు అర్హులు

1. దీర్ఘకాలము శాంతుడై, తామసము లేక, గురుసేవ చేసేవారు,
2. గురువును తల్లి, దండ్రి, దైవము, చుట్టము, పక్కముగా నమ్మేవారు,
3. గురువుయొక్క రుణము తీర్చుకొనేవారు.
4. గురువు మీదనే యెల్లప్పుడు దృష్టిగలవారు,
5. గురువు చెప్పిన సంగతి మరువకుండా వుండేవారు,
6. గురువును యెవరైన దూషణ చేస్తే విని సహించనివారు,

7. గురువాక్యముల యందు తన ప్రాణమును వినియోగ పరచువారు,
8. గురువు నామమును మంత్రముగా యెల్లప్పుడు దలచువారు,
9. గురువును నరునిగా భావించక దైవముగా దలచువారు
10. పదిరెండు సంవత్సరములు యెడతెగక గురుసేవ చేయువారు,
11. గురువుకు ఒకానొక సమయమందు, తామసము గలిగెనా ఓర్చుకొనువారు,
12. గురు భార్యను తల్లిగా భావించువారు,
13. గురువు కనుపడ్డచోట యెంతమంది వున్ననూ సందేహపడక నమస్కరించువారు, గురూపదేశానికి కర్హులు,
14. మేము అలాగున చేసినాము, మాకు అందువల్లనే జననమరణ భ్రాంతిరహితమైనది."
15. "మేము ముందు పుట్టతామనే చింతలేదు, చస్తామనేచింతలేదు, వున్నామనే దృష్టిలేదు, కన్నామనే ఆశలేదు, చేసుకున్నామనే దాక్షిణ్యములేదు, లేకపోయెననే విచారములేదు, మాభావము తెలిసేవారు మావలేనే వుండవలె అంతధైర్యము కలిగి యుండవలెను.
16. చస్తామని యేడిచేవారికి మేము చెప్పము,
17. యేమైనా యిస్తామనేవారికి మేము చెప్పము,
18. గుర్రాలు యిచ్చినా చెప్పము, యెనుగులు యిచ్చినా చెప్పము,
19. ధనము యిచ్చినా చెప్పము, ధాన్యము యిచ్చినా చెప్పము,
20. సేవకావృత్తి చేయించుకోవలెననే మాకు ఆశలేదు,
21. వినుమని బుజ్జగించము వినలేక పోయినారని కోపగించము,
22. మాకేమికావలశినది, అంటే వారికి తెలిసేమట్టుకు వారే వుంటే మంచిది.
23. మా వద్దకు వచ్చిన వారు చెప్పినమాటలు వినేది తోచిన మాటలు అడిగేది, భ్రాంతి రహితం చేసుకొని పోయేది ఇదే మా మార్గం.
24. మా వద్దకు వచ్చిన వారు యింటిమీద ఆశ వుంటే యింటివద్దనే వుండమనేదే మా మాట.
25. బోధ మీద ఆశవుంటే తెలిసినంత పరియంతం దీనివద్దనే వుండేది,
26. తెలుసుకొనే సామర్థ్యం కలిగితే వారికి మేము మరుగు పెట్టనేపెట్టము,
27. మేము పెట్టవలెనా, వారు తెలియ లేకపోతే అదే మరుగై వున్నది.

## 4. మేము మాకు జరిగిన విషయం యదార్థముగా చెప్పుతాము.

1. తెలివి కలిగి తెలిసితే బట్టబయలే వున్నది, ఆ బట్టబయలుకు యెరుకమరుపులు యెన్నడూలేవు, మాకేమిభయము, యెంతవాడైతేనేమి? మాకు ఇతరులతో పనిలేదు.

2. బ్రహ్మగాని, విష్ణువుగాని, శివుడుగాని, మాకుయెవరు లక్ష్యము లేదు, మేము మేము అనడము మాకు స్వభావమే, అయిన యెరుక వుండి మేము అనడములేదు,

3. నిదురలో యెవరితోనో యేమో ముచ్చట్లు కలవరించినట్లు, యింతేను, యెరుకచేత నేనే బ్రహ్మనని ఇతరుల వలె మేము అనలేదు, నేనే శివుడను, అని అనలేదు,

నేనే విష్ణువని అనలేదు, నేనే శక్తినని అనలేదు, నేనే బ్రాహ్మణుడను అని అనలేదు, నేనే రాజును అని అనలేదు, నేను వైశ్యుడనని అనలేదు, నేను శూద్రుడను అని అనలేదు, నేను చండాలుడను అని అనలేదు, నేను తురకను అని అనలేదు; మాకు అలాంటిదేమి లేనేలేదు, కలలో కలవరిస్తూ వున్నాము. గురువు వల్ల ఆ కల మేల్కొన్నాము.

4. మాకు యీ దేహము వుండేమట్టుకు కలవరింతలే, మా కలవరింత తీర్చుకున్నాము, తీర్చుకొన్నను కొంచెము వున్నది, తలప్రాణము తోకను వున్నట్లు, తలగొట్టిన మనిషి నడిచినట్లు, కల్లుద్రాగిన మనిషి చరించినట్లు, నిదురలో అటుయిటు పొర్లినట్లు, నేను కలలోవున్నాను, విచారిస్తే యేమిలేను,

5. నా మాట యెవరితో చెప్పను, నేను మహా కఠినుడను, నిర్భోగమాటంగా ఉన్నాము, ఒకరి సంగతి నాకేమి కావలెను, యీ వేళకావలశివుంటే. రేపో, యెవరితో మాట్లాడను, యెవరితో పలుకను, యెవరితో విచారించను. యెవరితో యెందుకు, యెందరువున్నా యిప్పుడేరి వారు.

6. బెల్లం వుంటే ఈగలు ముసురుతావి. లేకపోతే యేమి ముసురుతావి. యీ భయములు యెవరికి, నాకులేవు. యెరుకను నమ్మి ఉన్నవారిని జనం చాలా నమ్ముతారు.

7. శంకరాచార్యులకు లేదు, స్వామి జీయర్లకులేదు, నమ్మళ్వారి గారికి లేదు. బసవన్న గారికి లేదు. అహంకారము యెంత మాత్రములేదు. యెవరెవరి అభిప్రాయము వారిదే కాని వారికి వారి సిద్ధాంత అభిమానం పట్టుకున్నది.

8. మేము అభిమానాలు వుంచుకోము. మంచి విద్య యెక్కడ వున్నా సాధించినాము. అందుకే మమ్ములను, అందరు నిందించినారు. అందుకూ, ఒప్పుకున్నాము.

9. మేము చండాలులముకాము. "అహంవృత్తి యెవరికి వున్నదో వారు చండాలులు" యెలాగైతే మాకేమి, మేము యెలాగున్నను మేమే పోతిమి. మాతోకూడ వచ్చేవారు యెవరు, మాతో కూడా వుండేవారు యెవరు. మా సంగతి తెలుసుకునే వారెవరు, తెలుసుకునేవారికి చెప్తుతాము, తెలియని వారికి యేల చెప్పవలె, యేల బలవంతము చెయ్యవలెను.

10. మే మేమైనా భుజాలు కాల్చవచ్చినామా, కుయ్యోమొఱ్ఱో యనగా లింగాలు కట్టవచ్చినామా, కన్నులు ముక్కులు చెవులు మూయవచ్చినామా,

11. నెత్తిమీద చేతులు బెట్టి బాసలుచేయ వచ్చినామా, ముసుకువేసి చెవులు కొరకవచ్చినామా, కాని కార్యములు చేయవచ్చినామా,

12. పదిమందిని గూర్చుకొని మదుమాంసములు అపరాత్రివేళ అనుభవించ వచ్చినామా, మాకు యెందుకయ్యా. మాకు యెవరు యేమిచెప్పినారో వారిమాట మాకు నమ్మకమయినది.

13. మాకు సూటిగా వున్నది, మాకు జన్మరహితమయినది, భ్రమ నివారించినది, యికమేము ఆశపడము. ఆకలిలేనివారికి అన్నము పెట్టితే యేలాగో, అలాగు. ఆకలి కాక అన్నముతింటే అజీర్ణముచేసి తలనొప్పి పుట్టి వాకర్లుబెట్టి ప్రాణముమీదికి వచ్చును.

14, మాకు ఆశలేదు, ఒకరి మాటలు చెవుల్లో దూరవు. ఒకటి చూడ బుద్ధిపుట్టదు, ఒకరి మాటపలుకులలో నుండము. ఒకరికి బద్ధులముకాము, ఒకరిని మేము బద్ధులను చేసుకోము, మాకు యెందుకు?

15. యీ బోధ మార్గం మంచి మార్గమే, మా మార్గము మేము మొదట అవలంభించి యిప్పుడు విడిచినాము. గురువును మరచినాము, దైవమును మరచినాము, తల్లిని మరచినాము. తండ్రిని మరచినాము. ప్రపంచమే మరచినాము. దేహమే మరచినాము.

16. యిక మాగతి నిర్గతి. మాజీవనం బ్రతుకుమా సాటి యెవరూ లేరు, మేము మేము అని పొంగము మేము యేమి చూచుకొని అందుము.

17. ధనము మాకు నిల్వదు. ధాన్యమా నిల్వదు. మేమే నిల్వము. మేము మేమేగాని వకటిలేదు. అహంకారము శరీరములు యెక్కడెక్కడను వున్నవో అక్కడల్లా భ్రమలు వున్నవి. అంతటా అన్నీ అహంకారములైవున్నవి.

18. ఒక అహంకారము రాజు. ఒక అహంకారము బంటు. యీ అహంకారం అనేక రూపాలు. అనేక నామాలు. అనేక విచిత్రాలు. అనేక సామర్థ్యాలు. అనేక యుక్తులు. అనేక నరకాలు. అందురూ అహంకార స్వరూపాలు. ఆ యహంకారమును విడిచితే చాలును అది విడుచుట యేలాగంటే.

## 5. మూలం లేని గుర్తెరిగే శరీరాన్ని యెరిగిన వారు

1. "మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని తెలుసుకోవలెను, యిది తెలిసితే చాలును, యిది షోడశాక్షరి, ఈ షోడశాక్షరి కృష్ణస్వామికి యెరుకే, రుక్మిణీదేవికి యెరుకే, బసవన్నగారికి యెరుకే, సాందీపులవారికి యెరుకే,

2. శంకరాచార్యుల వారికి యెరుకే, శ్రీధరస్వామివారికి యెరుకే, నమ్మాళ్వారికి యెరుకే." యీ యెరుక సత్యముకాదు, యెరుక సత్యమని నమ్మరాదు, యెరుకను సత్యమని నమ్మేవారే అందరు,

3. యెరుకేలేనిదే. సుషుప్తిలో యెరుక వున్నదా, మూర్ఛలో యెరుక వున్నదా, మరుపులో యెరుక వున్నదా, మరణములో యెరుకవున్నదా, లేదు, మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు. యిదే మొదటి ఉపదేశం చేయవలసినది.

## 6. ఉపదేశ సమయంలో విచారణాంశం

"శిష్యుని పద్మాసనం వేసుకొనియెదుట కూర్చోమనేది, శరీరములోనే సమస్త లోకములు వున్నవని అనుకోమనేది,

జీవుడు పరమాత్మ సూక్ష్మదేహము, యీ దేహమే నేను అనుకోమనేది, యీ దేహమే సమస్త లోకములు, సమస్త దేవతలుగా ననుకోమనేది, ఈ దేహము సత్యమా, అసత్యమా అని అడగవలసినది యిది అసత్యమేనని పలుకును కనుక సత్యమేమిటిది అని అడగవలసినది.

యేమిలేదని శిష్యుడు చెప్పుచుండును. యేమీలేకుంటే సత్యమును నిరూపించమని అడిగేది, యేమీ తోచక వూరక మాట్లాడకుండా వుండును.

యేమీ లేదు అన్నమాటే సత్యమా అని అడగవలసినది, అవును యేమీలేదన్నమాటే సత్యమేనని పలికెనా గట్టివాడే, తెలియక వెతుకులాడెనా అతనికి సామ్యములు చెప్పవలెను."

శిష్యు : నిత్యమనగా యెటువంటిది చెప్పవయ్యా! అని అడిగెను.

## 7. ఒకటి ఉంటే రెండవది ఉంటుంది, ఒకటి లేక పోవలెను

గురు : 1. ఓ పిచ్చివాడా! అనిత్యమని వుంటేనే నిత్యమని తోచేది. అనిత్యము లేకపోతే నిత్యమని తోచేది యేవరికి? వెన్నెల వుంటేనే చీకటి వున్నది గాని లేకుంటే యెక్కడిది?

2. అబద్ధము వుంటేనే నిజము కావలెగాని లేకపోతే నిజమెందుకు, మంచి వుంటే చెడ్డది వున్నది, గొడ్రాలు వుంటే బిడ్డతల్లి వున్నది, ముండ వుంటే ముత్తైదు వున్నది.

3. లంజ వుంటే పతివ్రత వున్నది, పాపముంటే పుణ్యమున్నది, ధర్మముంటే అధర్మమున్నది, సుఖము వుంటే దుఃఖమున్నది,

4. జ్ఞానముంటే అజ్ఞానము వున్నది. సుకృతము వుంటే దుష్కృతము వున్నది. దేవుడు వుంటే జీవుడు వున్నాడు,

5. రూపము వుంటే నామము వున్నది, క్షరము వుంటే అక్షరమున్నది, ప్రకృతి వుంటే పురుషుడు వున్నాడు,

6. ఆవు వుంటే దూడ ఉన్నది, తల్లి వుంటే బిడ్డ వున్నది, కార్యము వుంటే కారణము వున్నది.

7. ఒకటి వుంటే రెండువస్తావి. ఒకటి లేకుంటే రెండేలవస్తావి, ఒకమాట పుట్టితే రెండుమాటలు పుట్టుతావి. యిలా తెలుసుకోవలెగాని. వూరికె మాట్లాడితే యేలాగు, యెన్ని దినములు చెప్పినా యేమి లేకపోవును?

8. నిత్యమేమి? అనిత్యమేమి? నీకు సత్యమని చెప్పినవారు యెవరు? నిత్యము వుంటే అనిత్యము వున్నది. ఒకటి వున్నది రెండులేవు అని అనుకోబోకు. రెండులేకపోతావి.

9. యెటువంటివారికి తెలుస్తావి, ఒకటివుంటె రెండు అనరా! ఒకమాటకు బోతే ఒకమాటరాదా.

10. వెంట్రుకలు వుంటే కొప్పువుండదా? యెన్ని కొప్పులయినా పెట్టవచ్చును.

11. మన్ను వుంటె కుండలుగావా. బంగారు వుంటే సొమ్ములుగావా.

12. నూలు వుంటే బట్టలుగావా, చెఱకు వుంటే బెల్లముకాదా.

13. నిత్యము వుంటే అనిత్యముగాదా, అనిత్యము వుంటే నిత్యమగుచున్నది. నిత్యము వుంటే అనిత్యము ఉంటుంది. ఆ మాటలు తలవబోకుము.

## 8. నీవనే యెరుకయే ద్వయదోషము గలది

1. నిత్యమన్నా నీవే. అనిత్యమన్నా నీవే. గుణమన్నా నీవే. నిర్గుణమన్నా నీవే. యెరుకన్నా నీవే, మరుపన్నా నీవే, జీవుడన్నా నీవే, దేవుడన్నా నీవే, క్షరమన్నా నీవే, అక్షరమన్నా నీవే,

2. ప్రకృతిఅన్నా నీవే, పురుషుడన్నా నీవే, లోకమన్నా నీవే, అలోకమన్నా నీవే, యింద్రుడన్నా నీవే, చంద్రుడన్నా నీవే, కార్యమన్నా నీవే, కారణమన్నా నీవే, నీవు గుర్తెరిగే శరీరమై యున్నావు గనుక గురుసూచన వలన నీవు లేనివాడవే. నీవు లేకపోతే సరి.

3. నిత్యము లేదు, అనిత్యము లేదు, గుణము లేదు, నిర్గుణము లేదు, యెరుకా లేదు, మరుపూ లేదు. జీవుడు లేడు, దేవుడు లేడు, క్షరమూ లేదు, అక్షరము లేదు, ప్రకృతి లేదు, పురుషుడు లేవు, లోకము లేదు, అలోకమూ లేదు, యింద్రుడు లేడు, చంద్రుడు లేడు, కార్యమూ లేదు, కారణములేదు,

4. నీవూ లేవు, నేనూ లేను, నేను వుంటే సరి అన్ని వున్నవి నిదురలో చూడలేదా నేనులేను, అప్పుడు యేమివున్నది, యేమీలేదు. అంటే యేమీపోదు. నేను లేకుంటే సరి యేమీలేదుయని అననక్కరలేదు. లేనివాడు భూమిలోనే లేడు, నేను లేనివాడినని యెరిగితె సరిపోవును.

## 9. నేననేది లేనివారు వ్యవహరించే తీరు

1. నేను లేనివాడు దుర్లభము. నేను లేకపోవడం గురువు చేతనే కాని గురువుకంటే యెవరిచేతనూ కాదు. గురువు వుండవలె. గురువు లేనివాడే నేను అనేవాడు. లోకమందున గురువేకాని మరివకరు కారు.

2. నేను లేనివాడు లోకమందున శిష్యుడుగాని మరివకరు కారు, నేనులేని వానితో సమానం యెవరుకారు. నేను లేనివారిని కనేది దుర్లభము.

3. నేనులేనివారు అందరివలెనే వుంటారు.నేను లేనివారు దగ్ధపట న్యాయముగా ఉంటారు.

4. నేను లేనివారు నేతి బీరకాయవలెనే వుంటారు.

5. నేను లేనివారు బెల్లంకొండవలెనే వుంటారు.

6. నేను లేనివారు యేనుగుమ్రింగిన వెలగకాయవలెనే వుంటారు.

7. నేను లేనివారు వేయించిన పేలపు గింజవలనే వుంటారు. నేను లేనివారు దేహము తెలియకనే వుంటారు.

8. నేను లేనివారు నిదురకుముందు కూరుకపాట్లువలెనే వుంటారు.

9. నేనులేనివారు మూర్ఛపోయినవారి వలనే వుంటారు.

10. నేనులేనివారు మందమతివారివలెనే వుంటారు.

11. నేనులేనివారు బాలునివలెనే వుంటారు. గావున నేనులేనివారు అగుట దుర్లభము. నేనులేనివారని తెలుసుకోవడము దుర్లభము.

## 10. గుణానికి తగిన చూపు వుంటుంది.

1. అంతంత మాత్రమువారు తెలుసుకొనజాలరు. అంతవారు తెలుసుకోగలరు. యెంతవారికి యెరుకలేదు. యెరుగని వారు యెంతవారు కారు.

2. యెంతవారిని అంతవారు యెరుగుదురు. పాములజాడా పాములకు యెరుక అయినట్టు. దొంగల జాడా దొంగలకు యెరుకైనట్టు. జారులజాడా జారులకు యెరుక అయినట్టు, అయ్యలజాడా అయ్యలకు యెరుక, అమ్మలజాడా అమ్మలకే యెరుక.

## 11. కర్మకు కర్మనే ఫలము

**శిష్య :** అయ్యా! దేహము లోపలనే కనుక్కోవలెనని అంటారు? దేహములోనేగాని బయట లేదా,

**గురు :** అంతటా వుంటే అందరూ కనక్కోరాదా? అది అందరికి తెలియదు.

ఓడ నడిపేవాడు వుండవలె, ఒడుగు చేసేవాడు ఒకడు వుండవలె, చదువు చెప్పేవాడు వుండవలె, ఒడుగు చేసేబ్రాహ్మణుడు అయినాడట,

**శి॥** అందుకు ముందు శూద్రుడు అయినాడా. అప్పుడు బ్రాహ్మణుడే కాడా,

**గు॥** 1. అది యెవరికి తెలియదు? అలాగే గురువులేనివాడు తెలియజాలడు, గురువు కలిగిన తరువాత గురుపుత్రుడు అవుతాడు. తరువాత గురువు శిష్యులు ఇద్దరు లేరు,

2. మొదటనే కష్టము, మొదట చదువుకొనేవారు కష్టపడతారు. అంతకష్టము గురువు పడుతాడు,

3. యెందుచేనంటే, వానితో కూడా గురువు గుంట ఓనమాలు వ్రాయవలెను, కర్మ చేసేవాడు వానికి కర్మమే

4. చాకలివాడు కర్మకుడే, మంగలివాడు కర్మకుడే, కుమ్మరివాడు కర్మకుడే.

శి॥ చాకలివాడు యెప్పుడు నీళ్లల్లోనే వుంటాడు,

5. కుమ్మరివాడు యెప్పుడు కొత్తకుండలే చేస్తాడు.

6. మంగలివాడు యెప్పుడూ శిరోముండనం చేస్తాడు. వారికి నరకమేకాదా?

గు॥ కర్మకాలితే మనిషి శుచిర్భూతుడుగా వుంటాడు. మనసు శుచిర్భూత మవుతుంది? మలిన వస్త్రములు ఒకడు కట్టుకొని మాట్లాడుతాడు. మంచి వస్త్రములు ఒకడు కట్టుకొని మాట్లాడుతాడు. వస్త్రములు మాట్లాడినవా? మనుష్యులు మాట్లాడినారా? కర్మ అలాంటిదే. కర్మకు కర్మే ఫలము. ఆ కర్మమునకు యే ఫలము లేదు.

## 12. మనస్సు లేకుంటే ఆనందం లేదు

1. కొంతమంది వైకుంఠమని అంటారు. ఆ వైకుంఠమందు చేరితే ఆనందమని అంటారు. ఆనందము వుంటే దుఃఖము లేదా, శరీరము వున్నది గదా, మనస్సు వున్నదికదా, ఆనందము వున్నదిగదా, మనస్సు లేకపోతే ఆనందము లేదుగదా,

2. ఒక్క ఆనందము వుంటే దుఃఖం లేదు. దుఃఖము లేకుంటేగదా ఆనందం రావాలి, సుఖదుఃఖము వుండేది యెరుకకే కదా ! గనుక యెరుక ఉంటే ఆనందము, ఆనందము కాదు. యెరుక లేక పోవడమే ఆనందము.

3. ఆనందానికి అనుభవములేదు. అనుభవము యేమీ నిదురలో వున్నట్టు వుంటున్నది, నిదురలోని ఆనందమేమి, ఆనందము లేక పోవడమేమి,

4. మాకు యే ఆనందము లేదు. మేము ఆనంద మనుష్యులము కాము. మేము వుండవలెననే యిచ్ఛలేదు. మేము లేపోవడమేనిజము.

5. మేమే మేము, మాకు యేమి ఆనందము. మమ్మును నిలిపే వారు యెవరు. మమ్మును నిలిపితే శక్తిమంతులే. మాటలు మాత్రము అంటారు. మాకు మాటలు నమ్మకముకాదు.

## 13. ముగ్గురు మూర్తులు ఉత్పత్తి, స్థితి లయాలు చేసినట్లు కనపడిందా?

1. ఉత్పత్తి చేస్తానని బ్రహ్మ యింటింటికి తిరుగుచున్నాడా? ప్రతిమనిషిని కలవమని తంటాలు పెట్టుచున్నాడా? అందరికి గర్భదానము చేయుచున్నాడా?

2. విష్ణువు అందరిని పోషిస్తానని అందరికి మొహరీలు యిస్తున్నాడా? తవ్వెడు మానెడు ధాన్యం అప్పు అయిన యిస్తూవున్నాడా? యెట్లా పోషిస్తూ వున్నాడు?

3. శివుడు అందరియిండ్లకు తిరిగి లయం చేస్తానని గొంతులు పిసికి చంపుతున్నాడా? కాదు గదా! ఎందుకు ఇంత ఆగచాట్లు.

4. ఉన్నది ఉన్నట్లు చెప్పవలెనంటే ఉత్త బట్టబయలే సత్యమని చెప్పవలెను, లేనిది లేనట్లు చెప్పవలె నంటే మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదని చెప్పవలెను. కల దోచిన శరీరాలు మేలుకొంటే యేమి లేవో ఆలాగే నీతోపాటు జగము లేదని తెలియవలెను.

గద్య:

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే, వేదాంత విచారణే, పూర్వభాగే సకల మత నిరసన అష్టమ ప్రకరణం సమాప్తం









# 12. అద్వైత శంకా నిరసన ప్రకరణము

శ్లో॥ త్యజ ధర్మ మధర్మంచ ఉభే సత్యానృతే త్యజః ।
ఉభే సత్యానృతే త్యక్త్వా యేన త్యజసి తత్త్యజః ॥

తా॥ ఇది ధర్మమని, ఇది అధర్మమని, ఇది సత్యమని, ఇది అసత్యమని యే జ్ఞానము చేత రెంటి విషయములను తెలుసు కుంటున్నావో వాటిని వదిలిపెట్టుము, వాటిని తెలుసుకున్న జ్ఞానాన్ని కూడా వదిలి వేసినచో యేమియు లేకపోవునని భావము.

1. అనాద్యవిద్యా నిమగ్నంబై జననమరణ క్లేశబహుళంబై యుండు నీ లోకం ఎండమావులయందు జలభ్రాంతివలెను కనపడుచున్నది.

2. రజ్జువునందు సర్పభ్రాంతివలెను తోచుచున్నది.

3. శుక్తియందు రజిత భ్రాంతిని, మిథ్యాభూతమై పరిణమించుచున్నది.

4. ఇట్టి అవిద్య నిష్కళంకమై, నిరంజనమై, సచ్చిదానందరూపమైన ఈ శుద్ధబ్రహ్మమును దెలియక ఇలాగున ప్రవర్తిస్తుంది.

5. ఆ బ్రహ్మ స్వరూపమును దెలియుటకు, ముఖ్యసాధనములైన, వేదశాస్త్రపురాణాదులు, బహుకష్టసాధ్యములను, చిరకాలాపేక్షములునుగా నున్నవి. కాబట్టి ప్రాచీనులు,

6. సూత్రభాష్యము, అద్వైత సిద్ధి చంద్రికా, వైజయంతీ, మొదలగు అనేక గ్రంథములు చేసియున్నారు గాని, అవియు శాస్త్ర జ్ఞానములేని వారలకు, దుస్సాధ్యములుగా నున్నవి.

7. కనుక వానియందలి విషయ సంగ్రహములు సంగ్రహించి, పామరులకు సహితముపయో గించునట్లు, అద్వైతానుభూతి గలవారిచే, అద్వైత ముక్తాకలాపమను, నీ గ్రంథము చేయబడెను.

8. సకల జనులకు తుచ్ఛసుఖార్థమై, సమస్త ప్రయోజనముల యందు ప్రవర్తించుచున్నారు కాని, నిత్యసుఖప్రాప్తి సాధనగలిగి ప్రవర్తించుచున్నారని యేమి చెప్పవలెను?

9. అధికారులైనవారికి అనాయాసముగా, నిత్యనిరుపద్రవబ్రహ్మానంద సుఖప్రాప్తికి సాధనమైన, వివేకచంద్రిక యనుగ్రంథము జేయబడినది.

శిష్యుడు:- అదియెట్లనగా, సాధనసంపన్నుడైన విమలచిత్తుడను శిష్యుడు ప్రబోధచంద్రుడను గురువునకు రహస్యమందు భక్తియుక్తుండై, నమస్కరించి, అతిభక్తితో స్వామీ! సంసారసముద్రమును యే విధముగా దాటవచ్చునని అడుగగా?

**గురువు:-** ఓయీ? నీవు పుణ్యాత్ముడవు? యెటువంటి ఫలాసక్తిలేక నిమిత్తకర్మములు పరబ్రహ్మార్పణముగా, బుద్ధితోచేసిన వారికిగాని, ఈ బ్రహ్మానుభవాసక్తిగలుగదు. గాన నీకు దోచిన సంశయములనడుగు, మనగా.

**శిష్యుడు:-** అయ్యా, బ్రహ్మమనగా యెటువంటిది?

**గురువు:-** 1. వాక్కుచేత చెప్ప శక్యముగాక మనసుచే దెలియబడక ఉత్పత్తి స్థితిలయములులేక అఖండమై లోపట బయట యనునది లేక, యేదిక్కులేక, విషయానుభవములేని సుఖస్వరూపమైన తెలివి మాత్రమేయై యుండి

2. దేశకాలములచేత కొంచెముగా జేయబడక, సదాస్వయం ప్రకాశమానమై, జాగ్రత స్వప్న సుషుప్తులకు సాక్షియై యుండి

3. అబాధ్యమై, సమస్త ప్రపంచ నివృత్తిదశకు సాక్షియై, చరాచర ప్రపంచమందు సద్రూపమై నిండియున్న వస్తువు బ్రహ్మము అనబడును.

**శిష్యుడు:-** అయ్యా, సంసారమనగా నెటువంటిది?

**గురువు:-** 1. ఓయీ! అఖండ నిజానందస్వరూపము నెరుగక మాయా సంబంధమైన దేహేంద్రియాది ప్రపంచమే తానని కామక్రోధాది గుణములు గలవాడై అస్థిరమైన దేహమునకు స్థిరత్వము గోరుచుండును.

2. ఈ సంసారము వాయువుచేత చలించెడి తరంగములతో గూడికొనిన సముద్రమువలె సంక్షోభించుచున్నది. అశాశ్వితమైన దారాపుత్రధన పశ్వాదులయందు అభిమానముచేత బద్ధుడై సదసద్వివేకము లేకయుండు పురుషుని యందున్న అహంకారావస్థయే సంసారము.

**శి॥** అయ్యా, యీ సంసారము ఆత్మయందు యెందువలన పుట్టుచున్నది ?

**గురు॥** అవివేకమువలన పుట్టుచున్నది. అవివేకము వివేకముచేత పోగోట్టబడునది.

**శి॥** అయ్యా వివేకమనగా నెటువంటిది?

**గురు॥** వివేకమనగా అంతఃకరణాది యీ ప్రపంచమునకు సాక్షియై వేరుగా నాత్మానుభవము గలుగుట. ఈ వివేకమునే మంద బుద్ధులైనవారికి గురువు అనుగ్రహముచేత ఇలాగు చెప్పబడినది.

1. దృగ్దృశ్య వివేకమనియు, 2. పంచకోశ వివేకమనియు, 3. పంచభూత వివేకమనియు 4. నామరూప వివేకమియు, 5. తత్వవివేకమనియు నైదు ప్రకారములుగా బ్రహ్మవేత్తలైన మహాత్ములు పురాణముల యందు గురుశిష్య సంవాదముచేత కట్టుబాటుచేసి బోధకొరకు నిరూపించి యున్నారు.

ఆ మహాత్ములు ఉపదేశించిన ప్రకారము నీకుపదేశించుచున్నాము. అత్యంత ఆసక్తిచేత వినుము.

1. దృక్కు అనగా చూచు నేత్రము

2. దృశ్యమనగా కన్నులచేత చూడబడు రూపమున్ను నీలాగుననే గంధము, రసము, మొదలైన ద్రవ్యాదులను దృశ్యమని తెలియవలయును.

3. ఈ దృక్కు రెండువిధములు. ఎట్లనగా నశించు దృక్కనియు, నిత్యమై నాశములేక అనిత్యమైన అంతఃకరణము మొదలుకొని యుత్పత్తి స్థితి లయములను జూచుచునుండెడిది, స్థూల దృష్టి యనబడును.

4. తన కన్యమై అసత్యమై యుండు బుధ్యాదులచేత ప్రకాశింపబడక తానే వాటికి సాక్షియై వెలుగుచుండెడు తెలివి ఆత్మ దృష్టియని చెప్పబడెను.

5. అట్టి తెలివిరూపమైన దృక్కే కూటస్థమనియు, ప్రత్యక్చైతన్యమనియు, నుపాదితో గూడుకొనిన బ్రహ్మ స్వరూపమనియు, ఆత్మయనియు, సాక్షియనియు, శాస్త్రమందు చెప్పబడుచున్నది.

6. కనుక దేహములో బుధ్యాదులకు, సాక్షియైన దృక్స్వరూపము విచారించుటకు సాధనమైన అంతఃకరణ స్వరూపమును విచారింపబడుచున్నది.

గు॥ 1. అంతఃకరణముతో కూడుకొన్న కూటస్థుడు, నెటువంటిదనగా కూటస్థుడు సత్యమనియు, దేహము మొదలగు అంతఃకరణములతో కూడి యుండుదానిని అసత్యమనియు, ఇట్లు సత్యాసత్య స్వరూపమనియు శాస్త్రమందు జెప్పబడినది.

శి॥ అది ఎట్టులనగా సత్యమని చెప్పగూడదు.

గు॥ అంతలోనే లేదని చెప్పబడుచున్నది. కనుక నసత్యమని చెప్పగూడదు.

2. సాక్షియైన యాత్మస్వరూపము దెలియబడుచున్నది. కనుక లేదని చెప్పగూడదన్నారు.

3. సాక్షియైన ఆత్మరూపముచేత కామక్రోధాది వృత్తిరూపమై కనబడుచున్నది. కనుక ఈ శంకల కధిష్ఠాన రూపమైన జీవుడు నిత్యుండని ప్రతిపాదించుట అచలగురు వాక్యమును తెలిసిన వారికి సర్వాబద్ధము.

4. కలదోచిన శరీరాలు యేలాగో ఆలాగే
మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదు.
ఈ ఉత్త బట్టబయలు యేమి లేదు, ఇదియే గురు వాక్యం.
ఇంతకంటే యెక్కవ లేదు.

గద్య:

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే**
**వేదాంత విచారణే**
**పూర్వభాగే అద్వైత శంకానిరసన ద్వాదశ ప్రకరణం సమాప్తం.**
**మొదటి భాగం సమాప్తం.**







ఓం

శ్రీగురవేనమః

శ్రీమద్బృహద్వాసిష్ఠ అచల సిద్ధాంత నిర్ధారణులును
శ్రీమించునచల పరిపూర్ణ బోధ ప్రతిష్ఠాపనాచార్యులగు
శ్రీమద్రామడుగు శ్రీశ్రీశ్రీ శివరామదీక్షితుల వారిచే రచియింపబడిన

# బృహద్వాసిష్ఠము

## అను

# శ్రీ శివరామ దీక్షితీయము

## పరిపూర్ణ బోధ అచల సిద్ధాంత గ్రంథము

## జనన మరణ భ్రాంతి రహిత మార్గము



## ద్వితీయ భాగము



# 1. యెరుక యొక్క - చలనామముల ప్రకరణం

| ఆత్మ నామములు | అనాత్మ నామములు |
|---|---|
| 1. అక్షరము | 1. క్షరము |
| 2. క్షేత్రజ్ఞుడు | 2. క్షేత్రము |
| 3. పురుషుడు | 3. ప్రకృతి |
| 4. పరాప్రకృతి | 4. అపరాప్రకృతి |
| 5. ఆత్మ | 5. అనాత్మ |
| 6. విద్య | 6. అవిద్య |
| 7. తత్పదము | 7. త్వంపదము |
| 8. పరబ్రహ్మం | 8. జీవేశ్వరులు |
| 9. అఖండము | 9. ఖండములు గలది |
| 10. స్వస్వరూపమం | 10. విశ్వరూపము |
| 11. పరమాత్మ | 11. ప్రపంచము |
| 12. గుణాతీతం | 12. త్రిగుణం |
| 13. ప్రమ | 13. భ్రమ |
| 14. కారణము | 14. కార్యం |
| 15. నిరాకారము | 15. సాకారము |
| 16. నిర్గుణము | 16. సగుణము |
| 17. దేహి | 17. దేహము |
| 18. జ్ఞానం | 18. అజ్ఞానము |
| 19. నివారశూకం | 19. కంటిలోపాప |
| 20. బ్రహ్మసత్యం | 20. జగత్‌మిథ్య |
| 21. ప్రత్యగాత్మ | 21. కూటస్థుడు |
| 22. ముక్తి | 22. బంధము |
| 23. స్వర్గము | 23. నరకము |
| 24. అజడము | 24. జడము |
| 25. పుణ్య పాపములు లేనిది | 25. పుణ్య పాపములు గలది |

| | |
|---|---|
| 26. మూలం లేనిది | 26. మూలంకలది |
| 27. నిరూపాది | 27. ఉపాది |
| 28. నిబద్ధి | 28. అబద్ధము |
| 29. దేవుడు | 29. జీవుడు |
| 30. ఓంకారము | 30. మమకారము |
| 31. సత్తు | 31. చిత్తు |
| 32. అద్వైతము | 32. ద్వైతము |
| 33. ముక్తికాంత | 33. మాయలాడి |
| 34. జననమరణములు లేనిది | 34. జననమరణాలు గలది |
| 35. ఇరువై ఐదవది | 35. ఇరువై నాలుగవది |
| 36. శివుడు | 36. శక్తి |
| 37. మహాకారణం | 37. శరీర త్రయము |
| 38. త్రినేత్రం | 38. ద్వినేత్రం |
| 39. భావము | 39. అభావము |
| 40. నిర్వికల్పము | 40. సవికల్పము |
| 41. ప్రజ్ఞానంబ్రహ్మ | 41. నేత్రము |
| 42. సారములేనిది | 42. సంసారము |
| 43. అహంబ్రహ్మాస్మి | 43. పంచకోశమయం |
| 44. అయమాత్మబ్రహ్మ | 44. పంచభూతమయం |
| 45. అడుగనిది | 45. అడిగేది |
| 46. అచరం | 46. చరము |
| 47. సత్తు | 47. అసత్తు |
| 48. లింగము | 48. అంగము |
| 49. స్వయంజ్యోతి | 49. ప్రకాశము |
| 50. సర్వాజ్ఞత్వం | 50. కించిత్‌జ్ఞత్వం |
| 51. విషయీ | 51. విషయము |
| 52. మాయావి | 52. మాయ |

1. ఈ రెంటి కలయికే పారమార్థిక ప్రపంచము, గురుసూచనైతే సరి దీని నిజ స్వరూపము వంద్యా పుత్రుని లాంటిది.
2. ఇంద్రజాలము వంటిది
3. ఆకాశ పుష్పము వంటిది.
4. ఆకాశంలో గంధర్వ నగరం వంటిది
5. శశవిషాణము వత్తు,
6. యెండమావుల జలము వత్తు, లేనివే
7. రజ్జు సర్పభ్రాంతి,
8. అద్దములో ప్రతిబింబించిన ప్రపంచము వంటిది.

గద్యః
ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంతవిచారణే
యెరుక యొక్క చలనామములు ప్రథమ ప్రకరణం సమాప్తం.







# 2. ఎరుక యొక్క చల వాక్యముల ప్రకరణం

## వాయువు వంటిది

1 మూలంలేని యీ గుర్తెరిగే శరీరం మసురామాత్ర ప్రమాణము
2 యెరుకే ప్రకృతి పురుషులు
3 యెరుకే గొప్ప కొంచెము
4 యెరుకే మూలమాయ
5 యెరుకే ఉన్నంతసేపు బట్టబయలులోనే విహరిస్తువున్నది
6 బట్టబయలును విడిచివుండేటందుకు యెరుకకు వేరే స్థలము లేదు
7 యెరుక ఉపాదితోనే కూడియుండును.
8 బట్టబయలువలన యెరుక పుట్టదు
9 శరీరము వలన పుట్టినది తనకు తానే తోచింది.
10 యెరుక వలన శరీరము పుట్టినది
11 యెరుకే బట్టబయలులో వున్నంతసేపు అనేక సామర్థ్యాలు కలిగి ఉండును., నీళ్ళల్లో మొసలివలెనే యుండును.
12 యెరుకే సమస్తమైన త్రిపుటులు గలిగి యున్నది.
13 ఈ యెరుకే అహంస్ఫురణ నేననే మూలమాయ
14 యెరుకే సమస్తమైన ద్వంద్వములు
15 యెరుకే ధ్వనిరూపము
16 యెరుకే అర్ధమాత్ర
17 యెరుకే కృష్ణపింగళ రూపము
18 యెరుకే పిండ బ్రహ్మాండ స్వరూపిణి
19 దీనిపేరే యెరుక, యిదే మూలమాయ.
20 యెరుకకే యెరుకమరుపులు గలవు
21 యెరుకను రమ్మనేవారు లేరు ఉండుమనేవారు లేరు పొమ్మనేవారు లేరు
22 యెరుకే సముద్రములో చేపవున్నట్టు వున్నది
23 యెరుకే తనకు తాను వస్తుంది, తనకు తాను వుంటుంది సకల వ్యవహారములు చేస్తుంది, తనకుతానే యేమీ లేకపోతుంది
24 యెరుకే నిత్యం అనేకమార్లు వస్తుంది, వెంటనే యేమీలేదు
25 యెరుకే తన మూలం తానే యెరుగదు

26 యెరుకే సకల భ్రమలకు మూలంయిదే
27 యెరుకే కలలో వచ్చిన శరీరం వంటిది
28 యెరుకే మహాకారణ శరీర మనదగినది
29 యెరుకే తనతోకూడా సమస్తమునకు నామరూపకుల గోత్రాదులను యేర్పాటుచేసినది
30 యెరుకే వేదశాస్త్రాది విద్యలను కల్పించినదే
31 యెరుకకే అవాంతర దొరతనము, దీనికే నచ్చదు.
32 యెరుకే సమస్త భాషా రూపిణి
33 యెరుకే రాకమునుపు నిశ్శబ్ధమే
34 యెరుకే ప్రత్యక్చైతన్యము
35 యెరుకే పరమ చైతన్యము
36 యెరుకే ఉభయ ఐక్యము
37 యెరుకే తత్వమసి రూపము
38 యెరుకే అహం బ్రహ్మాస్మి
39 యెరుకే ప్రజ్ఞానం బ్రహ్మ
40 యెరుకే అయమాత్మ బ్రహ్మ
41 యెరుకే బట్టబయలును బయట బెట్టినది
42 యెరుక నుండే ఆకాశాది పంచభూతములు పుట్టినవి. పంచీకరణ స్వరూపము
43 తాను ఒక్కటే అయివుంటే తనలో తానే అనేకముగా భ్రమించుచున్నది
44 తాను ఒక్కటే అయివుండి తనను తానే జూచుకొని భ్రమించుచున్నది
44 తనతోటే జీవేశ్వరులు ఉన్నారు.
45 తాను లేకుంటే జీవేశ్వరులులేరు
46 యెరుకకే స్మరణ
47 యెరుకకే విస్మరణ
48 యెరుకకే శృతి, స్మృతి, పురాణముల చింత
49 నిబద్ధిపుస్తకం యెరుకే చేసినది
50 అబద్ధాల పుస్తకం యెరుకే చేసింది.
51 యెరుకే గురుశిష్యాబోధా స్వరూపము
52 యెరుకే నిర్ణయాలు చేసేది
53 యెరుకే నిర్ణయానికి దొరకేది

54 యెరుకకే ప్రమాణాప్రమాణములు రెండు
55 యెరుక వుంటే వుండేది, లేకుంటే యేమీలేదు, యిటువంటి రెండుతిప్పలు యెరుకకే.
56 యెరుకే ఆసుకొయ్యవలె తిరుగుచున్నది
57 యెరుకే క్షణమైనా వూరికే వుండదు, యేదైనా వొక వ్యవహారం చేస్తూనే వుంటుంది.
58 యేకం యెరుకే అనేకం యెరుకే
59 యెరుకే సూక్ష్మమాయ అహంస్ఫురణ
60 యెరుకే స్థూల మాయ మనోబుధ్యహంకార పంచభూతములు
61 యెరుకే స్థూల, సూక్ష్మమాయలు రెండు
62 యెరుకే విక్షేపశక్తి సూక్ష్మదేహము
63 ఆవరణశక్తి స్థూల దేహముగా నున్నది యెరుకే
64 నేను అనే విక్షేపమే ఆవరణానికి మూలము, అనేక ఆవరణముల కల్పిస్తుంది యెరుకే
65 యీ విక్షేపావరణ శక్తులు రెండూ నేననేదే యెరుక.
66 అజడం విక్షేపశక్తి, జడం ఆవరణ శక్తి, జడాజడాలు రెండు యెరుకే
67 క్షేత్రం ఆవరణశక్తి క్షేత్రజ్ఞుడు విక్షేపశక్తి, యెరుకే
68 విక్షేపముపోతే ఆవరణము పోయె, ఆవరణముతోటి విక్షేపము పోదని చెప్పింది
69 క్షేత్రక్షేత్రజ్ఞులు రెండు యెరుకే
70 జ్ఞానాజ్ఞానాలే క్షేత్రక్షేత్రజ్ఞులు
71 యెరుక రాకడే ప్రపంచోత్పత్తి
72 యెరుక పోకడే ప్రపంచప్రళయము
73 సుషుప్తిని, మరణాన్ని యెరుగనిది యెరుకే
74 యెరుకే నడమంత్రపుది
75 పుట్టని చావని అచలానికి యెరుక లేదు, లేదనేది, ఉన్నదనేది యెరుకకే సంబంధము
76 యెరుకే సకల అబద్ధాలు ఆడేది
77 యెరుకే చలనము
78 యీ చంచల స్వభావము గలది యేమిచెప్పినా చెలించి పొయ్యేది యెరుకే.
79 యెరుక చెప్పిన మాటలు దీనితోటె పోతావి
80 యెరుక చెప్పేమాటలు దీనివంటివారే నమ్ముతారు
81 యెరుకే మధ్యవచ్చి మధ్యపొయ్యేది
82 దేహమును విడిస్తే దేహికి వుండేస్థలంలేదు

83 దేహి లేకుంటే దేహమును యెరిగే వారులేరు
84 వచ్చేటప్పుడు దేహిలేని దేహమురాలేదు
85 రాగానే దేహిదేహాలు వొక్కటే
86 యీ రెంటికి వేరనగూడదు
87 యెరుకే సకలవినోదములు చేసి, యేమి లేకపొయ్యేది
88 యెరుకకు అచలానికి యేమాత్రము సంబంధములేదు
89 తాను మూలములేనిది, నాకు మూలంలేదని చెప్పింది యెరుకే.
90 అన్నిటికి తానే మూలము అయినది, తనకు మూలం యేమిలేదు.
91 పుట్టిచచ్చేది యెరుకేనని యెరుక చెప్పింది.
92 రాకడపోకడలు గలది యెరుకే
93 యెరుకకు అచలము వున్నది యెరుకలేదు
94 అచలము వున్నదని యెప్పుడు తెలిస్తే అప్పుడే తానువుండదు
95 చలమే స్థిరమని నమ్ముకునేది యెరుకే
96 శరీరం అబద్ధం నేనునిబద్ధి అనేది యెరుకే
97 నేను శరీరం ఒక్కటే అనేది యెరుకే
98 నేను వేరే యీశ్వరుడు వేరే అనేది యెరుకే
99 వివేకావివేకములను నిబంధనచేసేది యెరుకే
100 యిది నిబద్ధి అది అబద్ధమనేది యెరుకే
101 నేనే నేను అనేది యెరుకే
102 నీవు నేనే అనేది యెరుకే
103 దేవుడు నేనే, జీవుడు నేనే అనేది యెరుకే
104 కన్నులయందువున్న పాపరూపమైనది యెరుకే
105 తనకు కారణము వున్నది అని భాష్యములు చేసినది యెరుకే
106 యీ భ్రాంతి సర్వకాలము వుండేదికాదు. అయితే పోకనేపోవునుయని తెలిపేది యెరుకే
107 యెరుక వంటి శిష్టులేదు
108 యెరుక వంటి భ్రష్టులేదు
109 యెరుకే యేదైనా వొక రోగముగా, దరిద్రముగా, సంపత్తిగా ఉంటాది,
110 ఉన్నప్పుడు ఒక్కతీరుగా వుండదు. క్షణక్షణం యేమీలేదు

111 సకలమాయలు చేసినది యెరుకే.

112 యెరుక రాకడపోకడ యెవ్వరు యెరుగరు

113 తానున్నంతసేపే యెరుక అయినా మరుపుఅయినా ఉంటావి,

114 తానులేకుంటే యేమీలేదు

115 యెరుక రాకడే స్వప్నము

116 గురునిచేత యిది యేమీలేదని, తెలిసి దృఢమై, దృఢముతో కూడా యిది లేకపోవటమే మేల్క, యిది లేనప్పుడు సుషుప్తియనిమంది అన్నారు, మరణమని మంది అన్నారు

117 యెరుక తనకు తాను వచ్చేదికద్దు, తల్లి కడుపులోయుండి వెళ్ళివచ్చేదికద్దు

118 యెరుక యిన్నాళ్లు వుంటుందనే మర్యాదలేనిది

119 సకలక్రియలకు మూలము యెరుకే.

120 అధిష్టానము లేనిది యిదే, అన్నింటికి అధిష్టానమని అనిపించుకున్నది యెరుకే.

121 దీనికి మూలము ఉన్నదని చెప్పంగనే వాడు పుట్టనేపుట్టె పుట్టినవాడు చావనేచస్తాడు

122 యెరుక బ్రతుకు కేవలం భ్రాంతి మాత్రమే

123 యెరుక పోయిన వెనుక దీని వ్యవహారం వున్నదని లేదని యెవ్వరనవలెను. యేమిలేదని యెవ్వరనవలెను.

124 యీ గుర్తెరిగే శరీరమనే చంచలముచేత శరీరం యేమీ లేదని తెలసి వచ్చెనా సర్వకాలం అచలమే

125 అన్ని జ్ఞాన శరీరం వలన పుట్టినవే

126 తనమతము తనకే సమ్మతము గాని, యే మతము నమ్మనిది యెరుకే.

127 షణ్మతములను కల్పించినది యెరుకే.

128 భూమండలమందు శరీరము లేనివారు ఉన్నారంటే నమ్మనిది యెరుకే.

129 సకల నిశ్చయములు యెరుకకే గలవు.

130 సకల సంశయములు యెరుకకే గలవు.

131 తాను వచ్చేటప్పుడు యేనుగులు, గుర్రములు, లొటిపిట్టలు, కుక్కలు, గాడ్దెలు, పందులు, పిల్లులు, యెల్కలు, పెద్దపులులు, సింహాలు, అనేకమంది గుర్రాలు తోమేవాండ్లు, ఆడవాండ్లు, బూడిదెగాండ్లు, నామందార్లు, అద్దకపు బట్టవలె నిలువునిండా ముద్రలు పోడుచుకున్న వాండ్లు, బోడివాండ్లు, ఫకీర్లు, గొడ్దలివలె బొట్లు పెట్టుకున్నవాండ్లు, పెద్దపెద్ద పట్టెనామాలవాండ్లు, ఆవులు, బర్లు, గొర్లు, మేకలు, మాలలు, మాదిగెలు మొదలైనవాండ్లు అనేకులు తనవలెనే మూలంలేక

యెక్కడనుండి యోవచ్చి, సకలమైన వ్యవహారాలు చేస్తూ పెండ్లాము, పిల్లలు, మనుషులు గలవారివలె వున్నట్లు తోచబడేది యెరుకకే.

132 అయోనిసంభవులు, యోని సంభవులు యెరుకే.

133 తలకాయ అనే మొదలు, కాళ్ళు అనే కొనగలది యెరుకే

134 శూన్యమైపోయేది యెరుకే, శూన్యమంటే యేమీలేదు

135 జ్ఞానాజ్ఞానములు యెరుకే

136 యెరుకే శరీరము లేనిదానిలోనే ఉన్నాని, లేనని చెప్పంది.

137 నిలువనీడలేనిది యెరుకే

138 సకల ప్రయత్నములు చేసేది యెరుకే

139 తల్లీదండ్రీలేనిది యెరుకే

140 వుండేది లేకపోయేది యెరుకే

141 తనకు మొదలులేదని యెరిగేది యెరుకే

142 కొనకువుండేటందుకు యేమీలేదని యెరిగేది యెరుకే

143 నీవు యెక్కడి నుంచి వచ్చినావు యెక్కడికి పోతావు అని అడిగితే దిక్కులేదన్నది

144 వచ్చినప్పటినుంచి సుఖమైనా దుఃఖమైనా అనుభవించిపోయేది యెరుకే

145 భ్రాంతి నివర్తి కావలెనని కోరేది యెరుకే

146 భ్రాంతి నివర్తి కావలసినది యెరుకకే

147 అధిక నీచాలు యెరుకకే

148 యిచ్ఛారూపము యెరుకకే

149 యేనుగ అధికం, యెలుక నీచం, సింహం యెక్కువ యేనుగ తక్కువ, పిల్లి యెక్కువ, యెలుక తక్కువ కనుక అన్ని మూలంలేని యీ గుర్తెరిగే శరీరాలే

150 అందులో కుక్క బ్రహ్మజ్ఞాని అనేవాడుక, కోడి కాలజ్ఞాని అనేవాడుక, చీమ దివ్యజ్ఞాని అనేవాడుక, యిట్లా గుర్తెరిగినది అందులో వొక్కటి నిలువదు అన్నది యెరుకే.

151 మెరుపువలె వున్నాననిపించి వెంటనే యేమీ లేకపొయ్యేదియిదే; దురహంకార, నిరహంకార, శుద్ధాహంకారములు యెరుకే

152 యెరుకకు బదులు లేదు

153 యెరుక వల్లనే సచ్చిదానందము పుట్టినది

154 యెరుకే సచ్చిదానందమని పేరు పెట్టుకుంది.

155 సచ్చిదానందమే అనాత్మ, సచ్చిదానందమే ఆత్మ, సచ్చిదానందమే పరబ్రహ్మ, పుట్టిన

శరీరములెల్లా సచ్చిదానందమే అన్నది యెరుకే.

156 గురుసూచన గాని వారికి, గురుసూచన అయిన వారేమూలం

157 గురుమూలముగా విచారించినవారికి సర్వకాలం అచలమే ఉన్నదన్నది యెరుకే.

158 కండ్లు మూసినా యెరుకే కండ్లు తెరిచినా యెరుకే యీ యెరుక లేకుంటే యేమీలేదు

159 యెరుక వున్నచోటనే కర్మములు ఉంటావి.

160 ఇది వున్నదన్నా పాపమే లేదన్నా పాపమే; నిర్ణయంబనే పాపం లేకుండా మెదలవలెను;

161 పరిపూర్ణమనే అదిన్ని యిదిన్ని అనే రెండు లేక వున్నది వొక్క పరిపూర్ణమే, యీ గుర్తెరిగే శరీరము యేమీ లేదని నిర్ణయముకాక తన్నుకుంటారు అన్నది యెరుకే.

162 యెరుక యేమి లేదని రెప్పపాటంత సేపైనా మరువక వుండవలెను; వుండకపోతే యిది యెంత దొడ్డ ప్రజ్ఞావంతునినైనా మోసపెడుతుంది అని చెప్పింది యెరుకే.

163 వున్న పరిపూర్ణానికి యిది విరోధి గనుక దీని కూకుదు వేళ్ళతో తీసివెయ్యవలెను అన్నది యెరుకే.

164 యిది యేమీ లేదని సకలక్రియలు చేసినా అది క్రియాశూన్యముకాదు

165 యెరుక లేకపోవటం గురుమూలముగా తెలిస్తే ప్రసంగములు నిలిచేను.

166 యెరుకే యిరవై అయిదోతత్వం ఈశ్వర స్వరూపం.

167 తక్కిన యిరువైనాలుగు తత్వాలు, జీవస్వరూపం యెరుకే.

168 జ్ఞానరూపము యెరుకే

169 కర్మరూపము యెరుకే

170 జ్ఞానకర్మరూపమైన శరీరము యెరుకే

171 ఆవగింజకు పర్వతానికి యెంత యెచ్చుతగ్గో యెరుకకు అచలానికి అంత యెచ్చుతగ్గు గలదు.

172 యిది అనిర్వచనీయమయింది; అనిర్వచనీయమంటే యేమీ లేనిది

173 యెరుకకు వున్న సామర్థ్యము అచలానికి లేదు

174 యిదియేమీ లేదని దీనికే తెలిస్తే వాదశూన్యం అవుతుంది యెరుకకే.

175 యెరుకే సమస్తమైన వస్తుమయం

176 వస్తువులయందు వుండేది యిది వస్తువులతోటి పోతుంది యెరుకే.

177 యెరుక పరిపూర్ణం కాదు ఇది యేమీలేదు

178 యెరుక తప్ప విడిచి అంతాపరిపూర్ణమే గలదు.

179 యెరుకే చిదగ్ని గనుక యెన్నటికి నమ్మరాదు మహానమ్మించి చూస్తూవుండంగా

యేమీ లేకపోయ్యేది

180 యెరుకే కలవంటిది మేలుకొంటే లేదు.

181 పరిపూర్ణము నిమిత్తం కాదు, యత్నం చేసేది యెరుకే.

182 యెరుక జేసే యత్నమే యెరుకకే విఘ్నము

183 యీ ప్రయత్నము చేసేదాన్ని తీసివేయటమే యెరుకకు విఘ్నము

183 ప్రయత్నము చేసేదాన్ని తీసివేయటమే యెరుకకు ప్రయత్నము

184 యెరుక లేదని యెరిగిన వారికి యెరుక మీద యిచ్ఛవుండదు

185 యెరుకను నిల్పేవారికంటే, నిలుపుకునేవారికంటే వేరేభ్రాంతికులు లేరు

186 యెరుకే అనేకకోటి బ్రహ్మాండములు వున్నవని భ్రాంతి పెట్టింది పెడుతుంది.

187 మూలము లేదని యెరుక యెవ్వరితో, చెప్పితే తాను లేకపోతానని భయము

188 అందరు యెరుకే అయివున్నది, అన్ని స్వరూపాలు నేనేనని చెప్పింది.

189 యెరుక కంటె కౌతుకము లేదు

190 యెరుక వల్లనే కర్మలు పుడుతావి

191 యెరుకే సుషుప్తి మరణాల యెరుగనిది

192 గుర్తెరిగే శరీరమే మూలప్రకృతి యనే యెరుక

193 యెరుకే స్థూల, సూక్ష్మ, కారణ, మహాకారణ శరీరములు

194 యీ రెంటిని వేరనేది యెరుకకు వెర్రి

195 దీనిచేత పుట్టని చావని దాన్ని వుండచూచి దీన్ని యేమీ లేదని నిశ్చయం వుంటే చాలు. యే సాధన వద్దు అన్నాది.

196 యే సాధన చేసినా యెరుక విడువదు అన్నది.

197 యెరుక అనే నిప్పు కాలుస్తూ వుంటుంది అన్నది.

198 యెరుకకంటే వేరే నిప్పులేదు

199 చిదగ్ని దేహాల సర్వకాలం చింతనిప్పువలె కాలుస్తుంది

200 సకల శరీరాలు యెరుకతో కూడనే వచ్చినవి. యెరుకతో కూడా యేమీలేదు.

201 శరీరంలో కొంత నిబద్ధ కొంత అబద్ధం అనేది అన్యాయము అని చెప్పింది యెరుకే.

202 యీ శరీరము వొక్కటేకాని దీనిలోపల వున్న పేర్లు అనేకాలు. జ్ఞానమని, అజ్ఞానమని యింద్రియాలని, విషయాలని, గుణాలని, అంతఃకరణ అని, మనస్సని, బుద్ధి అని, చిత్తమని అహంకారమని, వేదాలని, శాస్త్రాలని యెన్ని అని వ్రాయుదును దీనియందు (స్వగత) బేధాలు అనంతాలుతీసివేసిన కొద్ది యెరుకకే మొలుస్తాయి

203 యెరుక వికార స్వరూపం, చెవులు వొకతీరుగానున్నవి నొటినిండాబొక్కలు, చుట్టు వెంద్రుకలు, లోపటనాలుక నోరు మాట్లాడుచున్నది. కడుపులోవికారాలకు లెక్కలేదు. తలలో వికారాలు అనేకము, వికారం లేనిది వొకటైనా లేదు. కాళ్ళల్లోవున్న తిప్పలు చెప్ప శక్యముకాదు

204 యెరుక లేకుంటే యేదివుంటుందో అదే అచలం. అచలము కావలెనని యిచ్చవద్దు కాకపోతినని దుఃఖంవద్దు. అయితినని అబద్ధాలు ఆడవద్దు

205 సర్వకాలం గురువాక్యం మరవకవుంటే చాలు

206 యీ గుర్తెరిగే చైతన్యముకు జగత్తుకు వేరు లేదు, యెరుకతో వచ్చింది యెరుకతో పోతుంది.

207 శరీరంవలన గుర్తెరిగే చైతన్యం పుట్టింది, గుర్తెరిగే చైతన్యమువలన శరీరం పుట్టింది.

208 యీ శరీరాలు యేలాగు పుట్టినవంటె స్త్రీపురుష సంబంధంవల్ల అన్ని పుడుతాయి

209 దేహం లేదనేది యెరుకే. యేమీ లేదనేది యెరుకే. ఉన్నది అనేది యెరుకే యీ దేహం లేకుంటె వ్యవహారాలకు మూలం యేమని నిర్ణయము చేయలేము.

210 ఈ శరీరం యెవరివలన పుట్టినదో ఆ నిర్ణయము మొదలు కలత లేకుండా విచారించవలెను

211 ఈ గుర్తెరిగే శరీరం లేకుంటే యేమి తోచదు

212 త్రివిధాహంకారములు గలిగియున్నది యెరుకే.

213 "చతుర్వింశతి తత్వాలు జీవుడు, యిరవై అయిదో తత్వమే ఈశ్వరుడు, యీ దేహి దేహాలే ఈశ్వర జగత్తులు"

214 లేని క్షేత్రజ్ఞస్వరూపమే వున్నది వుంటుంది, లేనిది లేదు అంటుంది

215 ఈ శరీరము లేదు గనుక ఉన్నదానికి వ్యవహారమే లేదు

216 అయంజీవైఖ్యోపాధి విలయేసతి కేవలో భవతి అన్నది యెరుకే.

217 ఈ క్షేత్రము లేకుంటే క్షేత్రజ్ఞుడు లేనేలేదు. క్షేత్రజ్ఞుడు నిరాకారమే గనుక

218 పుట్టుకా, భ్రాంతి రెండు సమానమే

219 గుర్తెరిగేది శరీరముతోటే పోతుంది, వస్తుంది.

220 గుర్తెరుగుటం వొక్కటేకాని రెండు గుర్తెరుగటాలు లేవు

221 యీ గుర్తెరిగే క్షేత్రజ్ఞ స్వరూపమనే ఆత్మే బ్రహ్మమని వేదం పలికినది

222 యెక్కడ సర్వం తోచిందో అక్కడనే సర్వం లేకపోవలెను.

223 యీ గుర్తెరిగే క్షేత్రజ్ఞ స్వరూపమనే పరాప్రకృతే అధిష్ఠానము

224 యీ గుర్తెరిగే చిత్ప్రకృతి సాక్షిణి
225 యీ సాక్షిణి యిన్ని చిత్ర విచిత్రాలు కల్పిస్తుంది
226 యీ గుర్తెరిగే సాక్షిణికి మూలం యేమీలేదు
227 ఇది మగడువిడిచిన ఆడదిగాదు, మొగుణ్ని విడిచిన ఆడది గాదు
228 దేహము వున్నంతసేపే జ్ఞానము వుంటుంది. దేహం లేకుంటే జ్ఞానం లేనేలేదు
229 రోగవికారాలు పోతే రోగము పోయినట్లే. యెరుక వికారులుపోతే యెరుకపోవును
230 కలలో శరీరాలవంటివే యీ శరీరాలు, యే శరీరానికి మూలం యేమీలేదు, అన్ని వొక్కయేడుపే
231 సమష్టి దేహత్రయావస్థా త్రయాభిమానత్రయము యీశ్వరుడు ఇదే అజ్ఞానము
232 మహాకారణ శరీర తుర్యావస్థలకు అభిమాని పరమచైతన్యము. యిదేజ్ఞానము
233 యెరుకే కారణం, కార్యము.
234 యెరుకే అంతామాయ, నిలిచేది గాదు,
235 అహంస్ఫురణ మాయావి, విషయీ అన్నా యెరుకే.
236 యెరుకే పీతకర్భూరశ్యామ తటిల్లతలు
237 వ్యష్టి దేహత్రయము అవస్థత్రయము, అభిమాన త్రయము, జీవుడు అజ్ఞానము మొదలగున వన్నియు యెరుకే.
238 మహాకారణ శరీర తుర్యావస్థలకు అభిమాని ప్రత్యక్చైతన్యం యిది అంతా కార్యం అవిద్య అహంస్ఫురణే రక్తశ్వేత కృష్ణనీలాలు యెరుకే.
239 పూర్ణచైతన్యం స్ఫటికవర్ణం. ఉత్తమపురుషుడు శబ్ధాతీతం ఆకాశతీతం యెరుకే.
240 "జీవుడే క్షరుడు, ఈశ్వరుడే అక్షరుడు యీ యిద్దరుకానిదే ఉత్తమ పురుషుడు"
241 యెరుకే అంతాగూడి మూలములేని యీ గుర్తెరిగే శరీరము
242 యెరుకకు సకల వేతృత్వాలు కద్దు బ్రహ్మవేతృత్వము దీనిదే. యీ వేతృత్వమనే శబ్ధతెలివికి పనియేమి అంటే బ్రహ్మనువుండ జూచి తాను లేకపోవుటయే పని, దీనికి మూలములేదు యిది వచ్చినప్పటినుంచియే, సకల ప్రసంగాలు, యిది సమస్త భాషా రూపిణి
243 బ్రహ్మవేత్త బ్రహ్మకాదు. బ్రహ్మకు బ్రహ్మవేతృత్వములేదు. యీ వేతృత్వమునే బ్రహ్మమని వాదించే వారి వాదమును తీసివేసేది అచలబోధ
244 బ్రహ్మవేతృత్వమే బ్రహ్మజ్ఞాము
245 యెరుకకు బ్రహ్మవేతృత్వం ప్రపంచవేతృత్వం కూడా కద్దు

246 యెరుకే మూలమాయ, యిదే ప్రథమస్ఫురణ

247 ఆకాశమందు వాయువుబుట్టినట్లు సుషుప్తికిమెల్క వచ్చినట్టు నేను మేనుల నెరుగని బ్రహ్మయందులేని నేను మేనులు బుట్టి బ్రహ్మనుగని నేను మేనులు లేచిపోవటమే యీ బోధవిన్నందుకు ఫలం

248 ఎట్లా వున్న ప్రపంచం అట్లావుండంగా వెతికినా క్షేత్ర క్షేత్రజ్ఞులు లేకపోవటమే యీ విచారణకు ఫలం

249 ఈ క్షేత్ర క్షేత్రజ్ఞులలో యే మాత్రము ఆశపడ్డా అదే విషమౌను.

250 క్షేత్ర క్షేత్రజ్ఞులు కాని వుత్త బట్టబయలనదగినది

251 మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి ఊర్ణనాభికి ఉపమానం చెప్పివున్నది.

ఈ యెరుక నామాలు, యెరుక యొక్క వాక్యములు వేలు, లక్షలు గలవు గాని, అన్ని కలలో కలవరింతలే, కలదోచిన శరీరాలు మేలుకొంటే యేలాగు యేమి లేవో, ఆలాగే, మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదు, ఈ ఉత్తబట్టబయలు యేమి లేదుయని గురు సూచనైతే తీరుగుండదు.

గద్యః

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభవే, వేదాంత విచారణే

పూర్వభాగే యెరుక యొక్క చలవాక్యముల ద్వితీయ ప్రకరణం సమాప్తం





# 3. పరిపూర్ణబోధ - అచలనామముల ప్రకరణం

1. ఆత్మాతీతం కేవలాత్మ
2. పరిపూర్ణము
3. బట్టబయలు
4. అచలము
5. అఖండ రహితము
6. గుహ్యాతి గుహ్యము
7. అతీతము
8. పరమపదము
9. కల్పన రహితమైన కైలాసము
10. వికార రహితో ఈశ్వరః
11. కుంటితముగాని వైకుంఠము
12. త్రిపుటి రహితము
13. జననమరణ రహితమైనది
14. సచ్చిదానంద రహితము
15. ప్రకృతి ద్వయదోష రహితము
16. పుట్టుచావులు లేనిది
17. సర్వత్ర నిండి నిబిడీకృతమైనది
18. కాలాతీతము
19. నిర్ణయ రహితము
20. నామరూప రహితము
21. ప్రకాశ విమర్శ రహితము
22. ఇచ్చుకోదు పుచ్చుకోదు
23. సర్వలక్షణ విలక్షణము
24. గురుశిష్య రహితము
25. సగుణ నిర్గుణములు కానిది
26. సదసత్తులు గానిది

27. ఆకార సాకారములు గానిది
28. నిర్వికారము, వికార రహితం
29. సాకార నిరాకారములు గానిది
30. నిరాభాసము, అభాస రహితం
31. నిరుపద్రవము
32. చేతనాచేతన రహితం
33. వృత్తి శూన్యమైనది
34. అప్రమేయము
35. ఖండాఖండ రహితము
36. ఆదిమద్యాంత శూన్యము
37. సర్వద్వంద్వ రహితము
38. సర్వ పరిణామ రహితము
39. జ్ఞానకర్మ రహితము
40. మాయాతీతము
41. సర్వాతీతము
42. విద్యావిద్య రహితము
43. సర్వశూన్యం నిరాలంబం
44. ఉత్పత్తి స్థితి లయములు గానిది
45. సంపూర్ణము
46. నిష్కళంకము
47. నిత్యసత్యము
48. యధాతధము
49. వాచాతీతం మనోతీతం భావాతీతం
50. తడిలేని తీర్థం పొడిలేని ప్రసాదం
51. సచ్చితానంద రహితం
52. సర్వభ్రాంతి రహితం
53. బంధమోక్ష రహితం

54. ప్రజ్ఞానం బ్రహ్మ గానిది

55. అహం బ్రహ్మాస్మి గానిది

56. తత్వమసి గానిది

57. అయమాత్మ బ్రహ్మ గానిది

58. సర్వసాక్షి రహితం

59. ఆనంద రహితం

60. అనుభవ రహితం

గద్యః
ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభవే, వేదాంత విచారణే
పూర్వభాగే పరిపూర్ణబోధ అచల నామముల తృతీయ ప్రకరణం సమాప్తం







# 4. అచల వాక్యముల ప్రకరణం

**లేదంటే అంతటా వున్నది; ఉన్నదంటె కానరానిది; ఆకాశం వంటిది.**

1 పుట్టని చావనిది బట్టబయలు
2 మొదలు కొనలేనిది బట్టబయలు
3 ఒక్కటైన మహత్తు లేనిది బట్టబయలు
4 సర్వకాలం ఒక్క తీరుగా వున్నది బట్టబయలు
5 బదులులేనిది బట్టబయలు
6 స్వజాతీయ విజాతీయ స్వగత బేధాలు లేనిది బట్టబయలు
7 శరీరం లేనిది బట్టబయలు
8 చలించనిది బట్టబయలు
9 యేజోలి యెరుగనిది బట్టబయలు
10 జ్ఞానకర్మాలు లేనిది బట్టబయలు
11 నామరూపాలు లేనిది బట్టబయలు
12 సకలదేశాలయందు సర్వకాలాలయందు సమస్తమైన వస్తువులయందు వున్నది బట్టబయలు
13 ఉత్పత్తి స్థితి లయాలు లేనిది బట్టబయలు
14 తనకుతానే స్వతఃసిద్ధమైవున్నది జ్ఞానాజ్ఞానాన్యధాజ్ఞాన వివరీత జ్ఞానములుగానిది పంచభూతా హంకారమయమైన జడాజడాత్మక ప్రపంచాన్ని యెరుగనిది బట్టబయలు
15 శరీరాకారం గానిది బట్టబయలు
16 మూలం లేని యీ గుర్తెరిగే శరీరం రాకమునుపు ఉన్నప్పుడు బట్టబయలే ఉన్నది, అవి చచ్చినా ఒక్కతీరుగా వున్నది బట్టబయలు
17 శూన్యం గానిది బట్టబయలు
18 ఒక్కటైనా క్రియలేనిది బట్టబయలు
19 అసాధ్యమైనది బట్టబయలు
20 సంశయం లేనిది బట్టబయలు
21 దృఢం లేనిది, దృఢం చేసుకోనిది బట్టబయలు

22 క్రియాశూన్యమైనది బట్టబయలు

23 ఖోంచెయ్యనిది బట్టబయలు

24 ఒక్కటైనా భ్రాంతిలేనిది బట్టబయలు

25 మూలంలేని యీ గుర్తెరిగే శరీరంతోటి యే మాత్రం సంబంధము లేనిది బట్టబయలు

26 నీళ్ళల్లో పరుపుబండవున్నట్టు వున్నది, చట్టువలె ఉన్నది బట్టబయలు

27 శరీరం ఉన్నదనుకొను వారికి లోపల వెలుపల ఉన్నది బట్టబయలు

28 అచలమనే ప్రసిద్ధిచేత ఉన్నది బట్టబయలు

29 శాశ్వతమయింది సర్వత్రాయున్నది బట్టబయలు

30 లోపల బైట అనేమర్యాద లేక సమస్తమైన వస్తువుల యందు చలించక దేనిని స్పృశించక వున్నది బట్టబయలు

31 ఒక్కదానిని అయినా ముట్టుకొనిది బట్టబయలు

32 సంభాషణ చెయ్యనిది, విననిది బట్టబయలు

33 ఒక్కటైనా వికారం లేనిది బట్టబయలు

34 మూలంలేని గుర్తెరిగే శరీరం తనలో వున్నప్పటికి తాను దానికి అధిష్టానం కానిది బట్టబయలు

35 సూర్యుడు చంద్రుడు అవనివహ్ని శరీరం అద్రి అవనీజము అంగనా పురుషుడు ఉన్నారోలేరో దేన్ని తెలియక ఉన్నది బట్టబయలు

36 అవ్వి అన్నీ అనిత్యాలు సవికారాలు యిది నిత్యం అవికారి అననిది బట్టబయలు

37 సర్వగతమైనది బట్టబయలు

38 స్థాణువైనది బట్టబయలు

39 అచలమైనది బట్టబయలు

40 సనాతనమైనది బట్టబయలు

41 సచ్చిదానందం కానిది బట్టబయలు

42 దేనిని చూడనిది బట్టబయలు

43 విననిది బట్టబయలు

44 అడుగనిది బట్టబయలు

45 చదువుకోనిది బట్టబయలు

46 యెరుక మరుపులు లేనిది బట్టబయలు

47 ఒక్కటైనా వికారం లేనిది బట్టబయలు

48 వ్యవహారం లేనిది బట్టబయలు

49 చెప్పనిది బట్టబయలు

50 వస్తురూపం కానిది బట్టబయలు

51 మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి మూలంగానిది బట్టబయలు

52 గురు స్వరూపమైనది అనగా అన్నింటికన్నా అతీతం గనుక గురువనబడినది, ఉపదేశం చేయనిది, చిన్నది యెరుకైతే, పెద్దది బయలే గనుక గురువైనది.

53 శరీరం ఉన్నప్పుడు శరీరం నవ్వితే నవ్వనిది శరీరం యేడిస్తే యేడ్వనిది శరీరం తింటే తిననిది శరీరం తాగితే తాగనిది శరీరం నడిస్తే నడవనిది శరీరం మాట్లాడితే మాట్లాడనిది బట్టబయలు

54 కర్త కారయిత, విషయీ, మాయావి, గానిది బట్టబయలు

55 కారయిత గానిది బట్టబయలు

56 అచ్ఛేద్యమైనది (ఖండించబడనది) బట్టబయలు

57 అదాహ్యామైనది (కాల్చబడనిది) బట్టబయలు

58 అక్లేద్యమైనది (తడువనిది) బట్టబయలు

59 అశోష్యమైనది (ఇనికిపోనిది) బట్టబయలు

60 ఎందురు లేదు లేదన్నా ఉన్నది బట్టబయలు

61 శరీరాలలో చొరనిది వెళ్ళిపోనిది బట్టబయలు

62 తలకాయ కాళ్ళులేనిది బట్టబయలు

63 సాధన సాధ్య పరామర్శ రహితమైనది బట్టబయలు

64 రాకడపోకడ ఉనికి యేమి లేకపోవుట లేనిది బట్టబయలు

65 జగత్తు ఉన్నది లేదు అని యెరుగనిది బట్టబయలు

66 సర్వవ్యాపకమైనది బట్టబయలు

67 కుంఠితం గాని వైకుంఠమనే సౌజ్ఞగలది బట్టబయలు

68 శరీరానికి గల వికారాలు తనకు లేనిది బట్టబయలు

69 సుఖదుఃఖాలు లేనిది బట్టబయలు

70 స్వతంత్ర పరతంత్రాలు లేనిది బట్టబయలు

71 దొర గానిది బట్టబయలు

72 దొంగ గానిది బట్టబయలు

73 భ్రాంతి లేనిది బట్టబయలు

74 వృద్ధి బొందనిది బట్టబయలు

75 బక్కపడనిది బట్టబయలు

76 శరీరాన్ని పట్టనిది విడువనిది బట్టబయలు

77 ఇచ్ఛలేనిది బట్టబయలు

78 చలించనిది బట్టబయలు

79 యిరవై అయిదు తత్వాలకు ఆవలిది బట్టబయలు

80 క్షేత్రజ్ఞాఖ్య జీవోపాధిలేనిది బట్టబయలు

81 తత్వాతీతమైనది, తత్త్వంగానిది బట్టబయలు

82 ద్వైతాద్వైతరహిత పరమతత్వమైన మాట గానిది బట్టబయలు

83 జ్ఞానకర్మాలయందు భ్రాంతిలేనిది బట్టబయలు

84 యెవ్వరిమీద ఆపేక్షలేనిది బట్టబయలు

85 మహాద్వైతమైనది బట్టబయలు

86 మూలంలేని యీ గుర్తెరిగేశరీరం రాక మునుపు ఉన్నప్పుడు లేకపోయినప్పుడు సర్వకాలం ఉండేది బట్టబయలు

87 చూడపోతే లేదు, యెంత దూరం పోయినా యెడతెగక అంతట దట్టంగా యెక్కువ తక్కువలు లేక మనము పోక మునుపే ముందర ముందర స్వతస్సిద్ధమై ఉన్నది బట్టబయలు

88 కదలనిది బట్టబయలు

89 మెదలనిది బట్టబయలు

90 యెరుక లేనిది బట్టబయలు

91 కలలో శరీరాలు, యీ శరీరాలు యెన్ని తిప్పలుబడినా యేమి అననిది బట్టబయలు

92 గుర్తెరిగే చైతన్యం అనేజ్ఞానమున్ను అనేకచిత్రవిచిత్రములైన కర్మాలున్ను లేనిది బట్టబయలు

93 ప్రపంచం తనలో ఉన్నా ప్రపంచముతో సంబంధము లేనిది బట్టబయలు

94 తనకు తానేయున్నది బట్టబయలు

95 పుట్టనిది చావనిది బట్టబయలు

96 ఒకదాన్ని పుట్టించనిది బట్టబయలు

97 సర్వకాలం యేకప్రకారంగా నున్నది బట్టబయలు

98 బంధమోక్ష శూన్యమైనది బట్టబయలు

99 జ్ఞానకర్మ సాధనద్వయము యొక్క అపేక్షలేనిది బట్టబయలు

100 జ్ఞానకర్మాలచేత సాధ్యముకానిది బట్టబయలు

101 భేదాబేద రహితమైనది బట్టబయలు

102 జ్ఞాన భక్తి వైరాగ్య శూన్యమైనది బట్టబయలు

103 తన సంబంధంగానిది శరీరాలు గానిది బట్టబయలు

104 ఉదక పానం చెయ్యనిది బట్టబయలు

105 సుఖదుఃఖాలు యేమాత్రమైనా లేనిది బట్టబయలు

106 లింగత్రయం గానిది బట్టబయలు

107 ఇచ్ఛ లేనిది బట్టబయలు

108 వాదించనిది బట్టబయలు

109 తత్వం వంటిది కానిది బట్టబయలు

110 క్షేత్రక్షేత్రజ్ఞ రూపమైన లక్ష్యలక్షణ రహితమైనది బట్టబయలు

111 దేహిదేహాలు గానిది బట్టబయలు

112 విషయీ విషయాలు గానిది బట్టబయలు

113 దృగ్దృశ్యాలు గానిది బట్టబయలు

114 జీవేశ్వరులు గానిది బట్టబయలు

115 ఆత్మబ్రహ్మాలు గానిది బట్టబయలు

116 యేమీ అనుకోనిది బట్టబయలు

117 యెన్నటికీ చలనం లేనిది బట్టబయలు

118 రతి కర్మ లేనిది బట్టబయలు

119 విష్ణువనే వ్యాపకమైనది బట్టబయలు
120 గుణాలు లేనిది బట్టబయలు
121 వికారాలు లేనిది బట్టబయలు
122 క్షరాక్షర విలక్షణమైన ఉత్తమ పురుషుడైనది బట్టబయలు
123 స్త్రీ లింగం, పుం లింగం, నపుంసక లింగాలు గానిది బట్టబయలు
124 కొట్టనిది బట్టబయలు
125 కొట్టబడనిది బట్టబయలు
126 యేమి అడిగినా చెప్పనిది బట్టబయలు
127 తానువున్నానని యెరుగనిది బట్టబయలు
128 శరీరాలు లేవని యెరుగనిది బట్టబయలు
129 మహా గుహ్యమైనది బట్టబయలు
130 పరమ గుహ్యమైనది బట్టబయలు
131 మహా రహస్యమైనది బట్టబయలు
132 యితర లోకాంతర స్మరణ లేనిది జీవన్ముక్తి విదేహముక్తి నిత్యముక్తి లేనిది బట్టబయలు
133 ఇంతా అంతా అని ప్రమాణం లేనిది బట్టబయలు
134 సమస్తమైన వస్తువులకు అతీతమైనది బట్టబయలు
135 యితర స్మరణ లేనిది బట్టబయలు
136 భగవానులు గానిది బట్టబయలు
137 సత్యమని గ్రహించనిది బట్టబయలు
138 అసత్యమని గ్రహించనిది బట్టబయలు
139 నిశ్చయ సంశయాలు లేనిది బట్టబయలు
140 ఆత్మానాత్మల వ్యవహారం లేనిది బట్టబయలు
141 వేదశాస్త్రాల యొక్క నిర్ణయం చెయ్యనిది బట్టబయలు
142 గురుసూచన లేనివారికి కనుక్కోరానిది బట్టబయలు
143 గురుసూచన అయినవారికి గురు శిష్య ప్రపంచములు లేక తానే వున్నది బట్టబయలు
144 క్షేత్రక్షేత్రజ్ఞ రహితమైనది బట్టబయలు

145 క్షరాక్షరోపాధి ద్వయదోష రహితమైనది బట్టబయలు

146 పరాపరప్రకృతి ద్వయదోష రహితమైనది బట్టబయలు

147 జీవేశ్వర ద్వయదోష రహితమైనది బట్టబయలు

148 ఆత్మానాత్మ ద్వయదోష రహితమైనది బట్టబయలు

149 కదాచిత్ నజాయతే అని వున్నది బట్టబయలు

150 ఆత్మబ్రహ్మోపాధిద్వయ దోష రహితమైనది బట్టబయలు

151 సదసద్రూప ద్వయ దోష రహితమైనది బట్టబయలు

152 జ్ఞానాజ్ఞాన ద్వయ దోష రహితమైనది బట్టబయలు

153 విద్యావిద్య ద్వయ దోష రహితమైనది బట్టబయలు

154 దృగ్దృశ్య ద్వయ దోష రహితమైనది బట్టబయలు

155 ప్రకృతి పురుష ద్వయ దోష రహితమైనది బట్టబయలు

156 విషయీవిషయ ద్వయ దోష రహితమైనది బట్టబయలు

157 సాక్ష్యసాక్షి ద్వయ దోష రహితమైనది బట్టబయలు

158 శివశక్తి ద్వయ దోష రహితమైనది బట్టబయలు

159 దేహీ దేహ ద్వయ దోష రహితమైనది బట్టబయలు

160 క్షేత్ర క్షేత్రజ్ఞోపాధి ద్వయ దోష రహితమైనది బట్టబయలు

161 తిననిది బట్టబయలు

162 లిప్తము గానిది కారణపంచకము గానిది మరణ సుషుప్తి మూర్ఛాసమాధి తూష్ణీభూతావస్థల యందు గుర్తెరిగే శరీరముగాక యేమిలేక వున్నది బట్టబయలు

163 ఆత్మ బ్రహ్మ అని గుర్తెరిగే చైతన్యమును యెరుగనిది బట్టబయలు

164 స్థూల,సూక్ష్మ,కారణ, మహాకారణములనే దేహచతుష్టయమున్ను, జాగ్రత్స్వప్న, సుషుప్తి తురీయములనే, నాలుగవస్థలున్ను విశ్వ, తైజస, ప్రాజ్ఞ ప్రత్యగాత్మ లనే నాలుగు అభిమానులున్ను కలిసిన యీ పన్నెండు లేనిది బట్టబయలు

165 పంచప్రాణములు దశేంద్రియములు, అంతఃకరణరూపమైన జ్ఞానమున్ను కలిసిన షోడశ వికారములు లేనిది బట్టబయలు

166 నేను రాకమునుపే వున్నదిగాని, నాకు తెలుసుకో రానిది బట్టబయలు

167 అత్యంతస్వచ్ఛమైనది కృష్ణశంకరులనే హరిహరులకు మెప్పైనది బట్టబయలు

170 చూడనిది బట్టబయలు

171 యిదే క్షరాక్షరాభ్యాం విలక్షణః అయినది బట్టబయలు

172 యస్మాత్ అక్షరమతీతోహం అక్షరాదపి చోత్తమః అని వున్నది బట్టబయలు

173 షడ్వింశః పురుషోత్తమః ఇరువై ఆరోది అని వున్నది బట్టబయలు

174 దీనికి క్షేత్రములేదు గనుక క్షేత్రజ్ఞుడు లేనిది బట్టబయలు

175 చేసేది చేయించేదికాదు బట్టబయలు

176 నవద్వారపురే దేహే నైవ కుర్వన్నకారయేత్ అని వున్నది

177 వున్నదనే నిర్ణయం లేదనే నిర్ణయం లేనిది

178 యీ నామరూపాలు లేనిదానికి ఆత్మ అని, బ్రహ్మ అని, జ్ఞప్తి అని పేర్లు కలతగురువులు పెట్టినారు

179 ఇదిపుట్టదు పుటించదు సర్వకాలం ఒక్క తీరుగా వున్నది ఉండి చెయ్యదు చేయించదు బట్టబయలు

180 యిది జ్ఞానాతీతం బట్టబయలు

181 నిర్ణయానికి రానిది బట్టబయలు

182 నిర్ణయం చెయ్యనిది బట్టబయలు

183 వత్తిలేని దీపము వంటిది బట్టబయలు

184 నిరూపాధికము బట్టబయలు

185 సుషుప్తి వంటిది బట్టబయలు

186 త్రివిధాహంకార రహితమైనది బట్టబయలు

187 జ్ఞానాజ్ఞానములు రెండు గానిది బట్టబయలు

188 నేననే మూలమాయ గానిది నేననే అంతఃకరణ లేనిది

189 మనోబుద్ధి చిత్తాహంకారములు లేనిది బట్టబయలు

190 అహం స్ఫురణ అనే పరాశక్తి లేనిది బట్టబయలు

191 సచ్చిదానంద రూపమైన సర్వసాక్షిణి అనే మాయ లేనిది బట్టబయలు

192 రాకడపోకడ గల అహం స్ఫురణను తగులక, రాకడ పోకడ లేక వున్నది బట్టబయలు

193 నేను వున్నాను నేను లేను అనేజ్ఞప్తిలేక వున్నది బట్టబయలు

194 ఉన్నదనబోతే యెరుక యెరుగదు, లేదనబోతే యెరుకలేదు గనుక బట్టబయలే ఉన్నది

195 ఇదే వ్యాప్యవ్యాపకాతీతం, జగద్వ్యాపకం జగత్తు తోటేపోవును ఇలాంటిది గానిది బట్టబయలు

196 విద్యావిద్యలకు మూలం కానిది బట్టబయలు

197 అక్షర పరబ్రహ్మము కంటె వేరైనది బట్టబయలు

198 అహం బ్రహ్మము అనే అనుభవము లేనిది బట్టబయలు

199 ఇది అదియని అనుభవము లేనిది బట్టబయలు

200 కార్యముకాదు కారణము కాదు బట్టబయలు

201 సర్వాన్ని గుర్తెరుగనిది బట్టబయలు

202 ప్రకృతి పురుషరహితమైనది బట్టబయలు

203 సంకోచవికాసములు లేనిది బట్టబయలు

204 సగుణ నిర్గుణములు కానిది బట్టబయలు

205 బ్రహ్మభ్రాంతి జగద్భ్రాంతి లేనిది బట్టబయలు

206 యీ గుర్తెరిగే చైతన్యము పుట్టకమునుపే, స్వతస్సిద్ధమై చలించక పరిపూర్ణముగా వున్నది బట్టబయలు

207 యీ గుర్తెరిగే మాయోపాధిలేని శుద్ధము బట్టబయలు

208 ప్రకాశములేనిది బట్టబయలు

209 ప్రవృత్తి నివృత్తులకు మూలము కానిది బట్టబయలు

210 ఒక్కటి అనేది రెండు అనేది లేక వున్నది బట్టబయలు

ఈ బోధ దక్షిణామూర్తి వారి బోధ వంటిది చెప్పి చూపరానిది గురుసూచనైతే సరిపోవును.

గద్యః

**ఇతి అచలగురు శ్రీ శివరామదీక్షిత ప్రభావే, వేదాంత విచారణే**
**పూర్వభాగే అచల వాక్యములు చతుర్థ ప్రకరణం సమాప్తం**



# 5. శంకరాచార్యులవారి వాక్యములు

1 యేమిలేని జీవుడు వున్నాడు అన్నాడు

2 అవిద్య వున్నది

3 ప్రకృతి వున్నది

4 ఆత్మ వున్నది

5 కారణము వున్నది

6 గుర్తెరిగే జ్ఞానం వున్నది

7 అజ్ఞానం లేదు

8 సచ్చిదానందం వున్నది

9 అసంప్రజ్ఞాత ఆత్మకం జగత్

10 వొక్కటే కాని రెండోది యేమీలేదు. రెండోది శరీరం

11 శరీరమును గుర్తెరిగేది వున్నది

12 ఈశ్వరుడు వున్నాడు

13 ప్రకృతులు రెండు

14 ప్రకృతి యేమీలేదు

15 పురుషుడు యేమీలేదు

16 పురుషుడే నేను ప్రకృతి యేమీలేదు

17 దేహం అబద్ధం

18 దేహి నిబద్ధి

19 జ్ఞానం యేమి చెయ్యదు అజడం

20 శరీరం యేమి యెరుగదు, జడం

21 జ్ఞాన సాన్నిధ్యం చేత శరీరం చేస్తుంది

22 గుర్తెరిగే జ్ఞానానికి వికారం లేదు

23 శరీరానికి అన్ని వికారాలు వున్నవి

24 జగత్తుకు గుర్తెరిగే బ్రహ్మము కారణం

25 శరీరము కార్యము

26 కార్య కారణాలకు బేధం లేదు
27 సువర్ణం అలంకార ఆభరణాలు యేలాగో అలాగే అన్నాడు
28 ఆడదాని వల్ల జగత్తు పుట్టింది
29 పురుషునికి స్త్రీ అనే ప్రకృతికి సంబంధం లేదు
30 బ్రహ్మమును నేను
31 వారివారి కర్మాల చేతపుడుతారు
32 కర్మాలకు కర్తలేదు, బోక్తలేదు
33 నేను అనేవాడు తానే
34 కర్మాలకు కర్తతానే, భోక్తతానే
35 నేను నేననే మాటలు గలది.
36 సర్వం ఆత్మే
37 సర్వం బ్రహ్మ స్వరూపమే
38 జగత్తులేదు
39 సర్వకాలం వొక్కతీరే
40 సర్వం అహంకారమే చేస్తుంది
41 వేదాలు తమకు తామే స్వతఃసిద్ధాలు
42 నేనే నేను
43 యీ సంసారం కల వంటిది
44 జాగ్రత కద్దు
45 స్వప్నం కద్దు
46 సుషుప్తి కద్దు
47 తుర్యం కద్దు (తుర్యాతీతం)
48 ఈ శరీరము లోనే కనుక్కోవలెను
49 శరీరము లోపటలేదు బైటలేదు, అంతా నిరాకారం అన్నాడు.
50 చిదాకాశం అన్నాడు
51 జడాకాశం అన్నడు

52 గుర్తెరిగే క్షేత్రజ్ఞ స్వరూపమనే ఆత్మ వలననే ఆకాశం పుట్టింది.

53 ఆత్మనః ఆకాశః సంభూతః

54 ఆకాశస్య గుణః శబ్ధో నిశ్శబ్ధో బ్రహ్మ ఉచ్చతే

55 మాట్లాడేది సగుణం అనెనా నిర్గుణమనేనా ? రెండూ చెపుతాడు.

56 గుర్తెరిగే చైతన్యం బ్రహ్మ గనుక గుర్తెరిగే చైతన్యం మాట్లాడదు అన్నాడు.

57 **శృతి॥ యేన వా పశ్యతి యేన వా శృణోతి యేన వా గన్దావా జిఘ్రతి**

**యేన వా వాచం వ్యాకరోతి యేనవా స్వాదు చాస్వాదుచ విజాతి** అని శ్రుతి వున్నది

58 గుర్తెరిగే చైతన్యం చేతనే మాట్లాడుతాడు

59 గుర్తెరిగే నేను నిర్గుణం

60 గుర్తెరుగబడే శరీరాలు సగుణం

61 నిర్గుణమే సగుణానికి కారణం

62 బ్రహ్మ జగత్కారణం అయితే కార్యాలు సగుణం, ఎలాగు అంటే అంతా నిర్గుణమే. సగుణం లేనేలేదు అని అన్నాడు. యివ్వి అన్నీ కలత వాక్యాలే.

ఇలాంటి కలత వాక్యాలన్నియు యెరుకకు సంబంధితములే గాని పరిపూర్ణమగు బట్టబయలుకు సరిపడవు. ఈ శంకరాచార్య వాక్యములలో ఒక్క వాక్యమైన బట్టబయలు ఇట్టిదని సూచన చేయలేదు, గనుక యెరుకను నమ్మరాదు, కలదోచిన శరీరాలు యేలాగో ఆలాగే మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు, ఈ ఉత్తబట్టబయలు యేమిలేదు, ఇదే సిద్ధాంతము, సిద్ధాంతమే రాద్ధాంతము.

గద్యః

**ఇతి అచలగురు శ్రీ శివరామదీక్షిత ప్రభావే, వేదాంత విచారణే**

**పూర్వభాగే శంకరాచార్య వాక్యములు పంచమ ప్రకరణం సమాప్తం.**



# 6. సాందీప వాక్యముల ప్రకరణం

ఈబోధ గలవారు కాలిన నులుకవంటివారు, చూచేటందుకు ఉన్నట్లు వున్నదిగాని, యేపనికి అక్కరకు రాదు.

1 ఆత్మైక్య శరీరరహితః । యస్త్వాత్మాశరీర మితిశ్రుతేః ॥

2 గురువాక్యము చేతనే వినేది, అడిగేది, చెప్పేది, పోయెను యీ శరీరమునందు లేనిది అడుగదు వినదు చెప్పదు.

3 వంచన రహితమైన శిష్యుడు వచ్చి అడిగితే చూతాము

4 మంచివారు ఈ శరీరమందు లేక అంతటా చలించకవుందురు

5 ఈ శరీరమందు, లేని స్వరూపం నిర్గుణం వుండును

6 జీవేశ్వరులకు మూలం లేకపోయెను అదే అంటే మూలమాయ తోటి పోయినది

7 సర్వకాలం వొక్కతీరే ఆయెను

8 శూన్యమనే వ్యాపకము లేకపోయెను

9 స్వతస్సిద్ధమై అచలమే నిలిచెను

10 తానే తాను అనే అనుభవము లేకపోయెను

11 ఈ శరీరమందు నేననే యెరుక లేక పోవటమే పరమశాంతి

12 గురువాక్యముచేత బ్రహ్మభ్రాంతి లేకపోయెను. త్రిపుటికి మూలము లేకపోయెను కనుక అదే భ్రాంతిలేని పరిపూర్ణబోధ సిద్ధాంతము.

13 యీ శరీరమందు ఆత్మ వున్నదనే భ్రాంతిపోయెను.

14 తనకు తానే బయలు అంతటా వుండెను. ఆదిమధ్యాంత రహితమాయెను

15 ప్రయత్నము చేసేది గుర్తెరిగే యెరుక లేకపోయెను.

16 గురుస్వామి మహత్తు యేమనిచెప్పవలెను, చెప్ప శక్యముగాదు దీనికి బదులు లేదు

17 అక్కడ జ్ఞప్తి అంటివా యెరుకలేదు, యెరుక ఉంటే జ్ఞప్తి.

18 ఆ జ్ఞానమునకు మూలమే లేకపోయెను గనుక నిర్మూలం అనబడెను.

19 అందుకే యెరుకమరుపులు లేనిది యీ శరీరమందు లేకనే వుండెనను మాట సర్వ అబద్ధమాయెను.

20 ఈలాగు చెప్పినవారికంటె అధికులులేరు, యీ శరీరమందు లేక వున్నవారికంటె అధికులు లేరు, యిదే పరమరరహస్యం.

21 వున్నది అనేది లేదనేది లేకపోయెను అప్పుడు వున్నదే వుండె సర్వకాలం వొక్కతీరె

22 దేవతా భ్రాంతితోటే దయ్యం విడిచినట్లు, గురువాక్యం చేత యెరుక విడిపోయెను.

23 వున్నది అంటివా యెరుక యెరుగదు, లేదంటివా యెరుకలేదు

24 ఈ శరీరమందు లేకవున్నది మాటే ఆడదు చూచుట యేలాగు వుండీ నిరార్ధకమే.

25 గురువాక్యంచేత యీ శరీరమందు వున్నదిపోయెను.లేనిది లేకపోయెను.

26 వున్నది యెన్నటికి చలించదు, రాదుపోదు. అదే చలనరహితమైన అచలం.

27 అదే అది, అందుకే క్రియా శూన్యుడు, కర్మానికి మూలంలేదు గనుక సర్వకాలం క్రియాశూన్యమే

28 అవస్థలకు మూలంలేదు గనుక సర్వకాలం వొక్కతీరే

29 జగద్వ్యాపకము అన్న బ్రహ్మము జగత్తు తోటే పోయెను

30 వ్యాప్య వ్యాపకానికి వేరేవున్నాది

31 యీ శరీరమందును అంతటా బట్టబయలే ఉన్నది. అదే ప్రకాశ రహితము

32 బ్రహ్మ మహేశ్వర్లకు మూలము లేకపోయెను.

33 అత్యంత విలక్షణమే వున్నది విలక్షణం సూర్యునియందు చీకటిలేనట్లే. శరీరమందులేని నిజమును సర్వకాలం లేకపోయెను

34 విద్యావిద్యలకు వున్నది మూలము గాక వున్నదానియందు నిప్పునకు చదలు తగిలినట్లు విమర్శరూపిణి అయిన విద్య తగిలివున్నది.

35 బట్టబయలే స్వతఃసిద్ధమై తనకు తానే వున్నది.

36 అక్షరపరబ్రహ్మము కంటె వేరే నిజస్వరూపం అందుకే యీ శరీరమందు లేకవున్నది

37 అహంబ్రహ్మము అనే అనుభవములేనిదే నిజస్వరూపము

38 యీ శరీరమందు వున్నదిలేక వున్నది గనుక గురువాక్యంచేత కల్పన రహితం ఆయెను"

39 అనుభవము లేనిదే అనుభవము. సర్వకాలం వొక్కతీరే కనుక అహం బ్రహ్మోస్మి అనే అనుభవము లేకుంటే యీ శరీరమందు లేకున్నట్లే వుండును.

40 వున్నది, కార్యముగాదు కారణముగాదు. యీ శరీరమందులేక వున్నది గనుక యీ శరీరమందు వున్న సాక్షిణి మాయారహితము అయినది.

41 యీ శరీరమందు లేనిదాని జాడా ధ్యానం యెన్నటికీ లేదు, సకలచింతలు గలది పోయెను, పరబ్రహ్మం నిరాకారమాయె గనుక లేకనే పోయెను.

42 యీ శరీరమందు వున్నది లేకనే వున్నది గనుక అహంబ్రహ్మాస్మి అని అనుభవమే మూలమాయ అనే చైతన్యం అని యెరిగేది

43 సర్వాన్ని గుర్తెరుగనిది గనుక అదే పరిపూర్ణము

44 చైతన్యము కంటె మాయ వేరేలేదు గనుక అదే సర్వానికి అధిష్టానం సర్వానికి అదే కారణ కార్యమున్ను అయింది.

45 ఈ శరీరమందు వున్నది లేక వున్నది, ప్రకృతి పురుషరహితము అయినది గనుక అంతటావున్నది యీ శరీరమందు యెన్నడులేదు

46 చైతన్యమే మూలమాయ అదే నిర్గుణ సగుణాలు.

47 చైతన్యం వున్నది భ్రాంతి వివర్తనము, వున్నదానికంటె వేరుగా వున్నట్లే తోస్తుంది గనుక పరబ్రహ్మమే వివర్తనము

48 ఈ శరీరమందు వికారాలు లేవు గనుక మూలమాయ వున్నట్లు తోచితే వున్నదానియందు దానికే తోచును లేదని దానికే తోచును.

49 మూల మాయతీతం శూన్యం చేసిన వారు సాందీపులనుకోవలెను, లేకపోయెనా వారి శిష్యుడు కృష్ణుడనే భగవానులేమో అనుకోవలెను, వారే గురుశిష్యులు

50 రాముడు శిష్యుడు కాడు, వశిష్ఠుడు గురువుకాడు, కోటి విధాలు విచారించినా వారితోను సమముకారు బ్రహ్మైవ వివర్తనము

51 యీ శరీరమందు లేకవున్న దానికి సంకోచములేదు, వికాసము లేదు

52 బ్రహ్మమనే తమస్సు తోచెను. ఉన్నదానికి తోచేదే లేదు

53 ఉన్నదానికి సమానమైనదిలేదు, యీ శరీరమందు లేకవున్నది గనుక బ్రహ్మము అన్న, మాయ అన్న, ప్రకృతిఅన్న, అవిద్యఅన్న, అజ్ఞానమన్న ఒక్కటే

54 మూడు గుణములకు మూలం యెన్నటికిలేదు

55 ఈ శరీరమందు లేకవున్నది సగుణముకాదు, నిర్గుణము కాదు అదే అది

56 ప్రకృతి పురుషునికి వేరు, యెన్నటికికాదు. సగుణమే, నిర్గుణము, నిర్గుణమే సగుణము

57 గుర్తెరిగేది మహామాయ." అదే అజ్ఞాన త్రయమని గుర్తెరుగుమా అదే స్వరూప సంధానము

58 అహంబ్రహ్మాస్మి అనే పరబ్రహ్మానుభవము అదే మహామాయ"

59 నిజమందు లేకనే తోచేది వివర్తనం అది యేలాగు వున్నదంటేను సూర్యునియందు చీకటి వున్నట్లు ఉక్కుస్థంభాన్ని పురుగు తొలిచినట్లు తొలుస్తుంది. నిప్పునకు చదలు తగిలినట్లు తగిలింది

60 ఇంతేకాని యీ శరీరమందులేకవున్న దానికి ఒక్కటైనా వికారం లేదు జన్మకర్మాలు లేవుగనుక అది సాందీవునికే యెరుక. తరువాత కృష్ణస్వామికే కాని మరివొకరు ఉన్నారని తోచదు

61 అదే అంటె జ్ఞానవైరాగ్యాలు భ్రాంతితోనే వున్నట్టు తోస్తుంది అహం బ్రహ్మాస్మియనే అనుభవము నిశ్చయమాయెను

62 బుద్ధిమంతులైన వారు యెరుకనే మూలమాయ అని యెరుగవలెను

63 బ్రహ్మభ్రాంతి యెంత పర్యంతము వుండునో అంత్యపర్యంతము మాయ రహితముకాదు

64 దీని మహిమ చెప్పశక్యముకాదు. లేనిది వొక్కటి వున్నది సంఖ్యకురాదుగనక అపరబ్రహ్మవున్నట్టు తోచదు. గురువాక్యముచేత సంశయం తొలుగును

65 ఉన్న దానియందు యీ గుర్తెరిగే చైతన్యము లేక వున్నట్టే వుండి బ్రహ్మాదిదేవతలు వున్నారని తనవంటివారితో చెప్పుకుంటూ వుండును

66 గురువుగలిగితే సూర్యుని యందు చీకటి లేనట్టే యెన్నటికి లేకపోవును. లేకనే వున్నట్టు వుండును

67 ఉన్నది పుట్టని చావనిదిగనుక ఉత్పత్తికి మూలం యెన్నడు లేదు, గురుకృప కలిగినదాక సృష్టిభ్రాంతి తప్పదు

68 అటుతర్వాత నిర్ణయమేలేదు, రెండోది లేదు, గనుక 'బోధోహి' భయహేతుః అని వున్నది గనుక **ద్వితీయా ద్వైభ్యం భవేత్** అనిశ్రుతి ఉన్నది గనుక అబేధమే బేదమనుకోండి

69 బ్రహ్మమే మాయ, అహంకారస్వరూపముగనుక అదిగాక జగద్విలక్షణమైనసాక్షిణి. మాయామయమే విశ్వము, బ్రహ్మమే జగత్తు, జగత్తెబ్రహ్మము,

70 అందరు, యీ గుర్తెరిగే చైతన్యస్వరూపులే. అందుకే ఆత్మ యనేమాట, గురువాక్యము లేక బ్రహ్మభ్రాంతి పోదు.

71 గురువాక్యము గలిగితే అప్పుడే బ్రహ్మభ్రాంతితో గూడా జగద్భ్రాంతి సర్వకాలం

లేకపోవును. గురువాక్యముకంటె అధికంలేదు. అటుతరువాతది వున్నదే వున్నది సర్వకాలం వొక్కతీరె.

72 ఈ శరీరమందు వున్నది లేక వున్నది, గనుక నిజస్వరూపము. యీ గుర్తెరిగే చైతన్యము పుట్టకమునుపే స్వతః సిద్ధమై చలించక పరిపూర్ణముగావున్నది

73 గురువాక్యం చేత సకలసంశయరహితము తనకు తానే అవును, అది వారి శిష్యులకేకాని మరి వొకరికి వారి ప్రభావము తెలియదు.

74 చైతన్యమే రెండు, సగుణనిర్గుణము చైతన్యమనే, గుర్తెరిగే మాయోపాధి లేనిది శుద్ధమనే నిర్ణయము. శుద్ధము కంటె అధికము లేదు.

75 చైతన్యమనే మాయకే శబలమనె సౌజ్ఞ యీగుర్తెరిగే చైతన్యమే సగుణ, నిర్గుణ బ్రహ్మము

76 యిరువై అయిదోది పరమాత్మ, అదే పరమపురుషుడు. పురుషుడు ప్రకృతితోటిపోయెను గనుక యీ శరీరమందు లేనిది లేకపోయితె వున్నది సర్వత్రా వున్నది

77 యీ శరీరమందు యెన్నడులేదు. వ్యాప్యవ్యాపకము కంటె వేరే, కనుక అనుభవము లేకనే స్వతఃస్సిద్ధమై యుండును.

78 యస్మాత్ క్షరమతీ తోహం అక్షరాదపిచోత్తమః అని భగవద్వాక్యం వున్నది గనుక అక్షర పరబ్రహ్మము కంటె వేరే ఉన్నది అని సిద్ధాంతము.

79 అక్షరాదపిచోత్తమః మూలప్రకృతి కంటే వేరే నిజస్వరూపము ప్రకాశములేని ప్రకాశము నిజానికి స్వభావము. నిజము వలెనే అత్యంత గురుసాంప్రదాయరహితులకు తోచును.

80 నిజము శబ్ధాతీతం అయివున్న దానికి యేమీతోచదు. యీ శరీరమందు వున్నది లేక వున్నది గనుక ప్రవృత్తికి మూలంలేదు, నివృత్తికి మూలం లేదు

81 గురుసామర్థ్యం చేత ఉన్నదానికి సామర్థ్యం లేదు అదే అది గనుక ముగ్గురికి మూలంలేదు

82 యెరుకే పరమేశ్వరుడు, యెరుకే మహత్తత్వం, దానికి మూలం శూన్యము, అవతారములకు మూలము శూన్యము, యెరుకే అవ్యాకృతం.

83 అందుకే జ్ఞానసామర్థ్యము, యెరుకకే యిచ్ఛాశక్తి, క్రియాశక్తి కద్దు, ప్రపంచములో యెరుకకన్న అధికమైనది లేదు యని యెరుక చెప్పుకున్నది.

84 జ్ఞానానికే సకల సామార్థ్యాలు గలవు దానిచేతనే వెర్రివాణ్ని చేసె, గురుకృపచేతగాని ఆ వెర్రి తీరదు.

85 సాందీపుని వంటి గురువుకావలె, కృష్ణస్వామివంటి శిష్యుడు దొరికితే ఆ వెర్రి తీరుతుంది.

86 యెరుకకే త్రిపుటి అనేసౌంజ్ఞ, సకల సంకల్పాలు యెరుకకే, గురుకృపచేత మూలమాయ సర్వకాలం లేక పోవును. యెరుకతోనే సర్వంతోచును.

87 అవస్థలకు మూలం యెరుకే, సర్వం జ్ఞప్తియనే మాయ అని దృఢం, సూర్యునియందు చీకటిలేనట్లు నిజమందు వొక్కటియనేది రెండు అనేది యెన్నడూలేదు

88 అహంబ్రహ్మాస్మి అనే మూలమాయ క్షేత్రజ్ఞస్వరూపమనే మూలమాయ గనుక యిరవైఅయిదో తత్వమనే యీ ఆత్మనే పరబ్రహ్మ స్వరూపము అన్నారు.

89 అయమాత్మ బ్రహ్మ అనే శ్రుతి వున్నది గనుక పంచవింశతి ఆత్మాభవతి అనే శ్రుతి వుండనే వున్నది

90 యిరువై అయిదో వాడు జీవుడున్ను, ఈశ్వరుడే క్షేత్రజ్ఞుడే జీవాత్మ, జీవాత్మే అక్షర పరబ్రహ్మము అన్నారు.

91 ఈ అక్షర పరబ్రహ్మమును యీ శరీరమందు లేకుండా యెవ్వరుచేతురో వారే సాందీపులు

92 యీ శరీరమందు లేక అంతటా యెవ్వరున్నారో వారె అక్షర పరబ్రహ్మము కంటె అతీతులు, వారికి పరబ్రహ్మము వున్నది అనే భ్రాంతి యెన్నడూ లేదు.

94 అది యేలాగంటె, వున్నది దేహాకారం యెన్నటికికాదుకనుక వున్నది, వున్నట్టే వున్నది.

95 ఈ శరీరం లేదు గనుక యీ శరీరమందు యెన్నడు లేదు. స్వతఃసిద్ధమైన పరిపూర్ణము యెందులో ప్రవేశిస్తుంది, యెక్కడికిపోవును, మరల యెక్కడికి వస్తుంది

96 గురు వాక్యం చేత యీ శరీరమందు వున్నదాన్ని సర్వకాలం లేకుండా చేసేది గనుక వొక్కటైనా భ్రాంతిలేకపోయె. యింతకంటె అధికంలేదు"

97 యీ గుర్తెరిగే మూలమాయ ఏలాగు వున్నదంటే సూర్యునియందు చీకటి వున్నదన్నట్టువుండి వుక్కుస్తంభాన్ని పురుగుతొల్చినట్టు తొలుస్తూ నిప్పుకు చెదలు తగిలినట్టు పట్టివున్నది.

98 ఇటువంటిదాన్ని లేకుడా చేతామని ప్రయత్నమే వున్నదానికి విఘ్నము యేలాగైనాకాని గురువులేక నివారణముకాదు

99 అందుకే "శ్రీకృష్ణస్వామి సాందీపుని వద్దకిపోతే దృష్టాంతాలు చెప్పంగానే యీ

శరీరమందులేక సర్వత్రా మరల వున్నవాడు అయ్యి కట్టెలమోపులు మోసినాడు." అలాగే బలరాముడు కుచేలుడు. వశిష్టాదుల కంటె పెద్దలు బ్రాహ్మణులు కూడా గురుసేవా చేసినారు.

100 సదాచారసంపన్నులు గనుక వారికి తల్లి దండ్రి లేక దేవతా భ్రాంతిలేక అగ్రవర్ణ సంబంధములేక వున్నారు

101 యెరుక చేతనే వెర్రిచేసె, గురుకృపచేతనే గాని ఆ వెర్రి తీరదు

102 కృష్ణస్వామి వారిని వివరిస్తే స్వామి అనుకున్నాడు గనుక సాందీపుని కంటె యెవ్వరు అధికులులేదు, స్వామి యేలాగు వున్నాడో అలాగే కనుక్కున్నాడు. గనుక తమరు అలాగేవున్నారు.

103 ఇద్దరికి ప్రపంచం వున్నదని యెరుకలేదు, లేదని యెరుకలేదు, దాని స్పర్శలేదు

104 యీ శరీరమందు వున్నది లేక వున్నారు గనుక లేనిది లేక వున్నారు. అలాగే యెవ్వరికి సూచన అయితే వారల్లా అటువంటివారే అయ్యి ఉంటారు.

105 భావాభావ వివర్జితం అని వున్నది కనుక అందుకే "యిరువై అరోవాడు యేలాగు వున్నాడో అలాగే వున్నాడు", సాక్షిణి మాయ సర్వకాలం లేకవున్నవాడు.

106 వారికి యిరువై అయిదోవాడు సూర్యునియందు చీకటిలేనట్టే. సర్వకాలం లేకవున్నారు. వారికి వుక్కుస్తంభాన్ని తొలిచేటందుకు పురుగుకు శక్యముకాదు, అలాగే యీ మూలమాయ వారిని చలింపచేసేటందుకు శక్యముకాదు, నిప్పుకు చదలు బట్టెటందుకు యేలాగు శక్యముకాదో ఆలాగే గురువాక్యం తెలిసిన వారిని చెడగొట్టేందుకు శక్యముకాదు.

107 ఉన్నది వున్నట్టే వున్నది గనుక అది వ్యాపకముకాదు వ్యాప్యముగాదు. గనుక అది కారణముకాదు, కార్యము కాదు. గనుక యీ శరీరమందు యెన్నటికి లేదు

108 ఆదిమధ్యాంత శూన్యం గనుక నిజభక్తులకు బంధమోక్షరహితము చేసును. నిజవస్తువు, నిత్యనిర్గుణ, నిరాకారం, జ్ఞానంలేదు, గనుక వ్యవహారానికి మూలం లేకపోయెను. వ్యవహారం లేనిది నిజస్వరూపం.

109 మునిగినవాణ్ని తీసి బైటవెయ్యవలెను. మేలుకొన్నవాడు నిద్రబోయినవాణ్ని లేపవలెను.

110 గురువాక్యం చేత భ్రాంతిలేనివారికి, నిద్రలేదు, జాగ్రతలేదు, స్వప్నంలేదు, బ్రహ్మానుభవములేదు. సర్వకాలము వొక్కతీరే,

111 శరీరమందు వున్నది లేక వున్నది గనుక సర్వకాలం పరిణామ వికారములేక వున్నది వున్నది దేహంకారము యెన్నటికికాదు,

112 ఈ శరీరమందు సూర్యుని యందు చీకటి లేనట్టే జ్ఞానం యిందులేదు, అది లేకుంటే శుద్ధసంజ్ఞ. మహాఅద్వైతమే శుద్ధం అనిపించుకుంటుంది.

113 యీ గుర్తెరిగే చైతన్యమే అహంకారం ఇది లేకుంటే నిరహంకారం

114 యీ శరీరమందున్నది లేదు గనుక దృష్టాంతం లేదు. ఒక్కటిలేని ఒక్కటి గనుక ఉన్నది యెరుగదు, అందుకే ఎరుకతానుగాడు

115 ఆ యెరుక సూర్యునియందు చీకటివున్నట్టున్నది. యెరుకే అంతఃకరణము

116 అభేదజ్ఞానం లేనిదే శుద్ధం "యెరుకేలింగశరీరం" యీ దేహమువల్లను యెరుకపుట్టెను, సత్వాత్ సంజాయతె జ్ఞానం అని వున్నది అంటే సత్వగుణం నుండి జ్ఞానం పుట్టింది అన్నారు భగవానులు.

117 సూర్యునిచేత చీకటిపోయినట్టు గురుకృపచేత యెరుక లేకపోవును. అటుతరువాత వొక్కటైనా వికారం లేకపోవును. అవస్థలకు మూలం యెన్నడులేదు.

118 గురువాక్యం చేత సర్వాన్ని తీసుకపోయెగనుక యెరుకే స్వరూప అనుసంధానం అదే మహాకారణదేహం

119 సర్వాన్ని గుర్తెరిగే యెరుకే తుర్యావస్థ, నేను యెరుకగాను, వికారంలేని దేహమందులేని సర్వత్రావున్నది

120 ఉన్న దానికి అభిమానంలేదు, ఉన్నదానికి స్థానం లేదు ప్రమాణం లేదు, యీ శరీరమందు వున్నది లేదు గనుక గుణాలు లేనిది వున్నది

121 యెరుకకంటే విశేషం లేదు వొక్కటైనా వాసనలేనిది "

122 గురువాక్యం చేత వాసనాక్షయము ఆయెను. గురువాక్యం ఇటువంటిది. ఉన్నదానికి వొక్కటైనా అవస్థలేదు. సుఖదుఃఖ రహితమాయెను

123 ప్రత్యగాత్మ అనేయెరుకే అభిమాని. మహామాయ అనే క్షేత్రజ్ఞ స్వరూపము సూర్యునియందు చీకటిలేనట్టే యీ శరీరమందు ఆత్మ యెన్నడు లేదో ఉన్నదానియందు బ్రహ్మ అనేమాటలేదు.

124 యెరుక యెప్పుడు లేకపోతే అప్పుడే నామరూపం లేకపోవును. యెరుకలేకుంటే జ్ఞానంలేదు. సర్వజ్ఞత్వంలేదు, కించజ్ఞత్వంలేదు,

125 జ్ఞానం యెన్నడు లేదు గనుక యేదివున్నదో అదే శుద్ధం, దానికి మొదలు కొనలేదు గనుక అదేఅది, నామంలేదు రూపంలేదు

126 యీశరీరమందు వున్నది లేకవున్నది గనుక సర్వకాలం అదే వున్నది, మాట్లాడదు. చూడదు

127 త్రిపుటి యేలాగు వుండేనేని వినుట యెన్నడు సంభవించదు. అందుకే యీ శరీరమందు వున్నది యెన్నడులేదు. ఉన్నదానికి అర్థమాత్రసౌజ్ఞ

128 ఉన్నది కారణం గాదు, గనుక కార్యాలకు మూలం యెన్నడులేదు,

129 "యెరుకతోటే నాదంపోయెను. చిత్తేనాదం, చిత్తేకళ, చిత్తేబిందువు, వొక్కటి లేకుంటే అనేకాలు యెన్నడులేవు"

130 "యీ శరీరమందు వున్నది లేక వుండటమే శుద్ధప్రసాదము. యెంగిలి అన్నం యెన్నటికికాదు,"

131 ఉన్నది యెన్నడు తినదు గనుక ఒక్కటి లేకుంటే అనేకాలకు మూలం యెన్నడు లేదు

132 బింబం లేదు గనుక ప్రతిబింబం యెన్నడు లేదు

133 యీ శరీరమందు వున్నదిలేక వున్నది గనుక వ్యవహారం కించిత్తు సంభవించదు'

134 నిరాకార నిరాభాసమైన దానికి యేలాగుచెప్పను. శక్యంలేదు, గనుక యేమీ చెప్పగూడదు.

135 సాధనములేదు భ్రమకు మూలం అహంబ్రహ్మాస్మి అనే జ్ఞప్తిరూపము గనుక యెన్ని చెప్పిన గురు సాంప్రదాయం లేక, ఉన్నది వున్నట్టుపడదు

136 ఉన్నదానియందు సూర్యునియందు చీకటి లేనట్టే పరబ్రహ్మ స్వరూపం యెన్నడు లేదు

137 ఉన్నదానికి వికారాలు లేవు గనుక పరబ్రహ్మ స్వరూపం వంటిది యెన్నటికి కాదు

138 భ్రాంతికి మూలం అదే కనుక గుణత్రయానికి మూలం యెన్నడులేదు. యీ గుర్తెరిగే చైతన్యమునకు మాయాజ్ఞానమని వున్నది

139 యీ గుర్తెరిగే శరీరం కంటే మునుపే నిజస్వరూపం తానే తానై స్వతస్సిద్ధమై వున్నది

140 ముఖ్య అరుంధతివంటి నిరాలంబస్థూలం అరుంధతితోటే ప్రయోజనం వొడిశెను.

141 యీ శరీరమందు వున్నది గుర్తెరిగే చైతన్యం విసర్జించితే నిరాలంబమే స్వతస్సిద్ధము"

142 సాక్షిత్వం నిషిద్ధమని గుర్తెరిగేది, స్థూల అరుంధతివంటిది గనుక దానికి ప్రయోజనము తీరెను.

143 ముఖ్య అరుంధతి దొరికెను గనుక యిది జ్ఞాపకం వస్తే అదే చైతన్యము

144 అందుకే యీ గుర్తెరిగే చైతన్యం అనే పరబ్రహ్మం నీవుకావు. అది లేకుంటే యేలాగు వున్నదో అదే నిజస్వరూపమనే అచలం"

145 అది శుద్ధమని కీర్తిలేదు, వొక్కటైనా బాధలేదు, గనుక శుద్ధం గుర్తెరిగే చైతన్యమని నమ్మకుమా! యిది మహారహస్యం. యింతకంటే అధికంలేదు.

గద్యః

ఇతి అచలగురు శ్రీ శివరామదీక్షిత ప్రభావే, వేదాంత విచారణే

పూర్వభాగే సాందీప వాక్యములు షష్ఠమ ప్రకరణం సమాప్తం







# 7. అఖండానుభవ రహిత ప్రకరణము

శ్లో॥ బ్రహ్మానందం పరమసుఖదం కేవలంజ్ఞానమూర్తిం
ద్వంద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యం
ఏకం నిత్యం విమల మచలం సర్వధీ సాక్షిభూతం
భావతీతం త్రిగుణరహితం సద్గురుం తం న్నమామి ॥

1. ద్వౌ, అంటే యెటువంటివారికి తెలియవలెను. ఆ ప్రకారం దానికి వున్నదని చెప్పరాదు. రెండవది మరి వొకటి. అహంకారం వున్నదని చెప్పరాదు.

2. అంతా తానులేని తానే నిశ్చయం.

3. యీ దేహములో అహంకారం వున్నది. అహంకారం లేనిది వున్నది గురువాక్యం లేక తెలియదు

4. అహంకారం లేని స్వరూపం వున్నట్టు తోచును. గురువాక్యానంతరం స్వతఃసిద్ధమేవ.

5. జ్ఞానభక్తి వైరాగ్యాలు అహంకారానికే - గురువాక్యానంతరం సాధనాసాధ్య, పరామర్శరహితం. శిరచ్ఛేదవత్ - అహంకార రహితమేవ పుణ్యాపాపరహితం.

6. తానులేని తనకు యెవరు కర్త ? సర్వకాలం తానులేని పిమ్మట తానులేని తానే ఉంటుంది.

7. నేను యేమీలేదు - నీవు యేమీలేదు - మీతోటి యేమి చెప్పను ?

8. నేను నీవు లేని తరువాత యేది వున్నదో అది వుండజూచి అదే బయలని నిశ్చయించుకొని అదే అంతా అని అభ్యాసం చేయువలె. చేస్తే అది అఖండానుభవరహితం అగును.

9. ఏమి చేసినా అదే. యేమి చూచినా అదే. యేమి మాట్లాడినా అదే. మాటిమాటికి విన్నా అదే. చెప్పినా అదే. అదే అంటే బట్టబయలు.

10. అది యెటువంటిదో అటువంటిదే అంతా. దానికి నామం లేదు. రూపం లేదు. అంతా తానే - తానే అంతా. తానులేని తాను - నిజస్వరూపం

11. తనకు పుట్టుకలేదు. వునికి లేదు. యెప్పుడు యేకప్రకారం సర్వకాలం మౌనం

కర్తాభోక్తాతాను - తానులేని తాను - అనుభవ రహితం

12. తానులేనితనకు తానువుంటే యెరుక వున్నది మరుపువున్నది - నేను లేకుంటే రెండూ లేవు.

13. నేను లేనిది యెప్పుడు వున్నది - నేనువుంటే అది నేను కలిసి వున్నట్టు వుంటుంది. గనుక నేను అనే యెరుకే అహంకారం. అహంకారం లేనిదానియందు ఉన్నట్టు తోచినది.

14. కప్పుతీస్తే పుట్టుకచావు లేనిదే వున్నది. అహంకారం తనను యెరుగును - దేహాది పదార్థాలను యెరుగును. అహంకారం లేనిదాన్ని యెరుగదు.

15. 'అహంకారమే జగత్తుకు వేదశాస్త్రాలకు బీజం. విత్తనం జ్ఞానస్వరూపం అదే.' కర్మస్వరూపం

16. అహంకారము లేనిదానికి జ్ఞానకాండ యెందుకు? కర్మకాండ యెందుకు ? తానే నిర్మలజ్ఞానం తానే నిజబోధ, తానే ఆద్యంతరహితం, శూన్యం.

17. తాననేటి వృత్తి నాశరహితం. తానే వృద్ధి క్షయరహితం - తానుకొట్టదు - తాను కొట్టబడదు. తాను యేమిటిని కొట్టతాడు తాను యేమిటిని చంపుతాడు - సచ్చిదానంద రహితుడు తాను అయివుంటే మంచిది.

18. ఇదిగాక తాను మరివొకడు కాడు. దేహముకాదు - తానేతాను, తాను తాను అంటే యెరుక. తాననుట యెరుకకాదా - సుషుప్తియందు - వున్నదే అని సంశయపడితే రెండోది యేమీలేదు - యెరుకే అన్నది - హీనవికారమైన యెరుక యేమీయెరుగక ఉండును.

19. ఆచార్యప్రసాదం గలవారికి బయలే వున్నది, లేనిది యెరుక లేనేలేదు- ప్రసాదమంటే అన్నమని భ్రమతోచింది, 'ప్రసాదమంటే అనుగ్రహము.'

శ్లో॥ ప్రసాదే సర్వదుఃఖానాం హానిరస్యోపజాయతే
ప్రసన్న చేతసోహ్యాసు బుద్ధిః పర్యవతిష్ఠతి ॥

20. అని వున్నది గనుక సర్వకాలం ఒకప్రకారం వుండును గనుక, నేను పోతే అంతాపోయే, నేను వుంటే అంతావున్నది, నేను లేకుండ చెప్పిన వారు గురువులు.

21. యెరుక లేదని తెలిసితే "జ్ఞాన భక్తి వైరాగ్యాలు లేవు. యెవరు గురువులు, వినేవారు యెవరు, చేప్పేవారు యెవరు, భ్రాంతికి మూలం యెవ్వరు? భ్రాంతికి మూలం నేనుయనే యెరుకే కదా!

22. నా దేహం, నా మనసు, నా చిత్తం, నా చీరె, నా రవికె, నా ముంత, నా చెంబు, నేను వేరే, దేహం వేరే, నేను దేహమును గుర్తెరుగుదును, దేహము నన్ను గుర్తెరుగదు,

23. నన్ను నేను యెరుగుదు, దేహాదిపదార్థాలను యెరుగుదు, సర్వం నేను లేకుంటె సుఖము లేదు దుఃఖంలేదు. యింతకంటె దొడ్డది లేదు, యిటువంటివారు దొరికేది బహుదుర్లభము.

24. బహుమార్లు నేను లేదు, తానే అంతా వ్యవహారము లేదు, నేను అంతా అని వెరువక చేస్తే తప్పు. సర్వకాలం యెరుకకు వెరచి పరిపూర్ణమును అవలభించితే చాలు, వొక్క వ్యవహారము లేదు, అంతా తానే, తానే అంతా, అదే బట్టబయలు.

25. అంతా బట్టబయలే అని దేహపతన పర్యంతం యీలాగు యుక్తి వుంటే వ్యవహారానికి పనిలేదు, యిది సిద్ధాంతం, యిదే సత్యం యిదే మహారహస్యం, మహాగూడం, యేమీలేదు.

26. మళ్ళా నేను వుంటే జ్ఞానం వున్నది, అజ్ఞానం వున్నది, అహం అంటే అహంకారం, అహంకారము అంటే అహం, నేను అనేది దేహములో వున్నది, దేహములో నేను నిజమైతే అంతా నిబద్ధే, నేను లేకుంటే అంతా ఏమీలేదు,

26. నేను వొకకాలమందు వుండేది వొకకాలమందు లేకపొయ్యేది, అహంకారానికి స్వభావం నేను ఈ నేను లేక వుంటే లేనిమనస్సు లేనేలేదు, లేనిమాయ లేనేలేదు, లేనిమనస్సు లేక వుంటే వారు పుణ్యాపాపరహితులు, జనన మరణ భ్రాంతి రహితులు, నిష్ఠానేమ పర్యవసాన పరిసమాప్తి॥

**శృతి॥** **చిదః । ఇత్యుపదేశః । చిత్తమితి । కా ఉపదేశః ఏవంస్థూల అరుంధతి । దర్శనద్వారా ముఖ్య అరుంధతి । దర్శనవత్ । చిత్వా । ఇత్యుప దేశః । జీవత్వం చైతన్యం బ్రహ్మక్షేత్రజ్ఞ । లక్షణాఖ్యం । పరాప్రకృతి త్వత్ । చైతన్యదర్శనమేవ । స్థూల అరుంధతి దర్శన బ్రహ్మాదర్శనమేవ ।**

ముఖ్య అరుంధతి దర్శనంశఖ్యత్వాత్ నామరూపరహితమేవ । అస్తి ।
సూక్ష్మాత్మనామ దర్శనంచ చిద్రహితత్వాత్ చిదేవ అహంతత్త్వమితి ।
బోధేనాఖిలా । బోధామూర్ఖానాం ఉపదేశార్థం విధీయతే॥"

శ్లో॥ కర్మశాస్త్రేకులో జ్ఞానం తార్కేనైవాసైనిశ్చయః
సాంఖ్యయోగేభిషాపన్నః వాబ్ధికాశత తత్పరః ॥
ఏకం ఏవో వేదాంతజ్ఞాన స్వానుభూతి విరాజితే ॥

గద్యః

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే, వేదాంత విచారణే
పూర్వభాగే అఖండానుభవ రహిత సప్తమ ప్రకరణం సమాప్తం.
రెండవ భాగము సమాప్తము







ఓం

శ్రీగురవేనమః

శ్రీమద్బృహద్వాసిష్ఠ అచల సిద్ధాంత నిర్ధారణులును
శ్రీమించునచల పరిపూర్ణ బోధ ప్రతిష్ఠాపనాచార్యులగు
శ్రీమద్రామడుగు శ్రీశ్రీశ్రీ శివరామదీక్షితుల వారిచే రచియింపబడిన

# బృహద్వాసిష్ఠము

అను

# శ్రీ శివరామ దీక్షితీయము

## పరిపూర్ణ బోధ అచల సిద్ధాంత గ్రంథము

## జనన మరణ భ్రాంతి రహిత మార్గము



## మూడవ భాగము



# 1. శరీర రహిత ప్రకరణము

## ప్రథమ అధ్యాయం

## తుర్యాతీతం ప్రతిపాదించే నిశ్శబ్ద మార్గం

## అధ్యారోపాపవాదం

### 1. గుర్తెరిగే యెరుకను ఉన్నదనుట-రజ్జు సర్పభ్రాంతి వంటిది

**గురువు ॥** ఈ ఉత్త బట్ట బయలు ఏమిలేదు – ఇదే సిద్ధాంతం
మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమీలేదు ।
కోటిమాట్లకు ఇదేజ్ఞాపకం । యింత కంటె యెక్కువలేదు ।
గనుక । యిది మరువవద్దు

**శిష్యుడు॥** అది యేలాగు ?

**గురువు॥** కలలో శరీరం మేలుకొంటే యేమీ లేదు । అని నిశ్చయం
వున్నట్లు వుండవలెను ।

**శిష్యుడు॥** ఉంటే ?

**గురువు॥** 1. యీలాగైతేనే భ్రాంతిరహితం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరంతోటి । యేమివున్నాదని। ఆశపడ్డా । భ్రాంతి రహితం కాదు

2. యేమీలేని । మూలంలేని యీ గుర్తెరిరగే శరీరం । వున్నాదనే భ్రాంతే । రజ్జు సర్పభ్రాంతి । విచారిస్తే వుత్తతాడువలె వున్నది,

3. పుట్టనిచావనిది । బట్టబయలే ఉన్నది అదే సకల దేశాలయందు । సర్వ కాలాలయందు సమస్తమైన వస్తువులయందు । చలించక వుండంగా । పాము తోచినట్లు మూలంలేని యీ గుర్తెరిగే శరీరం తనంతట తానే తోచింది ఆలాగే । కలలో వచ్చిన శరీరం । వుండి మేలుకొంటే । యేమీ లేదు అని । నిశ్చయం అయినట్టు ।

4. గురువాక్యం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరము యేమీలేదు అని । చెప్పంగానే । అలాగే నిశ్చయంకావలెను । కాకపాయెనా । మరివక మార్గంలేదు

5. యేమార్గం నమ్మినా । రాజ మార్గం కాదు । దొంగ తోవలకు । లెక్కలేదు । యిటువంటి గురువాక్యం । మూడు కాలాలయందులేదు । ఇది నమ్మక । మరివకటి నమ్మెనా । ఆశ మాత్రమె కాని । భ్రాంతిపోదు । భ్రాంతి విస్తారం అవును ।

6. బుద్ధిమంతులు అయినవారికె గాని। మిగిలినవారికి శఖ్యం కాదు। యిదే భ్రాంతిలేని విచారం

7. గురుశేవ వున్న కొద్ది రుచి। గురుభక్తి విస్తారంగావున్న కొద్ది తనకు దృఢం గురువాక్యం విడువకూడదు। చచ్చు వరకు నిద్ర వచ్చు వరకు తాను లేని జ్ఞాపకం ఉంచుకోవలెను.

8. యిది జ్ఞానకర్మాల వంటి కలతవాక్యం కాదు। యింతకంటే అధికంలేదు। గనుక మరువరాదు.

## 2. శ్రీ రుక్మిణి కృష్ణసంవాదం

శ్రీకృష్ణస్వామి యొక్క జాగ్రత యిటువంటిది। స్వామి కంటె యెక్కువ అయింది శ్రీ రుక్మిణి అనే అమ్మవారు ఆమెదే జాగ్రత। యెక్కువ ఘట్టిది।

**శ్రీరుక్మిణి ॥** శ్రీకృష్ణస్వామి। సాందీపునిదగ్గెరికి పోయివచ్చిన తరువాత యేమి విచారిస్తిరి అని అడిగితే।

**శ్రీకృష్ణస్వామి ॥** చెప్పకుండగా మౌనముగా నుండెను.

**శ్రీరుక్మిణి ॥** సరే అని। సమాధాన పడ్డది

**శ్రీకృష్ణస్వామి ॥** యీామె నాకంటె ఘట్టిది అని। నేను మరచిపోయాను అని

ఆమెతో యీ మహావాక్యమైన। రహస్యం చెప్పినాడు।

"మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు" అని అన్నాడు।

**శ్రీరుక్మిణి ॥** అనంగానే। కలలో శరీరం మేలుకొంటే। యేమైనా వున్నదే।

అలాగే "మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు " అని అన్నది।

**శ్రీకృష్ణస్వామి॥** అంటే। శభాసు। అనినవ్వి। ఆమెయందు భక్తిగలవాడై వున్నాడు। మిగిలినవారు స్త్రీలేకాని। భ్రాంతిరహితులుగారు। అని శాంతి చేత వున్నాడు.

## 3. గురు శిష్య సంవాదం

**శిష్యుడు ॥** అట్లైతె కలలో వచ్చిన శరీరం । మేలుకొంటె యేమీలేదు । ఇది యేలాగు?

**గురువు ॥** మూలంలేని యీ గుర్తెరిగేశరీరం । గురువాక్యంచేత । మేలు కొంటె యేమీలేదు।

**శిష్యుడు ॥** సరిపోయెను । కలలో వచ్చిన శరీరం యీ శరీరం వక్కటేనా । యీషత్తు యేమైనా ఎక్కువా తక్కువా? ఉన్నాదా? ।

**గురువు ॥** శరీరానికి మూలంలేదు । గనుక రెండు సమానమే । కాని అది లేత శరీరం యిది ముదురు శరీరం ।

**శిష్యుడు ॥** అలాగు కాదు । గురో । దీనికంటె అదే పెద్దది । యిదే అనాధ ।

## 4. స్వప్న దృష్టాంతము

**గు॥** యేలాగంటె సిద్ధమైన యేనుగ । చౌడోలి । రాజు । అనేక కోట్ల గుఱ్ఱాలు । అనేక కోట్ల మనుష్యులు మూలంలేకనే వచ్చిరి । వచ్చినూరేండ్లు వుండి । సకలమైన ధర్మాధర్మాలుచేసిరి । అనేక మైన గోదానాలు । భూదానాలు చేసిరి ।

1. అందులో సన్యాసులు ।అద్వైతమె దొడ్డదని కొందరితో వాదించిరి.

2. పెద్ద వైష్ణవుడు । విశిష్ఠాద్వైతమని యుక్తిచేశి । అద్వైతం అఖండమనెను.

3. అందులో పెద్ద మద్వాచారి । యేమీలేని దేహాన్ని చూచి । జీవుడు వేరే । యీశ్వరుడు వేరే అని ద్వైతమే లెస్స అనిజేసినాడు ॥

4. అందులోనే భాస్కరాచార్యుడు అనే మనుష్యుడు జ్ఞానం నిబద్ధి అనే అది యేలాగంటే । కుక్కగుర్తెరిగే స్వభావం కలది । అలాగె అందరు తనకుతామే గుర్తెరిగేవారు । అందుకె తనకు తానే యెరుగును । అనేక కోట్లు వచ్చినా యెరుగును । యిది గుర్తెరిగేది అబేధ్యం । నాకంటే యెందరు వేరేవున్నారో అందరు అభేదమె అన్నాడు ।

5. అందుకే జ్ఞానం నిబద్దె । కర్మాలు నిబద్దే అన్నారు । గుర్తెరుగక । కర్మాలు చెయ్యరు గనుక । యీ గుర్తెరిగే జ్ఞానమే సకల కర్మాలు చేస్తుంది గనుక । కొందరు దేహం చేస్తుంది అని అన్నారు । అంటె తప్పుగాదు ।

6. అదె అంటె వచ్చేటప్పుడు గుర్తెరిగే జ్ఞానశరీరాలే వచ్చినవి । గనుక । వున్నంతసేపు జ్ఞానం వుండనే వున్నాది । మేలుకొంటే యేమీలేదని అందరికి యెరుకే

7. ఆ సిద్ధాంతాలు । కల మేలుకొంటె యేలాగుయేమీ లేదో । అలాగే । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని । చెప్పంగానె । పుట్టనిచావనిది । సకలదేశాలయందు । సర్వకాలాలయందు । సమస్తమైన వస్తువుల యందు । మొదలు కొనలేక । తనకుతానె స్వతఃసిద్ధమై వున్నదే బట్టబయలు।

## 5. సకల భ్రమలకు జ్ఞానమే మూలం

**గురువు ॥** 1. సర్వకాలం ఒక్కతీరె। అందుకె సకల భ్రమలకు మూలం। మూలంలేని యీ గుర్తెరిగే శరీరమేకాని । మరివకటిలేదు ।

2. గురువాక్యం తప్పవిడచి । శాస్త్రవాసనలో । ప్రవేసించెనా । భ్రాంతి తీరదు।

**శిష్యుడు ॥** 1. అయ్యా । కలలో వచ్చిన శరీరం మేలుకొంటె । యేమీలేదు అని దృఢం అందరికి కద్దుగదా నాకు మీరు । ఆ దేహమునకు మూలం లేదని చెప్పితిరి । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేసింది । నమ్మవద్దు అని అంటిరి।

2. మీరు నాకు మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదని చెప్పగానె యేదివున్నదో । అదే వుండె । యిక భ్రాంతి యెవరికి । మళ్లామళ్లా అంటరు । మహారాజవు । మీరుసరే కాని । నాకు మహా భయం।

**గురువు ॥** అట్లైతే । కలలో వచ్చి కొంత సేపువుండి । మేలుకొంటే సగం పోయి సగంవుంటుందె యేమీ భయం । యేమీలేదు ।

**శిష్యుడు ॥** అలాగె । యీ వాక్యంచేత । నాకు యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని దృఢం । చెప్పినప్పుడే అయింది ।

**గురువు ॥** యింతేకాని । సర్వకాలంలేదు గదా అనె ।

**శిష్యుడు ॥** అయ్యా । కలలోయెప్పుడైనా । యేడిస్తే । తనకు లేకవున్నా దుఃఖం వస్తుంది ।

## 6. సహవాస దోషము

**గురువు ॥** 1. బంగారాన్ని మూట కట్టుకొని పొయ్యేవారితో కూడా వకగవ్వ అయినా । యేమీ లేకవున్న వారుకూడాపోతె । భయంలేని వారికి భయం పుడుతుంది ।

2. యెరుకను నిజమని నమ్మి వున్నవారి సహవాస దోషంచేత । యెరుకనే సత్యమని దృడం అవుతుంది.

**శిష్యుడు ॥** అట్లైతే । వున్నవారికి లేనివారికి సహవాసం కద్దాలేదా ।

**గురువు ॥** కలలో కొందరికి కద్దు

**శిష్యుడు ॥** అట్లైతే । నీకు సుఖం దుఃఖం వున్నదా లేదా । నేనుయేమీ । నీవుయేమి వెర్రివారి సహవాసం వుంటె వెర్రి పట్టగలదు । నత్తివారి సహవాసం చేస్తె నత్తి వచ్చును।

**గురువు ॥** శబాషు । ఘట్టివాడవె । నీకు యింత దృఢం యెప్పుడు వున్నదో నా వద్దికి రాకు । నాతో కూడా వుండకు । నాజోలి పుచ్చుకోకు పో ।

**శిష్యుడు ॥** అయ్యా ! ఒకవిజ్ఞాపన । దృఢం యెవ్వరికి । వచ్చేది యేమి పొయ్యేది యేమి । కూడా వుండేదియేమి । అందరి జోలి పుచ్చుకునేది యేమి

**గురువు ॥** అట్లైతె । అడిగేవారు యెవరు అనె ।

**శిష్యుడు ॥** నాకు యేమీ తెలియదు । నేను చదువుకోలేదు । నేను యేమీ యెరుగను ।

**గురువు ॥** 1. యెరుగకుంటె జ్ఞానివె । అజ్ఞానివె । అని । నాకు యిటువంటి నీచపుమార్గం । చెప్పలేదు ।

2. మా గురుస్వామి । లంచగొండివారు కారు । నాకు రాజమార్గం సూచన చేశినారు । వారి వంటి వారు వారె కాని । వారికి బదులులేరు ।

## 7. బోధకు అనధికారులు

**శిష్యుడు ॥** ఆ మార్గం యెటువంటిది । స్వామి?

**గురువు ॥** అది పరమ గుహ్యాం । చెపుతాను విను.

1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అయివున్న । పతీతులకు చెప్పవద్దన్నారు.
2. శాస్త్రాలు నిబద్ధి అని నమ్మిన వారికి చెప్పవద్దన్నారు ।
3. దేవతా భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు ।
4. యెదురుబడి వాదించేవారికి చెప్పవద్దన్నారు ।
5. గురుశేవ చెయ్యని వారికి చెప్పవద్దన్నారు ।
6. నేనుయేది అంటె । అదె అనే మూర్ఖులకు చెప్పవద్దన్నారు
7. కర్మాలు నిబద్ధి అని నమ్మిన అప్రమాణులకు । చెప్పవద్దన్నారు।
8. స్త్రీల భ్రాంతి గలవారికి చెప్పవద్దన్నారు ।
9. జ్ఞాన భ్రాంతి గలవారికి చెప్పవద్దన్నారు.

10. భక్తిభ్రాంతి గలవారికి చెప్పవద్దన్నారు ।
11. వైరాగ్యం దొడ్డదనే మూర్ఖులకు చెప్పవద్దన్నారు
12. మొద్దుబుద్ధి గలవారికి చెప్పవద్దన్నారు ।
13. మోక్ష భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు ।
14. బద్ధులమని భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు ।
15. అనుభవ భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు ।
16. అదేనేను కావలెను । అనే భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు
17. అదేనేను అయితిని అని అనుభవం కావలెను అని భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు।
18. నేను నేను అని వాదించే వారికి చెప్పవద్దన్నారు ।
19. నామతమే దొడ్డది అనె వారికి చెప్పవద్దన్నారు ।
20. శ్రవణ భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు ।
21. మనన భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు ।
22. ధ్యాన భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు ।
23. ద్వైత భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు ।
24. అద్వైత భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు ।
25. విశిష్టాద్వైత భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు ।
26. మతాంతర భ్రాంతి వున్నవారికి చెప్పవద్దన్నారు ।

## 8. బోధకు అధికారులు

1. సూచన చెయ్యంగానె । కనుక్కునెవారికి । చెప్పుమన్నారు ।
2. అనుమానంలేని వారికి । చెప్పుమన్నారు ।
3. స్త్రీలేకాని । పురుషులేకాని । భ్రాంతిరహితం కావలెనని మిక్కిలి ఇచ్ఛ వున్నవారికి చెప్పుమన్నారు ।
4. "వొక్కటైనా భ్రాంతి లేకుండా । యెవ్వరు సూచన చేశారు । అని అత్యంత ఆసక్తి । గలవారిని । సంవత్సరం చూచి । సూక్ష్మ ప్రజ్ఞ వుండెనా సూచన చేసేది ।"
5. విద్యావిద్యాతీతమైన మార్గం దుర్లభం । అని దొంగతనంచేత వచ్చివుండెనా । సూచన

చేయకూడదు।

6. తనకుతాను గ్రహించెనా । మరిదొడ్డవాడని । అనిపించుకొని వాడికివాడే మునిగి పోతాడు కాని । పుట్టనిచావనిది । సకల దేశాలయందు । సర్వకాలాలయందు । సమస్తమైన వస్తువులయందు । మొదలు కొనాలేని అచలం యొక్క । జాడదొరకక । గాఢనిద్రలో కుక్కలు । పందులు । గాడుదులు । మునిగిమళ్ళా తేలినట్టు । తేలుతాడు।

**శిష్యుడు॥** యేలాగు చెప్పండి

**గురువు॥** బంధమని భయపెట్టి అది వేరే నీవు వేరే అని, అది నీవైతివని శంకరాచార్యులు అన్నట్టు కాదు, మా మార్గం రాజమార్గం.

**శిష్యుడు॥** అయ్యా! అది యెట్లు?

## 9. శంకరాచార్యుల వాక్యాలలో ఇలాగున ఉన్నది.

1. అందుకె శంకరులవారు । యేమీలేని జీవుడువున్నాడు అని అన్నాడు ।
2. అవిద్య వున్నదని అన్నాడు ।
3. ప్రకృతి వున్నదని అన్నాడు ।
4. ఆత్మ వున్నదని అన్నాడు ।
5. కారణం వున్నదని అన్నాడు ।
6. గుర్తెరిగే జ్ఞానం వున్నదని అన్నాడు ।
7. అజ్ఞానం లేదు అన్నాడు ।
8. సచ్ఛిదానందం వున్నదని అన్నాడు ।
9. జాగ్రత కద్దు అన్నాడు ।
10. సుషుప్తి అన్నాడు ।
11. తుర్యాతీతం అన్నాడు ।
12. జడాకాశం అన్నాడు ।
13. గుర్తెరిగే క్షేత్రజ్ఞస్వరూపమనే ఆత్మవలన । ఆకాశం పుట్టిందని అన్నాడు
14. యీ శరీరంలో । కనుక్కోవలె నన్నాడు ।
15. శరీరం లోపట లేదు బయటలేదు అన్నాడు ।
16. చిదాకాశం అన్నాడు ।
17. "ఆత్మానాకాశః సంభూత" । అని శ్రుతి అన్నాడు ।

18. "ఆకాశస్య గుణశ్శబ్ధో నిశ్శబ్ధో బ్రహ్మవుచ్చతె" అని వున్నది
19. మాట్లాడేది సగుణం అనెనా । నిర్గుణం అనెనా । అంటె గుర్తెరిగే చైతన్యం మాట్లాడదు అన్నాడు
20. "యేన వా వాచం వ్యాకరోతి" అని శృతి అన్నాడు ।
21. గురుతెరిగే చైతన్యం అనె । జ్ఞానం చేతనే మాట్లాడుతాడు అని వున్నాది.
22. గుర్తెరిగే నేను నిర్గుణం । గుర్తెరుగబడె శరీరాది పదార్థాలు సగుణం అన్నాడు ।
23. అచల గురుస్వామి కటాక్షం ఇతరుల వంటిది కాదు । ఇతరులు యేలాగైతేనేమి? కాకుంటె మనకు యేమి పని । మన మార్గం రాజమార్గము.

## 10. అచల గురు వాక్యం నమ్మిన వారు

1. బ్రహ్మసాక్షాత్కారం అయితె । మొదలుజేశేది సిద్ధం । సర్వకాలం శరీరం విడిచిలేదు । పట్టుకొనిలేదు । తనకుతానే అసుకొయ్యవలె తిరుగుతుంది । తనకుతానె స్వాధీనంలేదు । మందికేమి స్వాధీనం అయ్యేను । వున్నట్టువుంటుంది । చూస్తూ వుండంగానే యేమీలేదు । గనుక యెరుకను యెప్పుడు నమ్మరాదు ।

2. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అనె । నరకాన్ని విడువలేక సుఖమనె స్వర్గానికి ఆశపడితే । దుఃఖప్రాప్తి అయితె ।లింగమూర్తికి క్లేశమె । తనకుమహాక్లేశమె । అవును.

3. గుర్తెరిగే మహాలింగమైవున్నాడు । గనుక అందరు గుర్తెరిగేవారు । కాని । విష్ణుభక్తులు యీ గుర్తెరిగే చిత్తును । విష్ణువని । చిద్రూపమె నారాయణుండనె మాత్రమేకాని । స్వర్గ నరకములు । లింగమూర్తికి । నారాయణునికి । సమానమే ।

4. బియ్యానికి అనేక పేర్లు వున్నమాత్రమే కాని । సకల తిప్పలు బియ్యానికి యేలాగో అలాగే । కాని । మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని । తప్పించుకునే యుక్తి యెవరికీ గూఢం గానె వున్నాది.

5. యీ శరీరం పుట్టక మునుపు । శరీరం యేమీలేదు । చచ్చిన తర్వాత యీ శరీరం యేమీలేదు వున్న కాసంతసేపు మంది కూతలువిని । అనేక భ్రమల చేత । అనేక మంది వున్నట్టు । తానువుండి । విచారించి కొనకు । తాను యేమీలేదు ।

6. యీలాగే । అనేకముగా । వుండి । మళ్ళాయేమీలేదు । చచ్చిన వారు మళ్ళాపుడుతారు అనేటందుకు । యేమీ ఆధారం లేదు గనుక । యిది మళ్ళా పుడుతుంది అని యేలాగు అనవలెను ।

7. కలలో మర్యాద లేనట్టు । అనేకాలు తనకుతానె తోచి । తనకుతానె యేమీలేదు ।

8. యిటువంటి యెరుక వున్నదని భ్రాంతిపడే మాత్రమెకాని । వున్నది వున్నట్టు పడదు । ప్రసూతి అయితే చిన్నపిల్లకు । చంటిమీది ఆశవున్నట్టు యివి అన్ని కలత వాక్యాలే । తల్లికి ఆశ వుండే మాత్రమే, మహా ఉపద్రవం వస్తే యెవరి ఆశ ముందర పడదు।

10. తల్లికి తల్లే, పిల్లకు పిల్లే, ఎవరు చన్ను యిస్తే వారి మీదనే ఆశ తగులుతుంది. అందుకే తాను వుంటే ఆశనే తాను లేకుండ చేసే గురువు కావాలి.

11. దొంగ గురువు కాకుండా మాయా వేశాలు గాకుండా, శరీరంలేని సాంప్రదాయం విచారించి, శరీరం లేని పరిపూర్ణం ఉన్నది వున్నట్టు సూచన అయెనా ఒక్కటైనా భ్రాంతి పుట్టదు, భ్రమలకు మూలం లేని ఈ గుర్తెరిగే శరీరమే, గనుక యిది లేకుండా విచారించవలెను.

## 11. పరిపూర్ణ బోధ

1. యిప్పుడు యదార్థంగా వినుండి సంసారమంటె మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । యేమిచేస్తె అదే । సంసారం । శరీరం లేక మునుపు । కేవలం బట్టబయలుగానె వున్నాది ।

2. యీ శరీరం యేలాగు వచ్చినదంటె । ఫలాని దానివలన వచ్చినదని । ప్రమాణం లేదు । యీ గుర్తెరిగే శరీరమునకు । మొదలు యేమీలేదు । కొన యేమిలేదు । మొదలు వుంటె । యిది ప్రమాణమె అవును ।

3. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । యెప్పుడు యేమి లేదని గురుసూచన అయితే బట్టబయలే వుండె । సర్వకాలం యీ శరీరం యేమి లేదని నిశ్చయమవును.

4. యెరుక వ్యవహారం యెప్పుడు మొదలుబెడితె । అప్పుడేవున్నట్టు వుంటుంది । వ్యవహారం చాలించంగానె యేమీలేదు.

5. కల దోచిన శరీరాలు మేలుకొంటే యేమి లేనట్లు మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు, ఈ ఉత్త బట్టబయలు యేమిలేదు । ఇదే సిద్ధాంతము, సిద్ధాంతమే రాద్ధాంతము.

గద్య:

ఇతి అచలగురు శ్రీశివరామ దీక్షిత ప్రభావే । వేదాంత విచారణే ।
ఉత్తరభాగే శరీర రహిత ప్రథమ ప్రకరణం । ప్రథమాధ్యాయము సమాప్తం.



# 1. శరీర రహిత ప్రకరణం

## ద్వితీయ అధ్యాయం

**గురువు** ॥ మా సాంప్రదాయం భ్రాంతి లేని సాంప్రదాయం

**శిష్యుడు** ॥ యేలాగు చెప్పండి ।

### 1. స్వప్న దృష్టాంతము

**గు॥** 1. కలలో తనకుతానె। యీ గుర్తెరిగే శరీరం వచ్చి। తనకు తానె కొంత కాలంవుండి । వెంటనెయేమీలేదు ।

2. అలాగె । యీ గుర్తెరిగే శరీరమునకు । మూలంలేని । తనకు తానే తనవంటి మూలంలేని । ఆడదాన్ని చూచి । పెండ్లి ఆడి । కొడుకులగని । బిడ్డలగని । అనేకమైన ఆడవాండ్లను । మొగవాండ్లను । విడిచి । తన కలను మేల్కొని చూచే కలలో సంసారము ఏమైన ఉన్నదా?

**శి॥** 1. నాకు యీ సంసార భ్రాంతి తగిలింది నాకు శీఘ్రంగా భ్రాంతి లేకుండా । సాధనలు లేకుండా అనాయాసమైన రాజమార్గం సూచన చెయ్యండి ।

2. చేస్తె । శీఘ్రముగా కనుకుంటాను । ఇది మహాఅనాయాసమైన రాజమార్గం అని । అక్కడక్కడ విని వచ్చినాను

**గురు॥** యిది యెంత । రెప్పపాటుకంటె అనాయాసం । చెబుతాను వినుము.

**శి॥** నాకు మహా సముద్రం వలె వున్నది ।

**గురు॥** ఉండని । నీకు మహాతీవరం యెందుకు అనెను ।

**శి॥** అయ్యా చూస్తు వుండంగానె । యీ గుర్తెరిగే శరీరం యేమీలేక పోతుంది । అనే భయం నాకు ఉన్నది । అందుకోసం మహాతీవ్రం ।

### 2. ద్రాష్టాంతము

**గు॥** అయితే నీవు యేమి చెప్పమంటావు ।

**శి॥** పుట్టనిచావనిది సకలదేశాలయందు సర్వకాలాలయందు । సమస్తమైన వస్తువులయందు మొదలు కొనాలేనిది । చెలించక వున్నది । యెక్కడవున్నది । సూచన చేయండి.

**గు॥** అదియేమి । నీకు పదిరెండు దిక్కులందు నిండియున్నది. నాలుగుదిక్కులు ।

నాల్గు మూలల మీదా కిందా, నీలోపట, బయట బట్టబయలే ఉన్నది చూడుము.

శి॥ సరేకాని । నేను యేలాగుకాను అనెను?

గు॥ నీకు వున్నాదోలేదో అని అనుమానం లేదు కదా అనెను ।

శి॥ 1. నేనువున్నాను అన్నావున్నది । అనేక కోట్లకొద్ది । లేదు లేదు అన్నా ఈ బట్టబయలే వున్నది । నేను యింతసేపు యేమో అనుకున్న । ఆశ్చర్యపడ్డాను । యిపుడు అయితే । అది తప్పవిడిచి రెండోది యేమీలేదు ।

2. అది నాకు దృఢమె । యెటువంటి మూఢులకు । మూర్ఖులకు అయినను దృఢమె అవును యిది అనాయాసమె । అందుకె మీ మార్గం । రాజమార్గం ।

గు॥ ఘట్టివాడవె । మునుపెచెప్పితిమి గద ।

శి॥ మీ కాళ్ళకు మ్రొక్కుతాను । యింకొక్కసారి చెప్పండి ।

గు॥ అట్లైతె విను । కలలోదేహాలు యెక్కడనుంచి వచ్చినవి చెప్పుమా? ।

శి॥ యేమీలేదు । అవి తనకుతానె వచ్చినవి । తనకుతానె వున్నవి సమస్తమైన వ్యవహారాలు చేశినవి । మేలుకొంటె యేమీలేదు ।

గు॥ శభాసు । ధన్యుడవే । యెంతమంచి వాడవు । ఇంకేమైన తోచెనా?

శి॥ యీలాగు యెవరుచెప్పిరి । అని చూతామంటే । యేమీలేదు । యెప్పటి అచలమె వుండెను రాకడాలేదు । పోకడాలేదు । వున్నది వున్నట్టెవుండె ।

## 3. యెరిగే యెరుక లేనివాడే నిజమైన సన్యాసి

గు॥ 1. మునుపటి ఆడ మనిషికంటే దొడ్డవాడవు యీ విద్యకు తగ్గవాడవే । యీలాగు వుండవద్దా । యిదె మహాదొడ్డ గురుసాంప్రదాయం । మిగిలినవి దొంగత్రోవలు । ఛీ। వాటిని స్మరించరాదు । చూడరాదు । వినరాదు

2. యెరుక పుట్టనిచావని । అచలం వంటిది కాదు । రెండోది యేమీలేదు । యీ మార్గం సర్వకాలం వొక్కతీరే । చెయ్యటం యేమీలేదు । విడువటం యేమీలేదు

3. శరీర జన్యం । గుర్తెరిగే జ్ఞానం । అజ్ఞానం వలన కర్మాలు । యింతెకాని । శరీరంలేని బట్టబయలుకు । యెరుకాలేదు । కర్మాలులేవు । సర్వకాలం వొక్కతీరే।

4. యీ శరీరం యెటువంటిదంటె । సర్వశూన్యం యెటువంటిదో అటువంటిది ।

5. శరీరం లేకుంటె యేలాగువున్నదో, అలాగె పరిపూర్ణం వున్నది । మూలంలేని

యీ గుర్తెరిగే శరీరమనె ఆవరణం చేత వున్నారు. దానికే విచారణ.

6. యీ ఆవరణం అనాయాసంగా । కలలో వచ్చిన యేనుగమేలు కొంటేయేమీ లేదు అని । తనకుతానె దృఢం అయినట్లు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు అని దృఢం ఆయెనా తనకు తానె యేమిలేదు ।

7. పరిపూర్ణం స్వతః సిద్ధమై చెలించక వున్నది. ఇదే సత్యం.

8. యెప్పుడు సన్యాసియేమీ లేనివాడు । యేమీ లేనివాడె సన్యాసి । సన్యాసికి అదే మూలం। శరీరమునకు మూలంలేదు । సన్యాసి శరీరమె గనుక । యేమీ లేని శూన్యమే సన్యాసి ।

9. శ్లో॥ అశరీరం సర్వదా అస్తి । శరీరం రహితం సదా ।
అయమేవ సద్యోముక్తి । అన్యథా భ్రమకారణం ॥

గద్య:

ఇతి అచలగురు శ్రీశివరామ దీక్షిత ప్రభావే । వేదాంత విచారణే ।
ఉత్తరభాగే శరీర రహిత ప్రథమ ప్రకరణం । ద్వితీయోధ్యాయము సమాప్తం.



# 1. శరీర రహిత ప్రకరణము

## తృతీయ అధ్యాయము

### 1. స్వప్న దృష్టాంతము

**శి॥** మళ్లా మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వచ్చి । పుట్టని చావనిది । పుట్టి చచ్చేదాని లోపట వున్నదా । బైట వున్నదా । అని అడిగెను.

**గు॥** నీవు చెప్పుమా యని అనెను ।

**శి॥** నాకు లెస్సా తెలియదు । నాకు నేనే కాని । పుట్టని చావని దాని జాడా యెరుగను।

**గు॥** నీవే పుట్టని వస్తువవు కావు గదా ।

**శి॥** నేను యెందుకు అవుతా । నాకు మూలంలేదు అని । మీరే యెరుగుదురు।

**గు॥** 1. రాద్ధాంతంగా వచ్చేది । వున్నంత శేపు వుండేది । కలలో పెద్దపులి వలెనె, మేలుకొంటే యేమీలేదు.

2. మూలంలేని యీ గుర్తెరిగే శరీరంకు పుట్టని చావని దాని దర్శనం, గురు మూలంగా సూచన కాగానె । యేమీలేదు ।

3. యేనుగకు, సింహం స్వప్నమందు వస్తే యేలాగు మరణమో । అలాగే మూలం లేని యీ గుర్తెరిగే శరీరానికి । యీలాగు యెప్పుడూ । పుట్టని చావనిది । యెక్కడ వున్నదో యెటువంటిదో । దాన్ని సూచన ఆయెనా? అలాగె । లేకపోవును.

**శి॥** స్వామి, నాకు దాన్ని సూచన చెయ్యండి, చెప్పి చెప్పకతొల్లె కనుక్కొంటాను

**గు॥** అట్లయితె కనుక్కొ। నీవు యేమీ ।

**శి॥** మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను ।

**గురు॥** ఇంతేనా । నీకు యింకా యేమైనా పేరు వున్నదా ।

**శి॥** ఇంతేకాని । వెనకటి ముచ్చటయేమీ చెప్పను । అనెను । యేమి చెప్పుకొన్నా మీరు మన్నించరు । యెక్కడికి పోయినా యేమిలేదు ।

### 2. వెనుకటి పుస్తకాల సంగతి నాకు వద్దు

**గు॥** మళ్లా యెక్కడికి పోతావు । యెక్కడికి వస్తావు ।

**శి॥** 1. యేమైనా వున్నంతసేపూ నా ప్రభావం । పోయినా యేమీలేదు । మధ్య వచ్చినా । యీలాగు వున్న। పుట్టని చావని దాన్ని। కనుక్కొవలెనని । యిచ్చ పుట్టింది । కాని, భ్రాంతి పోయింది.

2. మీ కాళ్ళకు మొక్కుతాను। వెనకటి పుస్తకాల్లో ముచ్చట తేకండి । అదినేనే చేసినాను । నాకే మళ్ళా ముచ్చట చెప్పితిరి । అవి అలాగే వుండనీ । మీ మార్గమే చెప్పండి.

గు॥ సరే! నీవు గుర్తెరిగే శరీరం నేనని ఒప్పుకున్నావు గనుక సూచన చేస్తాను ।

శి॥ చెయ్యండి స్వామి ।

గు॥ 1. పుట్టని చావనిది । మొదలూకొనాలేనిది । సర్వకాలం వొక్కతీరుగా వున్నది । సకలదేశాల యందూ । సమస్తమైన వస్తువులయందూ । చలించక వున్నది ।

2. ఇటువంటి బట్టబయలు యందు నీవు లేకనే ఉన్నావు । అదినీవు కాదు । నీవు అది కాదు । నీకూ దానికి కొంచమైనా సంబంధంలేదు

శి॥ సరేకాని దాని సూచన నాకు అయింది । నా వర్తమానం యిక యేలాగు ।

గు॥ కలలో వచ్చిన యేనుగ మేలుకుంటే యేలాగూ యేమిలేదో అలాగే నీవు యేమిలేదు।

శి॥ నాకు లెస్స చెప్పుము ।

గు॥ సూచన చెయ్యంగానే తెలియవలె । అయినా విను । మేలుకుంటె । కలలో చూచినవి వున్నవా? లేదా । గుర్తెరిగినావా లేదా చెప్పుము.

శి॥ గుర్తెరిగినాను స్వామి, యేమి లేదని నిర్ణయం జరిగింది ।

గు॥ ఆ యెరుక నిన్ను గుర్తెరిగిందా । లేదా యెరిగిన యెరుక లేదని తెలిసింది గదా ।

శి॥ గుర్తెరిగింది । అనుమానమే లేదు ।

గు॥ ఇప్పుడు వున్నదా లేదా

శి॥ యేమీలేదు ఉన్నదనేటందుకు లేదనెటందుకు ఈ గుర్తెరిగే యెరుక లేదు ।

గు॥ సరె । అలాగె గుర్తెరిగే శరీరం యేమీలేదు । వినిపాయె గదా ।

శి॥ యెక్కడికి పోయెను

గు॥ యెక్కడికి పాయనో । చూతామంటే యేమీలేదు । అంతా అచలమేనని నేను లేక ఉంటే చాలును । యెరుకతో పని యేమి? లేనిది లేనట్లు ఉన్నది ఉన్నట్లు తెలియడమే నీ యొక్క పనియని తెలియవలెను.

గద్య:

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।**

**ఉత్తరభాగే శరీర రహిత ప్రకరణం తృతీయ అధ్యాయము సమాప్తము.**

# 1. శరీర రహిత ప్రకరణము

## చతుర్థాధ్యాయము

### 1. స్వప్న దృష్టాంతము

గు॥ యీలాగు వుండంగానే కలలో అయోని సంభవుడు వక్కరాజు, చతురంగబలాల తోటి, వచ్చె, అందరూ రాజువలెనె, అయోని సంభవులు, వచ్చిన సేనంతా వస్తునే,

శి॥ అయ్యా! నాకు మూలంయేమని అడిగెను

గు॥ నీతో కూడా వచ్చిన వారికి అందరికీ । మూలం ఏది గలదో । అదేనీకు । అనెను ।

శి॥ అయ్యా! నాతో కూడా । యేనుగులు । గుఱ్ఱాలు । లొటిపిటలు । కుక్కలు । గాడిదలు । పందులు । పిల్లులు । యెలకలు । పెద్దపులులు। శింహ్వాలు । అనేకమంది గుఱ్ఱాల । తోమేవాండ్లు । అనేకంవున్నారు। అనేకమైన స్త్రీలు వున్నారు । వారికీ నాకూ వక్కటే మూలమా ? అని అడిగెను।

గు॥ అందరూ అయోని సంభవులు కారా । అనెను ।

శి॥ సరెకాని నేను మాత్రమే అనుకున్నాను ।

గు॥ అదేభ్రాంతి । అందరూ మొదలు యేమిలేకనే వచ్చినారు । నీకు తల్లీదండ్రి యేలాగు లేదో । ఆలాగే సమస్తమైన వారికి లేదు । నీవూ అందరితో సమానుడవే । కాని । నేను మొదలు యేమీలేని వాణ్ణి అని । యెరిగెనన్ను అడిగినావు । యెవ్వరికైనా తెలుసునోలేదో అని । అడిగినావు ।

శి॥ స్వామీ । నేను తప్పవిడిచి యిఘయెవ్వరూ లేరు అనుకొన్న । నావంటివారు అందరూ । అని యెరుగ । యిప్పుడు అందరి వంటివాణ్ణి అని సంశయం వచ్చింది. అందరికంటె యెక్కువ వాణ్ణి చెయ్యండి ।

గు॥ అయ్యో । దాందేమి । పుట్టని చావనిది వున్నది । అది నీకు సూచన చెయ్యంగానే । అదే ఉంటుంది, కాని వఘటి నీకు భ్రాంతి వుండదు ।

శి॥ యిందుకు అందరితో సమానంగా । అది వుండెటట్టు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని తనకుతానే నిశ్చయం । అయ్యేటట్టు సూచన చెయ్యండి। అదే నాకు సమాధానం ।

## 2. నిజం తెలిసితే ఒక్కటైన భ్రాంతి ఉండదు

గు॥ అట్లైతె విను । నీవూ నీతో కూడా వచ్చిన సేనా । మొదలూకొనా లేనిదానిలో వున్నారు అది నీవు కావు । నీకంటేవేరే । సరేనా। అట్లైతే నీవుయేమీ ।

శి॥ నేను మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని । అనె ।

గు॥ అంటె । నీకు మొదలులేదు । కొనలేదు । యేదివున్నదంటె । నీకు తలకాయమొదలు । కాళ్ళుకొన । యివ్వేవి । దీనికి లేదు ।

శి॥ మరిదేనికి ।

గు॥ యీ గుర్తెరిగే శరీరానికీ। మొదలుయేమీ లేదు । కొనాయేమీలేదు । అని అన్నాను ।

శి॥ యిదిసరె । నాకు చులకనే । సూచన చెయ్యండి ।

గు॥ యీ గుర్తెరిగే శరీరంకంటే వేరే । మొదలూ కొనాలేనిది । రాకడా పోకడాలేనిది । పుట్టనిచావనిది, సకల దేశాల యందూ । సర్వకాలాల యందూ । సమస్తమైన వస్తువులయందూ । చలించక తనకు తానే శరీరంలేనిది వున్నది ।

శి॥ సరే । యీ శరీరానికి మొదలు యేమీలేదు । కొనాయేమీలేదు । వున్నప్పుడు । యేలాగు నిర్ణయం । కలలో కోటి యేనుగులు వుండే । మేలుకొంటే యేమాయ । యేమీలేదు । యింతేనా।

గు॥ యింతే । శరీరం యేమీలేదు । అని తెలుసుగదా । వున్నప్పుడు । యీమూలంలేని యీ గుర్తెరిగే శరీరం । యేమీలేదు ।

శి॥ అంటెతప్పా ।

గు॥ యేమి తప్పు । యేమీలేదు । వున్నది యెన్నటికీ లేకపోదు । లేనిది కాసేపు వున్నాయేమీలేదు । చెలించెది యేమీలేదు గనుక । అచలం వున్నది

శి॥ సరేకాని । రాజా । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమునకు । మొదలుయేమీలేక । కొనాయేమీలేక । ఉన్నావని । నీకే యెరుకనా । లేకయెవ్వరైనా చెప్పినారా ।

గు॥ యిది యేమి ఆశ్చర్యం । యిది యెంత । కలలో యిది యెక్కడనుండి వచ్చే । యిది యెక్కడ వుండే । నని చూడంగానే । యెక్కడికిపోయేనో । యేమీలేదు । అలాగే కాని

। పరిపూర్ణం వున్నదని । యెరుక లేదని చెప్పుదామంటే ఆశ్చర్యం ఆయెను ।

శి॥ 1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరంయేమీలేదు । అనంగానే । అచలం స్వతస్సిద్ధం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి । మూలం యేమీలేదు । కొనకు యేమీలేదు ఉన్నది బట్టబయలు మాత్రమే । యిదే గురువాక్యం ।

2. యిది నమ్మినవారికి బంధంలేదు । మోక్షం లేదు । సర్వకాలం పరిపూర్ణమె । యిటువంటి వారె పుట్టని చావని వారు ॥

శ్లో॥ అశరీరం సర్వదాఅస్తి । శరీరం రహితం సదా ।
అయమేవ సద్యోముక్తి । అన్యదా భ్రమ కారణం ॥

గద్య:
ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।
ఉత్తరభాగే శరీర రహిత ప్రకరణము చతుర్థ అధ్యాయం సమాప్తము.







# 2. అహంకార నిరసన ప్రకరణము

## 1. ప్రథమాధ్యాయము

శ్లో॥ శుద్ధే సుషుప్తి దృష్టాంతం । తస్మిన్నాహం కదాచన ।
తద్వచ్చరచరం నాస్తి । ప్రపంచం నాస్తి సర్వదా ॥ ॥1॥

శ్లో॥ యథానాహం తథా శుద్ధం । తస్మాత్ శుద్ధేన నిర్ణయః ।
జగదస్తీతి కో వేద । నాస్తి కో న చ నిర్ణయః ॥ ॥2॥

శ్లో॥ ఆత్మాతీతం కేవలాత్మా । దేహోనాస్తి కథాచన ।
అస్తినాస్తీతి కోవేద । నిర్ణయోనాస్తి సర్వదా ॥ ॥3॥

### 1. బయలు తప్ప అన్నియు తానై యున్నదే యెరుక

1. యీ శరీరమునకు మూలం । నేను గుర్తెరుగుదును । అది నేనే అనె అహంకారమే యెరుక । ఆ యెరుకె జ్ఞానం ।

2. యీ యెరుక అనె జ్ఞానమె । అందరి యందు వున్న । అహంకారం జ్ఞానమన్న, అహంకారమన్న ఒక్కటే.

3. యీ అహంకారంచేతనే । కులాలు । గోత్రాలు । నేను మాలవాడ్ని । నేను మాదిగ వాడ్ని అని । ప్రత్యక్షంగా అనుభవం । అహంకారానికె వున్నది

4. అహంకారం లేకుంటె నిర్ణయం లేదు నిర్ణయం లేకుంటే । జగత్తు వున్నదో లేదో దానికే తెలియదు । అహంకారంబనే జ్ఞానం వుంటేనే అన్ని వున్నవి । అని తెలుపుచున్నది.

5. అహంకారం వొకటెగాని । దాని వ్యాపారాలు వేరెవేరె । అహంకారము వేరులేదు బదులు లేదు । అన్ని దేహాల యందు వొక్కతీరుగానే వున్నది । గనుక । అందుకె నేనునేను అనేది సమానమె।

6. నేను నేను అనె యెరుకె జ్ఞానం । జ్ఞానమె యెరుక । జ్ఞానం దొడ్డదని శాస్త్రం వుండెనా । అందరు జ్ఞానులె గనుక । అందరు వొక్కటె ।

7. అహంకారాలు అనేకాలు లేవు గనుక । అహంకారమె దేవుడు । అహంకారం లేకుంటె । పరబ్రహ్మాన్ని యెవ్వడు యెరుగును ।

8. అహంకారమె పరబ్రహ్మ స్వరూపం । అహంకారం వుంటె అన్ని వున్నవి। అహంకారం లేకుంటె। దానితోటె అన్ని పోవును । అందరు అహంకార స్వరూపులె । అందరు ఆత్మ స్వరూపులే అహంకారం వలననె పుట్టినారు

9. నేను తురక వాణ్ని అని । అహంకారానికే యెరుక । అహంకారం తురకది । నేను నేను అనె అహంకారం వల్లా అన్ని కులాలు మోసుకొని వున్నది ।

10. అహంకారం లేకుంటే దానితోటె । అన్ని కులాలు పోతాయి । అహంకారమె వేదశాస్త్రాలను కల్పించింది ।

11. అబద్ధమనేది అహంకారమే । నిబద్ధి అనేది అహంకారమే । అహంకారం వలనవె వ్యవహారం । అహంకారం లేకుంటే । వున్నదోలేదో । నిర్ణయం లేదు । నిర్ణయం లేకుంటే । యెవరికి మూలమే లేదు

12. అహంకారం చేశిన శాస్త్రాలు । అహంకారానికె ప్రమానం । అహంకారం లేకవున్నవారికి । దేనితోటిపనిలేదు ।

13. "అహంకారమె గురువు । అహంకారమె శిష్యుడు । అహంకారానికె మతాలు । అహంకారం శరీరం వొక్కటే" శరీరం వేరె అని । అహంకారం వేరె అని అన్నది అహంకారమెగాని మరొకటి గాదు.

## 2. తాను వేరే శరీరం వేరే అన్నది తత్వవాదం అదే మాయవాదం

1. తాను వేరె అయితే । జంధ్యాలు తానె వేసుకోవలె । శరీరానికి ఎలా వెయ్యవలె ।

2. తానె లింగం కట్టుకోవలె । శరీరానికి ఎలా కట్టవలె ।

3. తానె జపం చెయ్యవలె । శరీరం ఎలా చేస్తుంది ।

4. తానె చక్రాంకితం చేసుకోవలె । భుజాలకు ఎలా చెయ్యవలె ।

5. తానె బొట్టు పెట్టుకోవలె । శరీరానికి ఎలా బొట్టు పెట్టవలె ।

6. అందుకె । తానువేరే । శరీరం వేరె అని । వాదించేది । తత్వవాదం అదె మాయావాదం।

7. అందుకే అహంకారం లేనివారు । యీ శరీరమందు అహంకారం లేక వున్నారు । గనుక వారె యిరువై ఆరోది అయిన అత్యంత విలక్షణులు । వారె శ్రీయః పతి । వారె ఆత్మ అనె శరీరం లేక వున్నవారు ।

8. యీ శరీరంమందు అహంకారం లేక వున్నవారు । పరవస్తువు వారు అందుకె భగవద్వచనం।

**శ్లో॥ నారాయణాత్పరంవస్తు । తస్మిన్నాహంకదాచన ।**
**గుణత్రయం నవిద్యంతె । వికార రహితం సదా ॥**
**ఇదం వస్తునారాయణాత్పరం । శేషం । స్పష్టం ।**

ఆచార్య కటాక్షం చేత యెరుగవలె । ఆచార్య కటాక్షం లేకపోతె । యీ గుర్తెరిగే చిద్రూపమనె అహంకారమె అయివుంటాడు । అహంకారం లేకపోవలెను అని అనుకుంటు వుంటుంది ।

9. యిరువై యైదోది అయిన యెరుక అనే । అహంకారమనె ఆత్మ శరీరం గనుక । ఆత్మే గుర్తెరిగే శరీరం । అహంకారం లేక । యిరువై ఆరోది అయ్యి । యిరువై యైదోది అయిన । యెరుక అనె అహంకారం లేక పోతె సరి।

10. వున్నది యీ శరీరమందు లేక వున్నది । అన్నది లేకపోయె గనుక కావటం లేదు । వున్నది యీ శరీరమందు లేక వున్నది । గురువాక్యం లేక బోధపడదు.

11. యిరువై యైదోది అయిన । అహంకారాన్ని । సర్వకాలం లేకుండా చేశినవారే గురువులు అహంకారంతోటి సర్వం లేకపాయెను ।

12. యీ యెరుకె సంశయానికి మూలం । ఆయె గనుక । సకల భ్రమలు యీ యెరుకకె । యీ యెరుకె కల్పనకు మూలం । యీ అహంకారం లేకుంటే పరమశాంతి తానె అవును ।

13. గురుమూలంగా కావలెను । అహంకారం లేని గురుసాంప్రదాయం కావలెను । అహంకార సహితమైనవి । మతాలు । వేదాలే గనుక । అహంకారంతో కూడుకున్నది వేదోక్త మార్గం ।

## 3. అహంకార రహితుల యొక్క లక్షణం

1. అహంకారం లేని శైవానికి । వైష్ణవానికి । వైదీకానికి । అహంకారం తోటే పోయెను।
2. అహంకారం లేకుంటే । వేదాలను వేదోక్త మార్గాలను యెవ్వడు యెరుగుదురు । వేదాలు వెర్రివాడు అయినా । అహంకారునికె గాని । అహంకారం లేని । వారికి కాదు.
3. అహంకారం లేని బసవన్నగారికి కాదు
2. అహంకారం లేని నమ్మాళ్వార్లు గారికి కాదు
3. అహంకారం లేని స్వామి జీయరుకు కాదు

4. అహంకారం లేని శంకరాచార్యుల వారికి కాదు
5. యెందుకు । వారికి అహంకారం లేదు అంటే ? రామానుజాచార్యులు బ్రాహ్మణుడు అయితె । రెడ్డికులం । నమ్మాళ్వార్ల గారి దాసుడు యెందుకు ఆయెను ।
6. బ్రాహ్మణుడు శూద్రపువాని శిష్యుడు యెందుకు ఆయెను । వైష్ణవులు బ్రాహ్మణులు గారు ।
7. బ్రాహ్మణుడు చెన్నయ్య భక్తుడు ఆయె గనుక । బసవన్నగారు బ్రాహ్మణుడు గాడు ।

## 4. పంచ బ్రహ్మల లక్షణం - వీరే మతోద్ధారకులు

మనుబ్రహ్మ కమ్మరవాడు గనుక । బ్రహ్మ సమ్మంధులు బ్రాహ్మణులు గారు ।

మనుబ్రహ్మ యొక్క కూలివాండ్లు మనుష్యులు । మనుబ్రహ్మ యొక్క కూలివాండ్లె । సర్వం మనుబ్రహ్మ నిర్మాణమె కలదు ।

1. మనుబ్రహ్మ కమ్మరవాడు ।
2. వాని తమ్ముడు మయబ్రహ్మ వడ్లవాడు ।
3. వాని తమ్ముడు త్వష్టబ్రహ్మ కంచరవాడు ।
4. వాని తమ్ముడు శిల్పిబ్రహ్మ కాశవాడు ।
5 వాని తమ్ముడు హిరణ్యబ్రహ్మ కంసాలవాడు ।
6. వీరె దేవతుల తండ్రులు । వీరె మతోద్ధారకులు । వీరె ఆకారాది క్షకారాంత వర్ణాలు కల్పించినవారు బ్రహ్మనిర్మాణమె అంతా । బ్రహ్మకల్పనె । అంతా ।
7. మనుబ్రహ్మ కల్పనలేక బొడ్డు తెగదు । అటు తర్వాత గొడ్డలిలేక పనివెళ్లదు । బ్రహ్మ సంమ్మంధుడు బ్రాహ్మడు గనుక । బ్రహ్మమె యెక్కువ । కర్మం వలన నిర్మాణం జరిగింది.
8. మతంగ మహాముని అరుంధతి గురువు ।
9. శ్యామలాశక్తి తండ్రి । వ్యాసుల కంటే దొడ్డవాడు
10. పుట్టు బ్రాహ్మలు వేరే । వడుగు బ్రాహ్మలు వేరే ।
11. మనుబ్రహ్మమె సర్వం । బ్రహ్మకంటె యెక్కువ యెవ్వరులేరు । విచారిస్తే ఇదే సత్యం ।
12. యీ బ్రహ్మమనె అహంకారంలేక । సర్వకాలం । వొక్కతీరుగా వున్నవారె । భ్రాంతిలేనివారు।
13. యీ శరీరమందు అహంకారం లేక వున్న వారె । భ్రాంతిలేక వున్నవారు ।

14. గురుస్వామి సాందీపుని వంటివారు కావలె । అయితె । యీ యెరుక సర్వకాలం లేకుండా చేస్తారు । వారే గురువులు ।

15. చూచి గుర్తెరిగేది అహంకారం । అనేది అహంకారం । వినేది అహంకారం। మాట్లాడేది అహంకారం । భోజనం చేసేది అహంకారం । రుచి । అరుచి । గుర్తెరిగేది అహంకారం।

16. అహంకారం । యెరుక వొక్కటె । యెరుకే చిద్రూపం । శ్రీ మన్నారాయణ రూపం । అహంకారం లేకుంటే చిత్తే వుండదు । అహంకారం లేకుంటే నామంలేదు । రూపంలేదు । పరబ్రహ్మాతో కూడా ముక్తి యేమి ఆయెను ।

17. అహంకారం లేకుంటే పరమపదం । అహంకారం లేకపోవటమె ముక్తి ।

18. అహంకారం జ్ఞానం వొక్కటే। అహంకారం లేకుంటే। జ్ఞానం యెటువంటిదో। దేహమందు వున్న అహంకారం వదిలితె సరి । కైంకర్యం చేతనేగాని అహంకారం వదలదు ।

## 5. కైంకర్య లక్షణం - అహంకారమును విడుచుట

1. కైంకర్యమె పరమ రహస్యం । దేహాభిమానం లేకుంటే సరి । కైంకర్యం కంటే అధికమైన భక్తి లేదు । గోపికలు కైంకర్యం చేతనె కడతేరినారు ।

2. "కైంకర్యం అంటే కింకరత్వం । స్వతంత్రం విడుచుటం । ఆచార్య కటాక్షం కొద్ది నడవటమె కైంకర్యం । కైంకర్యం వలననె । జన్మరాహిత్యం।"

3. "దేహం ఆచార్యుని శ్రీపాదాల పాదరక్ష । వారుయేమైనా చెయ్యని వారి కటాక్షం కంటే అధికం లేదు । వారె సంసార సముద్రం దాటించెవారు।"

4. "తీర్థం కైంకర్యమె । ప్రసాదం । కైంకర్యమె । కైంకర్యం తోటి అహంకారం బోవును।" ఇదే పరమ రహస్యం । దీనినుంచె పరమశాంతి । కైంకర్యమెముక్తికి ఫలం।"

5. "ఆచార్యుని సమ్మతమె ప్రసాదం । యింతకంటే రహస్యం లేదు । దేహం ఆచార్యునికి సమర్పిస్తె సరి । తను మనో ధనములందు వంచన కూడదు।"

## 5. క్షేత్ర క్షేత్రజ్ఞ ద్వైత లక్షణం

1. క్షేత్రమై వున్న జీవుడె (అపరా ప్రకృతి) । మేడిపండు వంటివాడు ।

2. క్షేత్రమును గుర్తెరిగిన క్షేత్రజ్ఞుణ్ని అని అయివున్న వాడే మూల మాయ (ఈశ్వరుడు)। అనె పరాప్రకృతి వేపకాయ వంటివాడు ।

3. దేహమును నేను అని గుర్తెరిగెనా మేడిపండు వంటివాడు ।

4. దేహమును గుర్తెరిగెవాడ్ని నేను అని నిశ్చయం వుండెనా వేపకాయ వంటివాడు ।

5. యీ దేహం క్షరోపాధి । యీ దేహమును గుర్తెరిగే నేను అక్షరోపాధి

6. యీ రెండు అయివున్న గాని । రెండింట్లో వొకటి అయివున్నాగాని । వాడె పతీతుడు । యీ రెండు ప్రకృతి ద్వయ దోష స్వరూపాలు కనుక వీటిని విడువవలెను.

7. యీ రెండే అపర, పరా ప్రకృతి ద్వయం ।

8. యీ రెండె ప్రకృతి పురుషులు ।

9. యీ రెండె సగుణ నిర్గుణాలు ।

10. యీ రెండె విద్యావిద్యలు ।

11. యీ రెండె సదసత్తులు ।

12. యీ రెండె జడాజడాలు ।

13. యీ రెండె సుఖదుఃఖాలకు మూలం ।

14. ప్రకృతి పురుషులు కలిసి ఉంటేనే జ్ఞానకర్మాలకు అజ్ఞాన కర్మాలకు మూలం ।

15. యీ రెండె సకల యజ్ఞాలు । సకల యోగాలు । సకల యాత్రలు । సకల చదువులకు మూలం ।

16. సకల నేమాలు । సకల అనేమాలు । బ్రహ్మహత్యాది పాతకాలు । మొదలగు వాటికి మూలం ।

17. మేడిపండువంటి దేహం । వేపకాయ వంటి క్షేత్రజ్ఞ స్వరూపం అయి వుండుట మంచిది కాదు.

18. యీ రెండు వున్నవి అని । వినంది । చూడంది । యెరుగంది । తన నిర్ణయం । తాను తెలియనిది ఒక్క బట్టబయలే ।

19. యీ రెండింటిని గురువాక్యం చేత దెలిసిన వారే నిర్మలులు.

20. ఇది అందరు తెలియాక విననివారె । యెరుగనివారె । చూడనివారె । గాబరా అయివున్నారు।

21. గుర్రాలు యెగబడితె । తల్లిని బిడ్డపట్టక । తండ్రిని కొడుకుపట్టక । యెక్కడి వారు । అక్కడనే గాబరా అయివున్నారు । యింతెకాని మరివొకటి లేదు ।

22. చలి లేని వణుకుడు యెందుకు । నిజగురు కృపకారణం । దొరికితే సరిపోవును

23. వేదశాస్త్రాల చేతకాదు ।

24. శ్రవణాదుల చేత కాదు ।

25. గురుదేవతాత్మైక్య జ్ఞాన తత్వం చేతకాదు ।

26. సమ్యగ్దర్శనం । మోక్షసాధనం । గనుక । గుర్తెరిగే చైతన్యమె నేను । అనె నిశ్చయం తోటి వుండెనా । వేపకాయ అయివున్నట్లే ।

27. యిందుకు ప్రపంచం । మేడిపండు వంటిది । పారమార్థికం । యీ దేహాన్ని గుర్తెరిగే చైతన్యం అయి । నేను వేపకాయ వంటివాణ్ని । ఈ రెండు అయ్యి వుండని గురువు కావలెను.

28. నిజగురువుల సాంప్రదాయం విని యీ మేడిపండును । వేపకాయను తిన్నగా దాని జాడ కనుక్కోని । సర్వకాలం యేక ప్రకారంగా ఆయెనా । భ్రాంతి పుట్టదు ।

29. మేడిపండును విడువకూడదు । వేపకాయ కాకూడదు । మేడిపండును పుట్టించేది వేపకాయను । నేను । మేడిపండును విడిచేది నేనే । యిందుకొరకు । మేడిపండు విడవవద్దు వేపకాయ కావద్దు । విచారించిన । విచారించకున్నా యీ రెండు మధ్యవచ్చి । మధ్య పొయ్యేవె ।

30. ఈ రెండింటిని । వినంది । చూడంది । యెరుగంది । లోపల బయట అనే మర్యాధలేంది । సర్వకాలం యేక ప్రకారంగా । వున్నది । చెయ్యనిది । చేయించంది జ్ఞాన కర్మాలు వినంది ।

31. నేను గురువును । నీవు శిష్యుడవు । అనే భావనలేంది । మానావమానాలను । వినంది । చూడంది। యెరుగంది । చావులేంది యేది గలదో । అదియె బట్టబయలు అని నిశ్చయం వుండవలెను.

32. అచలగురుని సత్తా అటువంటిది గనుక । తాను పుట్టని చావని వాడె । అటువంటి తనకు । మేడిపండు వంటి శరీరం అయివున్న వారికి । నేనే నేను అని అద్వైతం వాదం చేసేదే । వేపకాయ వంటి । చైతన్యం వున్నవారికి అస్సలు పడదు ।

33. అచల మార్గస్తులు గాక యున్నవారు ఎప్పుడు అహమును నమ్మినవారే గనుక వారిని చేరవద్దు.

గద్య:

**ఇతి అచలగురు శ్రీశివరామ దీక్షిత ప్రభావే । వేదాంత విచారణే ।**

**ఉత్తరభాగే అహంకార నిరసన ద్వితీయ ప్రకరణం ।**

**ప్రథమ అధ్యాయం సమాప్తం**

# ౨. అహంకార నిరసన ప్రకరణము

## ద్వితీయ అధ్యాయము

### 1. స్వప్న దృష్టాంతము

శి॥ మళ్ళా మూలంలేని యీ గుర్తెరిగే శరీరం కలలోవచ్చె । వచ్చి । గురుస్వామీ । మీరునాకు । మూలంలేని గుర్తెరిగే శరీరం లేకుండా । శరీరం లేకనె సకల దేశాలయందూ । సమస్తమైన వస్తువులయందూ । చలించక వుండేటట్టు । మళ్ళా పుట్టూకా చావూలేనట్టు । మొదలు కొనాలేక సర్వకాలం వక్కతీరుగా వుండేటట్టు । సూచన చెయ్యండి । చేస్తె నరకమనె శరీరాన్ని విడిచిపెడుతా

గు॥ మునుపు నీకు కల కావలెనని అనుకుంటే వచ్చిందా ?

శి॥ అయ్యా ! నేను యెన్నడూ అనుకోలేదు । నడుమంత్రాన తనకు తానే వచ్చింది ।

గు॥ విచారిస్తె యీ గుర్తెరిగే శరీరానికి మూలము యేమీలేదు । నేను । నీవలెనే । వచ్చినాను గురుసూచన చేత మేల్కొన్నాను.

శి॥ అయ్యా । నాకు శాశ్వితం లేదు । స్వస్థతలేదు । ఉన్నంత సేపూ వుండి । దరిజేరుదామంటె । నాకు వచ్చేటప్పుడు । మూలం యేమీలేదు । పోదామంటె వుండేందుకు స్థానం యేమీలేదు । నేను ఏమి చేయవలెను.

గు॥ బ్రతికి వున్నంత శేపూ చచ్చినట్టు పడివుండవలె । లేని సమయం వస్తే నేను యేమీలేదు । రెండోది యేమీలేదు । కేవలం అంధకారమే అంధకారమని నీకే యెరుక ।

శి॥ నీవు విన్నావు । గనుకాసరే । నేను యేమీలేదు । నాకు వెనక యేమీలేదు । ముందరా యేమీలేదు అని చింత ।

గు॥ యిటువంటివి అనేక కోట్లు వచ్చినావున్నా । యేమీలేకపోయినా । చలించక వుండేదికావలె । సరే । మంచిమాట । నీకుకావలిస్తే । సూచన చేస్తా కనుక్కో । మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి మూలంయేమీ లేదుగదా ।

శి॥ యేమీలేదు । యెక్కడికి పోయె ।

గు॥ యేమీలేనిది యెక్కడ నుంచి వస్తుంది । యెక్కడికి పోతుంది ।

శి॥ యేమీలేని యీ గుర్తెరిగే శరీరమును నేను । అయితే యింకా యేమి ఉన్నది ।

గు॥ సరె । సూచన చేతు ।

శి॥ చెయ్యండి ।

## 2. బట్టబయలుకు నీకు ఎటువంటి సంబంధం లేదు

గు॥ పుట్టనిచావనిది । మొదలూ కొనాలేనిది । సకల దేశాలయందూ । సమస్తమైన వస్తువులయందూ సర్వకాలాలయందూ । చలించక । వక్కతారుగానే యున్నది । యేమీలేని యీ గుర్తెరిగే శరీరమైయున్న । నీకు । దానికి యీషత్తు సంబంధంలేదు। నీజోలిదానికి పట్టదు । దాని జోలి మనకు అవశ్యకం కాదు । అది జాడపడకుంటె । మనస్సుకు శాంతిలేదు । గనుక సరేనా ।

శి॥ యేమీలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । పుట్టని చావనిది వున్నది । గనుక వున్నదాన్ని కనుక్కొని । వుంటె చాలు । వున్నదానికి శరీరమెలేదు । యీగుర్తెరిగే శరీరం యేమీలేదు । బాధయెవ్వరికి । బాధలేకపోవడం యెవ్వరికి ।

గు॥ శభాసు । సరేకాని । వక్క దృష్టాంతరం చెప్పుతాను । నిద్రలో వెయ్యి యేనుగులు వుండి మేలుకొంటె యేమాయె ।

శి॥ యేమీలేదు ।

గు॥ అలాగే పుట్టని చావనిది । రాకడా పోకడాలేనిది । మొదలు కొనాలేనిది । సకల దేశాలయందూ। సర్వకాలాల యందూ । సమస్తమైన వస్తువులయందూ । చలించక సర్వకాలం వొక్కతీరుగా వున్నది । గనుక నీవు నేను లేకపోతే సరి । ఇంతకన్న యెక్కువ లేదు.

గద్య:

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।**

**ఉత్తరభాగే అహంకార నిరసన ప్రకరణము ద్వితీయ అధ్యాయము సమాప్తము**



# ౨. అహంకార నిరసన ప్రకరణము

## తృతీయ అధ్యాయము

### 1. స్వప్న దృష్టాంతము

శి॥ కలలో మరివక రాజు వచ్చె। వస్తూనే నా నిర్ణయం నాకు తెలుసు। నాకు తెలియనిది యేమైనా వుండెనా। నాకు శీఘ్రుంగా సూచన చెయ్యండి అనెను।

గు॥ పుట్టని చావనిది। రాకడా పోకడా లేనిది। సర్వకాలం వక్కతీరుగా యున్నది। మొదలుకొనా లేనిది। వున్నది అనెను।

శి॥ స్వామీ। నాకు అటువంటి దానిజాడ। యెవ్వరైనా సూచన చేసేరా యని। మహా ఆపేక్ష చేత వున్నాను। అయ్యా। అది యెక్కడ వున్నదో। నాకు శీఘ్రూంగా। సూచన చెయ్యండయ్య।

గు॥ చేస్తాగాని। నీ వర్తమానం నీకు తెలుసునంటివి। నీ వర్తమానం కొంచెం చెప్పుమనెను।

శి॥ నాకు మూలం యేమీ లేదు। కొనకు స్థానం యేమీలేదు। నాకు నేనే వచ్చి కాస్సేపు వుండి। కొనకు శూన్యమై పోతాను।

గు॥ శూన్యమంటె యేమీలేదు అనుట యిఘ నీకు యేమీ కావలె। యీ ప్రకారాన పాములు। కొంగలు। గద్దలు। గువ్వలు। పిట్టలు। చిలుకలు। గొ(రెంకలు। నెమళ్లు। బాతులు। హంసలు। డేగలు। మొదలు యేమీలేనిదే వచ్చి। కాశ్శేపు వుండి। కొనకు శూన్యమాయెను।

శి॥ నేను వాటివలెనె అయితే। మీ ధర్మాన పుట్టని చావనిది। వున్నదని వింటిని। విన్నందుకు నాకు సూచన అయితె। మళ్ళా నాకు యీ దేహభ్రాంతి పుట్టకపోయేను। కొనకు యేమీలేదు।

గు॥ నీకేమి కావలె యీలాగు అన్ని జంతువులకూ నీకు సమానమె। యెటువంటి రాజైన। అన్నిటివంటి వలెనే వుండి లేకపోతాడు।

శి॥ స్వామీ। నాకు సావకాశం లేదు। సూచన చెయ్యండి।

గు॥ అట్లయితే నీవు। శరీరంలేని దానిలోనే వున్నావు గద। నీకు శరీరం లేదు గదా। అవునా? కాదా?

శి॥ సరె। సూచనాయెను।

గు॥ యిక అదే పుట్టని చావనిది। బట్టబయలై యున్నది.

శి॥ సరె । మరివకటి నేనెందుకు యేమిలేదు ।

గు॥ రాకడా పోకడా లేనిది । యింకా దానికి మొదలూ కొనాలేదు । సర్వము బయలే ఉన్నది.

శి॥ యింక యిఘ మీరు దయచెయ్యండి । నేను మొద్దును అనుకోరని । మళ్లా సూచన చేశినారు । మీ వంటి వార్ని యెవ్వర్నీ చూడలేదు ।

గు॥ సరె । శభాసు । ఘనుడవే ।

## 2. దృష్టాంత ద్రాష్టాల వలన నిజం తెలిసినది

శి॥ నేనేమి । నడుమంత్రపువాణ్ణి । మొదలు యేమీలేదు । కొనకూ యేమీలేదు । సర్వకాలం వొక్కతీరె వున్నది । శరీరంలేనది లెస్సా । యెంత దొడ్డది అయితె నేమి । కొనకు యేమీలేదు ।

గు॥ సరే విను । సర్వకాలం వొక్కతీరుగా । చలించక । సకల దేశాలయందూ । సర్వకాలాలయందూ । సమస్తమైన వస్తువులయందూ । గట్టిగా వున్నది । సరేనా । యిందుకు అనుమానం వున్నదే

శి॥ కోటి మాట్లకు లేదు లేదు అని అన్నా వున్నదే అది । అదే వున్నదీ । మూలం లేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు ।

గు॥ స్వత సిద్ధమై అచలం । తనకుతానే వున్నది । ప్రయత్నం చేత సాధ్యం కాదు । ప్రయత్నం చేశేది యేమీలేదు

శి॥ గనుక । రాజా । యీ శరీరం యేలాగు లేదో । వక దృష్టాంతం చెప్పుమా ।

గు॥ యీ కలలో కోటి యేనుగలు వుండె । యిఘ చూడంగానే యేమాయే

శి॥ యేమీలేదు । యేమీలేదని అందరికి దృధమె । నాకు వారికి వక్కటి యెక్కువ తక్కువ, యేమీ లేదు. మీరు సూచన చేశిన దాన్ని వుండజూచితే యేమీలేదు । సంశయంలేదు । దృధం అయింది । సర్వకాలం వక్కతీరె ఉన్నది.

గద్య:

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।**

**ఉత్తరభాగే అహంకార నిరసన ప్రకరణము**

**తృతీయాధ్యాయము సమాప్తం.**



# 3. చైతన్య నిరసన ప్రకరణము

## ప్రథమాధ్యాయం

### 1. యెరుకకు అచలానికి ఎటువంటి సంబంధం లేదు

1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం। సర్వం నావలన పుట్టినదని। తనవంటి వారితో చెప్పితే నమ్మివున్నారు।

2. పుట్టని చావనిది। మొదలూ కొనా లేనిది గనుక। అచలం। యేమీ అనలేదు। చలించక సర్వకాలం వక్కతీరుగానే యున్నది।

3. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే। సకల అబద్ధాలు ఆడింది। యీ గుర్తెరిగే శరీరమె చంచలం। యిటువంటి చంచల స్వభావము కలది। యేమి చెప్పినా। చెలించి పొయ్యేవెగాని। మరియేమి లేదు.

4. యీ గుర్తెరిగే శరీరం చెప్పినది। యిటువంటి గుర్తెరిగే శరీరాలే నమ్ముతావిగాని। పుట్టని చావని అచలం వినదు। చూడదు। ఆడదు। విరుగదు। యెన్నటికీ చలించదు।

5. యీ గుర్తెరిగే శరీరమే సకల వినోదాలు చేసి మాయమై పోతుంది। తనకు తానే స్వత సిద్ధమైయున్న అచలమునకు। యేజోలీలేదు।

6. మధ్యనే వచ్చి। మధ్యనే పొయ్యేదని గురు సూచనాయే। ఈ గుర్తెరిగే శరీరమె। సకల వినోదాలు చేశి। యేమీ లేకపోతుంది। అచలమునకూ। చంచలమైన శరీరానికి। కొంచమైన సంబంధంలేదు।

7. సమస్తమైన మహత్తులు యీ గుర్తెరిగే శరీరానివె। గాని పుట్టని చావని అచలానికి। వక్కటైనా మహత్తులేదు।

8. అచలం గనుక। రాకడాలేదు పోకడాలేదు। సర్వకాలం వక్కతీరె। యీ గుర్తెరిగే శరీరంతో యీషత్తు సంబంధంలేదు। దానికి అదే। దీనికిదే కాని। యీ గుర్తెరిగే శరీరానికి పుట్టని చావని అచలమునకూ। కొంచమైనా సంబంధము లేదు।

9. సంబంధం లేనిదే। సంబంధం వున్నదని। మూలము లేని యీ గుర్తెరిగే శరీరమె అన్నది। సర్వకాలం వక్కతీరుగా వున్న అచలం యేమీ అనక। వక్కతీరుగానే యున్నది। యిందుకు అనుమానం యెవ్వరికీ లేదు।

10. పుట్టని చావని అచలం యేమీ చెయ్యదు । అని అందరికీ సమాధానము చెప్పింది ।

11. యీ । పుట్టి చచ్చీ శరీరానికి । అచలం మూలము కాదు । అన రాదు । అదిగాక మరివకటి అటువంటిది వున్నది అని కూడా అనరాదు ।

## 2. యెరుకనే తనమూలం తెలియకుండ భ్రాంతిలో ముంచింది.

1. అందరూ యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె । చేసిన శాస్త్రాలు । వేదాలు । పురాణాలు నమ్మి । అదే యిది । యిదే అది । అని అనుకొన్నారు ।

2. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె । నానా మార్గాలు చేసినది । నాకు మూలంలేదని । వొకవెళ్ల కనుకుందురేమోనని । వేదాలు శాస్త్రాలు । శృతులు । సూత్రాలు । భాష్యాలు । స్మృతులు । యితిహాసములు । అనేక కథలు చేసి । యెవరికీ యీ మూలము తెలియకుండా చేసింది.

3. కనబడకుండ చేసి । తానుచేశినవి । తనంతవారికి చూపుకుంటూ । యెన్నటికీ । భ్రాంతి తీరకుండా । తానె ముందరపడి । అచలాన్ని స్మరించక । చలనమె స్థిరమని । మళ్ళా కొందరు నమ్మకపొయ్యేరని (అద్వైత సిద్ధాంతం) శరీరం అబద్ధం । నేను నిబద్ధి అన్నీ । కల్పించింది ।

4. మళ్ళా మరివక ప్రకారం (విశిష్టాద్వైత సిద్ధాంతం) । నేనూ శరీరం వక్కటే అని కొందరితో చెప్పుకున్నది.

5. ద్వైతసిద్ధాంతం చేసి । జీవుడు వేరే, దేవుడు వేరే వున్నాడని । తాను చేసిన స్మృతులు । ముందరపెట్టుకొని । కీచులాడుకుంటూ । యిదినిబద్ధి । అది అబద్ధం । అనుకొంటూ । యెడతెగని ప్రసంగాలు చేస్తూ వున్నది.

6. ఇలాగున సర్వకాలం యీ గుర్తెరిగే శరీరం నేను అనుకుంటూ । వివేకం । అవివేకం అని । నిబంధనలు చేసుకుంటూ । గురువూ । దేవుడూ । నేనూ । వక్కటే అని తెలుపుకొంటూ । అదియేలాగంటె మహాకఠినం అనుకొంటూ । మహారహస్యం అనుకొంటూ । నేను యీ గుర్తెరిగే శరీరమె । దేవతా యీ గుర్తెరిగే శరీరమె । నీవు యీ గుర్తెరిగే శరీరమె అని చమత్కారాలు చేసి చూపుతూ ఉన్నది.

7. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె చేసిన గ్రంథాలు ।వినిపిస్తూ అన్యోన్యంగా సంతోషం పడుకొంటూ । కొన్నాళ్ళకు । తానూ । దేవతా యేమీ లేకపోతే । అప్పుడు గాఢానిద్రలో మునిగి పోయినట్టు పోతాడు ।యింతేకాని వున్నది వున్నట్టు పడకపోయెను ।

8. మూలంలేనిది । యిదియని నిజం తెలియకుండా "అందరూ ఈ శరీరానికి కారణం వున్నది అని భాష్యాలు చేసినారు ।

9. గనుక పుట్టనిచావని అచలం గురించి ।మందికి తెలియకుండా । మధ్యను అరికట్టినారు । భాష్యాలనే తాళ్లతో । యీ గుర్తెరిగే చైతన్యాన్ని । ఘట్టిగా కట్టివేశినారు ।

10. తనకు యెప్పుడు సమాధానమైతే । అప్పుడు తాళ్లతోకూడా మునిగి । కొంత సేపటికి మళ్లా తేలుతుంది । మళ్ళా సకలమైన చమత్కారాలు చేస్తుంది । యింతేకాని గురువు కావలెనని కోరదు । తన మతం తనకే । సమ్మతం గాని । యేమతం నమ్మదు ।

11. భూమండలంలో । చైతన్యం లేదనేవారు వున్నారని । యెవ్వరూ యెరుగరు । చెప్పినా నమ్మరు । తనకు శక్యం కాదు । అందుకే భ్రాంతిలేని గురువు దుర్లభం ।"

12. అందరివలె వుంటాడు । నమ్మిక వుండదు । విడచిన వారు దొడ్డవారు । అందరివలె వుంటే అందరివంటివాడే అని । అనిపిస్తుంది । గాని శరీరంలేని వాడని । అనిపించదు।

13. అత్యంత గురుసాంప్రదాయం లేనివారు । గనుక । యీ రహస్యం । అన్య సిద్ధాంతాల వంటిదిగాదు । యిదే కాకుంటే యే శిద్ధాంతమునకూ । మూలంలేదు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె । సకల శిద్ధాంతాలు చేసుకున్నది.

14. యీ గుర్తెరిగే శరీరం వున్నంత సేపూ । సమస్తమైన లీలలూ అనుభవింపబడుతావి । రెండోదాని చేత అనుభవింపబడదు ।

15. అనుభవించేవాడు వక్కడే గనుక । అంతా బ్రహ్మానుభవమె । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వక్కటె గనుక । అనుభవంచేత అనుభవింపడు తావి । గనుక । అంతా బ్రహ్మానుభవమె ।

16. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంతశేపూ అనుభవం । యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు అని । యెప్పుడు వింటె । అప్పుడు పుట్టని అచలం స్వతసిద్ధం । అయి వున్నది

17. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేత సాధ్యంకాదు । అచలం స్వతః సిద్ధమై వున్నది గనుక । యీ ఆవరణం లేకుంటె । పుట్టని చావని అచలమె వున్నది ।

## 3. అచల గురువులు దేనిని నమ్మరో దానిని వివరించుట

1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమును। విడిపించే గురువు వుండెనా। అతి సులభం।

2. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేసిన పుస్తకాలు। విని నమ్మేనా। దీనివంటి చంచలుడే అయ్యి। కొంతసేపువుండి। కొంతసేపులేక పోతాడు।

3. నిద్రలో తాను చేసిన పుస్తకాలతో కూడా మునిగి। లేచి। మళ్లా మునుపటివలెనె। సకలమైన భ్రమల చేత భ్రాంతి తీరక। క్లేశపడుతూ ఉంటాడు.

4. అందుకే యే గురువును అంటె ఆ గురువును నమ్మక। "మూలంలేని యీ గుర్తెరిగే శరీరమనె ఆవరణంలేని గురువును చూచి। వారి ముచ్చట విని। వారినడత జూచి। వారి దగ్గర వున్న శిష్యుల జూచి। తెలుసుకోవలెను।

5. వారి శిష్యులు శాంతి చేత వున్నారో। వారి జాడా కనుక్కోవలెను, వారి జాడా చెప్పకపోయిరా। మీ గురువు యెవ్వరు అని అడిగి। వారి జాడా చెప్పిరా। వారి వద్ధికి పోయి చూస్తె। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేశిన శంకరభాష్యం నమ్మి వున్నరో చూడాలి।

6. లేక। యితర భాష్యాలు నమ్మి వున్నారో। గత శాస్త్రమును నమ్మి వున్నారో। యేదైన ఒక మత గ్రంథమును నమ్మి వున్నారో చూడాలి.

7. లేక శాస్త్రవాసనా। దేహవాసనా యితర వాసనలు నమ్మివున్నారో। వార్ని చూచి తెలుసుకోవలెను.

8. భూమండలమందు। మూలంలేని యీ గుర్తెరిగే శరీరంలేని జాడదెలిసె అచల గురువులు వున్నారు। వారి ఆచారమేమి। వారి శాస్త్రాలు యేమి చూడాలి।

9. వారు రారా పోరా। వారి జాడా యేలాగు। వారు పుట్టినారా లేదా, వారికి వేద శాస్త్రాలు ప్రమాణమా। అప్రమాణమా చూడాలి.

10. వారికి తల్లీ తండ్రి। భార్యా బిడ్డలు। వున్నారా లేరా। వారికి కులగోత్రాలు వున్నవా లేదా। తెలుసుకోవలెను.

11. మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికే। సకల భ్రమలూ। అందుకే। అచలులు। యిదికాక। యే సిద్ధాంతం నమ్మినా। రాకడాపోకడా తప్పదు।

12. అందుకే భ్రాంతిలేని త్రోవ దొరికేది కఠినం। మూలం లేని యీ గుర్తెరిగే శరీరం

వున్నదని చెప్పినా । లేదు । లేదు అని చెప్పినా భ్రాంతి పోదు । యిటువంటి గురుసాంప్రదాయం దొరికితె గనుక । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేకుండా । సూచన చేస్తారు ।

13. చేస్తె । వక్కటైనా భ్రాంతి వుండదు । ఆవరణం లేని గురువు ఆయెనా । ఆవరణం లేకుండా చేస్తాడు । వినేవారికి । భ్రాంతి రహితం కాకుంటె చెప్పేవారిదే జాడ్యము।

14. యీ వుపదేశం । మునుపు యెవ్వరి దగ్గరా తెలుసుకోక । తన దగ్గరకు వచ్చిన వారికి చెప్పితే । శీఘ్రంగా అతుకుతుంది ।

15. శాస్త్రవాసనగల శిష్యుడు ఆయెనా । మూలంలేని యీగుర్తెరిగే శరీరం చేశిన శాస్త్రాలలో వున్నట్టు చెప్పేది ।

16. యీ గుర్తెరిగే శరీరం । మునుపు । యేలాగుతాను చెడకుండా చేసుకొన్నాదో । అలాగే చెప్పేది । వచ్చిన వారి అభిప్రాయం కొద్దీ చెప్పేది ।

17. యీ రాజమార్గం చెప్పితె జన విరోధం" మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేసినట్టూ చెప్పితె । తెలిసినవాడె అని జనరంజకం । ఇందుకు సమ్మతము.

శ్లో॥ సత్యం జనవిరోధాయా । అసత్యం జనరంజకం ॥

శృతి: ఆసనేన సుర విక్రంతి । దధీ క్షీరె గృహే గృహే॥

గద్య:

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।
ఉత్తరభాగే చైతన్య నిరసన ప్రకరణ ప్రథమ అధ్యాయం సమాప్తం ॥







# 3. చైతన్య నిరసన ప్రకరణం

## ద్వితీయాధ్యాయం

### 1. యెరుకను నమ్మినవారి గతి ఇంతా అంతా గాదు.

1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం। తనకూ తనవంటి వారికీ, సమాధానం అయ్యేటట్టు । నా నా మతాలు । అనేక శాస్త్రాలు । అనేక శృతులు । అనేక భాష్యాలు । కొందరికి వకతీరు । మరి కొందరికి యింకోతీరు । యెవ్వరిది వారికి దొడ్డది అని । సమాధానం చేసి । పెట్టింది.

2. తనమూలం తెలియకుండా । ఆచార్యస్వాములు అని పేరు పెట్టుకొని । కొన్ని । యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె । మధ్యమతమని । కల్పించినది ।

3. ఇదే భాగవత సాంప్రదాయం । నాది అని ఒక భాష్యం చేశినది ।

4. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె । నేను మ్లేచ్ఛురాలనని। మ్లేచ్ఛశాస్త్రాలు । మ్లేచ్ఛభాష చేత । చేశినది ।

5. యింతేకాని పుట్టనిచావని అచలం । శరీరంలేనిది గనుక । యేశాస్త్రం చెప్పలేదు ।

6. శాస్త్రం చెప్పిన వారికి । చెప్పినట్టూ నడవకుండె కోపం । నడువకుండినా సరె । నన్ను విడవకుండినాసరె । నాకు మూలంలేదని । యెవ్వరు అనుకొందురో అని । యింతవిస్తారంగా చేశి । చేతపట్టుకొని వున్నది । యీలాగు వున్నాగాని ।

7. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె । తప్పున అచలంవున్నదని । విని బైటపడెనా । నీళ్ళలో నుండి చేపబైటపడి చచ్చినట్టె । "యెప్పటి అచలమె । అని యెరిగిపోతుంది.

8. యింతేకాని యే సాధనా । యే శృతి యేయుక్తి । యే అనుభవము పనికిరాదు ।

9. మొదలూ కొనాలేక । తనకు తానే స్వతసిద్ధమైయున్నది । గనుక । వున్నదే వున్నది । నేనే లేదని వూరుకుంటుంది.

10. అచలం గాక । రెండోదానికి । మూలంలేదు । యిందుకు భూమండల మందు భ్రాంతిలేని వారు । వున్నారేమో అని । వెతుక్కోవలె । వెతికి చూచి । వారితో కూడా వుండి । వారిజాడా కనుక్కోవలె । కనుక్కోక । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే నేను । అని నమ్మివుండెనా । యెరుకను నిల్పుకున్న వాడే అవుతాడు. ఇందుకు, సందేహం లేదు.

11. గుర్తెరిగే చైతన్యం నేను అని నేను సర్వోపాధులందు బేధం లేక ఉన్నానని నిర్ణయం చేసుకున్నవారి గతి ఈ లాంటిదని చెప్పుచున్నారు ।

## 2. దృష్టాంతముల నిరూపణ అభేద లక్షణం

11. అంతరమందు గుర్తెరిగే యెమిడికవలె వుండి పడిపోతాడు ।

12. బాహ్యమందు గుర్తెరిగే పంది వలెవుండి చస్తాడు ।

13. వైరాగ్యం చేత సన్యాసించెనా గుర్తెరిగే గాడిదవలె వుండి చస్తాడు ।

14. యోగాభ్యాసం చేశేనా గుర్తెరిగే దొమ్మరి వానివలె సాధించి వకనాడు పడిచస్తాడు ।

15. వాయుధారణ చేశేనా గుర్తెరిగే పాముచలె వుండి చస్తాడు ।

16. కర్మాలు చేశేనా । గుర్తెరిగే పంచబ్రాహ్మలవలె వుండి చస్తాడు ।

17. చాకలి వానివలె । బట్టలు మాచినకొద్ది ఉతికి తెల్లగా చేస్తా ఉంటాడు.

18. మంగలి వానివలె । వెంట్రుకలు మొలచిన కొద్ది కొరుగుతూ ఉంటాడు.

19. కుమ్మరి వానివలె । కుండలు పగిలినా కొద్ది చేస్తా ఉంటాడు.

20. మేదరి వానివలె । తడికలు విరిగినా కొద్ది చేస్తా ఉంటాడు.

21. మాదిగ వానివలె । వుండి చెప్పులు కుట్టి కుట్టి చస్తాడు ।

22. యేమిచేశినా । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని చేశినవాడే అచలుడు । వారే వుండి లేనివారు. వాడే తిరిగి చేయనివాడు అయితే పై సంప్రదాయాలు తిరిగి జననమరణాలకు కారమౌతావని తెలియవలెను.

23. యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని సర్వకాలం యెడతెగక । నిద్రవచ్చినదాకా ప్రతిదినం మరువక । చచ్చినదనుకా । అభ్యాసం చేసినవాడు పుట్టనిచావని అచలంగాని । మరివకటికాడు।

24. అచల సాంప్రదాయం నమ్మినవారికి । రాకడాలేదు । పోకడాలేదు । ఎందుకంటే ఉన్నది ఉన్నట్టు లేనిది నిరాకారమైన చైతన్యం లేనట్లు తెలిసినందుకు । జనన మరణ భ్రాంతి ఉండదు.

25. యిదిగాక యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరంచేశిన । మర్యాదావినెనా । గుర్తెరిగే పెద్దపులి వలె వుండి చస్తాడు ।

26. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేసిన మర్యాదా । యేదీనమ్మరాదు ।

27. నమ్మినా సంకెళ్లు తగిలినట్టె । మోక్షభ్రాంతి అయినా । బంధభ్రాంతి అయినా । తగిలి । శాస్త్రవాసనచేత । లోకాంతర గమనమైన తగిలి । దానంతవాడై ఉంటాడు।

28. నరకమనె శరీరాన్ని విడువబడక । మునిగేది తేలేది సుషుప్తి అనే అంధకారంలో । సుఖమనె దురాశ చేత । ఉండి చస్తాడు ।

29. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను అని । అతుకుబెట్టుకొని । నేనుదొరనని ఉండేనా । గుర్తెరిగే యేనుగవలె । వుండి చస్తాడు ।

30. శీఘ్రంగా యీ గుర్తెరిగే శరీరంవలేని । అచలం ఎరిగి వున్న గురువును । వెతుక్కొని వంచన లేక సేవజేసి । వారియెంగిలి తినుకొంటూ । ఈ పదిప్రశ్నల సమాధానం తెలియవలెను.

## 3. పది ప్రశ్నలు వాటి జవాబులు

1. ప్ర॥ క్రియాశూన్యం యేలాగు ? జ॥ గుర్తెరిగే యెరుక లేకపోవటమే.

2. ప్ర॥ భోంచెయ్యక పోవటం యేలాగు ? జ॥ జీవుడు లేకపోవటమే.

3. ప్ర॥ జన్మరాహిత్యం యేలాగు ? జ॥ అధిష్టాన బ్రహ్మం లేకపోవటమే.

4. ప్ర॥ యీ గుర్తెరిగే శరీరానికి దొరయెవ్వరు ? జ॥ దొర యెవ్వరులేరు, ఉన్నది బట్టబయలే.

5. ప్ర॥ గ్రంధాలు యెవ్వరు చేశినారు ? జ॥ యెరుకనే అనేకం చేసిపెట్టింది.

6. ప్ర॥ పుట్టనిచావని అచలం చేశిందా । మూలంలేని యీగుర్తెరిగే శరీరం చేశిందా? జ॥ పుట్టి చచ్చేదే చేసింది.

7. ప్ర॥ పుట్టనిచావనిది వకటి । పుట్టిచచ్చేది వకటి । రెండూ వున్నవా । వక్కటి వున్నదా? జ॥ పుట్టి చచ్చేది యెరుక అదే లేనిది, పుట్టని చావనిది బట్టబయలు ఒకటే ఉన్నది.

8. ప్ర॥ జగద్భ్రాంతి యెవరికి వచ్చింది । యెవరికి పోయింది ? జ॥ యెరుకకే వచ్చింది గురుసూచన యెవరికి అయిందో వారికే జగద్భ్రాంతి పోయింది.

9. ప్ర॥ వక్కటె అని కొందరు అంటారు । ఆ వక్కటి యెటువంటిది । అది యెక్కడ వున్నది? జ॥ ఆ ఒక్కటి యెరుక అన్ని ఉపాదులకు మూలం అంటారు అదే నీవైనావు యని కొందరు అన్నారు. అదీ నేనూ ఒక్కటే అంటారు. కాని, అది లేనేలేదు.

10. ప్ర॥ పుట్టెవాణ్ణి చచ్చేవాణ్ణి నేను అయితిని । పుట్టనిచావనిది । అది అనిరి । అది వేరే యిది వేరేనా । అదియిది వక్కటేనా ? జ॥ బట్టబయలు యెరుక కాదు । యెరుక

బట్టబయలు కాదు । ఇది అది కాదు, అది ఇది కాదు.

యీ పదిప్రశ్నలు అడిగి తెలుసుకోవలెను ॥ చెప్పశక్యంగాని ప్రశ్నలు । యెవ్వరూ భ్రాంతి పుట్టకుండా చెప్పరు । యే భాష్యాలు భ్రాంతిలేకుండా చెప్పలేదు । యెటువంటి వారికి చెప్పగానే భ్రాంతి పోవద్దా ।

## 4. యెరుకను విడిచే ద్రాష్టాంతములు

1. నిప్పుదగ్గరకు పోతే చలి పోయినట్లు వుండవలెను
2. దాహానికి నీరు పుచ్చుకుంటె । దప్పితీరినట్టు యుండవలెను
3. భోజనం చేసితే ఆకలి తీరినట్టు యుండవలెను
4. ప్రయాణం చేసి యింటికి వస్తే । ఆయాసం పోయినట్టు యుండవలెను
5. రోగిష్టి మందు పుచ్చుకొంటె । రోగం పోయినట్టు యుండవలెను
6. అన్నీ సరేకాని । దాటించేవాడు ఘట్టివాడు కావలె । అయినా । దాటెవాడు చెప్పినట్టూ వినవలె, వినక ఓడమీద నుంచి దుమికితే వాణ్ణి యేమీచెయ్య? వానికే భయం వుండవలెను ।
7. సర్వకాలం గురుశేవ విడువక వుండవలె । భార్యశేవ । కొమాళ్ళసేవ । ప్రభువుల సేవ । చేస్తే కాని స్వాధీనం కారు । వారి వలెకాదు ।
8. దీర్ఘకాలం గురుసేవచేతగాని । భ్రాంతి రహితం కాదు ।

## 5. భ్రాంతి రహిత యుక్తి

1. అద్వైతం వలె గుర్తెరిగే చైతన్యం నీవు అన్నట్లు కాదు.
2. చిత్తులో చిత్తు విశిష్టం అన్నట్టు గాదు.
3. ద్వైతం వున్నది అన్నట్టు గాదు.
4. అంతా చైతన్యమనె సమరస జ్ఞానము కాదు.
5. నేను గుర్తెరిగే వాణ్ణి గనుక । అపరోక్ష జ్ఞానం అన్నట్టు గాదు.
6. గుర్తెరిగే విషయీ అన్నట్టు గాదు.
7. గుర్తెరిగే జ్ఞానమే । బ్రహ్మము అన్నట్టు గాదు.
8. నీవే గుర్తెరిగే వాడవు అన్నట్టు గాదు.
9. యీ గుర్తెరిగే దృక్కు అన్నట్టు గాదు.

10. గుర్తెరిగే సాక్షి అన్నట్టు గాదు.

11. గుర్తెరిగే సాక్షిణి అన్నట్టు గాదు.

12. మోక్షమనే భ్రాంతి అన్నట్టు గాదు

13. బంధమని భయపెట్టినట్టు గాదు.

14. యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అనిచెప్పి । సమాధానం చేసేవారు దుర్లభం । యీ గుర్తెరిగే శరీరానికి మూలం వున్నదని చెప్పే వారు విస్తారం । వారి మాటలు వినకూడదు.

15. స్వప్నదేహాలకు మూలంలేనట్టే। యీ గుర్తెరిగే దేహాలకు మూలంలేదని। యెంతవారికీ తెలియదు।

16. మూలంలేని యీ గుర్తెరిగే దేహమే। నాకు మూలం వున్నదని। అన్నాది। నమ్మవలెనని । యెన్నో చెప్పుకొన్నది. గనుక నమ్మరాదు.

17. నేను యేమీలేదు అని । నీళ్ళలో నుంచి చేపను బైటవేశినట్టు అచలుడు యెరుకను తీసివేశిరని । నాకు మూలం లేదని చెప్పుకొన్నాది ।

18. పుట్టనిచావనిది । మొదలూకొనాలేని అచలం గనుక । అది నా వంటిది కాదు । నాజోలే దానికి పట్టదు ।

19. నేను । అచలం లోనేయుండి । యిన్ని వింతలు । యిన్ని శాస్త్రలు । యిన్ని అవతారాలు యెత్తుకుంటూ । వున్నాను । నా మూలం యెవ్వరూ యెరుగరు । యెరుగనట్లు చేసింది నేనేనని చెప్పుకున్నది.

20. నేను రాతిని దేవుడనిపించి తీర్థాలు సాగించేదాన్ని। నేనే ।

21. కట్టెను దేవుడనిపించి । అందరినీ రప్పించేదాన్ని। నేనే ।

22. నా జాడ నాకే దెలియదు । మందికి యేమీతెలుసును । నాకునేనేకాని యెవ్వరితోటి ప్రయోజనము లేదు । నన్ను నమ్మితే నరకము । నేననే నన్ను విడిచితే స్వర్గము ।

23. నేను యేమీలేదు। నాకు నేనే మూలం। సముద్రంలో చేపవున్నట్టు వున్న। బయటపడితే యేమిలేను । మొదలు కొనాలేని అచలం పుట్టదు । చావదు అని నమ్మితే చాలు. ।

24. సర్వకాలం వక్కతీరే । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నట్టె వుంటుంది । విచారిస్తే యేమీలేదు । 'భ్రాంతి లేనట్టు చెప్పే గురువు దుర్లభం' ।

25. భ్రాంతిలేని గురు సాంప్రదాయం । యెక్కడవున్నాదో వెత్తుక్కోవలె । అది వేదశాస్త్రాల చేత అవుతుందేమో అంటె కాదు । గుర్తెరిగే శరీరం సర్వమని వున్నది । గనుక సర్వకాలం వికారం తప్పదు । అదేమి అంటె । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేశింది ।

26. మొదలూకొనాలేనిది । పుట్టనిచావనిది । యేమీయెరుగదు । గనుక । యేమీచెయ్యదు । సమస్తం యీ మూలంలేని । యీ గుర్తెరిగే శరీరానికే తోస్తుంది ।

27. యీ గుర్తెరిగే శరీరం యేమీ లేకపోతే । యేమీలేని అచలం స్వతసిద్ధమై వున్నది గనుక। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అనిసంతతం। విడువకూడదు।

28. యిదే షోడశాక్షరీ **"మూలాభావమిదం జ్ఞాతం న శరీరం నకిమస్తి"** । ఆంధ్రం। **"మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు** । అని ఆవరణ విడిచే పర్యంతం । వుండవలెను ।

29. పుట్టనిచావని । అచలం । స్వతశిద్ధం। దానికి మొదలూకొనాలేదు । బట్టబయలు సర్వకాలం వక్కతీరుగానే ఉన్నది ।

30. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని సంతతం । సర్వకాలం । అభ్యాసం చేశెనా । వక్కటైనా భ్రాంతి వుండదు । వున్నదే వున్నది । వున్నదానికి రాకడా పోకడా లేదు । పుట్టని చావనిది గనుక స్థిరమై యున్నది ।

**గద్యః**

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।**
**ఉత్తరభాగే చైతన్య నిరసన ప్రకరణం ద్వితీయాధ్యాయము సమాప్తం.**



# 3. చైతన్య నిరసన ప్రకరణం

## తృతీయాధ్యాయము

### 1. స్వప్న దృష్టాంతము

గు॥ నీకు యేమీకావలెను ?

శి॥ రాకడాపోకడా లేనిదీ । సర్వకాలం వక్కతీరుగా యున్నదీ । మొదలూ కొనాలేనిది । పుట్టుకా చావూలేనిదీ । సకల దేశాలయందూ। సర్వకాలాల యందూ । సమస్తమైన వస్తువుల యందూ । చలించక తనకుతానే స్వతసిద్ధమైవున్నది । దాన్ని సూచనకావలె।

గు॥ సూచనచేస్తాగాని మళ్లా అడుగవు గదా ।

శి॥ మళ్లా అడుగ । నేనేమైనా చదువుకొన్న మొగవాణ్ణేనా । నాకు ఇది మాత్రం సూచన అయితే సరి

గు॥ అట్లైతే । నీవుయేమి ।

శి॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను ।

గు॥ యిప్పుడు యే తీరుగా అడిగినావో । ఆ తీరుగా వున్నదో లేదో । అని సంశయంలేదు కదా ।

శి॥ కోటిమాట్లకూ సంశయం లేదు । కలలో వచ్చిన యేనుగలు మేలుకొంటె యేలాగు యేమీలేదో । అలాగే । మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదు. సర్వకాలం బట్టబయలే వున్నది ।

గు॥ కేవలం అచలమె । సర్వకాలం వక్కతీరే । వ్యవహారం యెవ్వరికి । యేమి లేదు, గనుక ఉన్నది బట్టబయలే । ఈ ఉత్తబట్టబయలు యేమిలేదు, అంటే నామరూప రహితమైనదె గాని, లేదనరాదు, ఉన్నది బట్టబయలే దీనియందు యెరుకే యేమిలేదు.

శి॥ ఆశ్చర్యం యిది ఆశ్చర్యమే। యేమీలేదు । అనేటందుకు యేమీలేక పోయెను.

### 2. బ్రహ్మ విద్య - అతి సులభం - అతి కఠినం

గు॥ యిదియెంత ఆశ్చర్యం । యిదిగురు స్వామికే తెలియవలెగాని । అనరాదు । వారికీ శక్యంగాదు । బహుకఠినం । అటువంటి వారితో కూడా వుండి । చూడవలె । చూచినాశఖ్యం । కానట్టెయున్నది । అందుకే బ్రహ్మవిద్య అతిసులభం । అతి కఠినం

శి॥ స్వామీ । నాకుచాలు । నాకు స్వభావమె । శరీరమనే వ్రణం వుండే కలలో యేనుగు మేలుకొంటె । యేలాగో అలాగే । తనకు తానె యేమి లేదు । అని యేలాగు దృఢమో అలాగే । మీ సూచనచేత మూలం లేని యీ గుర్తెరిగే శరీరం । యేమి లేదు సర్వకాలం వక్కతీరే ।

గు॥ సరేకదా ।

శి॥ సరే, సరే ।

గు॥ చాలు శభాసు । చదువుకొన్న వారికంటె । నీవు దొడ్డ వాడవు । యీలాగు వుండవద్దా।

శి॥ 1. అయ్యా యిన్నిటికీ మూలం యేమో అదేకలలో యేనుగ । మేలుకుంటె తనకుతానే దృఢం ఆయే । యేది వున్నదో అదే వుండె । యిఘముచ్ఛటవద్దు । చాలు । చాలు స్వామీ ।

2. యెక్కువముచ్చట ఆడేటందుకు। మూలం యేమీలేదు । అనిసిగ్గు యుండవలె । అయ్యా । వున్నది వున్నట్లు సూచన అయిన వారికి । ముఖం చెల్లదు ।

3. మునపటివలె చలామణి లేదు । చెల్లని రూపాయి వలెనె । రాగి రూపాయి పాటిది కాదు । యిందుకు అనుమానం లేదు ।

4. అబద్ధాల పుస్తకం వలె । కాదు । యిది ఆపాటిది కాదు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి మూలంలేదు । బదులు లేదు । యీలాగు వుండవలె । నిజగురు సాంప్రదాయం ।

5. కల దోచిన శరీరాలు మేలుకొంటే యేలాగు యేమి లేదో । ఆలాగే మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదని మేలుక కలగినది । గనుక అంతా ఈ ఉత్తబట్టబయలు తప్ప మరేమి లేదు ॥

గద్య:

**ఇతి అచలగురు శ్రీ శివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।**
**ఉత్తరభాగే చైతన్య నిరసన ప్రకరణం తృతీయ అధ్యాయం సమాప్తం.**



# 3. చైతన్య నిరసన ప్రకరణము

## చతుర్థ అధ్యాయము

### 1. స్వప్న దృష్టాంతము

**శి॥** మరి ఒకనాడు । కలలో ఆదమనిషి వచ్చి । నాకు వక్కటైనా సాధన చెయ్యండి । తనకు తానె । స్వతసిద్ధమై వున్న దాన్ని । సూచన చెయ్యండి అనెను ।

**గు॥** 1. అంటె యిది యెంత । అనంగానె । నూరుదొమ్మరి గడెల । యెత్తుగల యేనుగ । చౌడోలారాజు కూడా వచ్చె । దాని మీదనే । పెద్ద చెరువులు ।

2. రాజులు । గుఱ్ఱాలు । అనేక ఫిరంగీలు । తోపులు । తుపాకులు । అనేకమైన ఆడవాండ్లు । దానిమీద చిన్న చిన్న యేనుగలు ।

3. దానిమీదనె । వంటలూ, భోజనాలు । నిత్యానూరు వేల పుట్లశెనగలు । పదివేలమంది ఆడవాండ్లు లెస్సా రాళ్లు । లేకుండా బాగుచేసి ।

4. పెద్ద గోనెపట్టాపరచి । ముందరపోస్తె । మూడు ఘడియలకు ఫలహారం చేసేది । చేశిన తరువాత । తూర్పు సముద్రం వద్దికితోలుకుపోతే । వొక్కబొట్టులేకుండా పీల్చేది ।

5. మళ్ళా తోలుకవచ్చి । పదివేలమంది ।యినుపగొలుసులు వేశి । కట్టివేశి । లక్షచరుకు మోపులు ముందర వేస్తే । తినుకుంటూ వుండేది । కల మేల్కొంటే ఏమిలేదాయె ।

6. యీ గురువు గాభరా అయ్యి । చూస్తూ వుండేది । వుండంగానే । ఆడదివచ్చి ।

**శి॥** అయ్యా । శీఘ్రుంగా । పుట్టని చావనిది । మొదలూ కొనలేనిది । సర్వకాలం వక్కతీరుగా యున్నది । నాకు శీఘ్రుంగా సూచన చెయ్యండి అనెను ।

**గు॥** చేస్తె యేమి చేస్తావు ।

### 2. ఉన్నది ఉన్నట్లు తెలిస్తే ఎటువంటి మూడులకైన భ్రాంతి ఉండదు.

**శి॥** దాన్ని వుండజూచి । సకల భ్రమలకూ । మూలమైన యీ గుర్తెరిగే శరీరాన్ని విడుస్తాను అనెను।

**గు॥** యిది కఠినం లేదు । అది వున్నదని నీకు నమ్మిక అయితె సరి । యెటువంటి మూడులకూ సంశయం వుండదు ।

అట్లైతె విను । పుట్టని చావనిది । సకల దేశాలయందూ । సర్వకాలాలయందూ । సమస్తమైన వస్తువుల యందూ । చలించక సర్వకాలం వక్కతీరుగానే ఉంది । మూలం లేని యీ గుర్తెరిగే శరీరం రాక మునుపు । వున్నది । వచ్చి నేనేమి లేదని తెలిసిన తరువాత కూడా బట్టబయలే ఉన్నది ।

శి॥ పుట్టని చావనిది । సకలదేశాలయందూ । సర్వకాలాలయందూ । సమస్తమయిన వస్తువుల యందూ । చలించక ఘట్టిగా బట్టబయలే ఉన్నదని నాకునమ్మిక ఆయెను।

గు॥ అట్లయితే సరేకాని । ఒక కార్యం వున్నాది అనెను ।

శి॥ చెప్పండి । అనెను

గు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు । అంటె యెందుకు సమాధానం లేదు । యిదే కోటిమాట్లకూ సత్యం । సత్యం । అనెను

శి॥ తబుకులతోటి నాలుగు కోట్లు మొహిరీలు । తెచ్చి ముందర పెట్టంగానె । యీ గురువు మేలుకొనె । మేలుకొంటె ఆ యేనుగ యేమీలేదు । ఆడది యేమీ లేదు । యెప్పటి అచలమనె బయలు మాత్రమే వుండెను.

గు॥ శభాసు । ఘట్టిదానవు । ఆ యేనుగది గొలుసు అయినా లేదు । ఆ గుర్రపుది లద్ది అయినా లేదు । తిన్న శనగలు యేమాయెనో । తాగిన నీళ్లు యేమాయెనో ।

అది వున్న స్థలం యేమాయెనో । చూతామంటె యేమీలేదు । అలాగే మూలంలేని । యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు । అని సిద్ధాంతము । గనుక చైతన్యమనె గుర్తెరిగే శరీరం యేమిలేదు, ఇది సత్యం.

గద్య:

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే । ఉత్తరభాగే । చైతన్య నిరసన ప్రకరణము చతుర్థ అధ్యాయం సమాప్తము.





# 4. ఉపదేశ ప్రకరణము

## ప్రథమోధ్యాయం

### 1. చరమార్థం

శ్లో॥ సర్వ ధర్మాన్ పరిత్యజ్య । మామేకం శరణం వ్రజ ॥
అహం త్వా సర్వ పాపేభ్యో, మోక్ష యిష్యామి మాశుచః ॥ **18-66**

టీ॥ తా॥ 1. హే మనుష్యుడా । సమస్తమైన ధర్మా ధర్మాలు । గల యెరుక అనె అహంకారాన్ని । సమూలంగా ఆచార్యకటాక్షం చేత । పరిత్యజ । పరిత్యాగం చెయ్యుమా ।

2. వొక్క అహంకారంలేని । మాం । నన్ను గురుమూలంగా । శరణం వ్రజా । నాకంటె అన్యులు లేరని నమ్మక । నమ్ముటే శరణుసుమా ।

3. అహంకారములేని నేను । త్వాకారమైన । నిన్ను విడిపిస్తాను ।

4. మాశుచః లేకపోతావు అని దుఃఖపడకుమా ॥

5. యెరుక నాకే యెరుక । నేను యెరుగుదును । నేను యెరుంగను । అని వున్నది గనుక । అహంకారమె జ్ఞానం ।

6. అహంకారం తోటి సర్వంపోవును । గనుక । నమస్కారం చేసేవారు లేరు । నమస్కారం లేదు ।

7. అది వైష్ణవ సిద్ధాంతం ॥ శైవసిద్ధాంతం యీలాగే । వైదీకం యీలాగు కాదు । చరమార్థంతో కూడా తిరుమంత్ర ద్వయం వడిసె ।

8. అహంకారం తోటె అన్నిపోయెను । జ్ఞానభక్తి, వైరాగ్యాలకు మూలంలేదు । వట్టి భ్రమలే । నని నీకు । ఉన్నది ఉన్నట్టు చెబుతాను విను.

### 2. బట్ట బయలు స్వరూప లక్షణం

1. చెప్పందియేదో । వినందియేదో । చూడంది యేదో । అదే బట్టబయలు.
2. యెరుకమరుపులేంది యెదో । నేననే అహంకారంలేంది యేదో । అదే బట్టబయలు.
3. నీవని నేనని యెరుకలెందియెదో । దేహము వున్నదో లేదో । అని సంశయం లేనిది యేదో । అదే బట్టబయలు.
4. సమస్తమైన వ్యవహారాలు లేనిదియేదో । స్త్రీపురుష నపుంసకరూపం గానిది యేదో ।

అదే బట్టబయలు.

5. పుట్టుకాచావు యెరుగనిదియేదో । ప్రకృతిఅనె శబ్ధంలేనిది యేదో । అదే బట్టబయలు.

6. వర్ణాశ్రమాలను యెరుగనిదియేదో। ధర్మాధర్మాలను యెరుగనిది యేదో। అదే బట్టబయలు.

7. పుణ్యపాపాలు వర్తమానాలు యెరుకలేనిది యేదో । ఖర్మజ్ఞానం లేనిదియేదో । అదే బట్టబయలు.

8. సర్వకాలం జీవజగద్భావం లేనిది యేదో। వాసనత్రయం లేనిదియేదో। అదే బట్టబయలు.

9. శ్రవణమనన నిధి ద్యాసలను యెరుగనిదియేదో । జాగ్ర । స్వప్న । సుషుప్తి । తుర్యా వస్తలు । వున్నవని యెరుగనిది యేదో । అదే బట్టబయలు.

10. సగుణ నిర్గుణాలు గానిదియేదో । బంధమోక్షాలు లేనిది యేదో । అదే బట్టబయలు.

11. నేను గానిది యేదో । నేనూ నీవు అనే జ్ఞానరహితమైనది యేదో । అదే బట్టబయలు.

12. ఆకాశాది భూతాలను యెరుగనిది యేదో । అదే బట్టబయలు.

13. విషయీ విషయాలను యెరగనిది యేదో । పైన సాధన రహితమైందియేదో । అదే బట్టబయలు.

14. సర్వద్వంద రహితమైంది యేదో। నేను మేనుల రహితమైంది యేదో। అదే బట్టబయలు.

15. జడాజడాలను యెరుగందియేదో । లోకాంతరాపేక్ష రహితమైంది యేదో । అదే బట్టబయలు.

16. సదసత్తులుగానిది యేదో । సుఖదుఃఖాలు లేందియేదో । అదే బట్టబయలు.

17. జ్ఞానభక్తివైరాగ్యాలు లేందియేదో। యేమీలేదని యెరుగంది యేదో। అదే బట్టబయలు.

18. గురు శిష్యభావరహితమైంది యేదో । అదే బట్టబయలు.

19. తల్లి తండ్రి లేనిది యేదో । అదే బట్టబయలు.

20. లోకాలు । కానిది యేదో అదే బట్టబయలు.

21. దేవతలు । మొదలగు ఉపాదులు గానిదేదో ఉపాదులకు మూలం కానిది యేదో అదే బట్టబయలు.

22. వేదాలు । శాస్త్రాలు । పురాణాలు । సూత్రాలు। యితిహాసాలు । వ్రాయనిది, చదువనిది, విననది యేదో అదే బట్టబయలు.

23. దొరలు । దొంగలు బీదా, ధనికులు । కానిది యేదో అదే బట్టబయలు.

24. బ్రహ్మాహత్యాది మహపాతకాలు । లేనిది యేదో అదే బట్టబయలు.

25. బ్రాహ్మణులు । మాదిగలు । వ్యాసాది మహారుషులు । కానిది యేదో అదే బట్టబయలు.

26. సంధ్యావందనాది నిత్యనైమిత్యాది ఖర్మాలు లేంది యేదో । అదే బట్టబయలు.

27. అదితానని తనకు యెరుకలేని స్వరూపం । యేదో అదే బట్టబయలు.

28. అటువంటిదాన్ని భగవానులు మొదలైన వారు యెరుగుదురు ।

29. అటువంటివారు సర్వకాలం లేనివారు అయ్యేయున్నారు ।

30. యెవ్వరూ యెప్పటికి । అటువంటి స్వరూపం కాలేదు ।

31. స్వతఃసిద్ధమైంది గనుక । సర్వకాలం కల్పనా రహితమైనదే బట్టబయలు.

32. కల్పన వున్నట్టూ లేనట్టూ । వుండె మాయచేత । కల్పనతోచ బడ్డట్టు । అవుతుంది । యెరుకకు మాత్రమే గాని బట్టబయలుకు ఏ కల్పన లేదు ।

## 3. అసంప్రదాయ లక్షణం

1. గురుసాంప్రదాయం వున్నదివున్నట్టూ తెలుపక । శ్రవణాదులలో ప్రవేశింపబెడితె । శాస్త్రాలనే బొందల్లోతట్టి । భ్రాంతి విస్తరిస్తూ । ఉంటాడు.

2. అది అవును । యిది కాదు । అంతా అదే నేనే అంతా । అంతానేనే । అనే అహంకారమనె యెరుకచేత । భ్రమలో పడిపోతాడు.

3. అదివున్నంత శేపూ । యీలాగు అనుకోని । అది లేకపోతె । దాంతోటే లేకపోతాడు.

4. మళ్లీ । అది వున్నట్టు వుంటే । భ్రాంతిబోక । దరిదొరుకక । కాలం గడిసెనా మళ్లీ జనన మరణభ్రాంతి వున్నట్టు । వుంటుంది ।

5. సర్వకాలం యేక ప్రకారంగా వున్నదానికి । భ్రాంతి వున్నదో లేదో । నిర్ణయం చేయకపోతె । అందరివంటి భ్రాంతుడే । అయ్యి యుంటాడు.

6. అహంకారం తదైక్యం అయినట్టు అవుతుంది. జీవేశ్వరైక్యమనుకుంటు ఉంటే తాను మిగిలే ఉంటాడు. ఇదే అసంప్రదాయకుల లక్షణం.

## 4. సంప్రదాయ లక్షణం

1. యిందుకొరకు శీఘ్రంగా తాను లేనిది లేనట్లు బట్టబయలే వున్నది వున్నట్టూ తాత్పర్యమాయెనా । శతృక్షయమైనట్టు । యెరుక లేదని లేకనే ఉంటాడు ।

2. అటుతర్వాత । తాత్పర్యానికి మూలం వుండదు । సుఖదుఃఖరహితమై । ఆదిమధ్యాంత । రహితమై । వుంటాడు ।

3. రాకడా పోకడాలేదు । స్వరూపస్థితి కంటె । మరివొకటి అధికం వున్నదని । గ్రహించేనా గ్రహించేది మిగిలే ఉంటాడు । గనుక స్వరూప స్థితి అంటే నిరాకారమై యుండుట.

4. అహంకారం వున్నదోలేదో। వున్నదని యెరిగితే జ్ఞాని । యెరుగకుంటె అజ్ఞాని వున్నదో లేదో అంటె సంశయం । యేమీలేదు అంటె బౌద్ధుడు । అవుతాడు, సంస్కారం కలిగి ఉండవలె.

6. సర్వకాలం మూలంలేని పరాప్రకృతి స్వరూపమే లేనిదని తెలిస్తే జన్మరహితుడు అవుతాడు । అప్పుడే రాకడా పోకడా లేనిది బట్టబయలే స్వతఃసిద్ధంగా ఉంది అని సర్వభ్రాంతి రహితమవుతుంది.

గద్యః

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే**
**ఉత్తరభాగే ఉపదేశ ప్రకరణము ప్రథమాధ్యాయము సమాప్తము.**



# 4. ఉపదేశ ప్రకరణము

## ద్వితీయాధ్యాయం

## స్త్రీ పురుష సంవాదం, స్వప్న దృష్టాంతము

స్త్రీ॥ మళ్ళా కలలో వక స్త్రీ వచ్చెను। వచ్చి। మీరు యెవ్వరు అని అడిగెను।

పు॥ యెవ్వరైతెనేమి అనెను।

స్త్రీ॥ యేమీలేదుగాని। అయ్యా। మీరు వక్కరే వున్నారు యేమి అని నాకు సంశయం అనెను।

పు॥ నీకు యేమి శంఖ। నీవు వున్నావు గదా। అనెను।

స్త్రీ॥ నేను యిప్పుడు వస్తిని। నేను రాక మునుపు। వక్కరూ యేలాగు వున్నారని। నాకు సంశయం అనెను।

పు॥ పుట్టని దాని వల్ల భయం కద్దు అనెను।

స్త్రీ॥ అట్లైతె పుట్టని చావనిది వున్నాదా। అనెను।

పు॥ అది వుండంగానె భయం లేక వున్నా। అది సకల దేశాలయందూ। సర్వకాలాలయందూ। సమస్తమైన వస్తువుల యందూ। చలించక సర్వకాలం వొక్కతీరుగా ఉన్నది.

స్త్రీ॥ అట్లైతె అదినాకు। సూచన చెయ్యండి ? అనెను।

పు॥ అది నమ్మెవారు దుర్లభం। యెవ్వరూ। పుట్టని చావనిది వున్నది అంటె। నమ్మరు।

స్త్రీ॥ యిటువంటి మూలంలేని శరీరం। నమ్మకుంటె। లేకపోదు గదా ?

పు॥ వుండగానే యేమి లేదు। మీ వంటివారికి సూచన చెయ్యంగానె నమ్మిక కద్దు।

స్త్రీ॥ యీ పుట్టని చావని అచలం కావలె। శీఘ్రంగా సూచన చెయ్యండి। అనెను।

పు॥ అట్లైతె విను అనె। నీవు యేమి। అనెను।

స్త్రీ॥ నేను మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని। ఆ నిర్ణయం మొదలు చెప్పినాను। అనెను।

పు॥ 1. నా నిర్ణయం। నేను యెరుగుదు। నేను అనేక నిర్ణయాలు చేసినా। మీరు కావలిస్తే చూడండి అనెను।

2. కృష్ణ నది వద్ద నుంచి గోదావరి దాకా । యెంతవెడల్పో । అంత వెడల్పుది । తాటి కమ్మల పుస్తకం । తెచ్చి ముందరపెట్టి। విడిచి చూస్తే । ముత్యాల వంటి అక్షరాలు । నూరేసి పంక్తులు । వక్కటైనా అబద్ధంలేదు ।

3. స్త్రీ లింగాలు । పుం లింగాలు । నపుంసక లింగాలు । తప్పకుండా విశేషం । యేలాగో అలాగె విశేషణాలు । తప్పకుండా । వున్నావి । యిది అబద్ధంలేని ప్రతి ।

4. అంతది తెల్లటి ఆకులది । రెండో పుస్తకం తెచ్చి । ముందుర విడిచి చూస్తే । అక్షరాలు లెస్సా లేవు । వుత్త అబద్ధాల తడికె । స్త్రీ లింగం దగ్గర పులింగం । పులింగం దగ్గర నపుంసక లింగం।

స్త్రీ॥ యేమి లెస్సలేవు । బూతుల తడిక । సరె చూస్తి । వక పుస్తకంలో నిబద్ధాలు । రెండో పుస్తకంలో అన్నీ అబద్ధాలు । లెస్స । అదె రొండూ నీవే చేశినావు । వొక పుస్తకంలో అబద్ధాలు యేమి నాకే మూలంలేదు । వాటికేమి మూలం అనెను ।

పు॥ సరె ఆ ప్రమాణీకురాలవే ।

స్త్రీ॥ నేను వున్నంతశేపూ ప్రమాణం । అప్రమాణం రెండూకాదు । మీవలె పుట్టనిచావని జాడ తెలిస్తే । రెండూ యేమీ లేదు । అనుకొందు । నేను మూలంలేని యీ గుర్తెరిగే శరీరమై వున్నాను. మీరు శరీరం లేని వారు । పుట్టనిచావని వారు గనుక । నాకు మూడు తిప్పలు । కొందరు నావంటి మూలంలేని యీ గుర్తెరిగే శరీరమై యున్నారు।

పు॥ నాకు రెండు తిప్పలు । వుంటే వుండేది । లేకుంటే లేకపొయ్యేది ।

స్త్రీ॥ అది యేలాగు ।

పు॥ 1. వచ్చినావున్నా కొనకు యేమీ లేదు । అందుకే రాకడ యెక్కడ నుంచియో । అది యెవ్వరికి తెలియదు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం కొన్నాళ్ళు వుండి । కొనకు చూడంగానే యేమీ లేదు ।

2. స్వప్నంలో శరీరం మేలుకొంటె । యేలాగో అలాగే । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు ।

3. పుట్టని చావనిది । మొదలూ కొనాలేనిది । సకలదేశాలయందూ । సర్వకాలాలయందూ । సమస్తమైన వస్తువులయందూ । సర్వకాలం చెలించక । వక్కతీరుగానె యున్నది ।

స్త్రీ॥ నాకు సూచన చెయ్యవయ్యా ।

పు॥ నీవు అందులోనె వున్నావు ।

స్త్రీ॥ యేమి । నేను అందులోనె వున్నానా । యిది యేమయ్యా ఆశ్చర్యం । అట్లైతె మళ్లా చెప్పండి ।

పు॥ 1. పుట్టని చావనిది । మొదలూ కొనా లేనిది । సకల దేశాల యందూ । సర్వకాలాల యందూ । సమస్తమైన వస్తువుల యందూ । చలించక సర్వకాలం వక్కతీరుగానె వున్నది ।

2. యింతేకాదు। యిది అవునోకాదో అని । గాడిదవంటి మనిషికి । అయినా సంశయం వుండదు।

3. అది లేదు లేదు అని కోటిమాట్లు అన్న లేకపోదు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । వున్నది వున్నది అని కోట్లమార్లు అన్న లేనిది లేదనే గురువాక్యం ద్వారా తెలియును ।

4. కలలో యేనుగ మేలుకొంటె యేమీ లేదని । తనకు తాను యేలాగు నిశ్చయమో । అలాగే పుట్టని చావని అచలాన్ని । సూచన చేసి । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు । అని దృఢం వుండుటయే విచారణకు ఫలం । యే ప్రయత్నం పట్టదు।

5. స్వతః సిద్ధమై వున్నది గనుక । సర్వకాలం వక్కతీరె । యిటువంటి గురు సాంప్రదాయమె । భ్రాంతి రహితమైనది । మా గురుసాంప్రదాయం అటువంటిది ।

శి॥ సరె । సరె । సరె । మీరు చెప్పినదే నిజమాయె, కలదోచిన శరీరాలు యేలాగో ఆలాగే మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు, ఈ ఉత్తబట్టబయలు యేమిలేదు, ఇదే నిజమైన ఉపదేశము.

**గద్య:**

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।**
**ఉత్తరభాగే ఉపదేశ ప్రకరణము ద్వితీయాధ్యాయము సమాప్తము.**



# 4. ఉపదేశ ప్రకరణం

## తృతీయ అధ్యాయము

### స్వప్న దృష్టాంతము - 1. ప్రకృతి పురుష సంవాదం

ఒకరి కలలోవొక ముత్తైదువ పుట్టె। ముత్తైదువను వెతుక్కుంటు। మూలంలేని పురుషుడువొచ్చె। వీరు యిద్దరు। తల్లిదండ్రిలేకనె వచ్చిరి। వీరుయిద్దరు అయోని సంభవులు। వీరికి సంవాదం జరిగెను.

**పురుషుడు॥** నీ పేరు యేమి అని అడిగితె।

**ప్రకృతి ॥** నా పేరు ప్రకృతి అనె। నీ పేరు యేమి అని అడిగితె।

**పురుషుడు॥** నా పేరు పురుషుడనె। నీకులం యేమి అని అడిగెను।

**ప్రకృతి ॥** నా కులం యేమో అనెను। నాకు తల్లి లేదు అనెను।

**పురుషుడు॥** నాకు తండ్రి లేదు అనెను। నా కులం యేమో అనెను।

**ప్రకృతి ॥** నా స్వరూపం। మూలంలేని యీ గుర్తెరిగే శరీరమెకాని। మరి వొకటి లేదు అనెను।

**పురుషుడు॥** మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె నా స్వరూపం కూడా అనెను।

**ప్రకృతి ॥** అట్లైతె నీకు నాకు శరీరమె యెక్కువ తక్కువగాని। యిద్దరం। మూలం లేని యీ గుర్తెరిగే చైతన్యం అనే వాండ్లమె। కదా।

**పురుషుడు॥** నీకు శరీరం లేదా అని అడిగెను।

**ప్రకృతి ॥** నేను వేరె। శరీరం వేరె అని అనెను।

**పురుషుడు॥** అట్లైతె। సుఖం దుఃఖం శరీరానికా। నీకా అనెను।

**ప్రకృతి ॥** గుర్తెరిగేశరీరం సుఖం యెరుగదు దుఃఖం యెరుగదు విలక్షణమైన నాకు నేనేలేను అనెను

**పురుషుడు॥** అట్లైతె। ప్రకృతి వేరె। పురుషుడు వేరెనా। ప్రకృతి పురుషుడు వొక్కటేనా అని అనెను।

**ప్రకృతి ॥** నా శరీరం ప్రకృతి। నేను పురుషుణ్ని। నావంటివారె అందరు। కూడు।

**పురుషుడు॥** అట్లైతే నీవు నేను వొక్కటేనా।

**ప్రకృతి ॥** నీకు నీవే। నాకు నేనే అనెను। ఇదే శరీరాల తేడా।

**పురుషుడు॥** అనంగానె । మంచిది అని పురుషుడు మాయమాయె ।

**ప్రకృతి ॥** యీ ప్రకృతి యెక్కడ చూచినా । యేమీలేదు । యెంత వెదకినా యెక్కడ లేదాయే । జాడా తెలియకపోయె । తనకు తానె తపస్సు చేశె చేస్తె । చెయ్యంగ చెయ్యంగ పురుషుడు వచ్చె।

**పురుషుడు॥** యెందుకు తపస్సు చేస్తావు అని అడిగెను ।

**ప్రకృతి ॥** నీ పేరు యేమి అని అడిగెను ।

**పురుషుడు॥** గురువు అనెను ।

## 2. గురు శిష్య సంవాదము

**ప్రకృతి ॥** నన్ను నేను యెరుగుదు । నా శరీరమనె ప్రకృతిని యెరుగుదు । మీవంటివారు కోట్లకొద్ది వచ్చిన యెరుగుదు । మనయిద్దరి కంటె । అధికం వున్నాదని యెరుగను । అనెను ।

**గురువు॥** అట్టైతె । మీకు మీరె స్వతంత్రులా । మీకు మూలం వున్నాదె అని అడిగెను ।

**ప్రకృతి ॥** మా మూలం యెరుగ । అధికం వున్నాదని యెరుగ । నన్ను యేలాగైనా కడతేర్చుమనె ।

**గురువు॥** నీకు యేమి చింత అనెను ।

**ప్రకృతి ॥** నీపేరు గురువు అంటిరె । అది యెటువంటిదో । అని చింతవొక్కటె । నాకు మూలంయేమో అని । నాకు తెలియదు అని చింత ।

**గురువు॥** 1. అట్టైతె । చెప్పుతావిను । నేను నీ కోసమే వచ్చిన । నేను పుట్టని చావని వాడ్ని । నాకు పేరు లేదు । నేను నడుమంత్రాన నీ వలెనే వచ్చినాను ।

2. నీవు తప్పస్సు చెయ్యగానె । నేను । నీకు । శాంతి జాడ । చెప్పుదామని వస్తిని । నాకు సర్వకాలం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం లేదు । నీకు జాడ వున్నట్టే వున్నది.

**ప్రకృతి ॥** యిదియేమీ । ఆశ్చర్యం । నాకు తెలియదు అనెను ।

**గురువు॥** తెలుపుతా విను । **ప్రకృతి ॥** చెప్పండి ।

**గురువు॥** యెప్పుడు వొక్కతీరుగా వుంటావా । కొంతసేపు వొకతీరుగా వుంటావా అనెను।

**ప్రకృతి ॥** నేను నిద్రవస్తె నిద్రపోతాను । కలగంటే కలగంటా । మేలుకొంటే మేలుకొంటాను।

**గురువు॥** యీమూడు । శరీరానికా నీకా । చెప్పుమా ।

ప్రకృతి ॥ నేను యేమీలేదు । నిద్రవస్తె నిద్రబోతుంది । నేను కలగంటే కల గంటుంది । నేను మేలుకొంటే మేలుకొంటుంది । నన్ను విడిచి శరీరం వుండదు । శరీరాన్ని విడిచి నేను వుండ । నిద్రబోతె నన్ను నేను యెరుగ । శరీరాన్ని యెరుగను ।

గురువు॥ అట్లైతె శరీరం వేరె । నీవు వేరె అని ముచ్చటాడుతావు గద !

ప్రకృతి ॥ అదియేమీ లేదు । నేను శరీరం వొక్కటే । మునుపుయేమో అనుకున్నాను । నాకు నేను భ్రమశినాను । నేనే రెండు పేర్లు బెట్టుకున్నా । పూర్వమందు నేను యేమి యెరుగ । వొకమొగవాడు వచ్చి వుండె వచ్చీనీవు ప్రకృతివా । పురుషుడవా అని అన్నాడు । అంటే రెండేమో అని । నేనే శరీరం । నేనే ప్రకృతిని । నేనే పురుషుణ్ణి అన్నాను ।

గురువు॥ యిది నడుమంత్రమె । యింతెకదా । యిక వున్నట్లు విను । మొదలు కొనాలేనిది వున్నది దానికి వుత్పత్తి స్థితిలయాలు లేదు । యేమీ లేకపోవుటం లేదు । సర్వకాలం వొక్కతీరె । వొక్కటైనా వికారం లేదు । పుట్టని చావనిదానికి । యేమీ లేదు అని అందరికి సమాధానమె

ప్రకృతి ॥ సరెకాని అది ఎక్కడవున్నది । శీఘ్రంగా సూచన చెయ్యండి। యెప్పుడు యెప్పుడా అని వున్నది । అది సాధ్యమా । అసాధ్యమా । మీరు యేలాగు కనుకొంటిరి ।

గురువు॥ నాకు నీవలెనే ఆపేక్ష వుండగా । వొక అడిది వచ్చి తెలిపిన తరువాత। నమస్కారం చేతామంటే । యేమీలేదు । కేవలం అచలమె కాని । రెండోది లేదు ।

## 3. అచల పరిపూర్ణబోధ

ప్రకృతి ॥ అలాగె నాకు శీఘ్రంగా తెలుపండి ।

గురువు॥ 1. లెస్సవిను । కలలో యేనుగవచ్చి । పన్నెండు యేండ్లు వుండి। యేమీలేక పోయెను । వెంటనే కోట్లకొద్ది లొటిపెటలు వచ్చి । నూరేండ్లు వుండి యేమీలేక పోయెను ।

2. వెంటనె భూమండలం । అనేక సముద్రాలు । ఋషులు । మునులు । యోగీశ్వర్లు । చిత్ర విచిత్రమైన గుఱ్ఱాలు ।బంగారు పల్లకీలు । వెండి పల్లకీలు । కృష్ణావతారాలు యాభైకోట్లు । రామావతారాలు నూరుకోట్లు । సీతలకు లెక్కలేరు।

3. ముండలు మూడుకోట్లు । అడివల్లా గోపికలె। వచ్చేటప్పుడు యెక్కడనుండి వచ్చిరోకాని । మనుష్యులకు మనుష్యులు । గుఱ్ఱాలకు గుఱ్ఱాలు । గాడ్దులకు గాడ్దులు । కుక్కలకు కుక్కలు । పందులకు పందులు ।

4. యేనుగులకు యేనుగులు । లొటిపెటలకు లొటిపెటలు । అనేకాలు యీ చొప్పునపుట్టే । అనేక దినాలు వుండి । చూస్తూవుండంగానే । యేమీలేకపోయెను। యిలాగే వచ్చేది వుండేది । మేలుకొంటే యేమీలేదు । వొక్కటొక్కటైనా లేదు ।

ప్రకృతి ॥ పుట్టని చావని దాని జాడా చెప్పండి ।

గురువు॥ పుట్టని చావనిది । సకల దేశాలయందు । సర్వ కాలాలయంయదు । సమస్తమైన వస్తువుల యందు । చెలించక సర్వకాలం వొక్కతీరుగానె వున్నది ।

ప్రకృతి ॥ యింతెకదా । నాకు వేరె వున్నట్టువున్నది । నేను యేలాగు అది కాను అనెను ।

గురువు॥ 1. నీవు అది యెన్నటికి కావు । అది అదె । నీవు నీవె । నీకు దానికి । చాలా యెక్కువ తక్కువ వున్నది ।

2. అది మొదలు కొనాలేనిది । నీకు మొదలుకొనా వున్నది । దానికి వుత్పత్తి స్థితిలయం లేదు ।

3. నీకు వుత్పత్తి స్థితిలయం వున్నది । గనుక । చాలా యెక్కువతక్కువ వున్నది ।

ప్రకృతి ॥ స్వామీ । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । మిరుగుడు పురుగు వంటిది । మెరుపు వంటిది । మేఘం వంటిది । రెప్పపాటు కంటె శీఘ్రంగా పొయ్యేది ।

గురువు॥ యింతే కదా । కలలో వచ్చిన శరీరం యేమాయె । చెప్పుమా।

ప్రకృతి ॥ మూలం లేనిది గనుక యేమీ లేదు ।

గురువు॥ యీ గుర్తెరిగే శరీరానికి । మూలం యేమిలేదు గదా !

ప్రకృతి ॥ అవును । కనపడని గుర్తెరిగే శరీరమైన, కనపడే ఈ స్థూల శరీరమైన అదియేమి । యిదియేమి । రెండు వొక్కటె । రెండు లేనివే !

గురువు॥ అట్లైతె । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని సంతతం సర్వకాలం యెడతెగకుండా అభ్యాసం చేస్తె సకల భ్రాంతి రహితం అవుతుంది ।

ప్రకృతి ॥ 1. సరెకాని । నాకు తోస్తుంది । యిటువంటి మూలంలేని శరీరం వచ్చినా యేమీలేదు । కలలో శరీరం యేలాగు । యేమీ లేదో । అలాగే । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు ।

2. పుట్టనిచావని అచలం తనకుతానె స్వతఃసిద్ధమై వున్నది । సరె అసాధ్యం అంటె భయం ఆయే । యేసాధనా లేక । పరిపూర్ణమే స్వతః సిద్ధమై వున్నది ।

3. యేమి ఆశ్చర్యం । యేమి లేని యెరుక యేమి లేదని । ఉన్నది బట్టబయలేనని

తెలిసిన తరువాత జ్ఞానకర్మాలు । సకలభాష్య సిద్ధాంతాలు । యెక్కడ పోయెనో । యెంత హాశ్చర్యం।

**గురువు॥** 1. సరెకాని । యెంతఘట్టివాడు । అయినా । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని । సంతతం । సర్వకాలం మరువక వుండవలెను ।

2. యెంత ప్రజ్ఞావంతునికైన । యీ అభ్యాసం సర్వకాలం వుండవలెను । వుండకపోయెనా భ్రాంతి పుడుతుంది । అశ్రద్ధ కూడదు । యింతకంటె యెక్కువ లేదు ।

**ప్రకృతి ॥** 1. గురు కటాక్షం చేత అనాయాసం ఆయె । వొక్కటైనా భ్రాంతి పుట్టకపోయెను । చేశినా । విడిచినా । పూరికెవున్నా । వొక్కటే ప్రకారం । అచలం చెలించదు గనుక । దరువాజ తీసివేసినట్టు ఆయెను ।

2. వున్నదే వున్నది । "మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు" కలలో వచ్చిన శరీరం యేమీ లేదు । అని నిశ్చయం అయినట్టు ఆయెను । యింకా భయమే లేదు.

**గురువు॥** యిదే గురువాక్యం । యింతకంటె అధికమైన గురువాక్యం లేదు । సర్వకాలం శరీరంలేని అచలం మాత్రమేవుండే । యిదే విచారానికి ఫలం । యిందుకు జ్ఞాపకం ।

**శ్లో॥ అశరీరం సర్వదాస్తి । శరీరం రహితం సదా ।**
**అయమేవ సద్యోముక్తి । అన్యద భ్రమకారణం ॥**

మూలంలేని యీ గుర్తెరిగే శరీరం రాకమునుపు । అచలమె వున్నది । వున్నప్పుడు అచలమె వున్నది । యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు అన్న । అచలమె వున్నది ఇందుకు సందేహం లేదు.

గద్య:

**ఇతి అచలగురు శ్రీ శివరామదీక్షిత ప్రభావే । వేదాంత విచారణే ।**
**ఉత్తరభాగే । ఉపదేశ ప్రకరణం । తృతీయ అధ్యాయం సమాప్తం**



# 4. ఉపదేశ ప్రకరణము

## చతుర్థ అధ్యాయం

## బోధ దృఢీకరణ లక్షణము

**గురువు॥** 1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అనే గురు సూచనైన తరువాత అంతకుముందు । అచలమె వున్నది । ఎప్పుడు అచలమె వున్నది ।

2. మూలంలేని యీగుర్తెరిగే శరీరం యేమీలేదు ।అన్నా అచలమె వున్నది చచ్చిన తర్వాత అచలమె వున్నది । కోటిమాట్లకూ యిదే జ్ఞాపకం । యింతకంటె యెక్కువలేదు । గనుక । యిది మరువవద్దు।

3. కలలో శరీరం మేలుకొంటె యేమీలేదని నిశ్చయం వున్నట్లు । వుండవలెను । యీలాగే భ్రాంతి రహితం । మూలంలేని యీగుర్తెరిగే శరీరం యేమి వున్నదని ఆశపడ్డా భ్రాంతి రహితం కాదు।

4. యేమీలేనిదే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । వున్నదనే భ్రాంతి రజ్జు । సర్పభ్రాంతి। వుత్తతాడువలెను వున్నది । దీన్ని లేని యెరుకగానే గుర్తించుము.

5. పుట్టనిచావనిది । సకల దేశాలయందూ । సర్వకాలాలయందూ । సమస్తమైన వస్తువుల యందూ । చలించక ఉన్న బట్టబయలులో పాముతోచినట్టు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం తోచిందే కాని । విచారిస్తే ఉత్త తాడే ఉన్నట్టు, బట్ట బయలులో యెరుక లేదని తెలిసెను.

6. కలలో వచ్చిన శరీరం వుండి । మేలుకోంగానే । యేమీలేదు । అని నిశ్చయం వున్నట్టు । గురువాక్యం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని చెప్పంగానె । అలాగే నిశ్చయం కావలెను ।

7. కాకపోయినా । మరివొక మార్గంలేదు । యే మార్గం నమ్మినా । నేను మిగులుతుంది నేను మిగిలితే అంతా నరకమే । రాజమార్గం కాదు । దొంగతోవలకు లెక్కలేదు । గనుక మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదు అని దృఢం కావలెను.

8. యిటువంటి గురువాక్యం మూడుకాలాల యందూ విచారించాలి యిది నమ్మక మరి ఒకటి నమ్మెనా । ఆశమాత్రమె కాని భ్రాంతి పోదు । విస్తారం అవుతుంది ।

9. యెరుక లేదని యెరిగిన బుద్ధిమంతులు అయినవారికేగాని। మిగిలినవారికి శఖ్యంకాదు। యిదే భ్రాంతిలేని విచారం । గురుశేవ వున్నకొద్దీరుచి గురుభక్తి వున్నకొద్ది దృఢం గురువాక్యం విడవకూడదు।

10. యిది జ్ఞాన కర్మాల వంటి కలత వాక్యం కాదు । యింతకంటె అధికం లేదు । కలలోవచ్చిన దేహం మేలుకొంటె యేమీలేదు । యిది అలాగే । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదని గురువాక్యం చేతమేలుకొంటె । యేమీలేదు । ఉత్తబట్టబయలే ఉన్నది దానియందు యెప్పుడు కూడ ఎరుక లేనే లేదు, ఇదే దృఢం, ఇదే ఉపదేశం । ఇంతకంటే అధికంలేదు.

గద్యః
ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।
ఉత్తరభాగే ఉపదేశ ప్రకరణం చతుర్ధ అధ్యాయము సమాప్తం.





# 5. మూలప్రకృతి నిరసన ప్రకరణము

## 1. శరీరం లేని గురుసంప్రదాయ లక్షణం

1. మూలంలేని యీ గుర్తెరిగేశరీరం యేమీలేదు । అని తనకుతానే తాత్పర్యం అయితే । మళ్లాతోచేటందుకు । యేమీలేదుగనుక । లేని మూల ప్రకృతి లేదని తెలియుటే నిజం.

2. శరీరాన్ని గుర్తెరుగనిబట్టబయలు । తనకుతానె స్వతఃసిద్ధంఅయ్యి యెన్నటికి చెలించక వున్నదే వున్నది । గనుక ఉన్నదే బట్ట బయలని తెలియుటే నిజమెరిగినట్లు.

3. యిది శరీరంలేని గురుసాంప్రదాయ । యిదే మహా అద్వైతం । యిదే ద్వైతాద్వైత రహితమైన పరమ నిజం, తత్త్వము గానిది, తత్త్వాతీతమైనదే అచలం.

4. అద్వైతమంటే తత్త్వమే । విశిష్టాద్వైతం తత్త్వమే । కేవల అద్వైతం కలలోనైనా లేదు । వున్న కాసంతసేపు । అన్నియు । తోచెను గురువాక్యం చేత మేలుకొంటే యేమి లేదు.

5. మూలం లేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు । గనుక వ్యవహారం లేదు । అంతా బట్టబయలే ఉన్నది.

## 2. సరి అయిన సమాధానం

1. శ్రీభాష్యకారుల తాత్పర్యం । అబద్ధమో । నిబద్ధో । నిబద్దే అని శ్రీశంకరాచార్యుల వారు సాధించినారు గనుక । నేను చదువుకొన్నాను । గనుక । వారి దానికి నేను నాకు తోచినంత వుత్తరం చెప్పినాను ।

2. వారు అనంది యేదో । అది విశిష్ఠమైనది. శుద్ధమార్గం । ఆచార్య కటాక్షం చేత । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమనె । తెరతీసి చూచిన వారికి । అద్వైతం లేదు । విశిష్టాద్వైతం లేదు యీ రెండు లేకుంటే ద్వైత వార్తె లేదు ।

3. సర్వకాలం యీశ్వరుడని వ్యాపకం వున్నది । అదేగుణాలు లేనిది **"వికారరహితో ఈశ్వరః"** కలలోతోచిన రామకృష్ణులవలెకాదు । తెరావల । తెరయీవల వున్నది । కుంఠితంగాని వైకుంఠం । ఆచార్య కటాక్షం గలవారికి । అరచేతిలో వైకుంఠం । ఉన్నట్లు ఉన్నది.

## 3. మాయవాదుల మార్గం

1. అఖిలాండకోటి బ్రహ్మాండాలకు । నేను దాసుడ్ని అని । ఆచార్య స్వాములవారు అన్న వాక్యం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం పరబ్రహ్మం । జ్ఞానమెనిర్గుణం । అన్నారా లేదా । అదేనేను యేలాగు అంటే । మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని పరబ్రహ్మం అన్నారు ।

2. నేనే పరబ్రహ్మం అయితే అందరు బ్రహ్మోహం అనవలె । దాసోహంయని యెందుకు కూయవలె । కులమతాలు యేలాగు వేరు చేయవలె । అంతా తానే అయితే తనకు ఆధరించే వాడు వేరుగా ఉన్నాడని యెందుకు అనవలెను ।

2. మూలంలేని యీ గుర్తెరిగే శరీరాలు స్వతంత్రులు అయినా । పరబ్రహ్మమె । అయితే అందరు । అందరికి శేవకులై నీళ్ళుయెందుకు మోస్తారు । వండియెందుకు పెడతారు । అగ్ని హోత్రాలు యెందుకు చేస్తారు । మాదిగవాండ్లవలె । మాలవాండ్లవలె । వేము బ్రాహ్మలమని । యెందుకు అభిమానం వుండవలె । అందుకే మాయవాదులమార్గం । ఇలాగే ఉంటాది.

## 4. అచల సిద్ధాంతం

1. విచారించండి మా సిద్ధాంతం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమనె తెర తీసివేస్తె యేమిలేదు । అంతా వైకుంఠం । అంతా కల్పనా రహితమైన కైలాసమె ।

2. శ్లో॥ **యస్మాత్ క్షరమతీతోహం । అక్షరాదపి చోత్తమః ।**
**"ఉత్కృష్టతమః । అక్షరదపిచ । అమోఘోత్తమః ।**
**అక్షరం పరబ్రహ్మణోపి । క్షరాక్షరాభ్యాం అన్యః॥"**

అందుకే క్షరాక్షరమైనది । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । దీనికి వేరుగా ఉన్నది । యీ బట్ట బయలు । యింతకంటె యెక్కువలేదు ।

3. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । యీ బట్టబయలె వున్నది । కల దోచిన శరీరాలు యేలాగో ఆలాగే । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । యిదే భ్రాంతిలేని । రాజమార్గం । ఎందుకంటే అన్నింటిని విమర్శించే యెరుక లేకుంటే సరి. ఇంతకన్న ఎక్కువ లేదు.

## 5. వాసిష్ట ప్రమాణం ॥

1. యీ శరీరం వున్నదనే భ్రాంతిచేతనే । అనేక భ్రాంతులు వున్నవి । సర్వకాలం చలించకవున్న । యీ బట్టబయలుకు యేమి భ్రాంతి లేదు. వున్న దానికి లేక పోయె । లేనిది యేమీలేదు ।

2. అందుకే వసిష్ఠుల వారు రామస్వామికి ఇలాగున చెప్పినాడు ।

శ్లో॥ **భ్రమేణాహం భ్రమే త్వం । భ్రమేణోపాసకో జనః**
**భ్రమేణేశ్వర భావత్వం । భ్రమమూలం ఇదం జగత్ ॥**

తా॥ భ్రమ చేతనే నేను భ్రమ చేతనే నీవు భ్రమ చేతనే ఉపాసన చేయుట, భ్రమ చేతనే నన్ను రక్షించేవాడు ఈశ్వరుడున్నాడని భావించుటయు, ఈ భ్రమకు మూలమైన యెరుకయే జగత్తు ఉన్నదని భ్రమ కల్పించినది. గనుక మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం ఏమిలేదని గురువాక్యం విని కంటే లెక్క తీర్పు అవుతుంది.

అందుకే వున్న బట్టబయలుకు ఒక్కటైనా భ్రాంతిలేదు । మూలంలేని యీ గుర్తెరిగేశరీరం యేమీలేదు । యిక భ్రాంతి యేమిటికి । లెక్క తీర్పు॥ వున్న బట్టబయలుకు యేమీలేదు ।

3. యేమీలేని యీ గుర్తెరిగేశరీరం యేమీలేదు । వొక్కతీరె వ్యవహారం వడిశె । చించివేసిన పత్రం యెవరిదగ్గరవున్నా యేమీలేదు । భయంతీరిపోయె । తీదీపులువడిశె।

4. లెక్కతీర్పటం కాకుంటే । యే వేళకైనా ముఖంనలుపె । అనిపిస్తుంది । యిపుడు యెక్కడనిలబడ్డా భయంలేదు । చచ్చేదియేమి బ్రతికేది యేమి । వున్న దానికి యెపుడు ఒక్కతీరె । నేను యేమీలేదు । నీవు యేమీలేదు । వున్న దానికి యేజోలిపట్టదు । వున్నది పుణ్యం చెయ్యదు । పాపం చెయ్యదు ।

5. నేను యేమీలేదు । నీవు యేమీలేదు । యిద్దరం యేమీలేకుంటే । వున్నది వున్నట్టెవుండె । యేమీలేనిది యేమీలేకపాయె । యీలాగని అందరు అనుకుంటారు । లెస్సవిచారించి । లెక్క తీర్పటంఅయితే । భయం వుండదు ।

6. విచారించితే వున్నది వున్నట్టె వుండె । యేమీలేనిది యేమి లేకపోయెను । గనుక జనన మరణ భ్రాంతి వడిశెగద !

## 6. బట్టబయలు లక్షణం ॥

1. యీ బట్టబయలు । పుట్టదు గిట్టదు । పుట్టించదు । గనుక యధాతధం ।
2. యీ బట్టబయలు భోంచెయ్యదు గనుక శుక్లంలేదు।
3. నీళ్ళుతాగడు । గనుక । నెత్తురులేదు ।
4. యీ బట్టబయలుకు యెరుకలేదు । గనుక । ఎటువంటి క్రీడ చెయ్యదు ।
5. యీ బట్టబయలుకు యెరుక లేదు । క్రియాశూన్యం అయింది ।
6. యీ బట్టబయలుకు పుట్టుకలేదు । ఈ బట్టబయలు యెరుక కాదు । గనుక ఆడదికాదు । మొగవాడు కాడు । నపుంసకం కాదు। అందుకే । బట్టబయలుకు ఒక్కటైనా వికారం । లేదు ।

## 7. బోధ లక్షణం ॥

1. యీ బట్టబయలుకు శరీరం లేదు గనుక । రాకడాలేదు । పోకడాలేదు।
2. అచలం కదలక । మెదలక । వొక్కతీరుగానే సర్వకాలం వున్నది । గనుక అంతా యీ బట్టబయలె।
3. యీ బట్టబయలె । అఛేద్యం అదాహ్యం అక్లేద్యం అశోష్యం సరె అన్ని సూటిపడుతావి ।
4. యీ బట్టబయలె నిత్యం । యిదే సర్వగతం । యిదేస్థానువు । యిదే అచలం । యిదే బహుకాలపుది .
5. యీ బట్టబయలు కొట్టేదికాదు । కొట్టబడేదికాదు । యీ బట్టబయలు యెవరిని కొడుతుంది । యెవరిని చంపుతుంది । యీ బట్టబయలుకు యెరుక లేదు । యెరుక లేనిదానికి యిచ్చ పుట్టనేపుట్టదు।
6. యీ బట్టబయలును । యేమిఅడిగినా చెప్పనేచెప్పదుగదా । దానంతవాడె । దాన్ని అడుగవలె అంటే యెరుక ఎప్పుడు దానంతది కాదు । దాని అంతది । అదె । యీ బట్టబయలుకు బదులు లేదు ।
7. యీ బట్టబయలు నేనువున్నానని యెరుగదు । యీ శరీరాలు లేవని యెరుగదు । అన్ని కలలోనె సకలముచ్చట్లు । యెరుకకే కలుగుట సహజం ।

8. యీ బట్టబయలుకు యెరుక లేదుగనుక । ఒక్కటి అయినా వికారం లేదు । యీ బట్టబయలు వొక్కజోలిఅయినా యెరుగదు ।

9. మొదలె యీ బట్టబయలువున్నది గనుక । వొక్కటి అయినా భ్రాంతి వుండదు । యీ బట్టబయలు తనకుతానె స్వతఃసిద్ధంఅయి । సర్వకాలం చెలించక । ఉన్నది.

10. భ్రాంతిలేనిది । భ్రాంతివున్నది అని । అనుకుంటూవున్న యెరుక తీసినకొద్ది । యేమిలేనిది । మళ్లిమళ్లివున్నట్టు తోస్తుంది । గనుక బట్టబయలు అటువంటిది కాదు.

11. మొదలె యీ బట్టబయలు వున్నాది అని సర్వకాలం మరువకవుంటే యేమీబాధలేదు । అని అనుకున్న కొద్ది వున్నట్టువున్నది । గనుక । పొట్టుదంచుకున్నట్టు వుంటుందిగాని యేమీబాదలేదు।

12. మొదలె యీ బట్టబయలు వున్నాదని । చాలాఅభ్యాసం చేస్తే చాలా సంశయం లేకపోతుంది । వున్నదంటేలేదు । లేదు అనబడుతూవున్నాది । వూరికే నామాట వినండి । వున్న దానికి వొక్కటిఅయినా । సాధనలేకనే । తనకుతానె । స్వతఃసిద్ధమై చలించక । సర్వకాలం వొక్కతీరుగానే వున్నది ।

13. వొక్కటేయుక్తి । సాధనచెయ్యవలెనా । యేమీలేదు । తనకుతానే దృడం । గురుసూచనైతే సరి నేను గానిది బట్టబయలే ప్రత్యక్షం ఆయెను.

14. ఈ బట్ట బయలు యందు యెరుక యెప్పుడూ లేదు అని గురువాక్యం కలదోచిన శరీరాలు యేలాగో ఆలాగే, మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు, ఈ ఉత్తబట్టబయలు యేమి లేదు, కోటి మాటలకు ఇదే సిద్దాంతము, సిద్దాంతమే రాద్ధాంతము.

గద్యః

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే । వేదాంతవిచారణే ।**
**ఉత్తరభాగే । మూలప్రకృతి నిరసన పంచమ ప్రకరణం ।**
**ప్రథమోధ్యాయం సమాప్తం.**



# 6. కారణ కార్య రహిత ప్రకరణం

శ్లో॥ కార్యోపాధిరయంజీవః॥ కారణోపాధిరీశ్వరః ।
కార్యకారణతాంహిత్వా । పూర్ణబోధోవశిష్యతేః॥

## 1. పురాణముల నమ్మిన వారి మత లక్షణం

1. నైదీక మతం వారు పరబ్రహ్మమె జగత్కారణం అని వాదించినారు ।
2. శైవులు శివుడె జగత్కారణం అని వాదించినారు ।
3. వైష్ణవులు శ్రీ మన్నారాయణుడె జగత్కారణం అని వాదించినారు ।
4. శాక్తేయులు శక్తియే జగత్కారణం అని వాదించినారు ।
5. ఇదేప్రకారం సర్వమతములవారు । వారి వారి మతదేవతలె జగత్కారణం అని వాదించినారు।

## 2. కారణ కార్య లక్షణం - తత్వ వాదం

1. కారణం । కార్యం । కారణానికి కార్యానికి బేధం యెన్నటికి లేదు । కారణం వున్నంతసేపు । కార్యం లేకపోదు ।
2. కారణం నిబద్ధి అయితే । కార్యం నిబద్ధే । కారణం అబద్ధం అయితే । కార్యం అబద్ధమె । అవుతుంది.
3. కారణం విత్తనం వంటిది । కార్యం చెట్టు వంటిది । కారణానికి కులంలేదు । గోత్రం లేదు । కారణానికి వుండెనా । కార్యానికి కూడా వున్నది ।
4. కారణం దేవుడు అయెనా । కార్యం దేవతా స్వరూపమె । ఇలాగే గురువు । దేవత । ఆత్మ । అహంకార స్వరూపమె । అవుతుంది.
5. నేను నేను అనె అనుభవంవున్నది గనుక । సోహం అని అయిక్యం అని । జీవుడు యీశ్వరుడు వొక్కడే అని । ఆ ఒక్కడే పరబ్రహ్మం అది నేనేనని చెప్పుకున్నది తత్త్వ వాదమనబడును.

## 3. అహం బ్రహ్మాస్మి అనుభవ లక్షణం

1. అహం బ్రహ్మాస్మి అనే అనుభవం । వేదమందెవున్నది । గదా.
2. నేనే జీవుణ్ణి । నేనే యీశ్వరుణ్ణి । నేనేబ్రహ్మను । నేనేసర్వం సర్వంనేనే । నాకంటె అన్యంలేదు । నేను వుంటె సర్వం వున్నది । సర్వానికి నేనే మూలం । అన్నది అహం బ్రహ్మాస్మి.

3. నేనే గురువును । నేనే శిష్యుణ్ణి । నేనే దొరను । నేనే శేవకున్ని । నేనే దొరసాన్ని । నేనే బానిశదాన్ని । నేనే సర్వం । సర్వానికి మూలం నేనేనని పలుకు లేనిదే పలుకుచున్నది.

4. అహంకారం వల్లనె శరీరం । అహంకారం అంటే పరబ్రహ్మం అదే నేననే గుర్తెరిగే శరీరం అదిగాడ్దులకు, పందులకు కుక్కలకు సమానమె ఇందుకు సందేహం లేదు.

5. పుట్టని చావని అచలం । సర్వకాలం చలించక । వొక్కతీరుగానే వున్నది । దీని వంటిది యింకోటి లేదు.

1. యీ స్థూల శరీరం । నేను అనుకునెవాడు అధముడు ।

2. యీ గుర్తెరిగే శరీరం । నేను అనుకునేవాడు మధ్యముడు ।

3. యీ రెండు । నేను అనక ఎప్పుడు నేను లేనివాన్ని నని అన్నవాడు ఉత్తమోత్తముడు.

## 4. అచల లక్షణం

1. అచలం యే గుణాలు లేనిది । వికారాలు లేనిది । అచలం అంటేనే చలన రహితం.

2. అది నేను కావలెనంటె యెన్నటికి కాదు । సాధన సాధ్యం లేనిది గనుక । అచలం రెండో తీరు కాదు.

3. వున్న అచలానికి । శరీరం లేదు । గనుక యేమి చెయ్యదు । చేయించదు । సకల తిప్పలు । గుర్తెరిగే శరీరానికే । యీ శరీరం లేని అచలానికి । యెన్నటికి లేదు ।

4. ఉన్న అచలానికి యెరుక లేదు । మరుపులేదు । యెరుక మరుపులు యెరుకకే । గలవు గాని అచలానికి లేవు.

5. బట్టబయలన్నా, అచలమన్నా, పరిపూర్ణమన్నా, స్వతః సిద్ధమన్నా, అచలమే అనబడును.

## 5. గురు కటాక్షం

1. గురుకటాక్షంచేత । అతిసులభం । జ్ఞానం చేత కర్మాలచేత । బహుక్లేశం । యెన్నటికి తెలియదు।

2. శీఘ్రుంగా । కార్యకారణాలు లేని గురుసాంప్రదాయం వెతుక్కొని । అచలంలా కుదురవలె । అట్లైతె । సర్వకాలం వొక్కతీరె । జన్మకర్మ భ్రాంతి । జ్ఞానంతోటె పోవును.

3. వున్న అచలానికి । జ్ఞానంలేదు । కర్మంలేదు । జ్ఞానం చేతనే । కర్మాలు పుడుతావి ।

గనుక జ్ఞానమె అహంకారం । ఈ అహంకారం పోవలెను.

4. శీఘ్రుంగా । సర్వకాలం । శరీరంలేక యేలాగువున్నదో । అని । వారి దగ్గరకు పోయి। శరీరం అయ్యివున్నారో । నేను నేను అనె యెరుక అయ్యివున్నారో చూచి । అచలంవలె చలించక వున్న వారే గురువు అనుకోవలెను.

5. చలించే । శరీరం అయివుండిరా । వారి సాంప్రదాయం । ఆత్మజ్ఞాన సాంప్రదాయమె అని తెలియవలె । జ్ఞానులు అయిరా । శాస్త్రాలతోవ అనుకోవలెను । గనుక వారె మధ్యములు, వారిని వదులవలెను.

6. పుట్టనిచావని అచల సాంప్రదాయం యెటువంటిదంటే । విలక్షణం కంటే అత్యంతవిలక్షణం క్షరం శరీరం । అక్షరం గుర్తెరిగే శరీరం । ఈరెండు లేకపోవలె । బయలే ఉండవలె । ఇదేనిజం. ఇది చెప్పినవారే ఉత్తమోత్తములు.

## 6. పరిపూర్ణ బోధ లక్షణం

1. యీ శరీరం కాదు । విలక్షణం అనె యెరుక కాదు । యీ రెంటికంటే మూడోది । అదెయిరువై ఆరోది । అది యీ శరీరాన్ని యెరుగదు । యీ గుర్తెరిగే శరీరం లేకపోతే సరి ।

2. వున్న దానికి యెరుక లేదు । మరుపు లేదు । అది గురుసాంప్రదాయం చేత సూచన కావలె । తన ప్రయత్నం సూచన అయ్యే పర్యంతం లెస్సవుండవలె । వున్నబుద్ధి । సకల సంశయాలకు మూలంయేదో । అది లేకపోతుంది ।

3. సర్వజ్ఞత్వం వుండెనా । మునుపటివలెనె వుంటాడు । సర్వకాలం । గురు వాక్యం విడువక అభ్యాసం చేయవలె । చేశేది యేమి అని । అశ్రద్ధ వుండెనా గురువుకు శాంతి వున్నట్టువుండి కుక్కవలె చెలిస్తాడు ।

4. జ్ఞానంచేత కర్మాలు విడువక వున్నట్టె వుంటావి । యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని । సంతతం విడువక । సమస్త కార్యాలయందు మరువక వుండవలెను ।

   1. భోజన కాలమందు ।
   2. నిద్రబోయే కాలమందు ।
   3. నడిచే కాలమందు ।
   4. కూర్చున్న కాలమందు ।

5. మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదని నిద్రవచ్చువరకు । ప్రాణం విడుచువరకు । మరువక అభ్యాసంచేస్తూ । వుండవలెను । యీలాగువున్న వాడె । మేలుకొన్న వాడు ।

5. తాను ఎప్పుడు నిరాకారమైన వాణ్ణినేనని గ్రహించిన అటువంటివానికి । పుట్టుక లేదుచావులేదు । సర్వకాలం లేకపోయె గనుక । వున్నది వున్నట్టెవుండెను ।

శృతి॥ "నిర్ణయోనాస్తి సర్వదా" । సర్వాన్ని తన్నుతాను నిర్ణయించే యెరుక లేకుంటే సరి. ఈ లేని యెరుకను లేదని, ఉన్నది బట్టబయలే సత్యమని నిశ్చయమైతే చాలు.

గద్య ః

ఇతి అచలగురు శ్రీశివరామ దీక్షిత ప్రభావే । వేదాంత విచారణే

ఉత్తరభాగే । కారణకార్యరహిత షష్టమ ప్రకరణం ప్రథమోధ్యాయం సమాప్తం.





# 7. క్షేత్ర క్షేత్రజ్ఞ నిరసన ప్రకరణం

## 1. ద్వయ దోష రహితులు

1. క్షేత్ర క్షేత్రజ్ఞ ద్వయదోషరహితమె, కర్మరహితం ।

2. ప్రకృతి పురుష ద్వయదోషరహితమె, వ్రత నియమం ।

3. పరాపర ప్రకృతి ద్వయదోష రహితమె, పుణ్య పాప రహితం ।

4. ధర్మాధర్మ ద్వయదోష రహితమె, జనన మరణ భ్రాంతి రహితము ।

5. ప్రకృతి ద్వయదోషరహితుడు । చెయ్యడు । విడువడు । అందరివలె వుంటాడు । వారిజాడ తెలియదు । లేని స్థితిలో అంటి అంటక ఉంటాడు.

6. ప్రకృతి ద్వదయదోష రహితుడైనవాడు । చేస్తాడు । చెయ్యడు । విడిచి పెడుతాడు । అందరికంటె లెస్సచేస్తాడు ।

7. ప్రకృతి ద్వయదోష రహితులకు । పట్టడంలేదు । విడువడం లేదు సర్వకాలం । ద్వయదోష రహితమె, వారి యొక్క స్వభావం ।

8. ప్రకృతి ద్వయరహితమె, పారమార్థిక । ప్రాపంచిక విషయ జ్ఞాన రహితము ।

9. ప్రకృతి ద్వయదోషమైన యెరుకనే । వేదాలను । శాస్త్రాలు । వ్యాసాలు చేసింది ।

10. ప్రకృతి ద్వయమైన యెరుక । ఒకటి వున్నది ఒకటి లేదని చెప్పింది ।

11. ప్రకృతి ద్వయదోష రహితులు । అందరి వలెనె । దోషద్వయం లేని యుక్తిని । గురువుచే సంపాదించి మెదలుకుంటారు ।

12. దోషద్వయం లేనివారు యేలాగు యెరుక అంటె । వారు లేకనే ఉంటారు.
    1. వారికి రాగద్వేషాలు లేవు ।
    2. ముఖంలేదు ।
    3. సమయెచిత ప్రజ్ఞగలవారై యుంటారు ।
    4. దేహాభిమానరహితులు ।
    5. శాస్త్రాభిమానంలేదు ।
    6. మనిషికొద్దినడిచేవారు ।

7. స్వదృష్టిచేత వున్నదో లేదో । రెండెరిగి నడుచుకుంటారు.

8. అన్యుల దృష్టికి వున్నట్టు వుంటారు, కాలిన బూడిద కచ్చికవలె ఉంటారు.

13. అలాగే ప్రకృతి ద్వయదోషరహితులు । చేసే వ్యాపారం అన్యులచేత కల్పితం కాదు।

1. సదా చూడదు । 2. వినడు 3. మాట్లాడడు । 4. కదలడు । 5. మెదలడు । 6. భోంచెయ్యడు। 7. రెప్పపాటు అయినా క్రియలేదు । ఇదే వారి ఆంతర్యం । ఎప్పుడు తాను లేని ఆలోచనే । ఉంటుంది.

14. సర్వకాలం ఉపాధి ద్వయదోష రహితులు గనుక । యీ రహస్యం లోకమందు దుర్లభం । ప్రకృతి ద్వయదోష రహితులకు । వేదశాస్త్రాల మర్యాదా లేదు ।

15. 1. అజ్ఞానులకు । కర్మకాండ ప్రమాణం । అయింది.

2. జ్ఞానులకు జ్ఞానకాండ ప్రమాణం । అయింది.

3. యీ ప్రకృతి ద్వయదోష రహితులు । జ్ఞానులుగారు । అజ్ఞానులుగారు । గనుక వీరికి వేదశాస్త్రాలతో పనిలేదు । నిర్మలులుగా ఉంటారు.

16. వేదాలు వెర్రివాక్యాలు ఆయె । కర్త లేనిదే కర్మం బోధిస్తుంది । జ్ఞానం లేనిదే జ్ఞానందొడ్డదని చెప్పుతాది । యీ వాక్యాలు యేలాగు నమ్మ । యెవ్వరు కర్తలు । ఇవి జ్ఞానులకే సత్యంగాని । జ్ఞానాజ్ఞాన రహితులకు గాదు ।

17. జ్ఞానం అజ్ఞానం ఆయె । కర్త అకర్త ఆయె । యిది యేమి వింత । భగవద్వాక్యాలు । స్వాములవారి వాక్యాలు । సౌకర్యం ఆయె । యిది పరమరహస్యం । ఉపాధి ద్వయ దోష రహితమేవ మోక్షః

శ్లో॥ **క్షేత్రక్షేత్రజ్ఞయో రహస్యం । నామరూప వివర్జితం ।**
**సదా త్రిపుటి రహితం । సర్వద్వంద్వ వివర్జితం ॥**

తా॥ క్షేత్రం క్షేత్రజ్ఞం ఈ రెండు లేవు, నామ రూపములు రెండు లేవు, క్షర పురుష, అక్షర పురుష, ఉత్తమ పురుష యను త్రిపుటి లేదు, ఇంకా అనేక సర్వ ద్వంద్వమైన యెరుక యెప్పుడూ లేనే లేదు । అంతా బట్టబయలే ఉన్నదని యెరుకచే దెలిసి ఈ యెరుకను వదులుటే పరమార్థం.

## 2. ప్రకృతి ద్వయంబనె యెరుక పేర్లు - దాని యొక్క వ్యవహారం

**1.** త్రిపుటి । జ్ఞాత । జ్ఞానం । జ్ఞేయం ।

ద్వంద్వాలు । 1. సత్తు, అసత్తు । 2. చిత్తు, జడం । 3. సుఖం, దుఃఖం ।

4. క్షేత్రం, క్షేత్రజ్ఞుడు । 5. జగత్తు, జీవుడు । 6. జ్ఞానం, అజ్ఞానం । 7. విద్యా, అవిద్యా

8. కారణం, కార్యం । 9. ఆత్మా, అనాత్మ । 10. ప్రకృతి, పురుషుడు ।

11. సాకారం, నిరాకారం । 12. సగుణం, నిర్గుణం । 13. కర్మం, జ్ఞానం ।

14. ధర్మం, అధర్మం । 15. పుణ్యం, పాపం । 16. పతివ్రత, వ్యభిచారి ।

17. ముండ, ముత్తైద । 18. బద్ధుడు, ముక్తుడు । 19. గృహస్తు, గుండగొయ్య ।

20. అహితాగ్ని, అనాహితాగ్ని । 21. బిడ్డతల్లి, గొడ్రాలు । 22. మంచివాడు, చెడ్డవాడు ।

1. గుర్తెరిగేది మాయ । అదే అవిద్య । అదే ప్రకృతి । అదే ప్రకృతి ద్వయం గనుక । గుర్తెరిగేది ప్రకృతి ద్వయమని । గీతాచార్య స్వాముల వారిచేత సిద్ధాంతం । సిద్ధాంతమె । రాద్ధాంతం ।

2. వున్నదే వున్నది । అది బట్టబయలు । ప్రకృతి ద్వయం యెరుగదు । ప్రకృతి ద్వయం లేదు గనుక । దానికే బంధమోక్షం । లేదు. వున్న దానికి అంతరం లేదు । బాహ్యం లేదు । ప్రకృతి ద్వయం । లేనే లేదు యని గురువాక్యం చెప్పింది ।

3. క్షేత్ర క్షేత్రజ్ఞ స్వరూపమె ప్రకృతిద్వయం । అదేవుపాధి ద్వయం ఉపాధి ద్వయ దోషమైన యీ గుర్తెరిగే యెరుక లేకుంటే ఏమిలేదు.

4. దేనికి లోపటా । దేనికి బయటా । వున్నదానికి । అంతరంలేదు । బాహ్యం లేదు మొదలులేదు । కొనాలేదు । యెప్పుడు వొక్కతీరె । ప్రకృతి ద్వయం లేదు గనుక । వ్యష్టి, సమిష్టి క్షేత్రజ్ఞ క్షేత్రాలు । వంధ్యా పుత్రవత్ । ఆయెను.

5. క్షేత్రం మూడు గుణాల వలన అయింది । సత్వగుణంవలన । నేను అనె తెలివిపుట్టింది । తెలివికి కారణం క్షేత్రం । గాఢానిద్రపోతే కారణం వున్నదో లేదో । క్షేత్రజ్ఞుడు లేకపోయినాడు గనుక ఉంటే రెండు ఉంటావి । లేకపోతే రెండు లేకపోతావి ।

6. మాయా స్వరూపం। అవిద్యా గనుక। క్షేత్రం మొదలైన విషయాలను। గుర్తెరిగేది చైతన్య స్వరూపిణి అనె పేరుగల విషయీ గుర్తెరిగే శరీరం। అవుతుంది
7. అదే అదిష్ఠానం। అనబడింది.
8. అదే పర బ్రహ్మ స్వరూపం।
9. అదే సచ్చిదానంద స్వరూపిణి।
10. అదే జగత్కారణం।
11. అదే ఆనందం సమిష్టిగా క్షేత్రాలలో ఉన్నదన్నారు।
12. అదే కార్యాలకు మూలమైన కారణం।
13. అదే చైతన్యం, ఆత్మ, బ్రహ్మ స్వరూపిణి।
14. అదే పరా ప్రకృతి, అదే నిరాకారమైన యెరుక, దాన్ని ఉన్నదనుట పెద్ద అబద్ధం।
15. అదే సాక్షిణీ గుర్తెరిగే క్షేత్రజ్ఞుడైన పరా ప్రకృతి అనబడింది।
16. అదే ప్రకృతి ద్వయమని రాద్ధాంతం। చేసుకున్నది।

### 3. ప్రకృతి ద్వయానికే నానా తిప్పలు

1. నేను ఉన్నాననే గుర్తెరిగే ప్రకృతికే సర్వభ్రాంతులు।
2. నేను ఉన్నాననే గుర్తెరిగే ప్రకృతికే సంశయాలు।
3. నేను ఉన్నాననే గుర్తెరిగే ప్రకృతికే అష్టాంగ యోగాభ్యాసాలు।

జ్ఞాన, అజ్ఞానమె ప్రకృతి పురుషుడు। ఇట్టి ప్రకృతి ద్వయమే అవతారాలు। క్షేత్రక్షేత్రజ్ఞ స్వరూపం। ప్రకృతి ద్వయానికే బంధం। మోక్షం। ప్రకృతి ద్వయం వలననె। వేద శాస్త్రాలు పురాణాలు। వ్రాయబడ్డాయి, చదువ బడ్డాయి, నియమాలు, అనియమాలు చెప్పబడ్డాయి.

1. ప్రకృతి ద్వయమె కారణ కార్యం।
2. ప్రకృతి ద్వయమె కనేది। చెప్పేది।
3. ప్రకృతి ద్వయమె వినేది। అనేది, చేసేది చేయించేది.
4. ప్రకృతి ద్వయమె చూచేది। చూపించేది.

5. ప్రకృతి ద్వయం అంటే మాయ । ప్రత్యక్షంగా ఉంటుంది విచారిస్తే యేమిలేదు ।

6. మాయ అంటే కనపడి । యేమీ లేదు ।

7. క్షేత్రం మాయ । అవిద్య మాయే ।

8. క్షేత్రజ్ఞ స్వరూపం । విద్య । ఈ రెండు ఒక్కటే యిదే పెద్ద మాయ ।

9. అవిద్య అంటే । యేదికనపడి లేకపోతుందో అదే అవిద్య ।

10. క్షేత్ర ప్రకృతి అవిద్య । క్షేత్రజ్ఞ ప్రకృతి విద్య । ఈ ప్రకృతి ద్వయమె అవిద్యా విద్య ద్వయం ।

11. క్షరోపాధి క్షేత్రం । అక్షరోపాధి క్షేత్రజ్ఞుడు । ఈరెండు యెరుకే ।

12. "క్షరాక్షరోపాధి ద్వయ దోష రహితమేవ । విచారస్య ఫలం కల్పనారహితమైతే । జగత్తువున్నది అనదు । లేదని అనదు । యేమీ లేదని అనదు ।

13. ప్రకృతి ద్వయ రహితుడు గనుక । జ్ఞానాజ్ఞానరహితమాయె గనుక యెరుక లేదు । రెండోదాన్ని యెరుగడు ।

14. గురువాక్యం చేత ప్రకృతి ద్వయ రహితమైన । ఉండిలేని వాడైనాడు ।

15. ప్రకృతి ద్వయరహితమె విచారానికి ఫలం ।

## 4. కేవలాత్మ లక్షణం-ఉదాహరణలు

1. సాధనాసాధ్య పరామర్శ రహితమె అయిక్యం । ఈ ఐక్యం అనేమాట బయలుకు పొసగదు.

2. కేవలాత్మ సుఖదుఃఖ రహితం । సుఖ దుఃఖాలకు మూలమైనది లేకపోవటము.

3. కేవలాత్మ వుత్పత్తి నాశన రహితం । నాశనం చేసేదే లేదు యెరుకే నాశనం అయింది.

4. కేవలాత్మ వృద్ధి క్షయరహితం । శరీరమే లేకపోయింది గనుక గుర్తెరిగేది ఏమిలేదు.

5. మొదలు ఏదిగలదో తుదకు అదే బట్టబయలు గలదు, అదే కేవలాత్మ.

6. క్షేత్రక్షేత్రజ్ఞ లక్షణ ప్రకృతి ద్వయ రహితమైనదే కేవలాత్మ । అదే యథాతథం.

7. సుషుప్తి యందు । ప్రకృతి ద్వయం లేదు । కేవలాత్మ వున్నది ।

8. మూర్ఛయందు । ప్రకృతి ద్వయంలేదు । కేవలాత్మవున్నది ।

9. సమాధియందు । ప్రకృతి ద్వయం లేదు । కేవలాత్మవున్నది ।
10. వూరికే వున్నప్పుడు । ప్రకృతి ద్వయం లేదు । కేవలాత్మవున్నది ।
11. మరణంయందు । ప్రకృతి ద్వయంలేదు । కేవలాత్మవున్నది ।
12. ఈ అయిదు అవస్థలయందు । యేలాగువున్నదో । అలాగే । గురూపదేశానంతరం । ప్రకృతి ద్వయం లేక । కేవలాత్మనే వున్నది ।
13. కేవలాత్మ సాధన చేత సాధ్యం కానిది గనుక గురువాక్యం చేత గుర్తెరిగి, యెరిగిన జ్ఞానం, మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు యని తెలియుటే జ్ఞాని లక్షణం, జ్ఞానం అంటే పప్పు, బువ్వ గుర్తెరిగేదే జ్ఞానం కాదు. తనను తానే గుర్తెరుగుట.
14. అందుకే జ్ఞానం జ్ఞాత । జ్ఞేయం త్రిపుటి రహిత విషయాన్ని । తెలియుటే గురువాక్య నిశ్చయం.

## 5. మొదటి జవాబు-గురు వందనం

1. పరాప్రకృతి రహితః సిద్ధయే నమః ।
2. చైతన్యాఖ్య పరాప్రకృతి రహితః నామ సిద్ధయే నమః॥
3. సత్యవాఖ్య పరబ్రహ్మ రహితః నమః । 4. నిర్గుణరహితః । 5. అద్వైత రహితః ।
6. జ్ఞాన రహితః । 7. చిద్రూపరహితః । 8. మాయావిద్యా రహితః ।
9. బంధ మోక్షరహితః । 10. ప్రకృతి పురుషరహితః । 11. గురుశిష్యరహితః ।
12. వాచ్యార్థ లక్ష్యార్థ రహితః । 13. నేను అనే చైతన్య రహితః ।
14. తత్వమసి, అదే నీవు అనే, చైతన్య రహితః ।
15. శబ్దరహితం । తత్త్వ రహితమైన । నీవు నేను । లేనటువంటి నిజరూపం । ఉత్పత్తి స్థితిలయాలను యెరుగనిది । బట్టబయలు ।
16. యేమి పుట్టుతుందో ।యేమి లయమౌతుందో యేమివున్నదో । యెవ్వరు యెరుగుదురో ।యివి వున్నవిఅని । చిత్తుకు యెరుక । గుర్తెరిగే జ్ఞానానికే యెరుక ఉన్నది.
17. చిత్తుమాయా అవిద్య అయివున్నది గనుక । యిది యెవ్వరు కారో। అదే వారి ముచ్చట వడిసె । వారే గురువాక్యమందు నిష్ట గలవారు.
18. చెప్పేవారు గురువులు । వినేవారు శిష్యులు । యింతకంటే మాయ వేరేలేదు ।
19. యేమి వ్రాతును । సర్వం మీ చరణాలకు । యివ్వేనూరు సచ్చిదానందరహితాయనమ॥

## 6. రెండవ జవాబు

1. శ్రీమదాతీత స్వస్వరూప । అధ్యయన । దాత । త్రీణీ । కర్మనిరతులయిన । వేదాతీత స్వరూపమైన । చైతన్యాతీత స్వరూపమైన । సారాతీతులైన । మీకు అనేక ప్రణామాలు గురుదేవా ।

2. మాయా । అవిద్య అనే । పేరుగల అటువంటి । చైతన్యాన్ని గూర్చి । యేలాగు సమాధానమైతె అలాగు । ఆశీర్వచనములు నమస్కారములు । దండములు । మాయ సమస్త భాషారూపిణి అయివున్నదన్నట్టు వున్నది । విచారించిన వారికి లేదు । విచారించని వారికి ఉన్నది ।

3. జ్ఞానాతీత సిద్ధులు చిచారించే । మహాకారణ దేహమనే । పేరుగల అటువంటి చైతన్య రహితులు గనుక । వున్నదని యెరుగరు । లేదని యెరుగరు । వారికి గుర్తెరుగుటయె దోషం । అటువంటి దోష రహితులే సిద్ధులు ।

4. జ్ఞానులే అజ్ఞానులు । నేను యెరుగుదును । నేను యెరుగను । అనే చైతన్యమే గుర్తెరిగే యెరుక। గనుక । చైతన్యం కంటే । మాయ । అవిద్య వేరు లేదు యిది అత్యంత రహస్యం ।

5. శాస్త్రంలో మాయా । అవిద్య । చైతన్యం కంటే వేరులేదు అని । వేదం చెప్పినది గనుక । వేదమనగా తెలివి, ఈ తెలివికి అందినదాన్ని । అందనిదాన్ని కూడా తెలియజేయగలదు, దీనికే విద్యా । అవిద్య అని వ్రాసినారు । ఆ శాస్త్రాలలోనె । ప్రకృతులు రెండు అని వున్నవి । చైతన్యం పరాప్రకృతి । జడం అపరాప్రకృతి । అని వున్నది గనుక । యిది వింతగాదు । విచారించవలసినదే ।

6. జ్ఞానం మహా కారణ దేహం । శరీరత్రయం అజ్ఞానం అని మర్యాద గలదు । సర్వం గుర్తెరిగే చైతన్యం అని వేద శాస్త్రాలకు అభిమానం । మనుష్యులకు అలాగె । జ్ఞాన స్వరూపులు గనుక । వొక్కటే కల్పనకు మూలం । జ్ఞానంకంటే కర్మం వేరులేదు ।

7. గుర్తెరిగేదే చేస్తుంది । గనుక వేద శాస్త్ర వినోదం చూచి వెరవవద్దు । గుర్తెరిగేదాని ప్రభావం । గుర్తెరగడం గురు ద్రోహం । యేమికాదు గాని, యెరుకకు లోను కావడమే గురుద్రోహం ।

8. మూలం లేనిది గనుక । నిర్గుణం । అద్వైతం గనుక । హేతులేని హేతునిజం ।

మీకు పర దేవత ప్రసన్నమై । తెలిపింది గనుక । తెలివి వలె వున్నది । యెరుకను గెలిచేది కఠినం । విద్యకంటే । అవిద్య లేదు ।

9. చూతామన్నా । ఉత్పత్తి స్థితిలయాలు యేమిటిచేత పుడుతావి అంటే । చైతన్యం సత్తాచేత అని । పుస్తకాలలోనె వున్నది । చైతన్యం వుంటే అలాగే । అది లేకుంటే యేమిటికి సత్తా । యేమిపుడుతుంది । యీ వింత యెవరికి తెలియదు । దీనికే గురువాక్యం అవసరమయింది.

10. భగవానులకు తెలుసును అని భ్రమ । భగవానులు సత్తు, చిత్తు అఖండము అన్నారు । ఈ రెండు లేకుంటే భగవానులు యెక్కడ । మనం యెక్కడ ।

11. యిది విచారిస్తే మీకుచాలు । మళ్ళామళ్ళా చూడండి । అమ్మగారికి । అయ్యగారికి వినుపించు । యెరుక యేమీలేదని జాగ్రత వుండవలెను ।

గద్యః

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే । వేదాంత విచారణే ।**
**ఉత్తరభాగే । క్షేత్ర క్షేత్రజ్ఞ ప్రకృతి ద్వయ దోష నిరసన సప్తమ ప్రకరణం ।**
**ప్రథమాధ్యాయం సమాప్తం.**







# 8. మహావాఖ్య స్వప్రకాశ నిరసన ప్రకరణము

## ప్రథమోధ్యాయం

### 1. బట్టబయలుకు పదిరెండు లక్షణాలు యేమిలేవు

1. ఈ వుత్త బట్టబయలుకు । ప్రత్యగాత్మ లేదు ।
2. ఈ వుత్త బట్టబయలుకు ప్రాజ్ఞుడు లేదు ।
3. ఈ వుత్త బట్టబయలుకు తైజసుడు లేదు ।
4. ఈ వుత్త బట్టబయలుకు విశ్వుడు లేదు ।
5. యీా వుత్తబట్టబైలుకు । తుర్యావస్త లేదు ।
6. ఈ వుత్త బట్టబయలుకు సుషుప్త్యావస్త లేదు ।
7. ఈ వుత్త బట్టబయలుకు స్వప్నావస్త లేదు ।
8. ఈ వుత్త బట్టబయలుకు జాగ్రతవస్త లేదు ।
9. ఈ వుత్త బట్టబయలుకు మహాకారణ దేహం లేదు ।
10. ఈ వుత్త బట్టబయలుకు కారణదేహం లేదు ।
11. ఈ వుత్త బట్టబయలుకు సూక్ష్మదేహం లేదు ।
12. ఈ వుత్త బట్టబయలుకు స్థూలదేహం లేదు
13. యీా పదిగెండు అనగా

**4 అభిమానములు :** 1 విశ్వ, 2 తైజస, 3 ప్రాజ్ఞ, 4 ప్రత్యగాత్మలు,
**4 శరీరములు :** 1 స్థూల, 2 సూక్ష్మ, 3 కారణ, 4 మహాకారణము ।
**4 అవస్థలు** : 1 జాగ్రత, 2 స్వప్నము, 3 సుషుప్తి, 4 తుర్యం ।
మొత్తం 12 మూడు నాలుగు పదిరెండు యేమీలేవు ।

### 2. బట్టబయలుకు పంచకోశ లక్షణాలు యేమియు లేవు

1. హిరణ్మయ కోశమన్న యెరుకె ।
2. ఆనందమయ కోశమన్నా యెరుకె ।
3. విజ్ఞానమయ । కోశమన్నా యెరుకె ।
4. మనోమయ కోశమన్నా యెరుకె ।
5. ప్రాణమయ కోశమన్నా యెరుకె ।

6. అన్నమయ కోశమన్నా యెరుకె ।
7. యీ బట్టబయలుకు యీ । ఆరు యేమీలేవు । ప్రపంచమెన్నడూ యేమీలేదు।

## 3. బోధకుని దృడ లక్షణం

1. యీ బట్టబయలుకు యేమీలేదు । యిదే గురువాక్యం । యిదిగాక జ్ఞానం యొక్క ఆశ వున్నా। కర్మయొక్క ఆశవున్నా। అడవి మార్గంలో కలిసి కుక్కల వలె రానుపోను భ్రమ విస్తారం అవుతుంది.
2. ఈ రెండూ యేమిలేదు, షోడశాక్షరీ పరమాత్మ । శరీరంలో లేదు. రెండో ప్రకారం కాదు. గనుక యీ ఉత్తబట్టబయలు యేమిలేదు । ఈ పదిరెండు ఈ ఉత్తబట్ట బయలుకు పుట్టినవి కావు అనగా? 4 అభిమానములు, 4 శరీరములు, 4 అవస్తలు యేమిలేవు.
3. ఈ ఉత్తబట్ట బయలుకు జ్ఞానం లేదు, ఈ ఉత్తబట్టబయలుకు అహంకారం యెన్నడు లేదు, గనుక లేని ఈ మాయ యీ యెరుక లేని చైతన్య స్వరూపిణి, లేని ఈ మాయను లేదని కన్నవారికి ఈ ఉత్త బట్టబయలు పుట్టనిది చావనిది యని నిర్ణయమాయెను.
4. యీ ఉత్త బట్టబయలు చెడి యెన్నడు శరీరాకారం కాలేదు, వెనుకటికి కాలేదు, ఇప్పటికి కాలేదు, ముందర కాబోదు, సర్వకాలం రెండో ప్రకారం గాక వక్క తీరుగానే యున్నది. బట్టబయలు మాత్రమే.
5. ప్రపంచానికి ఈ ఉత్త బట్టబయలుకు యెటువంటి సంబంధం లేదు.
6. తానే పుట్టని చావనిది । ప్రపంచాన్ని యెలాగు పుట్టించె । ప్రపంచం యొక్క జోలే లేదు.

## 4. అసాంప్రదాయ లక్షణం

1. పుట్టని ప్రపంచాన్ని వున్నదనేటందుకు । చదువుకున్న విద్వాంసులకు । విచారించిన సన్యాసులకు । జడలు పెంచిన యోగీశ్వరులకు । అహంకారులైన జ్ఞానులకు సిగ్గు గాదేమో ।
2. పుట్టని మాయను ఉన్నదని యనుకున్నవాడే గురు సాంప్రదాయ రహితుడు । వాడే అసంస్కారి । వాడే గురుమూలంగా వేదశాస్త్రాలను విచారించని వాడు, ఈ ఉత్త బట్టబయలు యేమిలేదని । గురువాక్యం చెప్పుకోలేదు, గనుక వాడే అసాంప్రదాయకుడు.

## 5. సాంప్రదాయ లక్షణం

1. **ద్వాదశాక్షరీ (అభావం శివం అశివం నలిప్యతే)** యిదే గురువాక్యం। ఈ గురువాక్యం సర్వకాలం స్మరిస్తూ యుండవలెను. స్మరించడమనగా బట్ట బయలు తప్ప రెండోది లేదని తెలియడం.

2. ఈ ఉత్త బట్టబయలే నిరంజనం అంజనమంటే లేని అహంకారం। యెరుక। జ్ఞాప్తి। జ్ఞానం అని ప్రపంచంలో అనుకొన్నారు, ఈ ఉత్తబట్టబయలుకు యెన్నడూ అటువంటివి యేమి కాలేదు. లేదు గనుక ఈ ఉత్తబట్టబయలు మాత్రమే ఉన్నది.

3. ఈ ఉత్త బట్టబయలు చొౘ్రదు వెళ్ళదు, మనుష్యాకారం యెన్నడూ కాలేదు, ముందర కాబోదు, సర్వకాలం రెండో ప్రకారం గాక ఒక్కతీరుగానే యున్నది,

4. యీ ఉత్తబట్టబయలు నిరంజనం। జ్ఞాప్తి లేనిది యెరుకే, నిషేదం గనుక జ్ఞానం జోలే కూడదు,

5. జ్ఞానం లేని ఈ ఉత్తబట్టబయలు గనుక శృతి ఇలాగున ఉన్నది.

**శ్లో॥ సర్వశూన్యం మయా రూపం। జన్మశూన్యం స్వభావతః**
**జన్మ భావేన మృత్యుశ్చ। పరిపూర్ణం స్వభావతః ॥**

6. అచల పరిపూర్ణము యొక్క స్వరూపము। ఆకాశాది సమస్త వస్తువులూ గాక। సర్వశూన్య మైనదియున్నూ। సహజముగా। జనన మరణంబులు లేని స్వభావముతో। నంతటనూ నిండిన అచల పరిపూర్ణమే స్వతః సిద్ధమై వున్నది ॥

7. యీ వుత్తబట్టబయలే పరిపూర్ణము। యీ వుత్తబట్టబయలు వలన పుట్టని ప్రపంచాన్ని యేలాగు వున్నదందు। వున్నదంటే అంతకంటె అబద్ధం లేదు। ఆ వర్తమానమె కూడదు। ప్రపంచాన్ని వున్నదని అనుకోరాదు। యీ వుత్తబట్టబయలు సర్వకాలం వున్నది।

**శ్లో॥ యేనం వేత్తి అంతారం యశ్చైనం మన్యతే హతమ్।**
**ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి న హన్యతే ॥ (2-19)**

8. యీ వుత్తబట్టబైలే నిశ్చయం। చైతన్యం నిషేధం గనుక। జ్ఞప్తి లేని మాయ గనుక। లేని ప్రపంచం లేదని। దృఢం వుంటె సరి ॥

## 6. పరిపూర్ణ బోధ దృఢీకరణం

1. యీ వుత్తబట్టబయలు వొక్కతీరుగానే యున్నది। యీ వుత్తబట్టబయలు తప్ప విడచి । రెండోది యేమీలేదు ।
2. లేని యెరుకే ప్రపంచం । ప్రపంచమేలేని యెరుక । యెండమావుల వత్ ।
3. యీ వుత్తబట్టబయలె వున్నది । యీ వుత్తబట్టబయలె నిరాకారం ।యీ వుత్తబట్టబయలె నిర్గుణం।
4. యీ వుత్తబట్టబయలె నిర్వికారం । యీ వుత్తబట్టబయలు పిండాకారం । గాడిదాకారం కాలేదు । బ్రహ్మాండాకారం కాలేదు । యీ వుత్తబట్టబయలె వున్నది ।
5. ఈ యెరుకే లేని మాయ । యీ అహంకారంలేని మాయ । లేనే లేదు ।
6. యీ వుత్తబట్టబయలుకు ప్రపంచానికి కొంచమైనా సంబంధంలేదు ।
7. యీ వుత్తబట్టబయలు రెండో ప్రకారం కాదు । యెన్నడూ కాలేదు ।మునుపూ కాలేదు । యిప్పుడూ కాలేదు । ముందర కాబోదు । సర్వకాలం వొక్కతీరుగానే యున్నది ।
8. యీ వుత్తబట్టబయలె పుట్టని చావనిది । నిరంజనుడు । పురుషోత్తముడు ।
9. యీ వుత్తబట్టబయలుకు రాకడా లేదు పోకడా లేదు । అచలం చలించక యున్నది.
10. పరమాత్మ వలన పుట్టని ప్రపంచాన్ని యేమని వ్రాయ । యెరుగని వారు యెన్నో చెప్పినారు.
11. యీవుత్తబట్టబయలు వలన వక్కటైనా పుట్టలేదు । పుట్టింది యేమీలేదు ।యేదిచూచినా అదె యేమి మాట్లాడినా అదె । వుత్తబట్టబయలు మాట్లాడదు । యీ వుత్తబట్టబయలుకు సంసారము లేదు।
12. యీ వుత్తబట్టబయలుకు సమరసాది ద్వంద్వాల ప్రస్తావనమేలేదు । గనుక । నిషేధం చెప్పనే లేదు।

## 7. పది ప్రశ్నల సమాధానం - భ్రాంతి రహిత లక్షణం

1. యీ వుత్తబట్టబయలుకు జ్ఞానమున్నూ । కర్మమున్నూ । శూన్యమె గనుక । భోంచెయ్యటం లేదు । పరిపూర్ణస్వభావం
2. యీ వుత్తబట్టబయలు వలన అహంకారం పుట్టనేలేదు । గనుక జన్మరహిత భ్రాంతి యెవ్వరికి।

3. యీ వుత్తబట్టబయలుకు భ్రాంతి యెన్నడూ లేదు। ప్రపంచం పుట్టనే లేదు। గనుక క్రియాశూన్యం యని చెప్పబడినది.

4. పరమాత్మ నిరాకారం గనుక జ్ఞానమున్నూ। ఖర్మమున్నూ శూన్యమె। దొర యెవ్వరు లేరు। సర్వకాలం వొక్కతీరుగానే యున్నది। ప్రపంచం పుట్టనేలేదు

5. మాయ యెటువంటిదో అటువంటి వాడే యీశ్వరుడు। ఈశ్వరుడే జీవుడు। జీవుడే అహంకారుడు। ఈరెండే శివోహం, జీవోహం అనే అహంకారమె జ్ఞానము। ఈ జ్ఞానమె బుద్ధి। మనస్సు చిత్తము। అహంకారం ఈ అంతఃకరణమన్నా యెరుకె। అన్నారు। గనుక ఈయెరుకే లేనిది గనుక గ్రంథాలు యెవ్వరు చేసేది.

6. యీ వుత్తబట్టబయలే అమృతం। అమృతమంటె మరణం లేనిది। గనుక పుట్టి చచ్చేది లేనే లేదు.

7. యీ వుత్తబట్టబయలు పుట్టని చావని పరిపూర్ణం। యీ వుత్తబట్టబయలు। పంద్యాకారం। గాడిదాకారం। మనుష్యాకారం। యెన్నడూ కాలేదు। గనుక జగద్భ్రాంతి యెవ్వరికి వచ్చింది.

8. ప్రపంచం పుట్టనేలేదు గనుక। మూఢులకు। ఉత్పత్తి। స్థితి। లయాలకు। మూలం వున్నదని భ్రాంతి కద్దు। పుట్టని చావని బట్టబయలు ఒక్కటే ఉన్నది.

9. యీ వుత్తబట్టబయలె పరబ్రహ్మాన్ని। యెరుగదు। పరబ్రహ్మాంకు మొదలులేదు। మధ్యలేదు। కొనలేదు। గనుక బయలు పరబ్రహ్మాం కాదు, ఈ పరబ్రహ్మామే లేని యెరుక। ఇది అదికాదు, అది ఇది కాదు।

10. యీ వుత్తబట్టబయలుకు జన్మంలేదు। మరణం లేదు। గనుక రాకడ పోకడ లేదు.

11. యీ వుత్తబట్టబయలుకు జ్ఞానఖర్మాలు యేమీలేవు। కర్తలేదు గనుక। సువర్ణాలంకారం ఆభరణాలు అయినట్టు బట్టబయలు కాలేదు।

12. యీ వుత్తబట్టబయలు నిరంజనం। అనిసౌజ్ఞ। జ్ఞానమని ప్రసిద్ధి మాత్రమే। నేతిబీరకాయ అంటె నెయ్యికారిందె। లేని జ్ఞప్తి అబద్ధం।

13. యీ వుత్తబట్టబయలు యేమీలేదు। అని నిబంధన। దీనికి నిషేదం లేదు గనుక। యీ వుత్తబట్టబయలుకు। జన్మం మరణం లేదు.

14. ప్రత్యగాత్మ అన్న జీవుడె ।జీవుడు వున్నాడని అనుకోరాదు । గురుసూచన ద్వారా ప్రత్యగాత్మ లేకనేపోవును.

15. పరిపూర్ణం వలన యెరుక పుట్టలేదు గనుక ।సమస్త శాస్త్రాల్లో జీవుడని ।అనుకొనిరె గాని మిక్కిలి గురుమూలంగా వేదశాస్త్రాలను విచారించని వారు ।విచారిస్తే జీవుడు లేడు, పరమాత్మ లేదు

16. యీ వుత్తబట్టబయలుకు । జీవుడు । జగత్తు । పుట్టనేలేదు । గనుక । యీ వుత్తబట్టబయలు వలన వక్కటైనా పుట్టలేదు । పుట్టిందని భ్రాంతి పుట్టింది, అది విచారిస్తే యేమీలేదు ।

17. జ్ఞాన భ్రాంతి । ఖర్మభ్రాంతి అంతా అనుభవమె । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంత శేపూ అనుభవం । జ్ఞానం లేకపోతె యెవ్వరికి అనుభవం లేదు । అనుభూతి లేదు ।

18. యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని యెప్పుడు తెలిస్తే అప్పుడే । పుట్టని చావని అచలం స్వతసిద్ధమై వున్నది ।

19. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేత సాధ్యం కాదు । స్వతసిద్ధమై వున్నది గనుక । అచలమె వున్నది

20. యీ ఆవరణ వీక్షేపం లేకుంటె పుట్టని చావని అచలమె వున్నది ।

21. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం విడిపించే గురువు వుండెనా । అతి సులభం

22. యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేశిన పుస్తకాలు । విని నమ్మెనా దీని వంటి చంచలుడే అయ్యి । కొంతసేపు వుండి । కొంతశేపులేక । విచారిస్తే లేక పోతాడు.

23. యీ ప్రకారాన । నేనే అచలం అనుకోని । నిద్రలో తాను చేశిన పుస్తకాలతో గూడా ముణిగి లేచేనా । మళ్ళా మునుపటి వలె । సకలమైన భ్రమల చేత వుండీ । భ్రాంతి తీరక దారి దొరుకక క్లేశపడుతాడు ।

24. నాలుగు మహావాక్యములనగా? ఒక్క యెరుకయగు బ్రహ్మ తత్వానికే చెప్పబడ్డాయి, అవి ప్రజ్ఞానం బ్రహ్మమన్న । అహం బ్రహ్మాస్మి యన్న । తత్త్వమసి యన్న । అయమాత్మ

బ్రహ్మ యన్నను యెరుకే । ఇదే వేదాల నిర్ణయం, ఉపనిషత్తుల నిర్ణయం ।

25. ఈ నాలుగు మహావాక్యములే ప్రస్థానత్రయంబగు, భగవద్గీత, బ్రహ్మ సూత్రాలు, ఉపనిషత్తులు, ఈ మూటి నిర్ణయమే యెరుకను నిల్పినదేగాక యెరుకనె అచలమని, పరిపూర్ణమని, బట్టబయలని చెప్పినారు. గనుక అచల మార్గమైన రాజమార్గమందు యెరుకను నిరాకారమని లేని యెరుకయని నిరూపించి బట్టబయలును సత్యమని చెప్పబడినది.

26. అందుకే గురువాక్యం మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదు, కలదోచిన శరీరాలు యేలాగో ఆలాగే, ఈ ఉత్తబట్టబయలు యేమిలేదు యని సిద్ధాంతము.

గద్యః

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ఉత్తరభాగే మహావాక్య స్వప్రకాశ నిరసన అష్టమ ప్రకరణం ప్రథమాధ్యాయము సమాప్తం.



# 8. మహావాక్య స్వప్రకాశ నిరసన ప్రకరణము

## ద్వితీయాధ్యాయము

## 1. స్వప్న దృష్టాంతము

యీ కలలోనె వెనకటి అయిదుగురూ వచ్చిరి । అంటె 1 సన్యాసి । 2 పెద్ద పట్టె నామాల అయ్యవారు । 3 అద్దకపు బట్టవలె వున్న మనిషి వచ్చెను । 4 రొమ్మున పెద్దలింగం కట్టుకొన్నాయన వచ్చెను । 5 అందులో వకగురువు వచ్చెను ।

1. యీ వచ్చిన వార్లయిదు గురులో వొక్కరు శరీరం లేనివారు అనిరి । ఆయనే గురువు। అదే భ్రాంతిలేని మార్గం। జ్ఞానకర్మ రహితమైంది। సర్వవృత్తి శూన్యమైంది।

2. సకలదేశాలయందూ । సర్వకాలాలయందూ । సమస్తమైన వస్తువులయందూ । క్రియాశూన్యమై । చలించక తనకు తానె స్వతసిద్ధమైవున్నది । అని తెలిపేవారు ।

3. అటువంటిదాన్ని । మూడుకన్నులు వున్నవాడైనా సూచన చేయలేడు । యిది అటువంటిది। వచ్చి అడుగంగానే। సూచన చేస్తూ వుండంగానే। కనుక్కోమంటారు।

గు॥ నేను యెటువంటిది అని సూచన చేస్తానో। అటువంటిదాని యందే నీవు వున్నావు।

శి॥ మీరు సూచన చేశినట్టూ వున్నది ।

గు॥ మళ్ళా అడుగవు గదా ।

శి॥ అడుగకుండా అన్నం వడ్డిస్తె। యెందుకు అడుగుతాను ।

గు॥ విను పుట్టని చావనిది। సకల దేశాలయందూ। సర్వకాలాలయందూ। సమస్తమైన వస్తువుల యందూ। సర్వకాలం వొక్కతీరుగా। చలించక తనకు తానె స్వతసిద్ధమై । ఉన్నది గదా ।

వొక్కదాన్ని అయినా ముట్టుకొననిది । దీనినే అనేక మందికి సూచన చేస్తే। అనేక మంది భ్రాంతిరహితులై యున్నారు ।

శి॥ బట్టబయలు సరె। యిదిగాక మరి ఒకదానికి మూలంలేదు అంటిరి, అది యెంతటిది

## 2. యెరుక యెన్ని ప్రయత్నాలు చేసిన ముందర పడదు.

గు॥ 1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదని యిప్పుడు సూచన కావలెను । అది ముప్పు తిప్పల పెట్టును.

2. మూలంలేని యీ గుర్తెరిగే శరీరంతోటి । యీ పరిపూర్ణమును । సాధించుదామని ।

యెన్ని సాధనలు చేశినా చెయ్యగలదు । చేస్తే యేమి అదే లేకపోవును.

3. యే సాధనా యేయుక్తి । యేశృతి । యేస్మృతి । యేశాస్త్రము । యే అనుభవము । ముందరపడదు । యెన్ని చేశినా చేశినవి ముందర పడవు ।

4. బట్టబయలు తనకు తానే స్వతసిద్ధమై వున్నది । చెలించక వున్నది । అదే అచలం।" గుణాలు లేనిది । గనుక । వక్కటైనా వికారం లేదు ।

5. యిటువంటి మూలంలేని శరీరాలు । కోట్ల కొద్దీ వచ్చినా । పోయినా । అది అలాగే వున్నది । యీ గుర్తెరిగే శరీరానికి దానికి సంబంధం యెంత మాత్రం లేదు । అది ఇది కాలేదు । ఇది అది కాలేదు ।

6. కలలో యేనుగవచ్చెను । దాని మీదనె అనేక మంది మనుష్యులు వచ్చిరి। వారు మనను గుర్తెరిగినారు । వార్ని మనము గుర్తెరిగినాము । వారూ మనము అనేక ప్రసంగాలు చేశినాము । వారు మేలుకొంటె । మనము యేమైనా వున్నామా ।

7. వారికి మనము మేలుకొంటె మనకు వారు యేమైనా వున్నారా లేరు గదా । ఆలాగే వారూ మనమూ కూడా । వున్నప్పుడు లేనప్పుడూ । దానికి యెన్నటికీ భయంలేదు । గనుక మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదు ।

8. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వంటిది అచలం కాదు ।

9. అచలం వంటిది రెండోది యేమియు లేదు, అంతా బట్టబయలే ఉన్నది ।

శి॥ అవును, అదే అది । చాలు । వ్యవహారానికి మూలం యేమీ లేదు । అవుతలి మాట ఎందుకు, వినేది, కనేదే పోయెను. అడిగేదేమియు లేదు ।

గు॥ శాబాసు । యెంత దొడ్డవాడవు ।

శి॥ మీరు సూచన చేశినంతటనే యెవ్వరికీ సంశయం వుండదు । యిఘయే శంఖలూ పుట్టవు । యెప్పటికీ అదే వున్నది । అదే అది రెండోది యేమీ లేదు.

గద్యః

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।
ఉత్తరభాగే మహావాక్య స్వప్రకాశ నిరసన
అష్టమ ప్రకరణం ద్వితీయాధ్యాయము సమాప్తం ॥

# 8. మహావాక్య స్వప్రకాశ నిరసన ప్రకరణం

## తృతీయోధ్యాయం

### 1. బట్టబయలుకు యేమి తెలియదు

1. వున్నాదంటె లేదు । వున్నాదనె మాటలేకుంటె తాను వున్నట్టే వున్నది । విచారిస్తే యేమి లేదు ।

2. శరీరం లేకుంటే యెరుకలేదు । కండ్లులేకుంటే । చూపే లేదు । శరారమే లేదు గనుక చెవులు లేవు । చెవులు లేవు గనుక వినటం లేదు ।

3. అలాగే శరీరంలేని దానికి నాలికెలేదు గనుక । రుచిని తెలియలేదు । ఆలాగే శరీరంలేదు గనుక నోరులేదు । మాట్లాడటం లేదు । మాటలు లేవు ।

4. ఆలాగే శరీరంలేదు గనుక । ఖర్మ అనే అహంకారం లేదు । గుర్తెరుగటం లేదు । కర్తాలేదు । భోక్తాలేదు ।

5. అలాగే శరీరంలేదు గనుక । భోంచెయ్యటం లేదు । కాళ్ళు లేవు । చేతులు లేవు । అందుకే రాకడాలేదు । పోకడా లేదు । యివ్వటం లేదు । తీసుకోవటం లేదు ।

6. వున్నదానికి యెరుకలేదు । మరుపూలేదు । శరీరం లేదు గనుక చెయ్యటం లేదు । చేయించడం లేదు । శరీరం లేదు గనుక పుట్టుకాలేదు । చావూలేదు ।

7. జీవుణ్ణీయెరుగదు । ఈశ్వరుణ్ణీ యెరుగదూ । బ్రహ్మానూ యెరుగదూ । వున్నదానికి వికారంలేదు । గనుక దేహాకారం యెన్నటికీకాదు ।

8. ఉన్నదానికి గుణాలు యెన్నటికీలేవు । శరీరానికి మూలం యోమోవున్నట్టు వున్నది । ఉన్నదివున్నట్టే వున్నది । ఉన్నది యే నిర్ణయం చేయదు ।

9. వేదశాస్త్రాలు యెవ్వరివల్ల ఆయెనో । వున్నదానికి శరీరం లేదు గనుక । వ్యవహారమె లేదు ।

10. శరీరం యెవరికి వున్నదో । యెవరికిలేదో । వున్నదానికి వక్కటైనా భ్రాంతిలేదు । సాధనములేదు । సాధ్యమూలేదు ।

11. కలలో వున్నంతశేపూ గుర్తెరిగే సచ్చిదానందమనే దేహభ్రాంతితోటి । సచ్చిదానందమనె జ్ఞానం చేత । సాధ్యం కాదు । కర్మాల చేత సాధ్యం కాదు ।

12. అద్వైతం చేత వున్నది వున్నట్టు తేట పడదు । విసిష్టాద్వైతానికి మూలంలేదు । వీటిని విచారిస్తేనే వున్నది లేనిది తెలుస్తాది.

13. వేదశాస్త్రాలకు పంచాశద్వర్ణములే మూలం। యీ పంచాశద్వర్ణాలకూ మూలంయేమో। వున్న బట్టబయలుకు చెప్పచేత కాదు। సకలభాష్యాలు। సకలసిద్ధాంతాలు। సకల మంత్రాలు। సకల యంత్రాలు। సకల తంత్రాలు। యెవ్వరివలన పుట్టినావో ఉన్నదానికి వాటి జోలేలేదు।

14. వున్నాదానికి వక్క శరీరమైనా లేదు। నాల్గుదేహాలు యెక్కడ వున్నావో। వున్నదానికి వికారంలేదు గనుక। జాగ్ర। స్వప్న। సుషుప్తి। తుర్యావస్థలు లేవు।

15. వున్నది శరీరాకారం కాదు గనుక। దేహమే లేదు। దేహాభిమానియనె ప్రత్యగాత్మ లేదు। ప్రాజ్ఞుడు లేడు। తైజసుడు లేడు। ఈశ్వరుడు యెక్కడ వున్నాడు?

16. లేని యీ భ్రాంతులు విడువపోతె। వున్నదివున్నట్టా పడదు। వున్నదివున్నట్టా గురుకటాక్షంచేత సూచన అయితే। వక్కటైనా యిశ్చ వుండదు।

17. అందుకే వున్నది శ్రవణం చేయదు। మననం చేయదు। ద్యానం చేయదు। స్వతసిద్ధమై వున్నది గనుక। సర్వత్ర బట్టబయలే ఉన్నది, దీనియందు యెరుక ఎప్పుడు లేదు।

## 2. ఉన్నదే ఉన్నది ఉన్నదానికి ఇది అది కావలెనని ఇచ్ఛలేదు.

18. వున్నది విద్యో। జ్ఞానమో। ఆత్మో। బ్రహ్మో। జీవుడో। ఈశ్వరుడో కాదు। వున్నది బట్టబయలే। రొండోది। యేమీలేని దానివలెనె కాదు। వున్నట్టె వున్నది। వున్నదానికి కావలెనని యిశ్చలేదు। అయితిని అని అనుభవము లేదు। వున్నది వున్నట్టె వున్నది।

19. నిజగురువు కృప కలిగితె। మనసు నిశ్చయము కుదిరిపోతే। వున్నది వున్నట్టే యున్నది ॥

శ్లో॥ **ఆశరీరం సర్వదాస్తి। శరీర రహితం సదా।**
**అయమేవసద్యో ముక్తిః। అన్యథాభ్రమకారణం ॥**

తా॥ శరీరాకారం గానిదే ఎప్పుడు ఉంది, గుర్తెరిగే పరమాత్మ ఎప్పుడు లేనె లేదు, గనుక లేని తాను ఉంటే బంధముక్తులు ఉంటాయి గాని, ఇది గాక ఏదో ఒకటి ఉన్నదనుకోవడమే భ్రమ.

గద్యః

**ఇతి అచలగురు శ్రీ శివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ఉత్తరభాగే మహావాక్య స్వప్రకాశ నిరసన అష్టమ ప్రకరణం తృతీయాధ్యాయం సమాప్తము**

# 8. మహావాఖ్య స్వప్రకాశ నిరసన ప్రకరణం

## చతుర్థాధ్యాయం

### 1. స్వప్న దృష్టాంతము

శి॥ యీ కలలో వక మనిషి వచ్చె। "పుట్టని చావని దాని విషయమై నాకు అనుమానంలేదు గాని ఓ గురుస్వామి! నేను యేమీ ?

గు॥ నీవు మూలంలేని యీ గుర్తెరిగే శరీరానివి। శి॥ నాకూ మూలంలేదా ?

గు॥ మూలంలేదు ॥ శి॥ నా బ్రతుకు యేమి ?

గు॥ కేవలం నీ బ్రతుకు భ్రాంతి మాత్రమె కాని। కలలో యేనుగను యినుప గొలుసులతో కట్టి వేశినాము। నూరు చెరుకు మోపులు ముందరవేస్తె। తినుకుంటూ వున్నది। యిది యెక్కడి నుండి వచ్చినది। యెవ్వరి వలన పోయింది। యెప్పుడు విచారిస్తే। అప్పుడె। లేదు గనుక మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు వొక్కలాగే వున్నవి.

### 2. జాగ్రత అవస్థ

యేనుగవంటిదే యీ శరీరం। తనకు తానే యేమీలేదని దృఢం। గురుకృప ఆయెనా । వ్యవహారం విడిచేటందుకు । పట్టేటందుకు మూలం యేమీలేదు । సర్వకాలం వొక్కతీరే । అందుకే పుట్టనిచావని దాన్ని। చెప్పిచూపి పోయెను ।

1. ఉన్నది వొక్కతీరుగానే యున్నది। పోయిందాని జాడలేదు। యెన్ని ప్రకారాల మూలం వున్నదనేటందుకు। తోచక భంగపడే మాత్రమె। వున్నది లేదని యెవ్వరూ అనరు।

2. అందరూ శరీరం లేనివారే। వున్నది విచారించవలెను ।

3. శరీరానికి మూలం వుంటే వ్యవహారం నిబద్ధే । లేకుంటె అబద్ధమె । గురువాక్యం మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు ॥ ఇందుకు దృష్టాంతము.

**శ్లో॥ యః ఏనం । వేత్తి హన్తారం । యశ్చైనం। మన్యతేహతమ్ ।**
**ఉభౌతౌన విజానీతో । నాయం హన్తి న హన్యతే ॥ (2-19)**

**శ్లో॥ వేద వినాశనం నిత్యం । య యేన మజ మవ్యయం ।**
**కథం సపురుషః పార్థ । కం ఘాతయతి హన్తి కమ్ ॥ (2-21)**

ఓయీ అర్జునుడా । యే పురుషుడు । యీ ఆత్మను । యేకరూపిగాను 'అస్తిభాతి ప్రియంరూప రహితుని గానున్నూ అస్త్యభావ వికార రహితుని గానున్నూ। పుట్టకలేని

వానిని గానున్ను । క్షయరహితుని గానున్ను । యెరుగుచున్నాడో ।

ఆ పురుషుడు । యెవ్వనిని యెట్లు చంపుచున్నాడు ? యెవ్వని యెట్లు చంపించుచున్నాడు ? అందుకే క్రియలేని అచలం గనుక । యెంతవార్లకూ కఠినంవలెనె వున్నది । యీ శరీరం యేమీలేదని స్మారకం వచ్చెనా । అచలమె వున్నది । ఉదకాన్ని నాచుకప్పినట్టె కప్పినది । యింతేకాని యింతకంటె సులభంలేదు॥

## 3. అశరీర సాంప్రదాయం కావలెను.

1. గురు సాంప్రదాయం శరీరంలేని సాంప్రదాయం కావలె । కాకపోయెనా । శరీరం కంటె వేరె నరకం లేదు । సమస్తభ్రమలకూ గుర్తెరిగే శరీరమె మూలం । గనుక గుర్తెరిగే శరీరం నిరాకారం, నిర్గుణమని తెలిసిన వారే అశరీరులు ।
2. ఆత్మా సచ్చిదానందమె । పుట్టినశరీరమెల్లా । గుర్తెరిగేది పరబ్రహ్మమేనని శాస్త్రం చెప్పింది ।
3. సర్వకాలాలయందూ గురుమూలంగా విచారించిన వారికి । అచలమే వున్నది ।
4. చెలించె శరీరానికి మూలంలేదు గనుక । యేమీలేదని సిద్ధాంతం । సిద్ధాంతమే రాద్ధాంతము ।
5. అందుకు మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । సర్వకాలం శరీరం లేకుంటె యేమీలేదు ఇంకా జనన మరణాల భ్రాంతి ఎవరికి !
6. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నదని అనుకొనిరా । అందరివంటి మూఢులే । అవుతారు.
7. జ్ఞానులే । శరీరంలేనివారు । చైతన్యం నిరాకారమని యెవ్వరు గుర్తించారో । వారే విచారపరులు
8. వారె చెలించనివారు । వారె బంధ మోక్షములు లేనివారు ।
9. వారే శరీరాత్మలు లేనివారు । చెయ్యక చేయించక సర్వకాలం వక్కతీరుగా వుండేవారు॥

గద్యః

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే । వేదాంత విచారణే ।
ఉత్తరభాగే మహావాఖ్య స్వప్రకాశ నిరసన
అష్టమ ప్రకరణం చతుర్థాధ్యాయము సమాప్తము

# 9. అమల ప్రకాశ ప్రకరణము

## ప్రథమాధ్యాయము

### 1. భగవానుల మాటలో నిజం

యీ వుత్తబట్టబయలు వలన । భగవానులు పుట్టనేలేదు । పుట్టని చావని వాడని గీతల్లో వుండనే వున్నది ।

శ్లో॥ అజోపి సన్నవ్యయాత్మా భూతానా మీశ్వరోపి సన్ ।
ప్రకృతిం స్వామధిష్ఠాయ సంభవామ్యాత్మ మాయయా ॥ **(4-06)**

తా॥ నేను పుట్టుక లేని వాన్ని (జన్మరహితుడను) గనుక వ్యయము గాని వాడను, గనుక అవ్యయుడను, ఐనప్పటికి, నేను నేనను కలలో యెరుక గలవారికి నేనే సమస్త ప్రాణులకు ఈశ్వరుడను అయినా నా ప్రకృతి ఆధీనములో నుంచుకొని నా యోగమాయచే అవతరించుదును.

1. పుట్టని చావని వాడు । అయోధ్యలో యేలాగుపుట్టె । పదహారువేల గోపికలు అష్టభార్యలు । అనే మాటలకు మూలం యేమి లేదు ।

2. యీ వుత్తబట్టబయలే పుట్టని చావని పరిపూర్ణము అనె అత్యంతవిలక్షణము । గనుక । యీ బట్టబయలు । సకల దేశాల యందూ । ఉన్నది । సర్వకాలాలయందు ఉన్నది । సమస్తమైన వస్తువుల యందూ వున్నది ।

3. తాను యెరుగడు । జ్ఞానాజ్ఞానాలు లేనివాడు గనుక । ఆదిమాధ్యాంత శూన్యుడు గనుక । తాను యెక్కడ వున్నాడు । తనకు మొదలు లేదు । మధ్యలేదు । కొనలేదు ।

4. వున్న యీ బట్టబయలు । యేలాగు వున్నదో అలాగె వున్నది । కాని ఈ యెరుక ఆలాగున లేదు, । బట్టబయలు స్వతఃసిద్ధమై ఉన్నది.

### 2. కుల మతాల లక్షణం

1. తురకలు పంది వలన పుట్టినారు । బ్రాహ్మణులు బర్రెవలన పుట్టినారు । నక్కవలన నారాయణుడు పుట్టినాడు । కుక్కల వలన కోతులు పుట్టినవి యని యెందుకు కూయవలెను ।

2. యీ నారాయణుని వలన ప్రపంచం పుట్టనేలేదు । అని యెవ్వరూ యెరుగరు । అభిమానమె పంది । కోపమె కుక్క । జుటా కూచ్ నహిః ॥

3. కుక్కవలె కరవ వచ్చేది చేష్టలన్నీ వూరపంది చేష్టలే । కుక్కచేష్టలు కొన్ని ఊరపంది చేష్టలు విస్తారం । దానిమీద తురకలకు యెందుకు కోపమో ఖురాను బాగా యెరిగిన వాని వలె వున్నాడు । గురువూ మనిషి వంటివాడె । అయితె । అందరు సమానమేనా।

4. మొదలు యేమి వున్నదో । అది పందిని పుట్టించిందే । మనిషిని పుట్టించిందే । పందాకారం । మనుష్యాకారం ఆయెనా తమది నిరాకారము । నిర్గుణము । ప్రపంచాకారం యెన్నడూ కాదు।

5. యీ వూరపంది యెవరివలన పుట్టినాదో । ఆవుకొడుకు బసవన్న । యెద్దు । అనుట । యెద్దు సాంప్రదాయం కొందరిది । ఛీ । ఛీ । మొదలు చక్కనైతె । కొనవెళ్లా చక్కనె । మొదలు వంకరైతె । కొనవెళ్లా వంకరే । అయిపాయె.

6. యీ వుత్తబట్టబయలు మాత్రం । పుట్టని చావనిది । యింతకంటె యెక్కువలేదు । ఎక్కువంటే బట్టబయలే, తక్కువంటే యెరుకె । యెరుకే లేదు ।

7. సర్వకాలం వక్కతీరె । వెనకటికీ । కర్త పుట్టలేదు । యిప్పుడూ పుట్టలేదు । ముందురపుట్టబోదు ।అభిమానమె వూరపంది ।

8. పంది పుట్టుక యెరిగిన వాడె గురువు । తన పుట్టుకయెరిగినా సరె । యీ పరమాత్మే పరమాత్మ। పరమాత్మ అన్నమాటే గాని, నామం లేదు । రూపం లేదు ।

9. యీ వుత్తబట్టబయలు వుత్తబట్టబయలే । దీనివలన ప్రపంచం యెన్నడూ పుట్టనేలేదు । ముందరా పుట్టబోదు । సర్వకాలం వుత్తబట్టబయలె ఉన్నదని కనుగొంటె సరిపాయె।

## 3. నిష్కర్ష లక్షణము

1. శంకరాచార్యుల నిష్కర్షయింతే । స్వామి జియ్యరూ యింతే అన్నారు । మొట్టమొదలు బట్టబయలే వున్నది । జ్ఞానాజ్ఞానాలు కోటి శాస్త్రాలలోనూ । ఛీ యని తీశి వెయ్యనే వేశేరు । అహంకారం లేకుంటె జ్ఞానం యెక్కడ వున్నది । సర్వకాలం యెడతెగక । యీ వుత్తబట్టబయలు వున్నది ।

2. కోటి మందిని అడిగినా । కోటిశాస్త్రాలు చూచినా । పుట్టని చావనిది । యీ వుత్తబట్టబైలే అని। నిష్కర్ష । అన్ని దిక్కులా వున్నది బట్టబయలె । యేదిక్కులేనిది యెరుకనె, గనుక యేమిలేదు.

3. అహంకారమేమీ తెలియదు । యీ వుత్తబట్టబయలుకు । జన్మము లేదు । మరణము లేదు ।

4. 'భూమా' అంటె గుర్తుయెరుగనిది । వినినిది । చూడనిది । "భూమా" అని పేరు ॥శృ॥ **"యత్రనాన్యత్ పశ్యతి । నాన్యశృణోతి । నాన్యద్విజానాతి సభూమా"** ॥ అదే వుత్తబట్టబయలు । జ్ఞానాజ్ఞానాలు మొదలైన ద్వంద్వాలు నిషేధం గనుక । శుద్ధం యీ బట్టబయలు యిదెలెస్స । గనుక । యింతకంటె దొడ్డదిలేదు ।

5. శాశ్వతమైనది యిదె । జ్ఞానం వెతికినా లేదు । ద్వంద్వ రహితమైనది యిదె । ద్వైతాద్వైత రహితమైన పరమ రహస్యం । యిదే ప్రకాశవిమర్శ రహితమైనది దీనిని పరమతత్వం అని కూడా అనరాదు । యిదే "యీ వుత్తబట్టబయలు ఇది తప్ప మరి యేమీలేదు । "

6. యీ ప్రపంచం పుట్టనేలేదు । గనుక సమయాచారం మహాదొడ్డది । కర్తలేదు గనుక । విధియెవ్వరిని గూర్చి । నిషేధం యెవ్వరిని గూర్చి । "యీ వుత్తబట్టబయలుకు యేమీలేదు । వేదశాస్త్రసారాతీతం యిదే స్వతఃసిద్ధమైనది బట్టబయలు మాత్రమే.

గద్యః

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ఉత్తరభాగే ।**
**అమల ప్రకాశ నవమ ప్రకరణం ప్రథమాధ్యాయము సమాప్తము.**



# 9. అమల ప్రకాశ నిరసన ప్రకరణము

## ద్వితీయోధ్యాయము

### 1. కవీశ్వర లక్షణము

1. "యీ వుత్తబట్టబయలె పరమపురుషుడు" । యీ పరమపురుషుని వలన । క్షేత్రక్షేత్రజ్ఞుడనె జీవుడు పుట్టనేలేదు । క్షేత్రమనె శరీరమున్నూ లేనే లేదు ।

2. అంతాపుట్టనిచావని బట్టబయలు । అత్యంత విలక్షణమైంది । పుట్టని చావంది గనుక । ప్రపంచం పుట్టనేలేదు । గనుక భగవానులు పుట్టనేలేదు ।

3. భగవానులు ॥ కల్పితుడు । కవీశ్వరుడు పుట్టినాడు । పట్టాభిషేకం కల్పించినాడు ।

4. పరమాత్మ వలన అహంకారం పుట్టనేలేదు । పుట్టని అహంకారం వలన । పుట్టినవి । లేని తామస పురాణాలు । అప్రమాణపు వేదాలు । వట్టి మాటలు యేలాగు అబద్ధమో । అలాగే అబద్ధం । యీ వుత్తబట్టబయలే సత్యం ।

5. పుట్టని ప్రపంచమె అసత్యం । మతాలు అడవిలోత్రోవ । వంటివి ఛీ । వాటిని తలువ రాదు । అహంకారంతో పుడుతావి । అహంకారంతో లేకపోతావి ।

6. పుట్టని చావని మార్గం కాదు । శరీరం పుట్టక మునుపు । వుత్తబట్టబయలె వున్నది । శరీరం వున్నప్పుడూ । ఉన్నది.

7. యీ శరీరం లేకపోయినప్పుడూ । యీ శరీరం కాలిపోయినప్పుడూ । యీ పుట్టని చావని బట్టబయలే చలించక వున్నది । కోటిమాట్లకూ యీ వుత్తబటట్టబయలుకు శరీరం యెన్నడూ లేదు గనుక । జీవుడు పుట్టనేలేదు ॥

### 2. ప్రభు లక్షణము

1. యీ వుత్తబట్టబయలె ప్రభుస్వామి । యీ ప్రభువుల వలన ప్రపంచం పుట్టనేలేదు అని 'లీలచేసిన । కవీశ్వరునికి యెరుక । శైవశిద్ధాంతాలకు ప్రపంచం పుట్టనేలేదు అని యెరక'

2. యీ వుత్తబట్టబయలె ప్రభుస్వామి యీ ప్రభుస్వామి వలన । కర్మలు గాని కర్తృత్వముగాని । ఖర్మఫలసంయోగము గాని । పుట్టనేలేదు । పాప పుణ్యంబులు । బంధమోక్షంబులు । పుట్టనేలేదు।

3. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వలన సర్వమున్నూ పుట్టినవి । సర్వమున్నూ యీ గుర్తెరిగే శరీరంతోనే పోతావి । అందుకే గురు వాక్యం । మూలం లేని ఈగుర్తెరిగేశరీరం యేమిలేదని సౌజ్ఞ.

4. యీ ప్రభువు వలన ప్రపంచం పుట్టనేలేదు । ప్రభువు అన్నా । పరమపదమన్నా । యీ వుత్తబట్టబయలుకే సౌజ్ఞ ।

5. యీ వుత్తబట్టబయలు వలన । పుట్టని చైతన్యాన్ని । వున్నదని యేలాగు అన । ఛీ । పుట్టనిచావని । యీ వుత్తబట్టబయలు మాత్రమె వున్నది ।

6. గీతాభాష్యాల్లో । పరబ్రహ్మం యెప్పుడు నిరాకారమే దానికి జనన మరణాలు లేవుయని ఆయన అభిప్రాయం। "యీ వుత్తబట్టబయలు మాత్రమె వున్నది । అని శంకరాచార్యులు వారు అన్నారు

7. సూత్రభాష్యమందు । పుట్టని చావని యీ వుత్తబట్టబయలు మాత్రం । వున్నది । వుపనిషద్వాక్యాలయందు । పుట్టనిచావని వాడే పరబ్రహ్మం అని అన్నారు.

8. అమృతం యిదే కారణకార్యం లేక వున్నది । బట్టబయలు సదసత్తులు గానిది । బట్టబయలే యిదే మొదలు చెప్పవలె । పరమాత్మ వలన పుట్టని । క్షేత్రక్షేత్రజ్ఞులను । చెప్పరాదు ।

9. పుట్టనిచావని వాడె పరమపురుషుడు. పరమపురుషుడే విలక్షణం । అహంకారం । జ్ఞానాజ్ఞానాలు మొదలైన ద్వంద్వాలు బట్టబయలందు యెప్పుడు పుట్టలేదు గనుక ద్వంద్వరహితము । బట్టబయలే అమలమైనది । అమృతమైనది ।

గద్యః

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।

ఉత్తరభాగే । అమల ప్రకాశ నిరసన

నవమ ప్రకరణం ద్వితీయోధ్యాయము సమాప్తం



# 9. అమల ప్రకాశ నిరసన ప్రకరణము

## తృతీయ అధ్యాయము

### 1. స్వప్న దృష్టాంతము

**కల స్త్రీ॥** కలలోనె వక్క స్త్రీ వచ్చె । వస్తూనే । "నాకు మొదలు యేమీలేదని యెరుగుదును । వున్నప్పుడూ నా వర్తమానం । నాకే యెరుక । సర్వకాలం శరీరంలేక వున్నది । వున్నదని విన్నా । దాన్ని సూచన చెయ్యండి స్వామీ ! ॥

**గురు॥** వున్నది । నీవు లేనప్పుడు ఉన్నది, నీవు ఉన్నప్పుడు ఉన్నది, నీవు పోయిన తరువాత కూడా ఉన్నది.

**కల స్త్రీ॥** యెక్కడ వున్నది ? యెటువంటిది ?

**గురు॥** 1. అదిపుట్టని చావనిది । శరీరం వున్నా శరీరాన్ని ముట్టనది । రాకడ లేనిది । క్రియా శూన్యమైంది । మొదలూ కొనాలేనిది । సర్వకాలం వొక్కతీరుగా వున్నది ।

2. సకల దేశాల యందూ యున్నది । సర్వకాలాలయందు వున్నది । సమస్తమైన వస్తువులయందు చలించక అచలం అంతట వున్నది ।

3. చెలించక అచలమనె ప్రశిద్ధి చేత వున్నది । యిటువంటి దానియందు నీవు వున్నావు । కానీ లేకనె ఉన్నావని, నీకు తెలియదు.

**కల స్త్రీ॥** యింతే కదా । సరెగురుస్వామీ సరె । యిది వొకవేళ్ళతోచు । నేమో?

**గురు॥** యేమని । తోచును.

**కల స్త్రీ॥** 1. యిదియోమో అనుకొందు । యిది పుట్టని చావనిది అని యెరుగ యిప్పుడు నాకు యింతకంటె ప్రకటమైంది । యేదీ లేదు అని ॥ యిప్పుడు తోస్తుంది ।

2. కుండముందుర వున్నట్టు వున్నది । యిదె పుట్టని చావనిది । అని తోచకపోయెను

**గురు॥** 1. యిది కలతలేని గురుసాంప్రదాయం । కలవారిచేత యీలాగు సూచన అయింది । నీవు యిది చూచి । భ్రాంతిరహితం అయ్యేది । అయినా మళ్ళా మళ్ళా చూడు । వ్రాసుకో ।

2. యిది గురూపదేశం లేని వారికి । గురుకటాక్షం కలిగెవరకూ । యెంతవారికైనా జాడ పడదు.

3. చలం । అచలం । యీరెండేకాని। మూడోది । వివేకమైన । అవివేకమే ।

4. పుట్టని చావని దానికి । మొదలూకొనాలేని దానికి । రాకడాపోకడా లేనిదానికి । క్రియా శూన్యమైన దానికి । సర్వకాలం వొక్కతీరుగా వున్నదానికి । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం లేక । తనకుతానే స్వతసిద్ధంగా ఉన్నది ।

5. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం రాకమునుపూ । సకల దేశాలయందూ । సర్వకాలాలయందూ । సమస్తమైన వస్తువుల యందూ। తనకు తానె స్వతఃశిద్ధమై । యున్నది

కల స్త్రీ।। యిటువంటిది యేమీ చెయ్యదుగదా ।

గురు।। కలలో నిర్ణయాలు యెవరు చేశిరి । దానికాదె తోచె దానికదె పాయె గదా !

## 2. యెరుకే పరిపూర్ణం ఇట్టిదని, యెరుక ఇట్టిదని చెప్పి తాను లేకపోవుట

గురు।। 1. యీపుట్టని చావనిదానిలోననె। మొదలూ కొనాయేమీలేక। కొనకూ యేమీలేక । యీ కలలోనే తనకు తానే వచ్చింది ।

2. సమస్తమైన నిర్ణయాలు । సకల వినోదాలు । అనేక భాష్యాలు ।అనంతమైన వేదాలు । శాస్త్రాలు । పురాణాలు । ఖిల్లాలు । పట్టణాలు । పల్లెలు । అనేక సిద్ధాంతాలు । తనకు మనస్సునకు వచ్చినట్టుగా చేశింది । తనకు తానే కొనకు శూన్యం అవుతుంది ।

క.స్త్రీ।। అలాగు కాదు । నేను మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని గనుక । యీ శరీరానికి మొదలు వున్నదని । అనుకొన్నాను ।

గురు।। యీ శరీరానికి మూలం వున్నదని । యెవ్వరైన అనిరా । వారు కలలో యేనుగవలె వుండి । దాని మీద కూర్చుండి । ఉన్నది అని అన్నారని । నమ్మితే । మేలుకొంగానె । ఆయేనుగ మీద మనిషి వున్నాడా?

క.స్త్రీ।। యేమీలేదు । అలాగే మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదు ।

గురు।। మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి మొదలువున్నాదా । కొనకు ప్రవేశించేటందుకు స్థానం వున్నదా । అనెను ?

క.స్త్రీ।। యేమీలేదు అయ్యా । యెవ్వరు యీలాగు అనంగా వినలేదు । అయితె చులకనవలె వున్నది।

గురు॥ యేమైనా మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంతసేపే। ఉన్నది అనేది। లేదు అనేది। పుట్టని చావనిది। వున్నది। అది యేమీ అనదు।సకలవ్యవహారాలూ యీ గుర్తెరిగే శరీరానికే। అని గుర్తెరుగు। గనుక। యింతకంటె అధికంలేదు। కలదోచిన శరీరం యేలాగో ఆలాగే మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదు, ఈ ఉత్తబట్టబయలు యేమిలేదు. యిదే సిద్ధాంతం, సిద్ధాంతమే రాద్ధాంతం.

గద్యః

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే।
ఉత్తరభాగే అమల ప్రకాశ నిరసన నవమ ప్రకరణం
తృతీయ అధ్యాయం సమాప్తం



# 9. అమల ప్రకాశ నిరసన ప్రకరణం

## చతుర్థాధ్యాయము

### 1. గుర్తెరిగే యెరుక కన్న నీచం లేదు, దీనికన్న అధికం లేదు.

1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । యీ శరీరంకంటె । నీచంలేదు । అధికం లేదు । అధికం యిదే । నీచం యిదే

2. యేనుగ అధికం । యెల్క నీచం । సింహ్వం యెక్కువ । యేనుగ తక్కువ । పిల్లి యెక్కువ యెల్క తక్కువ ।

3. అందరూ మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే కాని । కుక్క బ్రహ్మజ్ఞాని అని వాడుక । కోడికి కాలజ్ఞాని అని వాడిక । చీమకు దివ్య జ్ఞాని అని వాడిక ।

4. అన్నీ యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికె తోచును । కనుక గుర్తెరుగుతే గుర్తెరిగే శరీరమే లేదు ।

5. పుట్టని చావనిది సర్వకాలం వక్కతీరుగావున్నది । దానిలో। మధ్యవచ్చి । మధ్యనె యేమీ లేకపొయ్యేదానికి । కొంచమూ కూడా సంబంధము లేదు ।

6. అశాశ్వతమైంది । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం మెరుపువలెనె । మెరుస్తుంది । వెంటనే యేమీలేదు ।

7. అలాగే కలలో తప్పున రాంగానే । గుర్తెరుగుతాము । మనను అవి గుర్తెరుగును । వారూ మనమూ ఎవరికి వారమే మేల్కొనగానే కనుపించకుండ పోతాము.

8. పుట్టని చావనిది । మొదలూ కొనాలేనది । సర్వకాలం వక్కతీరుగా వున్నది । శరీరం లేనది । క్రియా శూన్యమైంది । రాకడాపోకడా లేనిది । ఒక్క బట్టబయలు మాత్రమే.

9. సకల దేశాలయందూ । సర్వకాలాల యందూ సమస్తమైన వస్తువుల యందూ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం రాకమునుపే। చలించక। తనకు తానే స్వతసిద్ధమై బట్టబయలే యున్నది.

10. స్వతఃసిద్ధమైవున్న దానియందు । మీరూమేమూ వున్నాము । వున్నామనె కలలోనే వున్నాము గనుక గురుసూచన వలన లేకపోతాము, ఇదే నిశ్చయము.

## 2. స్వప్న దృష్టాంతము

**కలవారి శంక॥** అది మాత్రమే వుండేటట్టు సూచనచేశే వారు కావలెనని। చూస్తూ వున్నాను

**గురు॥** 1. అయితె విను। "యీ పుట్టని చావనిది యీలాగువుండంగానె। యీ కలలోనే వెనుకటి అయిదుగురూ వచ్చిరి।

2. అంభారీల మీద యెక్కివచ్చిరి। వారి వెంటనే అనేకమైన లష్కరూ। వొక్కొక్కరికి నూరుకోట్ల మంది శిష్యులూ। కోటి గుర్రాల మీదకాకితపు పుస్తకాలున్నూ।

3. కోటియెడ్ల మీదకమ్మాలకు పుస్తకాలున్నూ। తాట్యాకుల పుస్తకాలు విస్తారం। ఉండెను.

4. కొన్ని అనేకమైన సంగటనలు। సర్వకాలం తీర్థం సాగినట్టె సాగింది। అనేక మంది రాకడాపోకడా అయింది। యీ అయిదుగురు గురువులే। అందరూ మధ్యవచ్చినవారె ఉన్నారు।

5. అందులో శరీరంలేని ఆయన వున్నాడని। ప్రశిద్ధి కద్దు। అది యేమో అని ఆయననే అందరూ చూడ వస్తారు। వచ్చి చూస్తే। అందరూ కూర్చున్నట్టె కూర్చున్నాడు।

6. యిది యేమీ అన్ని అనుకొంటిమి। మనకు కావలసినట్టు యెవ్వరైనా సూచనచేసేరేమో। అని చూతామనుకొనిరి। అయితె ఆయె। కాకుంటె కాకపాయె। అడుగుదామని అడిగిరి।

7. పొయ్యేటపుడు వారికి। వారి లష్కరునకు। సకల సామాగ్రి। గడ్డికట్టెలతో కూడా। తీసుకపోయిరి । నమస్కారాలు చేశిరి।

8. చేశి। స్వామీ మొదలుయేమీలేదు। కొనకు ప్రవేశించేటందుకు స్తానం యేమీలేదు। మాకు మేమే వస్తిమి।

9. సకల భాష్యాలతో। వుంటిమి। గనుక మాకు పుట్టని చావనిది। మొదలూ కొనాలేనిది। సర్వకాలం వొక్కతీరుగా వున్నది। శరీరం లేనిది। క్రియా శూన్యమైనది।

10. సకలదేశాలయందూ। సర్వకాలాలయందూ। సమస్తమైన వస్తువులయందూ। చలించక। తనకు తానే స్వతసిద్ధమై వున్నదాన్ని। సూచన చెయ్యండి।

11. సూచన చేయంగానే వెంటనే మేముయేమీ లేకుండా। మాకు సూచన చెయ్యండి। సాధనచెయ్యందె మాకు స్వత సిద్ధం కావలెనని అన్నారు. ।

**గురువులు॥** కాని మీరు యేమి ॥ అని అడిగిరి। (అయిదుగురు)

శి॥ మేము మాతో కూడా వచ్చిన వారికి మొదలుకొనా యేమీలేదు । మధ్య వచ్చి వున్నాము । మేము మూలంలేని యీ గుర్తెరిగే శరీరము । మాకంటె అధికం లేదు । మాకంటె నీచం లేదు । అనంగానే అందులో వకగురువు పక్కుననవ్వె । నవ్వంగానే ఆ నలుగురూ చిన్నబోయిరి । పోయి ఆనలుగురూ ఆలోచన చేసిరి । దీనికి యేమీ విచారం అనిరి ॥

గు॥ దాండేమి మీ దగ్గర విస్తారంగానె వున్నావి గదా! గ్రంథాలు.

శి॥ మా దగ్గర విస్తారంగానెవున్నవి । గాని మీరు చెప్పేది మా గ్రంథాలలో లేదు,

గు॥ పుస్తకాలు విడచి విచారించండి । అనె । ఆనవ్విన గురువు అనెను । నలుగురూ అదే పనిమీద వుండిరి ఆ నవ్విన ఆయన యెప్పటి వలెనె కూర్చున్నాడు ।

శి॥ అందులో కొందరు అయ్యా మేము అడిగినది సూచన చెయ్యకపోతిరి । అనెను ।

గు॥ అంటే పొయ్యేటప్పటికి వారి దగ్గరకు పొయ్యిరండి । చూస్తూవున్నారు అనెను ।

శి॥ అంటె పొయ్యేటప్పటికి । అనేక కోట్లమంది పుస్తకాలు విడచి । చూస్తూ వున్నారు । అక్కడికి పోయిభోంచేశి । అందరూ నవ్విన ఆయన దగ్గరకు వచ్చిరి ॥ అందరమూ మొద్దులముకాము । మమ్ముమేము యెరుగుదుము ।

మావంటి వారుకోట్ల కొద్దీ వచ్చినా యెరుగుదుము । కాకుంటె మాకు మొదలు యేమీ లేదని గుర్తెరిగి నామా । అలాగే మాకు ప్రవేశించేటందుకు స్థానం యేమీ లేదని గుర్తెరిగి నామా । మాకల్లా పుట్టనిచావనిది । యెక్కడ వున్నదని ఆశ తగిలింది । అది మాత్రం సూచన చెయ్యండి అనిరి ।

గు॥ అయితె సరే ! మాకు యేమీ ।

శి॥ మరి ఒకటి । శరీరం లేక కొందరు వున్నారు అంటె అది యెలాగో అని । రెండు ఆశలు వున్నవి ।

గు॥ నవ్విన ఆయన । అయితె శరీరం యెక్కడికి పోతుంది । కొనకుయేమీ లేదు । యిది అందరికీ సమానమె । యిఘయేమి । దీనికి చింత వద్దు ।

శి॥ సర్వకాలం శరీరంలేకనే । వక్కతీరుగానే వుండవలె ।

గు॥ ఆలాగుననే వుండేరు అనెను ।

1. ఆ నలుగురూ । నవ్విన ఆయన దగ్గరకు వచ్చిరి । "యే పుస్తకంలోనూ । ఆవిడ మార్గమె । కాని । తమరు అడిగినట్లూ సమాధానం చేతామంటె । దొరుకదు ।

ముందర యెవ్వరు దగ్గరకు వచ్చిదండమైనా పెట్టరు ।

2. చేతిలో ఉప్పు । కూడా పుట్టదు । లేనిపోని అపకీర్తి । యెన్నడూ యిలాగు పిడుగుపడలేదు । అనిరి"॥

3. నవ్విన ఆయన । పుస్తకాలు కట్టించండి । పోతాము అనెను ।

శి॥ అనంగానే నేటిదాకా నడచిన వాండ్లు । చిన్నపోయిరి । పోయీ ।

4. అయ్యా । ఆ నలుగురూ దొడ్డవారే కాని । మీరు మాకు సూచన చెయ్యగలరు ।

గు॥ అనంగానే । కూచిచెయ్యుమనె ।

శి॥ కూచిచేసిరి । అయ్యా । అయ్యా। సూచనచెయ్యరా అనిరి ।

గు॥ అంటె పుట్టనిచావనిది । మొదలూ కొనాలేనిది । రాకడా పోకడాలేనిది । సర్వకాలం వొక్క తీరుగావున్న దానిలోనే మీరువున్నారు అనె ।

శి॥ అవును మేము వున్నాము అనె ।

గు॥ అనంగానె । సరె । సరె । అనిరి । **(రెండో కూచి ఆయే)**

గు॥ ప్రజల్లారా । మీరూ మేమూ యింత పర్యంతమూ । కూడా వున్నాము గదా।

శి॥ వున్నాము । యెరుక యను కలలోనే ఉన్నామని తోస్తుంది.

గు॥ మమ్ములను మీరు యెరుగుదురు । మిమ్ములనమేము యెరుగుదుము । మేము మేలుకొంటె । మీకూ మాకూ యేమీలేదుగదా । మీరు మేలుకొంటే మేము యేమి లేము గదా అనెను ।

శి॥ యేమీలేదు । యేమిలేదని మూలంలేని గుర్తెరిగే శరీరానికే యెరుకాయె !

గు॥ మీరూ మేము । యేమీలేదని । తనకు తానె దృఢమా । యేమైనా కష్టపడవలెనా ।

శి॥ యేమీ కష్టంలేదు ।

గు॥ పుట్టని । చావనిది వున్నది । గదా ।

శి॥ వున్నది అది । రాకడ పోకడా లేకనే ఉన్నది ।

గు॥ మనవంటి వారుకోటి మందిరానీ । పోనీ । దానికి యేమి కాదు గదా !

శి॥ అవునయ్యా । మేరే గురువుకు తగుదురు । అందుకే శరీరం లేని వారని వాడికె గలదు ।

**మూడో కూచికాంగానె॥** 1. యీ ప్రజలెల్లా మేలుకొనిరి । మేము మేలుకొంటె యెక్కడ చూచినా యేమీలేదు । ఆ గుర్రాల లద్దెనాలేదు । యేమీ ఆశ్చర్యం । యేమీ లేదు । యేది వున్నదో అదెవున్నది ।

2. ఆ గురువు చెప్పనె । చెప్పెగదోయీ । మేము మేలుకొంటె । మీరు మాకు యేమీలేరు । మీరు మేలుకొంటె మీకుమేము యేమీలేరని । అన్నారు గదా !

3. యీలాగు చెప్పేగురువు యెక్కడ వున్నాడోయీ । సరె । కాని ఆ నలుగురూ యేమీకారు । వారి పుస్తకాల్లో వున్నదె వారికి నమ్మికె ।

**గు॥** ఆ నమ్మిక ఛీ । యిప్పుడు ఆ పుస్తకాల్లో యేమాయె॥

**శి॥** యేమీలేదు । యేమిలేని యెరుకనె నిజమని వుండె । మీ నుండి మాకు నిజం తెలిసింది ।

**గు॥** అలాగె అదిచూచి । చెప్పెవారు యేమైరి॥

**శి॥** మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు యని సూచన చేయంగానే మేము, వారు యేమీలేదు అని జాడ పడె ।

**గు॥** అనేకమంది శిష్యులు యేమైరి । పుట్టని చావనిది । మొదలూకొనాలేనిది । సర్వకాలం వక్కతీరుగా వున్నది । శరీరంలేనిది । క్రియాశూన్యమైంది॥ సకల దేశాలందూ । సర్వకాలాలయందూ । లోపటాబైటా అనే మర్యాదాలేక సమస్తమైన వస్తువులయందూ చలించక । దేన్నీ స్మరించక । తనకు తానే స్వత సిద్ధమై వున్నది ।

**శి॥** యిటువంటి దాన్ని । గురుస్వామి సూచన చెయ్యంగానే

**॥శృ॥ ఆకాశ ఫల పాతవాన్ ॥** అలాగు ఇక్కడా శూన్యంకాదు॥ కోటిమాట్లూ వున్నదన్నా । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । లేదన్నా పుట్టని చావనిది లేకపోదు॥

**గు॥** యిదేసిద్ధాంతం । సిద్ధాంతమే రాద్ధాంతము ।

**శి॥** నాకు చాలు గురుస్వామీ॥

**గద్యః**

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।**
**ఉత్తరభాగే అమల ప్రకాశ నిరసన**
**నవమ ప్రకరణం చతుర్థాధ్యాయము సమాప్తము.**



# 10. అమృతసార ప్రకరణము

## ప్రథమాధ్యాయము

### 1. అచల బోధ గురువు

1. యీ వుత్త బట్టబయలు తనకు తానె స్వతసిద్ధమై చలించక వున్నది। దాని యందు ప్రపంచం యెన్నడు పుట్టనేలేదు । యిదే నిజ గురువు వుపదేశం । యీ వుత్తబట్టబయలె పరిపూర్ణం,

2. యీ వుత్తబట్టబయలు నిజగురువు చెప్పక కానలేరు । అందుకే ।

**॥శృ॥ ఆచార్యవాన్ । స్వరూపోవేదాః ॥** ఆచార్యుని వలన తన యొక్క నిజ స్వరూపం తెలుస్తుంది. అని వున్నాది గనుక గురుసూచన అవసరమై ఉన్నది.

**॥శృ॥ ఖంబ్రహ్మ ॥** అని సిద్ధాంతవాక్యం వుండనె వున్నది । అనగా శూన్యాంశమైన ఆకాశ స్వరూపం, బ్రహ్మము యని ఉన్నది. మొదలుయేది వున్నదో అదె చెప్పినాడు।

3. నిజగురువు । పుట్టని చావని గురువు కావలె । శరీరం ఆయి వున్న గురువు పనికిరాడు । అహంకారం అయివున్న గురువు పనికిరాడు ।

4. పుట్టనిచావనిది యేదో । అదే సత్యమనిచెప్పె గురువు కావలె । జ్ఞానమార్గం నిషేధమే । కర్మమార్గమూ । నిషేదమే గనుక । పుట్టని చావనిది । యీ వుత్తబట్టబయలు ఉన్నది గనుక । యిది మొదలు చెప్పవలె । పుట్టని ప్రపంచంయొక్క జోలే కూడదు।

### 2. గురువాక్యం

**మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు**

**కలదోచిన శరీరాలు యేలాగో ఆలాగే**

**ఈ ఉత్త బట్టబయలు యేమి లేదు**

1. యీవుత్త బట్టబయలు వలన । మాయ పుట్టనేలేదు గనుక । యీ వుత్తబట్టబయలు మాత్రమే వున్నది । యీ వుత్తబట్టబయలు అత్యంత విలక్షణం ।

2. యీ వుత్తబట్టబయలు వలన । క్షరమనే చైతన్య స్వరూపిణీ అనే మాయ । పుట్టనేలేదు గనుక । యేమీలేదు ।

3. యీ వుత్తబట్టబయలుకు । పరాయేమీ లేదు । లేకుంటె క్షరమనే శరీరం యేమీలేదు

। యీ వృత్తబట్టబయలె వున్నది

4. యీ వృత్తబట్టబయలు పుట్టదు । పుట్టించదు । అందుకే । ప్రపంచం పుట్టనేలేదు । చావదు । యీవృత్త బట్టబయలు మాట్లాడదు । యీ వృత్తబట్టబయలుకు । వక్కటైనా బాధలేదు ।

5. జన్మంలేదు గనుక । జన్మం లేకుంటె అహంకారం లేదు । అహంకారం లేకుంటే । ప్రపంచభ్రాంతి యెవ్వరికి । యిందుకు ॥

**శ్లో॥ జన్మాభావే ఖర్మంనాస్తి । ఖర్మాభావే ఫలం నహి ।**
**ఫలాభావే భయంకుత్ర । భయాభావే నసంశయః ॥**

అందుకే । ప్రపంచం యెక్కడ వున్నాది । యీవృత్త బట్టబయలుకు యేమీలేదు । యీవృత్తబట్టబయలే పరిపూర్ణం । యీవాక్యం సంతతం మరువక యాది వుండవలెను ఇదే । ప్రయత్నం చెయ్యవలెను ।

6. యీ వృత్తబట్టబయలె అత్యంత విలక్షణం । యీవిలక్షణం వలన వికారం పుట్టనేలేదు । యిది "నిజ గురువాక్యం మొదటిది వుపదేశం । పుట్టని చావనిదే । బట్టబయలు, ఈ బయలులలో యెరుక పుట్టనే లేదు,

7. పుట్టనిదే అమృతం । అత్యంత విలక్షణం బట్టబయలు । వలన ప్రపంచం పుట్టనే లేదు । గనుక । యిది మొదటి వుపదేశం ।

8. యిది మహారహస్యం । రాజగుహ్యం । పరమగుహ్యం । అనాధికారులకు చెప్పరాదు । అనే నీమం వున్నాది॥

## 3. అధికారి లక్షణం

1. పుణ్యం యిచ్ఛ వున్న వారికి చెప్పరాదు, పాపం యిశ్చ వున్నవారికి చెప్పరాదు । మిక్కిలి గురుసాంప్రదాయం యెరుగరు । యీ బట్టబయలు ప్రభావం యెరుగరు ।

2. యే మతం అయ్యి వున్న । వారికైన ఉత్పత్తి స్థితిలయాలు ప్రభావం వున్నావి । అప్రమాణానికే వేదం ప్రమాణం । ప్రమ లేక పోతే భ్రమ లేదు.

3. యీ వృత్తబట్టబయలె పుట్టని చావనిది । జ్ఞానాజ్ఞానాలు । శూన్యం । యీవృత్తబట్టబయలె నిర్భాయ్యం । సంతతం మరువక యాది వుండవలెను ।

4. యీ వృత్తబట్టబయలువలన సత్తు పుట్టనేలేదు । అసత్తూ పుట్టనేలేదు ।

5. యీ వృత్తబట్టబయలె నిరంజనం । నిర్వికారం । నిర్గుణో । నిష్క్రియో । నిత్యో । నిర్వికారోనిరంజనః అత్యంత విలక్షణమైన స్వరూపం ॥

6. మొదటి సాక్షిణీమాయ । పుట్టనేలేదు । యీవృత్తబట్టబయలె అత్యంత విలక్షణం ॥మొదటి సాక్షిణీయె॥ లేని యెరుక । యిది లేదని తెలియుటే గురువాక్యం ।

7. ఇంద్రియములచేత । నింద్రియార్థ గ్రహణము చేయునట్టి । దేహాభిమానము గల । అజ్ఞునకు । (శబ్దాది విషయములు) అభిలాషయున్నూ । అభిలాషవినా । నివర్తించుచున్నవి । పరిపూర్ణము చూచిన । స్తితప్రజ్ఞునికి (ఆ అభిలాషయున్నూ) నివర్తించుచున్నది ।

8. యీవృత్తబట్టబయలు వలన వేదాలు॥ భగవద్గీతలు । పుట్టనేలేదు । యీవృత్తబట్టబయలుకు జ్ఞానాజ్ఞానాలు । విద్యావిద్యలు । సదసత్తులు । అనె ద్వంద్వాలు । పుట్టనేలేదు గనుక । యిదే అత్యంత విలక్షణం । యీవృత్తబట్టబయలు మునుపే వున్నాది ।

9. యీవాఖ్యం సంతతం మరువక వుండవలెను । వుంటే యేమీ తోచదు । అక్షరం పాపమె । క్షరం పాపమె । యీరెండూ దోషస్వరూపాలు । యిందుకు ॥క్షరాక్షరోపాధి ద్వయదోషేణా ఉత్క్రుష్టః । అని శంకరాచార్యులు వారు 18 అధ్యాయం భాష్యంలో అన్నారు । యీవృత్తబట్టబయలే నిరాకారం । నిర్గుణం । నిరంజనం । యిందుకు । ఆయన కూడా బ్రహ్మతత్త్వం యనె యెరుక విషయంలో ఇలాగు చెప్పినారు । స్వస్వరూప నిరూపణ ।

శ్లో॥ నిర్గుణోనిష్క్రియోనిత్యో । నిర్వికారోనిరంజనః ।
నిర్వికారో నిరాకారో । నిత్యముక్తోస్మి నిర్మలః ॥ (ఆత్మబోధ 34)

శంకరుల వారు అన్నారు.

గద్యః

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే, వేదాంత విచారణే ।
ఉత్తరభాగే అమృతసార దశమ ప్రకరణం ప్రథమోధ్యాయం । సమాప్తం



# 10. అమృతసార ప్రకరణము

## ద్వితీయోధ్యాయము

### 1. పరిపూర్ణ బోధ నిష్కర్ష

1. పుట్టనిచావనిది మొదలు కొనాలేనిది రాకడ పోకడలేనిది వక్కటైనా మహత్తు లేనిది సర్వకాలం వక్కతీరుగా వున్నది.

2. భేదాలు లేనిది స్వజాతీయ విజాతీయ స్వగతబేధాలు లేనిది శరీరం లేనిది చలించనిది యేజోలి యెరుగనిది జ్ఞాన ఖర్మాలు లేనిది నామరూపములు లేనిది

3. సకల దేశాలయందు సర్వకాలాల యందు సమస్తమైన వస్తువులయందు వున్నది,

4. ఉత్పత్తి, స్థితి, లయాలు లేనిది తనకుతానే స్వతః సిద్ధమైవున్నది,

5. శరీరం కానిది శరీరం లేనిది, మూలము లేని యీగుర్తెరిగే శరీరం రాకమునుపు వున్నపుడు అదియేమిలేదు అని అన్నపుడు బట్టబయలు వక్కతీరుగానే వున్నది.

6. శూన్యం గానిది వక్కటైనా క్రియలేనిది అసాధ్యమైనది. గురువాక్యం చేత సాధ్యమైనది.

7. సంశయ నిశ్చయాలు లేనిది క్రియాశూన్యమైనది భోంచెయ్యనిది వక్కటైనా భ్రాంతి లేనిది

8. మూలములేని యీ గుర్తెరిగే శరీరముతోటి యేమాత్రం సంబంధం లేనిది నీళ్ళల్లో పరుపు బండవలె చలించనట్లు వున్నది,

9. శరీరం వున్నా శరీరాన్ని ముట్టనిది అచలమనే ప్రసిద్ధి చేత వున్నది. కుండ ముందర వున్నట్టు వున్నది. కుండకు లోపల బయట క్రిందా మీద నాల్గు దిక్కుల నాలుగు మూలలందు నిండి నిబిడీ కృతమై యున్నది.

10. శాశ్వితమైనది కుండ లోపటా బయటా అనే మర్యాద లేక సమస్తమైన వస్తువులయందు చలించక దేన్ని స్మరించక వున్నది. స్మరించే యెరుక యొక్క జోలె యెరుగదు ।

11. ఒకదాన్ని అయినా ముట్టుకోనిది సంభాషణ చేయనిది వక్కటైనా వికారము లేనిది.

12. మూలం లేని గుర్తెరిగే శరీరం తనలో వున్నప్పటికీ తాను దానికి అధిష్టానం కానిది చంద్ర సూర్య వహ్ని యింద్ర పురుషులు వున్నారోలేరో దానికి యేమి తెలియక ఉన్నది.

13. నిత్యమైంది, సర్వగతమైంది, స్థాణువైనది, అచలమైనది, సనాతనమైనది, సచ్చిదానందం మాత్రం కానిది.

14. దేన్నిచూడంది, వినంది, అడగంది, యెరగంది, చదవంది, వక్కటైనా వ్యవహారం లేనిది వికారం లేనిది చెప్పనిది. యధాతథంగా బట్టబయలుగా ఉన్నది.

15. మూలము లేని యీగుర్తెరిగే శరీరం దానికి మూలం కానిది అన్నింటికి అతీతం గనుక గురుస్వరూపమైనది, గురు స్వరూపం అంటే గుర్తెరిగే యెరుక గానిది, యే ఉపదేశం చేయనిది.

16. శరీరం వున్నపుడు శరీరం నవ్వితే నవ్వనిది యేడిస్తే యేడవనిది తింటే తిననిది తాగితే తాగనిది నడిస్తే నడవనిది మాట్లాడితే మాట్లాడనిది కర్త కానిది కారయిత కానిది. యేదో అదే గురు స్వరూపం.

17. అచ్ఛేధ్యమైనది అదాహ్యామైనది అక్ల్యేదమైనది ఆగోప్యమైనది యెందరు లేదులేదు అన్నావున్నది.

18. శరీరాలలో చేరనిది, వెళ్ళిపోనిది తలకాయ కాళ్ళు లేనిది సాధనాసాధ్య పరామర్శ రహితమైంది

19. రాకడపోకడ వునికి యేమి లేనిది జగత్తు వున్నదని లేదని యెరుగంది సర్వ వ్యాపకమైంది.

20. కుంఠితముగాని వైకుంఠమనే సౌంజ్ఞగలది శరీరానికి గల వికారాలు తనకు లేనిది సుఖదుఃఖాలు లేనిది. స్వతంత్ర పరతంత్రాలు కూడా లేనిదే, బట్టబయలు.

21. దొర కానిది, దొంగకానిది, భ్రాంతిలేనిది, వృద్ధిపొందనిది, బక్కబడనిది, శరీరాన్ని పట్టనిది, విడవనిది, యిచ్చ లేనిది, చలించనిది, యిరవైఆరోది అయినది బట్టబయలు.

22. క్షేత్రజ్ఞాఖ్య జీవోపాదిలేనిది తత్వాతీతమైనది, ద్వైతాద్వైతరహిత పరమతత్వాతీతమైనది, జ్ఞానకర్మాలయందు భ్రాంతిలేనిదే బట్టబయలు.

23. సర్వత్రా యెడతెగక దట్టంగా వున్నది, యెవ్వరిమీద ఆపేక్షలేనిది, మహాద్వైతమైనది, సర్వకాలాలయందు ఉన్నది బట్టబయలు.

24. మూలము లేని యీగుర్తెరిగే శరీరము రాకమునుపు వున్నపుడు లేకపోయినపుడు యీ వుత్తబట్టబయలు వున్నది ఇందుకు సందేహం లేదు.

25. చూడబోతే లేదు. యెంతదూరం పోయినా యెడతెగక అంతట దట్టముగా యెక్కువ తక్కువలేక మనం పోకమునుపే ముందర ముందర స్వతఃసిద్ధమై వున్నది. కదలనిది మొదలనిది యెరుకలేనిది అచలమయ్యే ఉన్నది.

26. కలలో శరీరాలు యీశరీరాలు యెన్నితిప్పలు పడ్డ యేమి అననిది యీగుర్తెరిగే చైతన్యమనే జ్ఞానము వలె అనేక చిత్రవిచిత్రమైన ఖర్మాలు లేనిది బట్టబయలు.

27. ప్రపంచము తనలోనె వున్న ప్రపంచముతో సంబంధము లేనిది తాను తానై వున్నది తాను పుట్టనిది వకదాన్ని పుట్టించనిది సర్వకాలం యేకప్రకారంగా వున్నది, బంధమోక్ష శూన్యమైంది.

28. జ్ఞానఖర్మాలయొక్క సాధన ద్వయాపేక్షలేనిది. జ్ఞానఖర్మాల చేత సాధ్యం కానిది, బేధాబేధ రహితమైనది బట్టబయలు.

29. ఆత్మ బ్రహ్మంయను నామరహితమైనది, జ్ఞాన భక్తి వైరాగ్యశూన్యమైనది. తన సంబంధము కాని శరీరాలుగాని కానిది వుదకపానం చెయ్యనిది సుఖదుఃఖాలు లేనిది లింగత్రయం కానిది, యిచ్చలేనిది, వాదించనిది, బట్టబయలు.

30. తత్త్వం వంటిదికానిది, లక్ష్యలక్షణమనే క్షేత్రక్షేత్రజ్ఞుల రహితమైనది, దేహిదేహాలు కానిది, విషయీ విషయాలు గానిది, దృశ్యాదృశ్యములు కానిది, జీవేశ్వరులు కానిది, ఆత్మబ్రహ్మాలు గానిది, బట్టబయలు.

31. యేమి అనుకోనిది యెన్నటికి చలనము లేనిది రతిఖర్మలు లేనిది, విష్ణువనే వ్యాపకం అయినది. గుణాలు లేనిది, వికారాలు లేనిది, క్షరాక్షరవిలక్షణమైన వుత్తమ పురుషుడైనది బట్టబయలు.

32. స్త్రీ పుంస నపుంసకాలు కానిది, కొట్టనిది కొట్టబడనిది యేమి అడిగినా చెప్పనిది. తాను వున్నానని యెరుగనిది, శరీరాలు లేవు అని యెరగనిది, మహాగుహ్యామైనది, పరమగుహ్యామైనది, మహారహస్యమైనది బట్టబయలు.

33. యితర లోకాంతర స్మరణ లేనిది, యింత అంత అని ప్రమాణం లేనిది సమస్తమైన వస్తువులందు వున్నది బట్టబయలు.

34. యితర స్మరణ లేనిది భగవానులు కానిది సత్యమని గ్రహించనిది అసత్యమని గ్రహించనిది, నిశ్చయ సంశయాలు లేనిది బట్టబయలు.

## 2. బట్టబయలు సర్వ ద్వంద్వాలకు అతీతమైనది

35. ఆత్మానాత్మల వ్యవహారం లేనిది వేదశాస్త్రాల యొక్క నిర్ణయం చెయ్యనిది గురుసూచనలేనివారికి కనుక్కోరానిది, గురుసూచన అయినవారికి గురుశిష్య ప్రసంగాలు లేక తానేవున్నది. అంతట సర్వకాలయందు సమస్తమైన వస్తువులందు ఉన్నది.

36. క్షేత్రక్షేత్రజ్ఞులు లేక క్షేత్రజ్ఞరహితమైనది. ఆత్మబ్రహ్మోపాది ద్వయదోష రహితమైనది, విద్యావిద్యోపాది ద్వయదోష రహితమైనది, శివశాక్త్యోపాది ద్వయదోష రహితమైనది, దేహిదేహోపాది ద్వయదోష రహితమైనది, తినినిది, లిప్తంగానిది, ఆత్మబ్రహ్మ అని గుర్తెరిగే చైతన్యాన్ని యెరుగనిది, బట్టబయలు.

37. అత్యంత నిర్మలమైనది। అత్యంత స్వశ్చమైనది। చూడనిది। యిటువంటి వస్తువుయొక్క విచారణ జ్ఞానేశ్వర్లుకున్నూ, శివరామదీక్షితుల వారికి యెరుక। శ్రీధర స్వాములవారు 1 సాందీపుడు 2 శ్రీకృష్ణ స్వామి 3 శ్రీశుకులు 4 శంకరాచార్యులు 5 వ్యాసులు 6 రామానుజాచార్యుల వారు 7 మద్వాచార్యులవారు । వీరందరు భావార్థం యెరుగుదురు.

38. వారివంటి వారు వారె ॥ వారి భావం శివరామదీక్షితుల వారికే యెరుక ॥ యీబోధ యెవ్వరు తెలుసుకుంటారో । వారికి యీ ఏడుగురి అభిప్రాయం తెలుస్తుంది॥ జాగ్ర । స్వప్న । సుషుప్తి తుర్యాలు । తుర్యాతీతాలు । లేనిది ॥ కంటిలోపాప అనే గుర్తెరిగే ఆత్మలేనిది । గురువాక్యం । మూలంలేని యీగుర్తెరిగే శరీరం యేమిలేదు । యీవృత్తబట్టబయలే ఉన్నది । సత్యం సత్యం । సత్యం।

గద్యః

**ఇతి అచలగురు శ్రీ శివరామదీక్షిత ప్రభావే వేదాంత । విచారణే । ఉత్తరభాగే । అమృత సార దశమ ప్రకరణం । ద్వితీయోధ్యాయం । సమాప్తము ॥**



# 10. అమృతసార ప్రకరణము

## తృతీయోధ్యాయము

### 1. స్వప్న దృష్టాంతము

**ముసలి శి॥** యీ కలలోనే ముసలివృద్ధుడు వచ్చె। వస్తూనే। "నామూలం నాకు తెలియదు। యెంత వారికీ తెలియదు। యీరహస్యం చెప్పండి అనె?

**గురు॥** యిది యెంత నీవు పుట్టని చావనిది। మొదలూ కొనలేనిది। శరీరం లేనిది। రాకడా పోకడా లేనిది। సర్వకాలం వొక్కతీరుగా వున్నది। క్రియాశూన్యమైనది। భోంచెయ్యనిది। వొక్కటైనా భ్రాంతి లేనిది। సకలదేశాల యందూ। సర్వకాలాలయందూ। సమస్తమైన వస్తువులయందు। చలించక వున్నదాని యందు నీవు వున్నావు॥

**ము.శి॥** యింత దొడ్డదానియందా। నేను ఉన్నానా!

**గురు॥** సూచన అయిందా లేదా?

**ము.శి॥** నేను యెన్నడూ వినంది। అత్యద్భుతమైంది। నాకు శ్రవణం చేస్తిరీ యిటువంటిది నాకు యెవ్వరైన సూచన చేశేరేమో అని। నాయిశ్చ వుండి వుంటిని?

**గురు॥** నీకు సూచన అయిందా॥

**ము.శి॥** యదార్థంగా వున్నది। అది నాకు సూచన అయినది। అరచేతిలో వుసిరికాయవున్నదో లేదో। అని అనుమానం లేనట్టు। యదార్థం ఆయెను।

**గురు॥** సూచన అయిందా లేదా?

**ము.శి॥** అయినట్టే। కాని। యిఘవకసారి వినిపించండి। అనె।

**గురు॥** విను। విను।

**ము.శి॥** సరే। సరే। లెస్సొ వింటిని। మరీ వున్నది। యిటువంటి బట్టబయలు లేదని యెంత మూడునికీ। మూర్ఖునికీ। అనుమానం లేదు। యిదే దృఢం ఆయే।మూలం చెప్పండి అనె?

**గురు॥** చెప్పుతా గాని। నీకు సూచన అయింది పోదు గదా।

**ము.శి॥** నాకూ దానికీ। యేమి సంబంధం। నావంటి వారలు కోట్ల కొద్దీ రానీ। పోనీ।

నీళ్ళల్లో । పరుపు బండవలె ఉన్నది, వున్నదానికి । సర్వకాలం । వక్క తీరె । యెంత ప్రవాహం వచ్చినా దానికి యేమి కొదువ లేదు ॥

**గురు॥** యెక్కడ అయినా నీళ్ళకేగాని । దానికి సర్వకాలం వక్కతీరె "యిఘ నీ వర్తమానం విను । నీకు తల్లీ । దండ్రి యెవ్వరైనా వున్నారా"

**ము.శి॥** యీ మాట నేనెన్నడూ వినలేదు । యీ పాపపుమాటనేడు వింటిని । అదె । మేము అయోనిసంభవులము ॥

**గురు॥** చూస్తె నీవు వక్కడివే । చాలామంది వున్నట్టు ముచ్చటాడుచున్నావు ॥ యీలాగు వుండంగానే। అనేకకోట్ల గుర్రాలు । యేనుగులు । మనుష్యులు । రథాలు । అనేక ఖిల్లాలు । మూడుపాళ్ళు। పెత్తనుదుర్లవాండ్లూ । బూడిద గాండ్లూ । నామాలవాండ్లూ । అనేకమంది దగ్గెర వాండ్లూ ॥శాబాను। వృద్ధయ్యా । వీరంతా అయోనిసంభవులెకారా । సరె । సరె ॥ వృద్ధా । తల్లీ తండ్రీ అననెరాదు

॥శృ॥ **నానృతాత్ పాతకంపర** ॥ అని వున్నది । అబద్ధం కంటెవేరే పాపంలేదు । యీ వచ్చిన వార్ని అడిగేవు సుమ్మా । తప్పున నెత్తి కోట్టి పోతారు ॥

## 2. యెరుక పూర్వం లేదు ఇప్పుడు లేదు, యెప్పుడు లేదు

**ము.శి॥** అయితే నేను అడుగనే । యీ దుఃఖం నాకు యెందుకయ్యా । నాకు మూలంయేమి?

**గురు॥** నీకు సూచన చేశినది మూలం కాదు గదా

**ము.శి॥** అది బట్టబయలు నాకు యెన్నటికీ మూలం కాదు.

**గురు॥** అయితే నీకు మూలం యేమి లేదు ।

**ము.శి॥** అవును నాకు కొనకు యెక్కడికి పోతాను ।

**గురు॥** నీకు యెరుకేలేదు । నీవు యెక్కడ పోతావు ।

**ము.శి॥** నేను వున్నంతసేపే నాకు యెరుక ।

**గురు॥** నీవు యెప్పుడు లేవు ।

**ము.శి॥** నేనా యెప్పుడంటే అప్పుడే శూన్యం ।

**గురు॥** శూన్యమంటే యేమి ।

**ము.శి॥** యేమీలేదు అనుట ।

**గురు॥** నీవు లేకపోతే, నేను సూచన చేసింది లేకపోదు గదా ।

**ము.శి॥** అది బట్టబయలు రానూ లేదు । పోనూలేదు । వుండేది । నాకే యేమీలేకపొయ్యేది నాకే

**గురు॥** నీకు యేమీ లేదని దృఢమెకదా । యిఘనీకు యేమి కావలె । పుట్టని చావనిది నేను కావలెనని యిశ్చలేదుగదా ।

**ము.శి॥** గాడిద । గుర్రం యెన్నడూ కాదు గదా । నేనేమి, మొదలు యెన్నటికీ లేదు । కొనయెన్నటికీ లేదు । కాశ్శైపు వున్నప్పుడు యేమీ లేదు । కొనకూ యేమీ లేదు । గనుక । యిటువంటిది నాకు । కావలెనని యిశ్చలేదు । అయితినసే అబద్ధాలు పట్టవు స్వామీ ! పుట్టని చావనిది వున్నది అని నమ్మిక వుండి । మూలం లేని యీ గుర్తెరిగే శరీరానికి । మొదలుయేమీలేదు । కొనయేమీ లేదు । కొనకువున్నప్పుడు యేమీలేదు।

**గురు॥** శరీరం వున్నప్పుడు । శరీరం లేని దాన్ని వుండజూచి । సర్వకాలం శరీరం లేకుండేది । యిదే భ్రాంతి లేని మార్గం । యింతకంటే అధికం । వున్నదని యెన్నడూ ఆశవద్దు । వున్నది వున్నట్టు చూచి । లేనిది యేమీ లేదని । సర్వకాలం మరువక వుంటేచాలు । తాను లేకపోవటమే విచారానికి ఫలం॥

**శి॥** అవునయ్యా ! గురుస్వామి కల దోచిన శరీరాలు మేలుకొనగానే యేమి లేనట్టు మూలం లని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదు యని సూచన చేస్తిరి, ఉన్నది ఈ ఉత్తబట్టబయలు యేమిలేదు యని మేల్కగంటిని. మీకు ఇవే నమస్కారములు ॥

గద్యః
**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే । వేదాంత విచారణే ।**
**ఉత్తర భాగే । అమృతసార దశమ ప్రకరణం ।**
**తృతీయాధ్యాయం సమాప్తము**



# 10. అమృతసార ప్రకరణము

## చతుర్థాధ్యాయము

### 1. స్వప్న దృష్టాంతము

**గురు॥** యీ కలలోనే వక అబ్బుమనిషి వచ్చె। వస్తూనే ॥ నేను వున్నంత శేపూ వుండేది। లేకపోతే యేమీ లేక పొయ్యేది। యీ వుండుండం లేకపోవటం। రెండూ నాకు స్వభావమే। నాజాడ తెలియక। కొందరు సుషుప్తి అని। మరణం అని అనుకొన్నారు।

**శి॥** సుషుప్తి। మరణం। అనేది మంది అనంగా దొరికించుకొన్నా। నాకు సుషుప్తి యెరుకలేదు। మరణం యెరుకలేదు। తప్పున వచ్చేది వుండేది। సుఖమైన దుఃఖమైనా అనుభవించేది। కొనకు అందరూ చూడంగానే। యేమీలేదు।

యీలాగు నిత్యం కోటిమాట్లు వుండేది। యేమీలేక పొయ్యేది। వుండటం లేకపోవుట నాకు స్వభావమె। మందికి హాశ్చర్యం।

**గురు॥** అయితే నీవు యెక్కడ నుంచి వచ్చినావు ?

**శి॥** నాకు మూలం యేమీలేదు। కొనకు ప్రవేశించేటందుకు స్థానం యేమీలేదు।

**గురు॥** నీవు యేమి ?

**శి॥** నేను మూలంలేని యీ గుర్తెరిగే శరీరమును। నన్ను నేను యెరుగుదు। నేను వున్నంతశేపూ కోట్ల కొద్దీ వచ్చినా యెరుగుదును।

**గురు॥** యింతేకదానీకు యిప్పుడు యేమికావలె?

**శి॥** పుట్టని చావనిది। రాకడా పోకడా లేనిది। సర్వకాలం వొక్కుతీరుగా వున్నది మొదలు కొనాలేనిది సకల దేశాలయందూ। సర్వకాలాలయందూ సమస్తమైన వస్తువుల యందూ। చలించక। తనకుతానే। స్వతసిద్ధమై వున్నది సూచన కావలె ॥

**గురు॥** సూచన చేస్తాగాని। మళ్లా అడుగవు గదా॥

**శి॥** మళ్ళా అడుగ। నేనేమైనా చదువుకొన్న మగవాణ్ణే నాకు యిది మాత్రం సూచన అయితే సరి।

**గురు॥** నీవు యేమి

**శి॥** నేను మూలంలేని యీ గుర్తెరిగే శరీరమును।

**గురు॥** యిప్పుడు యేతీరుగా అడిగినావో । ఆ తీరుగా వున్నదో లేదో అని సంశయం లేదు గదా ॥

**శి॥** కోటి మాట్లకూ సంశయం లేదు । మీ వలన నేను యేమిలేకపోతిని ।

**గురు॥** అయితే విను । నీవు రాకమునుపు వచ్చిన తరువాత నీవు పోయిన తరువాత కూడ బట్టబయలే ఉన్నది గదా !

**శి॥** సరె । సరె । బట్ట బయలే ఉన్నది ।

**గురు॥** ఘట్టిగా వున్నది గదా । కోటిమాట్లకూ వున్నది గదా ?

**శి॥** కోటిమాట్లకూ బట్టబయలే వున్నది । నాకు యేమి విచారం వున్నా యెరుకనే । ఏమీలేదు ।

**గురు॥** యిప్పుడు కలలో యేనుగవచ్చె । వచ్చిన యేనుగ యేలాగు యేమీలేదో అలాగే । మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు గదా !

**శి॥** యిప్పుడు అయితె సర్వకాలం వున్నదే వున్నది ॥

**గురు॥** కేవలం అదిలేక సముద్రం వలె వక్కతీరుగా వుండవలె ॥

**శి॥** అదియేమీలేదు । కేవలం అచలమే । సర్వకాలం వక్కతీరే వ్యవహారం యేమిలేదు।

## 2. నిజం తెలియకుంటే ఆశ్చర్యమే తెలిసితే కూడా ఆశ్చర్యమే

**గురు॥** యెవ్వరికా? వ్యవహారము ।

**శి॥** యేమీ అన్నా ఆశ్చర్యం । యిది ఆశ్చర్యమే । యేమీలేదనేటందుకు । యేమీ లేకపాయ యిఘయేలాగు । అది యెంత ఆశ్చర్యం" యిది గురుస్వామికే తెలియవలె । అనరాదుగాని వారికీ శక్యం కాదు । బహూకఠినం । అటువంటి వారితో కూడా వుండి చూడవలె । చూచినాశక్యం కానట్టే వున్నది । అన్నా, అందుకే । బ్రహ్మావిద్య । అతికఠినం । గురుస్వామి కటాక్షం వలన । అతి సులభం।" స్వామీ నాకు స్వభావమె । శరీరం అనె వ్రణం వుండె ?

**గురు॥** "కలలోయేనుగ మేలుకొంటె । యేలాగు యేమీలేదని తనకుతాను యేలాగు దృఢమో। అలాగె సూచన చేత । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అలాగు । అయెనా । మూలంలేని యీ గుర్తెరిగే శరీరంబనే వ్రణం యేమీలేదు । యేమీలేకుంటె సర్వకాలం వక్కతీరె।" సరెకదా ॥

**శి॥** సరె । సరె ॥

**గురు॥** శాబాసు చదువుకొన్న వారికంటె నీవు దొడ్డదానవు । యీలాగువుండవద్దా । అమ్మా । యిటువంటివారు యెలాగు అంటె । అలాగు నడువరు గదా । యిది ప్రమాణమని నడువరుగదా । యిన్నిటికీ యేది మూలమో అదే కలలో యేనుగ । మేలుకొంటె యేమీలేదని । తనుకు తానె దృఢం వుండవలె ॥

**శి॥** దృఢం అయెను స్వామి ॥

**గురు॥** ఆ దృఢం యేమీ లేకపోవలె ।

**శి॥** దృఢం చేసుకుంటే యెరుక యేమీలేదు । యేది వున్నదో అదె వుండె ॥

**గురు॥** యిఘ ముచ్చటే వద్దు ॥

**శి॥** చాలు స్వామి చాలు । యెక్కువ ముచ్చట ఆడేటందుకు । మూలంయేమీ లేదని తరువాత అడుగుటకు శిగ్గు వుండవలె । వూరికే అదివున్నదంటే వుండిపాయె యేది వున్నదో అదె వుండిపాయె ॥

**గురు॥** వున్నది వున్నట్లూ సూచన ఆయిన వారికి । ముఖం చెల్లదు । మునపటి వలెనె చలామణీలేదు। చెల్లని రూపాయివలెనె । రాగిరూపాయి పాటిదికాదు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । పుట్టని చావని దానికి బదులు లేదు । యిందుకు అనుమానం లేదు॥

**శి॥** అన్నీ, అబద్ధాలు పుస్తకాలె । మీరు చెప్పినదే నిబద్ధి ఇది నిజం ।

**గురు॥** అలాగు కాదు పుట్టని చావని పరిపూర్ణానికి బదులు లేదు । యీ లాగువుండవలె గురు సాంప్రదాయం ॥

గద్యః

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।**
**ఉత్తరభాగే అమృతసార దశమ ప్రకరణం చతుర్థాధ్యాయము సమాప్తము**



# 11. ధర్మాధర్మ నిరసన ప్రకరణము

## ప్రథమాధ్యాయము

శ్లో॥ ఛిదేవ చిదమేవలోకన్ । చిదేవ భూతాని ఛిదేంద్రియాణి ।
కర్తా నిరంతః॥ కరణం చిదేవ । ఛిదేవ సర్వం । పరమాత్మ రూపం॥

శ్లో॥ చిదేవ పంచ భూతాని । చిదేవ భువనత్రయం ।
విజ్ఞాన మధునామస్య । అహమస్మీం చిదేవహి॥

### 1. యెరుక యుంటే దానికో ఫలితం కూడా చెప్పుకొంటుంది.

1. శిద్ధోహం = నేను సిద్దుని
2. బుద్ధోహం = నేను బుద్ధిమంతున్ని
3. హం సోహం = నేను హంస స్వరూపున్ని
4. అహం బ్రహ్మోస్మి = నేను బ్రహ్మము నైతిని
5. జీవేశ్వరైఖ్య జ్ఞానం = జీవుడు ఈశ్వరుడు యని ఈ రెంటిని నేనేనని తెలియుట.
6. యీ జ్ఞానమె బ్రహ్మ స్వరూపం ।
7. జ్ఞానమే పరమాత్మ । గుర్తెరిగేదే । నేను । నేనే జ్ఞానం ।

1. నేను గుర్తెరిగేది యెక్కడవున్నాదో అంటె । అది పరోక్ష జ్ఞానం ।
2. నేను గుర్తెరిగేది యిక్కడున్నాదంటె । అది అపరోక్ష జ్ఞానం ।
3. నేనే గుర్తెరిగే ప్రకృతిని అంటె అది సాక్షాత్కారం । అదే ఆత్మ జ్ఞానం ।
4. జ్ఞానముకంటె దొడ్డదిలేదు । గుర్తెరిగేదే జ్ఞానమని పది ఉపనిషత్తుల యందూ చెప్పుచూ వున్నది సాక్షి అంటె గుర్తెరిగే వాడు । సాక్షిణీఅంటె గుర్తెరిగే చైతన్య స్వరూపిణీ ।
5. సాక్షివర్జితం । అంటె మాయారహితం । అవిద్యారహితం ।
6. ప్రకృతి ద్వయరహితం । క్షరాక్షరోపాది ద్వయ దోషరహితం।
7. ప్రకృతి పురుషులకే జగత్తు తోస్తుంది ।
8. ప్రకృతి ద్వయరహితునికి యేలాగు తోస్తుంది । తోయనే తోయదు ।
9. వున్నదానికి లేమి లేదు । లేనిదానికి ఉనికి లేదు ।

10. పుట్టనిది కేవలాత్మ। పుట్టేది చచ్చేది ప్రకృతి ద్వయం।

11. యీ ప్రకృతి ద్వయం లేకుంటె। యే సంశయం లేదు। పుట్టుచావులు లేనిదే వున్నది

12. ఆత్మ నిరాకారమే। బయలు నిరాకారమే, రెండూ వున్నవని చెప్పితె సత్యద్వయ మవుతుంది। రెండూ వున్నవని చెప్పరాదు। లేనిది ఆత్మయనె యెరుక యెప్పుడూ లేదు। ప్రకృతి ద్వయదోష పూరితమైనది యెరుకయనబడును।

13. ఉన్నది బట్ట బయలు యెప్పుడూ లేకపోదూ। యిది ద్వయదోషములు లేనిది। యిదే విచారణకు ఫలం।

14. ప్రకృతి ద్వయదోష రహితమె అనుభవము। అనుష్ఠానంలేదు। విచారణమే కారణం।

15. ప్రకృతి ద్వయమె అనుష్ఠానం చేసేది। విచారించేది ప్రకృతిద్వయమె। అయిన ఇంటి దీపమని ముద్దాడుతామా !

16. యీ ప్రకృతి ద్వయం లేదనే నిశ్చయ పర్యంతం విచారించవలె। విచారించగ యెరుక లేకపోవలె

17. సర్వకాలం ప్రకృతి ద్వయదోషరహితమైతే మౌనం। గావలెను.

## 2. ఉపాధిద్వయ దోషరహితమే అచలబోధలో సర్వభ్రాంతి ప్రక్షాళన

| | |
|---|---|
| 1. ఉపాధిద్వయ దోషరహితమే | మడి। |
| 2. ఉపాధిద్వయ దోషరహితమే | శుభ్రం। |
| 3. ఉపాధి ద్వయ దోషరహితమె | సుజ్ఞానం। |
| 4. ఉపాధి ద్వయ దోషరహితమె | మహాపూజ। |
| 5. ఉపాధి ద్వయదోషరహితమె | యాత్రాఫలం। |
| 6. ఉపాధి ద్వయదోష రహితమె | జన్మరాహిత్యం। |
| 7. ఉపాధి ద్వయదోషరహితమె | తీర్థం |
| 8. ఉపాధి ద్వయదోషరహితమె | ప్రసాదం। |
| 9. ఉపాధి ద్వయదోషరహితమె | సిద్ధి। |
| 10. ఉపాధి ద్వయదోషరహితమె | గురుపూజ। |
| 11. ఉపాధి ద్వయదోషరహితమె | లోకాతీతం। |
| 12. ఉపాధి ద్వయదోషరహితమె | యింద్రియ జయము। |

13. ఉపాధి ద్వయదోషరహితమె నియమము ।
14. ఉపాధి ద్వయదోషరహితమె త్రిపుటివర్జితం ।
15. ఉపాధి ద్వయదోష రహితమె పురుషరహితం ।
16. ఉపాధి ద్వయదోషరహితమె అఖండైశ్వర్యము ।
17. ఉపాధి ద్వయదోషరహితమె అమృతం ।
18. ఉపాధి ద్వయదోషరహితమె అకర్తృత్వం ।
19. ఉపాధి ద్వయదోషరహితమె అభోక్తృత్వం ।
20. ఉపాధి ద్వయదోషరహితమె క్రియాశూన్యం ।
21. ఉపాధి ద్వయదోషరహితమె నిర్గుణం ।
22. ఉపాధి ద్వయదోషరహితమె గుణాతీతం ।
23. ఉపాధి ద్వయదోషరహితమె ఉత్తమం ।
24. ఉపాధి ద్వయదోషరహితమె బీజరహితం ।
25. ఉపాధి ద్వయదోషరహితమె అచలం ।
26. ఉపాధి ద్వయదోషరహితమె నిష్కళంకము.

గద్యః

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ఉత్తరభాగే ధర్మాధర్మ నిరసన ఏకాదశ ప్రకరణం ప్రథమాధ్యాయం సమాప్తం.**



# 11. ధర్మాధర్మ నిరసన ప్రకరణం

## ద్వితీయోధ్యాయం

### 1. ధర్మాధర్మములకు మూలమైన యెరుకను విడుచుటే ధర్మము

శ్లో॥ సర్వ దర్మాన్ పరిత్యజ్య । మామేకం శరణం వ్రజా ।
అహం త్వా సర్వ పాపేభ్యో । మోక్షయిష్యామి మాశుచ ॥ (గీ॥ 18-66)

1. శిష్యా, సమస్తమైనటువంటి । ధర్మాధర్మములు గలిగిన యెరుకను । సమూలంగా విడిచి పెట్టిన వాడవై । అన్నిటికంటె । ముఖ్యుడనైన నన్ను । శరణు పొందుము । నేను నిన్ను సమస్త బంధములనుంచి । విడిపించ గలవాడను । నీవు లేక పోతానని దుఃఖ పడకుము.

2. ఏద్దైనను ఆచార్య కటాక్షం చేతకావలెను । లేనియెడ యీ గుర్తెరిగే చిద్రూప మనె । అహంకారం వుండి బాధిస్తూ వుంటుంది । బ్రాహ్మణ స్వభావః । ఛాండాల స్వభావః । ఆశ్రమాలకు మూలంలేదు। అహంకారం అవిద్యగనుక । లేనిదే అవిద్య । లేనిది లేదని తెలియటమే ధర్మం । తెలియక పోవుటే అధర్మం, మాయను విడుచుటే ధర్మం ।

3. యీ అవిద్య । వాచ్యార్ధం గనుక । విద్యయైన అహంకారమె మాయ । యేదిలేదో అదె మాయ।

4. బట్టబయలు సకల దేశాలయందూ వున్నది । అది శరీరానికి మూలముకాదు ।

5. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । అనేక కోటి బ్రహ్మాండాలు వున్నవని । భ్రాంతి పెడుతుంది।

6. నాకు మూలం లేదని యెవ్వరితోనూ చెప్పదు । అందరూ తానె అయివున్నది । యింతకంటె కౌతుకం లేదు । అందుకె "చూచిన గురువెల్లా పనికిరాదు । యీ శరీరానికి మూలం యేమీలేదని । చెప్పి సమాధానం చేసే గురువు కావలెను ।

7. యీ గుర్తెరిగే శరీరం వచ్చేటందుకు మూలం యేమీలేదు । కొనకు ప్రవేశించేటంగుకు స్థానం యేమీలేదు । అని చెప్పే గురువు కావలెను ।"

8. ఉన్నప్పుడు వున్నట్టే వుంటుంది । చూస్తూ వుండంగానే యేమీలేదు ।

9. మొదలు కొనాలేనిది । పుట్టని చావనిది గనుక । సర్వకాలం వొక్కతీరే । అందుకే సకల దేశాలయందూ । సర్వకాలాలయందూ । సమస్తమైన వస్తువులయందూ । తనకు తానె స్వతసిద్ధమై యున్నదిగనుక । చలించక వున్నది ।

10. యిటువంటిది గురువాక్యం చేతకాని తెలియబడదు । భ్రాంతి విడువదు । అందుకే "దరిద్రం తీసివేస్తె ఐశ్వర్యం స్వతస్సిద్ధం గనుక । వస్తుందో రాదో అని యెవ్వరూ దరిద్రము యనె యెరుకను విడువరు ।

## 2. లేని యెరుకను ఉన్నదని చెప్పడం అన్యాయం

11. యీ శరీరంలో కొంతనిబద్ధి । కొంత అబద్ధం అనేది అన్యాయం అందుకే మూలంలేని । యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని సమాధానం చేస్తె సరిపాయె । యీలాగు సూచన అయితే సంశయం వుండదు ।

12. సంశయమె జన్మహేతువ । సంశయమే యెరుక । యీ యెరుకే పరా ప్రకృతి స్వరూపము గనుక । సర్వకాలం । లేని పరాప్రకృతి స్వరూపమే ॥"

**శ్లో॥ అపరేయ మితస్త్వన్యాం । ప్రకృతిం విద్ధిమే పరమ్ ।**
**జీవభూత మహాబాహో । య యేధం ధార్యతే జగత్॥ (7-05)**

తా॥ మహాబాహులు గలిగి యున్న ఓ అర్జునా! అపర ప్రకృతి, దీనికంటే బిన్నమైన జీవుడుగా అయిన నాపర (శ్రేష్ట) మైన ప్రకృతిని గూర్చి కూడ తెలుసుకో, ఈ జగత్తు పరాప్రకృతి వల్లనే నిలచియుంది. అపర ప్రకృతి యనగా పంచభూతాలు, పరాప్రకృతి యనగా అధిష్టానమైన యెరుకయని భావము.

**శ్లో॥ ఇదం శరీరం కౌన్తేయ । క్షేత్రమిత్య బిదీయతే ।**
**ఏతద్యో వేత్తి తంప్రాహుః । క్షేత్రజ్ఞ యితి తద్విధః ॥ (భ-13-01)**

తా॥ ఓ కుంతిపుత్రా! ఈ శరీరాన్ని క్షేత్రం అంటారు, ఈ క్షేత్రాన్ని గూర్చి ఎవరు తెలసుకుంటారో అతడు క్షేత్రజ్ఞుడని దీని గూర్చి తెలిసినవారు చెపుతారు.

**శ్లో॥ క్షేత్రజ్ఞం చాపిమాం । విద్ధి సర్వ క్షేత్రేషు భారతః**
**క్షేత్ర క్షేత్రజ్ఞయోః జ్ఞానం । యత్త జ్ఞానం మతం మమ॥ (భ-13-02)**

తా॥ ఓ భారతా! అన్ని క్షేత్రాలలోను (శరీరాలలోను) క్షేత్రజ్ఞుడను నేనే అని తెలుసుకో, క్షేత్రాన్ని, క్షేత్రజ్ఞునుణ్ణి గూర్చిన జ్ఞానం నా జ్ఞానమే అని నా నిశ్చయము.

శ్లో॥ స్వరూపం ప్రకృతి ద్వయదోషరహితాత్ । స్వతఃసిద్ధమేవా ।
ఉపాధిద్వయ దోషరహితతాత్ । స్వతఃసిద్ధమేవా । స్వతఃసిద్ధ ః ॥

తా॥ లేని నా పరాప్రకృతి, అపరాప్రకృతి, ఈరెండు దోష స్వరూపాలె ఈ రెండు ఉపాదులకు రాకడ పోకడ గలదు స్వతఃసిద్దమైన బట్టబయలుకు ఆలాగున లేదు, రెంటిని లేదని గురు సూచనైతే సరి, జన్మరాహిత్యమే.

1. క్షేత్రజ్ఞుడు ధర్మం అయితే క్షేత్రం అధర్మం గనుక ఈ రెంటిని విచారించి యెరుకను త్యాగం చేయడమే పరమధర్మము.

గద్యః
ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।
ఉత్తరభాగే ధర్మాధర్మ నిరసన ఏకాదశ ప్రకరణం
ద్వితీయాద్యాయం సమాప్తం.



# 11. ధర్మా ధర్మ నిరసన ప్రకరణము

## తృతీయోధ్యాయము

### 1. స్వప్న దృష్టాంతము

శిష్యా! విను ॥ యీకలలో ఒక సన్యాసి వచ్చె । వెంటనే పెద్ద పట్టెనామాల అయ్యవారు । పుస్తకం చంక బెట్టుకొని వచ్చె । తరువాత అర్ధకపు బట్టవలె వున్నమనిషి వచ్చె । అటువంటి ఆయనె ముసలి ఆయన వచ్చె । వీరిని చూతామని వయస్సు ఫకీరు వచ్చె।

ఫకీరు॥ మీరు నలుగురూ నాలుగు దార్లు పెట్టుకొన్నారు. మీకు మీరెపెట్టుకొన్నారా । మీకు యెవ్వరైనా చెప్పినారా । అనే అంటే । విభూతి చెమటకు తడిసి పోయింది గనుక । యీయన మన మతంవాడేనని । ఫకీరు అనుకోనె । అనుకొని నెత్తిచూచె । రొమ్ముచూచె। చూచి । మనసంబంధమె అనుకోని । మీకులం యేమీ అని అడిగెను ।

శం॥ నాకు కులంలేదు । గోత్రం లేదు । అనెను

ఫకీరు॥ లేదని నీకే యెరుకా । మరియెవ్వరైనా చెప్పినారా అనెను ।

శం॥ నాకు చెప్పేవారు యెవ్వరు । నాకంటే వేరే యెరుకలేదు । నేనే అందరిలో వుండి యెరిగేవాణ్ణి । నేనే నేను । సమస్త నిర్ణయాలకు కర్తను । నేనే నేను అనెను ।

ఫ॥ అయ్యవారూ నీవేమయ్యా అనెను ।

రా॥ నేను నిబద్ది । యీశరీరం అబద్ధం । అని నిర్ణయం చేసినా । అబద్ధం అంటే లేదు అనుట ॥

రా॥ అట్లయితే పుట్టింది నీవాశరీరమా ।

శం॥ శరీరమే । నాకు పుట్టుకా లేదు చావూ లేదు । సర్వకాలం వక్కతీరె ।

ఫ॥ నీవు చెప్పవయ్యా । అయ్యవారు ।

రా॥ సరె । కాని । నేనువేరె । శరీరం వేరె । అన్నాడు

శం॥ వారూ । మేమూ । నేనూ । శరీరం వక్కటె అన్నాను । నన్ను విడచి శరీరం వుండదు । శరీరాన్ని విడచి నేను వుండ । నాతోకలసి వున్నది శరీరం । శరీరంతోకలసి నేను వున్నాను । యింతేకాని । రెండూ కావు వొక్కటీ కాదు ।శిలాప్రతిమ యేలాగో అలాగే

ఫ॥ అయ్యవారిని అడుగుమా । వ్యవహారం చేశేది । శిలాప్రతిమా । అడుగుమా ।

రా॥ మా సిద్ధాంతం వొక్కటీ కాదు రెండూ కాదు । విశిష్టం ఫకీరా వ్యవహారం అడిగితివి । మావారిని అడుగు।

ప॥ వారుమావారా । యేమి ॥

రా॥ యెక్కువ తక్కువ । జుట్టు లేదు । జంద్యాలు లేవు । అదియేమయ్యా అనె । సన్యాశి।

శం॥ వ్యవహారం నీవు చేస్తావా । శరీరం చేస్తుందే ।

రా॥ నేనుయేమిచేస్తాను । నేను క్రియాశూన్యుణ్ణి । ఆకర్తను । ఆభోక్తను । నేను యేమీచెయ్యను । అన్నీ దేహధర్మాలె । దేహమె చేస్తుంది అనెను ॥ అనంగానె

ఫ॥ ఫకీరునవ్వె । నవ్వి । అద్ధకం బట్టవంటి మనిషిని । నీవేమయ్యా అనెను

మ॥ ఛీ। శరీరం యేమి చేస్తుంది । సకల వ్యవహారాలకూ । కర్తనూ । గుర్తెరిగే వాణ్ణి నేనే।

శృ॥ **జ్ఞాత్వా కర్మాణికుర్వీతా** । అనివున్నది సమస్తమైన వ్యవహారాలు । నేనెకాని । స్వతంత్రుణ్ణి కాను।

ఫ॥ నీకంటె వేరుమరి వొకరు । వున్నారా ।

మ॥ వున్నారు ।

ఫ॥ గురువును యెరిగిన వారా । యెరుగనివారా ।

మ॥ మా సిద్ధాంతం । చాలా గొప్పది ।

ఫ॥ ముసలి మనిషి నీవేమయ్యా ॥

వే॥ నీవు నిబద్దే । శరీరం నిబద్ధే అనే

రా॥ నేనూ నిబద్దే । శరీరం నిబద్దే । నేను లేనిదీ శరీరం చెయ్యదు । శరీరం లేనిది నేను చెయ్య । గుర్తెరిగే నేను జ్ఞానం । శరీరం చేసేది ఖర్మ । జ్ఞానం నిబద్దే ఖర్మాలూ నిబద్ధే । ద్వైతం నిబద్ధి అనె।

ఫ॥ ఫకీరు నవ్వి । మీరు యెక్కడికి పోతారు అనెను ।

వే॥ మేము నల్గురము నాలుగు బాటలవారము । మాకు యేమీ ప్రయోజనం లేనే లేదు । సకల విద్యలు చదువుకొన్నాము । చెప్పుదామంటె చదువుకొనే వారు లేరు । శ్రవణమైనా చేతామంటె వినే వారు లేరు । యెవ్వరైనా వత్తురేమో అని చూస్తూవున్నాము

। వస్తె నల్గురూ నాలుగు దార్లు చేతామని వున్నాము॥

ఫ॥ యెవ్వరైనా । వచ్చేరు । రావలెనని తపస్సు చెయ్యమని చెప్పి ఫకీరుపాయె ॥

యీ నల్గురూ యెక్కడ చూచినా లేరు । యేమీ లేదు అని వుండిరి । వుండంగా వుండంగా అనేకమంది బూడిద పూసుకొని వచ్చిరి । అనేకమంది నామాల వారు వచ్చిరి । అనేక మంది నాలుగు విధాల వచ్చిరి । రాగానే । వినవలెనని యిచ్ఛపుట్టె । పుట్టంగానే । వినిరి ।

మనమూ యీలాగే కొందరికి చెప్పుదామని పుస్తకాలు వారి వారి సమాధానంగా శానా వ్రాసుకొనిరి । వ్రాసుకోని । చదువుకొంటూ చెప్పుకుంటూ వుండిరి. మేలుక వచ్చె ఎవ్వరులేక పోయిరి.

గద్యః

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే । వేదాంత విచారణే ।
ఉత్తరభాగే । ధర్మాధర్మ నిరసన ఏకాదశ ప్రకరణ ।
తృతీయోధ్యాయం సమాప్తము



# 11. ధర్మా ధర్మ నిరసన ప్రకరణము

## చతుర్థోధ్యాయము

### 1. నరక స్వర్గాలు, జనన మరణాలు కల్పితములు

1. మూలం లేని యీ గుర్తెరిగే శరీరం । నేను అని । నిశ్చయంగల వారుకొనకు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి । ప్రవేశించేటందుకు స్థానం వున్నదని । అన్నారు. మళ్ళా వస్తుంది అని అన్నారు ।

2. మూలంలేని యీగుర్తెరిగే శరీరమె యిన్ని మార్గాలు చేశింది । చెప్పేవానికి చేటు అయితె । వినె వారికి జాగ్రత వుండవలెను ।

3. కలలో వచ్చిన వాటిని । గట్టిగా కట్టి వేసుకొన్నట్టు మళ్ళామళ్ళా నేననే యెరుకను గట్టిగా కట్టివేసుకొంటారు । యీ సుఖ దుఃఖం నాకు యేమి అని । కల మేల్కొని అందరూ చూడంగానే । యేమిలేదు యని కనుకొంటే చాలుగదా !

4. ఆలాగే మూలంలేని యీగుర్తెరిగే శరీరం ప్రతిదినమందూ । యేమీలేదు దృఢం చేసుకోవాలి, చేసుకొంటే కొనకూ యేమీలేదు । యేమీలేని అపకీర్తి । సుషుప్తి అని కల్పించినారు । కొనకు మరణం అని కల్పించినారు । ఎంత పిచ్చి అనవలెను ।

5. తల్లికి అలవాటైన పిల్ల తల్లికొరకు ఏడిస్తే । ఆపిల్ల । అమ్మా అమ్మా అని । యాదిచేస్తే । నీళ్ళకు పోయింది । జియ్యచేశిరాను పోయింది । అన్నట్టు । యీమూలం లేని యీ గుర్తెరిగే శరీరం । స్వర్గానికి । పోయింది । నరకానికి పోయింది । అని కల్పించినారు।

6. నేను రానేరాను । వస్తినా కాశ్శేపు వుండి । మీకు తెలిశేటట్టు మళ్ళాయేమీలేదు । అని నిశ్చయం అయేటట్టు । కలలో వచ్చికాశ్శేపు । మీతోకూడా వుండి । మీరు అటు మొఖం కాంగానే । మీకు నేను యేమీ లేదు । అని నిశ్చయం అయిందో లేదో అలాగే । మూలం లేని యీ గుర్తెరిగే శరీరం । యేమిలేదు । అని నిశ్చయం ఉండవలెను ।

7. పుట్టని చావనిది । మొదలూ కొనాలేనిది । వక్కటైనా క్రియలేనిది శరీరం లేనిది । సకల దేశాలయందూ । చలించక । సర్వకాలం వక్క తీరుగా వున్నది । బట్టబయలేనని, లేనిది యీ యెరుకేనని యెరిగితె చాలు.

## 2. స్వప్న దృష్టాంతము

గు॥ కలలో రెండోది లేదని ప్రసిద్ధి కద్దు । కలతప్ప విడచిరెండో అవస్త లేదు । యేదైనా వున్నప్పుడే గనుక । మూలంలేని యీగుర్తెరిగే శరీరం వున్నంతసేపూ వుండేది । కొనకు యేమీ లేదు । పుట్టని । చావనిదాని వంటిది కాదు । యీలాగు వుండంగా తప్పున । వక్క ఆడదివచ్చెను ।

శి॥ నన్ను మీదగ్గర సర్వకాలం । యెడతెగకుండా వుంచుకొండి అనెను ॥

గు॥ నీకు సమాదానం వుంటే వుండు । నీకు సమాధానం కాకుంటె పో। నేను నిన్ను యేమి అనను॥

శి॥ నాకు క్షణమైనా విడువకుండా । మీదగ్గర వుండవలెనని వున్నది ॥

గు॥ వుంటే వుండు । నేను అనే యెరుక వున్నంతశేపూ ఉంటావు ॥

శి॥ మీరు నన్ను యేమనకుందురు । నేను యెప్పుడు లేకపోతానో । ఆలాగున శిక్షణ చెయ్యండి అనెను । అంటూనె బట్ట పరుచుకొని అడ్డం పడెను, ఆరు నెలలకు లేచెను ।

గు॥ మంది మాటలు యేమి విచిత్రం ।

శి॥ మీకు యెలాగు యెరుక వున్నాదో । ఆలాగు చెప్పుమనెను ॥

గు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । నేనువుంటే నాకు యెరుక । నేను యేమీ లేకుంటె యెవ్వరికి యెరుక । వ్యవహారమే లేదు । నేను వుంటే సర్వం । నేను యేమీ లేకుంటె । యేమీ లేదు ।

శి॥ అట్లయితే నీకు మూలం వున్నదా ॥

గు॥ నాకు మూలం యేమీలేదు । మంది సుషుప్తి అంటారు । అప్పుడు మందిలేరు । నేనులేను నేను రాంగానే నాతోటి వచ్చినారు । వారూ నావంటి వారే । కాశ్శేపు వుండి కొనకు యేమీ లేక పొయ్యేది ।

శి॥ పుట్టని చావని దానిజాడ వారు యెరుగరు । నేనుయెరుగను ॥

గు॥ దానిజాడా చెప్పేవారు వున్నారు ।

శి॥ ఏమో శరీరం లేనివారైతే నేమో । మూలంలేని యీగుర్తెరిగే శరీరం చేత సాధ్యం కాదు ।

గు॥ నీకేమి యెరుక । దాని సంగతి ।

శి॥ అసాధ్య వస్తువ । అని । ప్రసిద్ధి కద్దు గదా । దాని సూచన చేయండి ?

గు॥ 1. మూలం లేనియీా గుర్తెరిగే శరీరం చేత । పుట్టని చావని దాన్ని । మొదలూకొనా లేని దాన్ని । రాకడాపోకడా లేని దాన్ని । సర్వకాలాలయందూ వొక్కతీరుగా వున్న దాన్ని । సకల దేశాలయందూ । సమస్తమైన వస్తువులయందూ । చలించక వున్నదాన్ని । వుండజూచి ।

2. కలలో యేనుగ మేలుకొంటే । యేమీ లేదని యేలాగు నిశ్చయమైందో ।

3. ఆలాగే । ముందట యేమీలేక । కొనకూ యేమీలేక । పోయినట్టు । మూలంలేని యీాగుర్తెరిగే శరీరం యేమీలేదు । అని నిశ్చయమే । విచారానికి ఫలం । ఇంతకంటే ఎక్కువ లేదు ।

శి॥ సరే యిది యేమి । ఆశ్చర్యం । ఉన్నది ఉన్నట్టే చెప్పితిరి । లేనిది లేకపాయెను ।

గు॥ యిది కఠినం కాదు । అచలం వున్నది । నిబద్దే । చలించే శరీరం యేమీ లేదనేది । నిబద్దే । యెక్కడ చూచినా పరిపూర్ణమే । చూపులేదు । రూపులేదు । వూరికే మాటలు । యెందుకు

శి॥ అసాధ్యం నిబద్దే । అనాయాసం నిబద్దే । నరకం స్వర్గం, జనన మరణాలు నేను లేకపోతే దేనికి అని యెరుకకే విచిత్రమాయెను గనుక యిదే రాజమార్గం । అనుమానం లేని మార్గము । అనాయాస మార్గం, ఏ సాధన, ఏ కర్మ లేదు స్వామి నేను ధన్యుణ్ణి అయితిని.

గద్యః

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే, వేదాంత విచారణే
ఉత్తరభాగే । ధర్మాధర్మ నిరసన ఏకాదశ ప్రకరణం
చతుర్థోధ్యాయం సమాప్తం॥



# 12. భావా భావ రహిత ప్రకరణము

## ప్రథమోధ్యాయం

### 1. భావాతీత లక్షణం

గు॥ యీ వుత్తబట్టబైలు యేమీ లేదు యేమీ లేదు । అంటె । జననమరణములు । సుఖదుః ఖములు గల మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు అనుట । సరే । యిప్పుడు కనుపించె శరీరాలు । కలలో కనుపించె శరీరాలు సమానమా యేమైనా యెక్కువతక్కువ వున్నదా ।

॥శి॥ యేమీయెక్కువ తక్కువలేదు । రెండూ యేకరీతే యేకమే । అంటె । యిందుకు అనుమానం బోడిముండకైనా లేదు । యిది వకసూటె । యిది అందరికీ యెరుకే కదా

॥గు॥ అట్లైతే నీవుయేమి ।

॥శి॥ నేనా నేను మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని ॥ యీ శరీరానికి కలలోవచ్చిన శరీరానికి మూలం యేమీలేదు ।

॥గు॥ అయితే ఆ రెండు యెవరి సత్తాచేత తోచినావి ?

॥శి॥ వాటికవ్వే । వీటికివ్వే । యెవరి సత్తాలేదు । యీ శరీరాలను రమ్మనేవారు లేరు । పొమ్మనమనె వారులేరు । విచారించని మూఢులు వీటికి । మూలంవున్నదని । భ్రాంతి పొంది యున్నారు। విచారిస్తే అందరికీ మూలంలేదని యెరుకే । మనకు కనిపించే శరీరం వంటిదైనా యేమీలేదు।

॥గు॥ అట్లైతే మీకు శరీరం వున్నట్లా, లేనట్లా ?

॥శి॥ నాకా కలలో వచ్చిన శరీరం మేలుకొంటె వున్నట్లా లేనట్లా అంటే । నేను మేలుకొంటె యేమీ లేదు । కొంచమైనా లేదు ।

॥గు॥ యీ శరీరం యేమీ లేదు । యిప్పుడు చస్తావా ।

॥శి॥ ఛీ॥ యెప్పుడు విచారిస్తే అప్పుడే । లేదు గురుకటాక్షం చేతయేమీలేదు

॥గు॥ నిబద్ధే ॥ నిబద్ధే । యిందుకు అనుమానం లేదు ।

॥శి॥ కాని । కొందరు చస్తే యేమీలేదంటారు

॥గు॥ అలాగైతె । గురువు యెందుకు । విచారానికి ఫలంయేమి । మొదలుయేమీ లేదు । యీలాగు అందరికి సమానమె । గురు ముఖంగా విచారించిన వారికి యెప్పుడు విచారిస్తే । అప్పుడె యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు

॥శి॥ యీలాగు సరి । యిందుకు అనుమానంలేదు । కాని గురుస్వామీ । నాకు రెండు అబద్ధాలు తోస్తూ వున్నావి ।

## 2. ఈ గుర్తెరిగే శరీరం ఉన్నంత సేపూ కలలే ఉంటాయి.

॥గు॥ అవియెవ్వి

॥శి॥ సుషుప్తి అనేమాట మరణం అనెమాట । అదియెలాగు

॥గు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేకుంటె యేమో యెరిగిన వారికే తెలుసును గదా!

॥శి॥ సరే అదిజాడే నిబద్దే అనిపించెను ।

॥గు॥ 1. సుషుప్తి । మరణం । అని మంది కల్పించినారు । యింతేకాని వున్నది వొక్కటె । మూలం లేని యీ గుర్తెరిగే శరీరం వున్నంతశేపూకలే । యెరుక యను కలలోనే ఉంటావు ।

2. గురు మూలంగా యీ కలలో వచ్చిన శరీరాలు యెరుక వుండంగానే యేమీ లేదు । అని తనకు తానే యేలాగు । జ్ఞానవివేకం చేత దృఢమో । అలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదని । తాత్పర్యమాయెనా । అదేమేలుకొనుట ।

3. యింతేకాని వక్కటైనా అవస్థలేదు । స్వప్నావస్త గురుడు మేలుకొలిపితె । అదే జాగ్రత । అదే ప్రబోధ । యింతేకాని నాలుగు అవస్థలు లేవు ।

4. యింతేకాని । యీ శరీరం వక్కటె । నాలుగు శరీరాలు అనుట । అబద్ధం । నీలివార్త । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం మృషాస్వప్నం । యింతేకాని యెరుకముచ్చట్లతో యేమీపనిలేదు

॥శి॥ 1. స్వామి । నాకు చాలు । మీరు మహాకష్టపడితిరి । యిటువంటి ముచ్చట । యెవ్వరికైన దృఢం కాకపొయ్యేనని భయం విడువండి । యెంత మొద్దులైనా తనకు తానె దృఢం అవుతుంది ।

2. అతి సులభం । యిటువంటి సులభం వున్నదని । యెన్నడూ వినలేదు ।

3. కఠినం వున్నదని విన్నా అనేక సాధనలు । అనేక లక్ష్యాలు । అనేక ముద్రలూ । చేత చాలా శ్రమపడితిని । గాని వక్కటైనా అక్కరకు రాకపాయెను । సముద్రం కాళ్ళచేత నడిచి నావద్దకు వచ్చినట్టు ఆయెను । స్వామీ నాకు చాలు । చాలు ॥

గద్యః
ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే
ఉత్తరభాగే । భావాభావ రహిత ద్వాదశ ప్రకరణం
ప్రథమాధ్యాయము సమాప్తం ।



# 12. భావా భావ రహిత ప్రకరణము

## ద్వితీయాధ్యాయము

### 1. శ్రవణ, మనన నిధి ద్యాసలు చేసే యెరుకను విడుచుట

శి॥ శ్రవణ । మనన । నిధిద్యాస । లేని మార్గం । మీ మార్గం అని వస్తి । అది నాకు సూచనచెయ్యండి । సూచన చేస్తే । యీ శ్రవణ మనన నిధిద్యాసలను చేసే యెరుకను విడుస్తాను స్వామి.

గు॥ అట్లైతే నీవు యేమి ?

శి॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరమును నేనే సర్వత్ర ఉన్నాని చెప్పుకొన్నాను.

గు॥ 1. యింతేకదా । యిటు విను । ప్రకృతి ద్వయరహితమైంది । భావాభావద్వయ దోషరహితమైంది । సకలదేశాలయందూ । సర్వకాలాలయందూ । సమస్తమైన వస్తువుల యందూ మొదలూ కొనాలేక । ఈ బట్టబయలు లోపటాబైటా అనే మర్యాదలేక । తనకు తానే చలించకవున్న దాని చూసి, నిజం చెప్పుము ।

2. నీవు మొదలు యేమీ లేక । కొనాయేమిలేక । మధ్యగదా వచ్చి యిన్ని ముచ్చట్లూ ఆడుచున్నావు । అది అంతటా నిండి వున్నది । అలాగే నీ యందు వున్నదో లేదో అని అనుమానం లేకుండా వున్నది । సమస్తమైన అనుమానములు గలిగిన । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు సరేనా, యింకేమైనా కావలెనా ।

శి॥ చాలుస్వామి । చాలు । మీరు సూచన చేశిన ప్రకారం బట్టబయలే వున్నది । నేను అంతటివాన్ని కాదని తెలిసే । మరియు నేను లేని జాడపడెను ।

గు॥ యింకాయేమైనా అడుగుమా ।

శి॥ యేమి అడుగుదు । శ్రవణ । మనన । నిధి ధ్యాన । సమాధులు చేతామంటె చేతకాదు । యెరుకకు మూలంలేదు । మూలం ఉంటే యేమైనా ఇచ్చునేమో యని ఆశవుండే ఇది మూలం లేనిదీ చెయ్యడానికి । శిగ్గు అవుతున్నది ।

వున్నది వున్నట్టే వుండె । సాధనాంతర నిరపేక్ష । స్వతసిద్ధమాయె । సకల నిర్ణయాలు । చేసేశరీరం యేమీలేదు ।వున్నబైలుకు చైతన్యమనె జ్ఞానం లేదు । శరీరం లేక వున్నది యేమీ లేక వున్నది ।గనుక యే నిర్ణయం చేసేటందుకు మూలం యేమీ లేదు

గు॥ అయితే వున్నట్టు తెలుస్తే చచ్చినట్లు పడివుండుము ।

॥శి॥ యీ మాటకొంచెం నయంవలె వున్నది । కలలో యేనుగకొంచెమైనా లేదు గనుక । యీ గుర్తెరిగే శరీరం మళ్లీవున్నదని యేలాగు అనను । యేమీ లేదు । అది సూచన చెయ్యంగానె యెప్పటి పరిపూర్ణమనె బట్టబయలే వున్నది ।

## 2. బట్టబయలును పరమ తత్త్వమని చెప్పకూడదు

1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే నానా మతాలు । నానా శాస్త్రాలు చేశింది ।
2. చెలించక వున్నది అచలం యేమీచెయ్యలేదు ।
3. అన్నింటికి మూలం నేనన్న యెరుక యెన్నో మత సిద్ధాంతాలను అదే స్థాపించుకొని, దానికన్న ఇది యెక్కువ, దీనికన్న అది తక్కువయని నిర్ణయాలు చేసిన యెరుకనే యేమిలేకపోయెను గనుక శంకరాచార్యులవారి అద్వైతం । రామానుజాచార్యులవారి విశిష్టాద్వైతం । మద్వాచార్యుల వారి ద్వైతం । సర్వం యెరుకతోటె యేమిలేక పోయినవి ।
4. ఉన్నది ద్వైతాద్వైత రహితమైన పరమతత్వం । పరమ తత్త్వం అని కూడా చెప్పకూడదు । దశముఖుడు వేరే । శతముఖుడు వేరే అన్నట్టు । యెక్కడబడితె అక్కడనె బట్టబయలు వున్నది । తత్త్వం అనే మాటే లేదు. తత్త్వం అంటే అది నీవైతివియని అర్థం) గనుక బట్టబయలు అటువంటిది కాదు.
5. యీ గుర్తెరిగేది గురుకటాక్షం వలన లేకుంటె । యేలాగు వున్నదో అలాగే వున్నది ।
6. గుర్తెరిగే శరీరరహితుడు అయిన వాడు । సకలభ్రాంతులను విడిచిన వాడు ।
7. పరిపూర్ణమె స్వతసిద్ధమై వున్నది గనుక । దాని యత్నము చెయ్యడమె యెరుకకు విఘ్నము । యత్నం చేశేదాన్ని తీసివెయ్యడమే ప్రయత్నము । యిది మహాగుహ్యం । మహారహస్యం ।
8. యింతకంటె యెక్కువ గురువాక్యం లేదని । పరంపరా ప్రాప్తి అయింది ।
9. ఛీ । నీవు బ్రహ్మమనె మాట, నేను బ్రహ్మమనే మాట మాకు యెన్నటికి పట్టవు । యీ అచల మార్గం గాక యేమార్గం నమ్మినా భ్రాంతిలో మునిగి ఎన్నటికి తేలడు ।

10. పరిపూర్ణం దేనికీ మూలము కాదు । యిదే భావాభావ రహితమైనది. యెరుకతోటే భావాభావాలు రెండు పోవును.

11. యీ గుర్తెరిగే శరీరమె అనేక బ్రహ్మాండాలు వున్నవని భ్రాంతి పెడుతుంది । ఇది తనకు మూలంలేదని యెవ్వరితోనూ చెప్పదు । దీన్ని లేదని చెప్పే గురువు కావలెను । భ్రాంతి లేకపోవలె । సర్వకాలం పరిపూర్ణమే వుండవలె । యిదే సిద్ధాంతం । సిద్ధాంతమే రాద్ధాంతం ।

గద్యః
ఇతి అచలగురు శ్రీశివరామ దీక్షిత ప్రభావే వేదాంత విచారణే
ఉత్తరభాగే భావాభావ రహిత ద్వాదశ ప్రకరణం
ద్వితీయాధ్యాయము సమాప్తము



# 12. భావా భావ రహిత ప్రకరణము

## తృతీయోధ్యాయము

### 1. యెరుక ఉన్నదన్న సంకటమే లేదన్న సంకటమే

1. గురువాక్యం యెరుగని వారి ముందు। మూలం లేని గుర్తెరిగే శరీరం వున్నదన్నా సంకటమే. లేదన్నా సంకటమే. రెండు విధాలా సంకటమే. గురు కటాక్షం చేత ఉన్నది వున్నట్టు సూచనయితే దాని జోలి తనకు పట్టదు,

2. యీ నిర్ణయం వేదాల చేత కాకపోయింది, శాస్త్రాల చేతకాక పోయింది,

3. శంకరాచార్య స్వాములవారు యెరుక లేదని నిర్ణయం చేస్తే యెవ్వరికి నిర్ణయం కాలేదు,

4. నిర్ణయమైతే పుట్టినపుడు పురుడు యెందుకు చేస్తారు, చచ్చినపుడు సూతకము యెందుకు చేస్తారు.

5. రామానుజాచార్యులవారు ప్రవాహ రూపేణా జగత్తు సర్వకాలం వుండనే వున్నదన్నారు. వారు వున్నంతసేపూ సుఖ దుఃఖములు కలిగి యుండిరి.

6. చిత్తే శేషము, చిత్తులో చిత్తే విశిష్టము అని అన్నందువలన వికారరహితం సంభవించక పోయె, సుఖదుఃఖరహితం కాక పోయె, భావాభావ రహితం కాకపోయె.

7. శిలా ప్రతిమవత్ అని దేహి దేహానికి అవినాభావ సంబంధం ఉండి చెప్పినారు, గనుక దేహానికి విశిష్టం తప్పదు. దేహానికి వుపద్రవము వస్తే యేడ్చేది దేహి కనుక యీ దేహికి సుఖ దుఃఖాలు లేవు అని శాస్త్రం చెప్పుచూ వున్నది. అది పెద్ద అబద్ధం,

8. దేహి నిబద్ధి, దేహం అబద్ధం అని శంకరాచార్య స్వాములవారు శృతి మూలంగా చేసుకొని చెప్పినారు.

9. సుఖదుఃఖాలు దేహీ వున్నంత సేపే, గానీ దేహి లేకుంటే దేహమునకు లేదు. సుషుప్తి యందు దేహి లేక పోయింది, గనుక సుఖ దుఃఖాలు లేవు, దేహి యుండంగానే సుఖ దుఃఖాలు సిద్ధం,

### 2. దేహి ఉన్నదనే భ్రాంతి ఉన్నంత కాలం జనన మరణ భ్రాంతి పోదు

10. దేహి నిబద్ధి. అయితే దేహం వున్నదని నిర్ణయం లేదు, గనుక దేహి వున్నాడని భ్రాంతి వున్నంత సేపూ జనన మరణ భ్రాంతి తప్పదు.

11. అందుకే అద్వైతం నమ్మకుంటే విశిష్టానికి మూలం లేదు, గనుక రెండూ దగానే. యీ రెండూ లేకపోతే మధ్యసిద్ధాంతమునకు మూలం లేదు, మాట మాత్రమైనా లేదు.

12. అంగడి సాగితే తత్కాలములో అన్ని దినుసులు వున్నట్లు వుంటుంది. అంగడి లేకపోతే మునుపు యెంతో అంతే. మళ్ళీ సాగితే సాగుతుంది. పోతే పోతుంది.

13. అద్వైతం విశిష్టాద్వైతం అటువంటివే. స్వప్నావస్థ వలనే మేలకొంటే యేమిలేదు । యింతేకాని యే సిద్ధాంతము నమ్మినా జగత్ భ్రాంతి తప్పదు.

14. నిజగురు సాంప్రదాయం నమ్మినటువంటి వారికి సకల వ్యవహార భ్రాంతిరహితమై సర్వకాలం పుట్టనీచావని పరిపూర్ణమే ఉంటుందని తెలిసిన వారు యెప్పుడు వారు లేని వారే అవుతారు.

15. యిట్టి నిజగురు సాంప్రదాయానికే జ్ఞాన భ్రాంతి లేదు. కర్మ భ్రాంతి లేదు, చూస్తే అందరివలనే వుంటారు. అటువంటివారు సమయోచిత ప్రజ్ఞచే బాధ లేక వుంటారు. అటువంటి వారిని బ్రాహ్మణుడని నమ్మవద్దు. చండాలుడని విడువవద్దు.

16. భ్రాంతి రహితం కావలెనని యిచ్ఛ వున్న వారు వారి సేవ చేస్తే దయ వస్తే తమ వలనే జగత్ భ్రాంతి లేకుండా చేస్తారు.

17. యింతే కాని మరొక ప్రకారంగా సాధన చేసి సాధించుతామంటే సాధ్యము కాదు.

18. స్వతఃసిద్ధమై చలించక యున్నది, సాధనల చేత సాధ్యం యెన్నటికీ కాదు, సాధన చెయ్యబొయ్యేదే యేమి లేక పోతున్నది. కనుక సాధనాసాధ్య పరామర్శ రహితమైన అచలమే యున్నది.

19. అందుకే భావాభావ రహితము గనుక భావించేదే లేదు, భావము లేదు, బట్టబయలే ఉన్నది, యిదే నిజము.

**గద్యః**

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే,**

**ఉత్తరభాగే, భావాభావ రహిత ద్వాదశ ప్రకరణం**

**తృతీయాధ్యాయం సమాప్తము**



# 12. భావా భావ రహిత ప్రకరణము

## చతుర్థాధ్యాయం

### 1. భావం ఉంటే భావంలో అనేకం తోచి భ్రాంతిలోనే పడవేసును

గు॥ 1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । యీ శరీరం వున్నది । అన్నా యేమీలేదు । కలలోగన్న యేనుగను మేలుకొని చూస్తే యేలాగున లేకపాయెనో అలాగె । జగద్ అదిష్టానము లేదు.

2. యేమీ లేని యీ గుర్తెరిగే శరీరంబనే ఆత్మ ఉన్నాది అనుకొని । అందరూ భంగపడ్డారు।

3. దీనికి మూలంవున్నదని అనేక భాష్యాలు । అనేక శాస్త్రాలు । చేశినారు గాని । వక్కరూ దీనికి మూలము లేదని విచారించకపోయిరి

॥శి॥ అట్లైయితే స్వామి మీరు నాకు సూచన చెయ్యండి ?

॥గు॥ 1. యిదియే మహా రహస్యం వంచనలేని సేవచేతగాని । సూచన చెయ్యరు । ధీర్ఘకాలం సేవచేతగాని దయరాదు । దయవస్తే అయ్యా అని అడుగందే దయచేశి చెప్పుతారు ।

2. వంచకుడై దూర్తుడాయెనా, శక్తిమతంలో కలుపుతాడు । కలిపితే మునుపటికంటె । ఘట్టివాడై సంతోషపడుతాడు । అమ్మ నన్ను కరుణించింది అంటూ ఉంటాడు.

3. యేత్వాలు పీత్వాలుతో సంతోష పెడుతాడు । గనుక మా గురుస్వామి చరణాలేదిక్కాని సర్వకాలం యీ మూలం లేని యీ గుర్తెరిగే శరీరం, అయి యేదైనా వకటి చేస్తాడు । అని అనుకుంటూ ఉంటాడు.

4. స్త్రీలకూ పురుషులకూ సంతోషం । యేత్వాలు । పీత్వాలే లేని వారితో సంభాషణ చెయ్యరాదని నిశ్చయం చేసుకోని । తమ అనుకూలతతో సహవాసం చేసుకొంటూ । కాలం గడుపుతారు ।

5. మనమె శ్రేష్టులమనుకొంటూ కోడివలె । కూసుకొంటూ । కుక్కలవలె సంతోషపడుకుంటు వుంటాడు । లేవంగానే అదేచింత ।

6. వంచనలేని శిష్యుడు వస్తే భ్రాంతిలేని మార్గం చూపుతాడు । గురుసాంప్రదాయం దొడ్డదికావలె । శంకరాచార్యస్వాములవారి మీద అనురాగం రామానుజాచార్యుల వారి మీద ద్వేషం । లేని గురుసాంప్రదాయం దొరికితే యదార్థం తెలుస్తుంది

॥శి॥ స్వామీ నాకు మీచరణాలేగతి అని యుంటిని । తమ మార్గం భ్రాంతిలేని మార్గం । అని బహుమంది వల్లవినివచ్చినా । నన్నుయేలాగునైనా కడతేర్చండి ?

## 2. భావ రహితోపదేశమైతే, బయలే నిజమవును.

॥గు॥ అట్లయితే విను । సకల దేశాలయందూ । సర్వకాలాలయందూ । సమస్తమైన వస్తువుల యందూ । మొదలూ కొనాలేక । చలించక తనకుతానె స్వతసిద్ధమైనది । 1 స్త్రీలింగం । 2 పుల్లింగం । 3 నపుంసక లింగ త్రయంకానిది । నిజస్వరూపం । అందుకె । దేవతాకాదు । దేవుడూకాదు । బ్రహ్మమూకాదు । లింగంలేనిది । అటువంటిదానియందే నీవు వున్నావు

॥శి॥ సరే అట్లైతే నేను అందులోనే వున్నా । దాన్ని కనుక్కోకపోతిని । స్వామీ యిది సరె । యికనాకు నా వర్తమానం చెప్పండి ।

## 3. స్వప్న దృష్టాంతము

॥గు॥ 1. విను యిప్పుడు కలలో యేనుగవచ్చి వుండె । అది మేలుకొంటే యేమీలేదు। వచ్చేటప్పుడు యెక్కడ నుండి వచ్చె । యెక్కడికి పోయె । యెవరు రప్పించిరి॥ యెవరు పొమ్మనిరి ।

2. అందుకే యీ గుర్తెరిగే శరీరం కలలో యేనుగవలె । మూలం లేకనే వచ్చి । చూస్తూ వుండంగానే యేమీలేకపోతుంది గదా !

3. అందుకే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదని గురువాక్యం వచ్చె । యీలాగునే । నీరాకడా । నీవునికీ । నీ పోకడా । సరెనా యింకా అనుమానమా !

॥శి॥ స్వామీ నాకుచాలు । యేమీ అడిగేటందుకు శరీరం యీషత్తూ లేకపోయింది । యిటువంటివారు యేలాగు వుంటారు । అని సంశయం వస్తుంది

॥గు॥ 1. "మూలంలేని యీ గుర్తెరిగే శరీరం లేకుంటె యేలాగో ఆలాగే । వ్యవహారం । యిటువంటి వారు । గుర్తెరిగే చైతన్య రహితులు గనుక। యేమీ అనరాదు । వారు లేని స్థితిలో ఉంటారు ।

2. ద్యానం లేకుండా క్రియా శూన్యులు । మళ్ళా అందరివలెనే చేస్తాడు ।

3. గాని రాగద్వేషరహితుడు । ఆ మహాత్ముని దీర్ఘకాలం సహవాసం చేతగాని తెలియదు।

4. నీచుల ప్రభావం వలె శీఘ్రంగా బైటపడదు । భావాభావ రహితులు గనుక । మహాకఠినం ।

5. చూచి నేర్చుకోవలె । వారిజాడ వారి అంతవారికే గాని । మిగిలిన వారికి శక్యం కాదు ।

6. జనక చక్రవర్తి ప్రశిద్ధి వలెనే । శ్రీ కృష్ణుని స్వభావము వలెనే । ఆవరణం లేదు గనుక । వారి వ్యవహారానికి మర్యాద లేదు ।

7. శరీరం లేని వారు గనుక । భోంచెయ్యని వారు । జ్ఞాన ఖర్మాలు లేవు గనుక యెప్పుడూ వక్కతీరె । సర్వకాలం పెద్దలసహవాసం వుంటె । మహోదృఢం । యింతకంటె అధికం లేదు ॥"

8. కలదోచిన శరీరాలు యేలాగో ఆలాగే । మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదు । ఈ ఉత్త బట్టబయలు యేమి లేదు । ఇదే భావాభావ రహితోపదేశం ।

గద్యః

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే । వేదాంత విచారణే ।**
**ఉత్తరభాగే భావాభావరహిత ద్వాదశ ప్రకరణం**
**చతుర్థాధ్యాయం సమాప్తము.**





# 13. ఉత్తరాల ప్రకరణము

## ప్రథమాధ్యాయము

### (1) మొదటి జవాబు :

శ్రు॥ శ్రీమాన్ మహోదయా మూల ప్రకృతి రహితః । పరాపరప్రకృతి రహితః సత్యవాఖ్య బ్రహ్మ రహితః । జ్ఞానాజ్ఞాన రహితః । విద్యావిద్య రహితః । నిర్గుణః అద్వైత రహితః । బంధమోక్ష రహితః నమో నమః ॥

మీ వలన అహం అను నేననే చైతన్య రహితము । త్వం నీవనె చైతన్యరహితము । శ్శబ్ధ రహితః॥ పురుష రహితము । గురుశిష్య రహితం । యను రహస్యం యెరిగినందున । ధన్యుడను.

1. లక్ష్యార్థ రహితమైన । నీవు నేను లేనటువంటి కానటువంటి నిజరూపం బట్టబయలే, ఈ బట్టబయలు ఉత్పత్తి స్థితిలయాలు యెరుగదు । యేమిపుడుతుందో । యేమి లయమవుతుందో । యెవరు యెరుగుదురంటె । యిదె చిత్తు అనే యెరుక । చిత్తే మాయ అవిద్యా అని వున్నది । యెరుకే లేనిదని లెస్స తెలిసెను ।

2. చెప్పేవారు గురువులు । వినేవారు శిష్యులు । యింతకంటే వేరే లేదు । వొడిశె యేమి వ్రాతు॥ సర్వం మీ చరణాలకు నూరు దండాలుగా భావించీ । నూరు ఉత్తరాలుగా భావించేది ॥

### (2) రెండవ జవాబు :

1. శ్రీమద్గురో నమోనమః । అధ్యయన । అధ్యాపక । దానాత్రయ । కర్మ నిరతులయిన । మహాకారణ దేహరహితులయిన । వేదసారాతీతులయిన మీకు వేదసారాతీతం యేమి వ్రాతు ॥ యేమీవ్రాస్తుందో । యేమి ఆశీర్వదిస్తుందో అదే మాయ గదా !

2. విద్యా అని పేరుగలిగి । నటువంటి । చైతన్యాన్ని గూర్చి । యీ గుర్తెరిగే చైతన్యం । యేలాగు సమాధానం । అయితే ఆశీర్వచనములు । దండములు । అన్నీమాయ । మాయసమస్త భాషారూపిణి । సర్వార్థ ధాత్రి సావిత్రి । సచ్చిదానందరూపిణి । అని వున్నది । విచారించిన వారికేలేదు ।

3. శిష్యులు మహాకారణ దేహమని । పేరు గలిగినటువంటి చైతన్యరహితులు । గనుక । వున్నదని యెరుగరు । లేదని యెరుగరు । వారకి గుర్తెరుగుటే దోషం । అటువంటి దోషరహితులు । సిద్ధులు । జ్ఞానికాదు అజ్ఞానికాదు యని । నేను యెరుగుదును ।

4. చైతన్యమే యెరుక । గనుక చైతన్యం కంటే వేరేలేదు । "వేదమనగా జడం । మాయ । అవిద్య అని వున్నది" । ఆశాస్త్రాల్లోనే ప్రకృతులు । రెండు అని వున్నది । చైతన్యం పరా ప్రకృతి । జడం అపరాప్రకృతి అని వున్నది । యిది వింతగాదు ।

5. మహాకారణ దేహం శరీరత్రయం । అజ్ఞానం అనే మర్యాద । సర్వం గుర్తెరిగే । చైతన్యమే । అని వేదశాస్త్రాలకు అభిమానం । మనుష్యులు గనుక । ఆలాగే జ్ఞాన స్వరూపులు గనుక । వక్కటే కలకు మూలం ఖర్మం వేరే లేదు । గుర్తెరిగేదే అన్ని చేస్తుంది ।

6. వేదశాస్త్ర వినోదం చూచి । వెరువవద్దు । గుర్తెరిగే దాని ప్రభావాన్ని గుర్తెరుగుటే । గురు ద్రోహం । సర్వార్థ మూలం । అద్వైతం గనుక । ఒకటి లేనిది ఒకటి నిజం । తెలిపింది గనుక। యెరుకను గెలిచేది కఠినం ।

7. విద్యకంటె అవిద్యవేరు లేదు । ఉత్పత్తి, స్థితిలయాలు । యేమిటి చేతపుడుతావంటే । చైతన్యం సత్తా అని ఆ పుస్తకాల్లోనే వున్నది । అదిలేకుంటే యేమిటి సత్తా యేమి పుడుతుంది । యీ వింతయెవ్వరికీ తెలియదు ।

8. భగవానులకు తెలుసును భగవానులు । చిత్తు । అఖండం । రెండూ లేకుంటే । భగవానులు యెక్కడ । మనం యెక్కడ । మాయకంటే వేరులేదు । యిది విచారిస్తే మీకు చాలు । మళ్లా మళ్లా విచారించండి । అమ్మగారికి అయ్యగారికి వినిపించు । యెరుక । యేమీలేదు అని వుండవలె ।

9. జాగ్రత వుంటే వారు శిద్ధులు। యిదే అనేక గ్రంధాలు। అమ్మవారి వాక్కున యేమివస్తే అదే అమృతం । ఆమే అవతారం । అవహితం । గురువాక్యమందు నిష్టవుంటే యిఘయేమీ పట్టదు॥

10. కల దోచిన శరీరాలు మేలుకొంటే యేమి లేదని యెరిగిన యెరుక కూడా మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు అని తెలిసితె వడిసిపాయె ।

గద్యః

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే । ఉత్తరభాగే । ఉత్తరాల త్రయోదశ ప్రకరణం ప్రథమాధ్యాయం సమాప్తం**



# 13. ఉత్తరాల ప్రకరణము

## ద్వితీయాధ్యాయము

### 1. వైదికంలో ఎరుక స్థాన నిర్ణయం

1. మహాకారణాతీతమే తుర్యాతీతము । యీ తుర్యాతీతము బోధించే । ఆచార్యులు దొరికితే నిజం । అద్వైతం । మిధ్యాజ్ఞాన స్వరూపం గనుక । యిది గుర్తెరిగే యేరుకే । సచ్చిదానందం । అదే కన్నులయందు వున్నది । దీనికే నివారశూకం అన్నారు యిందుకు॥

**శృ॥ నీలతోయధ మధ్యస్థా । విధ్యుల్లేఖేవ భాస్వరా । నీవారశూక వత్తన్వీ పీతాభాస్వత్యణూపమా । తస్యాశ్శిఖాయా । మధ్యే పరమాత్మా వ్యవస్థితః । సబ్రహ్మా సశివః సహరిః సేంద్రః సోఽక్షరః పరమస్వరాట్ ॥**

తా॥ 1. విశిష్టాగ్ని నీలి మబ్బుల నడుమ మెరియు మెరుపు తీగవలె ప్రకాశిస్తూ, సూక్ష్మతమమైన వరిధాన్యపు మొనవంటి ప్రమాణమును కలిగి బంగారు కాంతులతో ప్రకాశించుచున్నది.

2. అణు ప్రమాణంతో వెలుగొందుతున్న ఆ సూక్ష్మాగ్ని యొక్క అగ్రభాగపు నట్టనడుమన పరమాత్ముడు వ్యవస్థితుడై యున్నాడు, అతడే సృష్టికర్త బ్రహ్మగాను, స్థితికారకమైన విష్ణువు గాను, లయ కారకుడైన శివుడుగాను, జగత్పాలకుడైన ఇంద్రుడుగాను, నాశము లేనటువంటి శాశ్వితుడు, స్వయం ప్రకాశకుడు, సచ్చిదానందుడు యని వేదం చెప్పుకొన్నది.

3. గుర్తెరిగే యెరుక సచ్చిదానందం । అదే కన్నులయందు వున్నది । చూచేది సచ్చిదానందం । గనుక । నేను యెరుగుదును అని అనుభవం వున్నాది ।

4. నేనే సచ్చిదానందం । యీ సచ్చిదానందమే పరదేవత అనే అమ్మవారు సర్వాన్ని గుర్తెరిగే అమ్మవారు । గనుక । ॥లలితా॥ సప్తకోటిమహామంత్ర స్వరూపాసాక్షిణీ । అని వున్నాది।

5. గుర్తెరిగే సచ్చిదానందస్వరూపులే । అందరూ । యీ సచ్చిదానందమనే యెరుకే అన్ని కులాలు అయింది । యెరుకతోటే । అందరూ నేను ఫలానివాణ్ణి నేను ఫలానివాణ్ణి అని అంటారు।

## 2. ఈ గుర్తెరిగే తాను లేదని తెలిసితే అంతా పరిపూర్ణమే

6. అందరూ యెరుక స్వరూపులే । గనుక యీ గుర్తెరిగే సచ్చిదానందం వుండెనా అందరూ నిబద్ధే । యీ గుర్తెరిగే । సచ్చిదానందం లేకపాయెనా అందరూ లేరు ।

7. ఆ పరిపూర్ణమే దేహి దేహాకారం గాకవున్నది । గనుక । విరోధం లేదు । వికారంలేదు । గుణాలు లేవు। యింతకంటే యెక్కువ లేదు ।

8. యీ శరీరం పుట్టకమునుపే । తనకు తానే స్వతస్సిద్ధమై వున్నది । అచలం । యెన్నటికీ చెలించదు । దేహాకారం గాక వున్నాది గనుక । యెరుకలేదు । మరుపులేదు । వున్నది వున్నట్టే వున్నది । సర్వకాలం వొక్కతీరే । వున్నది వున్నట్టు తెలపే గురువు కలతలేని గురువుకావలెను ॥

## 3. మత నిర్ణయంలో కొందరు గురువులు

1. గురువు యెరుక స్వరూపం అయివుండెనా । అరుంధతి తండ్రి సాంప్రదాయం వారే । వసిష్ఠాదులవలె । ఋషీశ్వరులు కర్మయోగులు । కొందరు శుకుల వంటి విరక్తులు । కొందరు జ్ఞానులు మునీశ్వరులే । జ్ఞానకర్మరహితమైన శుద్ధమార్గం వారుకారు । వశిష్ఠాదులే బ్రహ్మకు మూలము । వారి సాంప్రదాయం వారికే యెరుక ।

2. శాస్త్రం లేక నడిచేవారే బౌద్ధులు । నులకచంద్రయ్య । చెన్నయ్యగారే శైవులు । అప్పయ్య దీక్షితులవారు వారిభక్తుడు । వారిది బసవన్నగారి కులమే । గనుక । రామానుజాచార్యులవారది బసవన్నగారి కులమే ।

3. మారుసూరి నంబిగారి శిష్యుడు । తిరుప్పణ్యాళ్వారు గారి భక్తుడు । మాలవారైనాగాని । మహాపెద్దలు

4. మతంగ మహాముని అరుంధతి కులము వాడే । వసిష్ఠాదులతో । సమానం ।

5. శ్యామలాతండ్రి శక్తి గనుక । కొందరు ఋషులు ఆ సాంప్రదాయం వారే । వారు శాక్తేయ మతం వారు । శక్తివున్నదని అనుకోనేవారు

6. కొందరు చార్వాకులు సూర్యుడే దేవుడని నమ్మివున్నారు। "యీషణ్మతాలవారు । కులంచెడ్డ పతీతులే । యీషణ్మతాలవారే వర్ణసంకరులు ।

7. బ్రాహ్మడు సత్యమైతే । క్షత్రియుని యొక్క అన్నం యేలాగుతినే ।

**శృతి॥ "ఆర్యాధిష్ఠితావా శూద్రా"** అని వుండె ।

8. శాస్త్రంచేతనే కులంచెడేది । శాస్త్రం చేత గుర్తెరిగే జ్ఞానమే చైతన్యం అని తెలిసేది, చైతన్యమే క్షేత్రజ్ఞుడు । వాడే సచ్చిదానందస్వరూపమైన ఆత్మ, వాడే పురుషుడు । వాడే ఈశ్వరుడు । వాడే సర్వాన్ని గుర్తెరిగే వాడు గనుక సర్వజ్ఞుడు । వాడే కించిత్‌జ్ఞత్వం అయ్యి ఉన్నాడు.

9. కర్మ ప్రతిపాదక శాస్త్రానికి బదులు । జ్ఞాన ప్రతిపాదక శాస్త్రం । జ్ఞానం వలన కర్మం పుడుతుంది । కర్మద్వారా జ్ఞానోదయం అనేవారి వెఱ్ఱి యేమని చెప్పవచ్చును ।

10. జ్ఞానమే కర్మం చెయ్యమని బోధించే వేదశాస్త్రాలు । గురువులు రెండూవెఱ్ఱి । గుర్తెరుగుటంచేత కర్మం పుడుతుంది । గుర్తెరిగే జ్ఞానమే సర్వార్థములు ।

11. నేను నేను అని ప్రవర్తించేది స్వతస్సిద్ధమైన జ్ఞప్తి । అదే బ్రహ్మస్వరూపం । అదే ఆత్మ । అదే జీవుడు । అదే ఈశ్వరుడు । గుర్తెరిగే జ్ఞానానికే సకల ఉపదేశాలు చెప్పేది జ్ఞానం ।

చూచేది జ్ఞానం । వినేది జ్ఞానం । అది యెవరు । యెరుగుదురో । వారు యేమిచేస్తారు । యేమివిడుస్తారు । జ్ఞానమే లోపట బైటవున్నదని చెప్పడం ఆత్మజ్ఞానుల యొక్క మర్యాద.

12. అట్టి జ్ఞానం మిధ్య అని తెలిస్తేదేనిలోపట దేనిబైట । అంతరబాహ్యాలు అంతా కల్పితం । బట్టబయలు దేహములోచొచ్చిందా వెళ్ళిపోతుందా । అన్నితిప్పలు । యీ గుర్తెరిగే మాయకే । దాని మహిమ యేమని చెప్పవచ్చును । వున్నదంటే వున్నది । చూస్తే యేమి లేదు ।

13. గురూపదేశానంతరం గుర్తెరిగే యెరుక లేనే లేదు । మహావాక్యోపదేశం । యెవరికి చెయ్యవలెను అంటే । అది జ్ఞానప్రతిపాదకమే గనుక । జీవేశ్వర ప్రతిపాదకం । గనుక బ్రహ్మమే ఆయెను । తదాతీతమైనది నిజం । అదే బట్టబయలు ఈ బయలుకు ఐక్యం పొసగదు.

14. యెరుకలేదని ఘట్టిగా యెవరికి కలదో వారు శిద్ధపురుషులు । వారేవారు । జ్ఞానులుకారు । అజ్ఞానులు కారు యిదే ఉపదేశం ।

15. అద్వైతం మిథ్య । జ్ఞానస్వరూపము గనుక । అమృతవాక్యం । నమ్మినవారికి కద్దు । సంశయం లేదు ॥

## 4. యెరుక స్థాన, స్వభావ, స్వరూప నామాలు

1. కన్నుల యందువున్నది యెరుక। అది మాయవ్యాపించి దానికి సమస్త నిర్ణయాలతో చెప్పబడ్డది। దానికే। జ్ఞానమని అన్నా। చైతన్యమని అన్నా। జ్ఞాప్తి అని అన్నా। క్షేత్రజ్ఞుడు అని అన్నా। ఆవిద్య అని అన్నా। ఈశ్వరుడు అని అన్నా। మాయ అని అన్నా। జీవుడు అని అన్నా। ఆత్మ అని అన్నా।

2. ప్రకృతి అని అన్నా పరబ్రహ్మమని అన్నా। సచ్చిదానందమని అన్నా। స్వరూపమని అన్నా। మహాలింగమని అన్నా। ఆదినారాయణుడు అని అన్నా। హాంకారమని అన్నా। జ్ఞానమయమని అన్నా। యిటువంటి మాయకే పర్యాయనామాలు ॥

## 5. జ్ఞాన బీజ లక్షణము దాని నిరసన

1. జ్ఞానబీజమందు। పెద్దలు। పిన్నలు। యోగులు। భోగులు। జ్ఞానులు। కర్ములు। మౌనులు। ఋషులు। దొరలు। దొంగలు। అనేకమైన కుల మతాలు।

2. రాజులు। భృత్యులు। దిగంబరులు। సన్యాసులు। వ్యాసాది మహామునులు। దశావతారాలు। బ్రహ్మ విష్ణు మహేశ్వరులు। ముప్పైమూడు కోట్ల దేవతలు। బ్రాహ్మణులు। మాదుగులు। అష్టాదశవర్ణాలు। సంధ్యావందనాలు। నిత్య నైమిత్తికాలు। కర్మాలు। ప్రతి విద్యాదికజడాలు। కించిజ్ఞత్వాలు। సర్వజ్ఞత్వం।

3. జనన మరణాలు। సుఖదుఃఖాలు। ద్వైతాద్వైతాలు। భేదాభేదాలు। కర్మాకర్మాలు। జ్ఞానాజ్ఞానాలు। నానా మతాలు। నానా వర్ణాలు। నానా నిర్ణయాలు।

4. భక్తమహేశ్వరులు। నిమిత్తమైనధాసత్వాలు। గురువులు। శిష్యులు। మహాత్ములు। చిత్రవిచిత్రమైన స్వరూపాలు।

5. పాపపుణ్యాలు। బంధమోక్షాలు। సకలసంశయాలు। సకల నిశ్చయాలు। గుర్తెరిగే జ్ఞానబీజమందు అంతా చెప్పబడ్డది। ఈ జ్ఞాన భీజ నిర్మూలనమే, మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదని తెలిసితే చాలు। గుర్తెరిగే జ్ఞానం లేదు గనుక అంతా అబద్ధం।

## 6. బీజ నిరసన లక్షణం

1. యిందులోపల చెప్పబడ్డది। ఒకటి వుంటె ఒకటి లేకపోదు। అట్లుగనుక।"అనేక గురుభక్తి గురునిష్ఠ ఫలప్రాప్తి చేతను। యెరుక లేదని తెలిస్తే వడిశె।

2. యీ బీజం। నిరసనం చేసే గురువు తావుకు పోతే। అన్నిటికి మూలం అయింది

యేదో దాన్ని లేకుండా చేస్తాడు ।

3. చేసినంతలోనె । యీ చంచలమనేది । నాశనమైతే । యెక్కడ చూచినా అచలమే వుండును.

4. యిది యేమి అని । అడుగుదామంటె । అడిగేటందుకు తానులేడు । చెప్పేటందుకు గురువులేడు । అచలం మాత్రం వుండె ।

5. దానికి రాకడలేదు పోకడలేదు । దానికి మొదలులేదు కొనాలేదు । దానికి పుట్టుకలేదు చావులేదు । దానికి జ్ఞానంలేదు కర్మంలేదు । దానికి పుణ్యంలేదు పాపంలేదు ।

6. దానికి జన్మంలేదు మరణంలేదు । దానికి సుఖంలేదు దుఃఖంలేదు । దానికి బంధంలేదు మోక్షంలేదు । దానికి కించిజ్ఞత్వం లేదు సర్వజ్ఞత్వంలేదు । దానికి నిశ్చయంలేదు సంశయంలేదు అందుకే గుర్తెరిగే । జ్ఞానంలేదు గనుక జ్ఞానమనే భీజ నిరసనమాయెను।

7. అన్ని నిబంధనలు । యీ గుర్తెరిగే దానికే । సకల నిబంధనలకు మూలమైన । గుర్తెరిగే శరీరము యేమిలేకుండా తెలిసెనా । పుట్టని చావని అచలమే స్వతసిద్ధమై వున్నది ॥

గద్యః

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।
ఉత్తరభాగే । వుత్తరాల త్రయోదశ ప్రకరణం
ద్వితీయోధ్యాయం సమాప్తం



# 13. ఉత్తరాల ప్రకరణము

## తృతీయాధ్యాయము

### 1. యెరుకయే అన్నింటికి ధొర గాని, యెరుకకు ధొర యెవ్వడు లేడు

॥శి॥ యీ కలలోనే । ఒక్కమనిషి వచ్చే । వస్తూనే ఓ గురుస్వామి నాకు యెనిమిది దృష్టాంతరాలతో । సూచన చెయ్యండి అనె । అంటె ।

॥గు॥ శభాసు అని । సరేకాని నీవు యేమీ అని అడిగే । అడిగితే ।

॥శి॥ నేను । మూలంలేని యీ గుర్తెరిగే శరీరంను అనేను ।

॥గు॥ యీ శరీరానికి । యెవ్వడైనా ధొర వున్నాడా।

॥శి॥ 1. నేను దొరను యెరుగ దొరసాన్ని యెరుగ । నాకు మొదలుయేమీ లేదని । నీకు యెరుకే । నాతో కూడా వచ్చినవారే అతి ప్రీతిచేత । పడి వుండి । తనవంటి ఆడదాన్ని । తగిలి । కొడుకులా బిడ్డలా । కంటూ వున్నవారం ।

2. మాకు సుఖదుఃఖం పుట్టదు మేము రెండు । మార్గాలుగా వున్నాము స్వతఃసిద్ధమైమాకు మేమే వస్తాము । వొఘవేళ కడుపులో వుండి । వెళ్ళివస్తాము । మాకు అనంతమైన ప్రకారాలు ఉన్నావి । అన్ని నిర్మాణాలు । చేశినాము ।

3. మాకంటె అన్యం । పుట్టనిచావనిది । దానికి । మొదలు లేదు । కొన లేదు, దానికి రాకడాలేదు । పోకడాలేదు । సర్వకాలం వొక్కతీరే । ఉండె ।

4. శరీరం యెన్నటికీ లేదు । క్రియాశూన్యమైంది । సకల దేశాలయందు । సర్వకాలాలయందు । సమస్తమైన వస్తువులయందు । చలించక తనకు తానే । స్వతః సిద్ధమైవున్నది ।

5. దానికి వక్కటైనా పేరులేదు । దానికి అదేకాని । రెండోది బదులులేదు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి । మర్యాదలేదు । యిన్నాళ్ళు వునికీ అని । తన సమాధానమే కాని । రెండోదాన్ని చూచి । భయపడదు ।

॥గు॥ రెండోది అంటే । ఏమిటి ?

॥శి॥ 1. పుట్టని చావనిది । అదే అంటే । నేను వుండేది । దానియందు పుట్టనిది । మాతో సంభాషణ చేయదు । మేముదాన్ని । పుష్టిపెట్టి । వ్యవహారం చేయము ।

2. మాకు అది మూలంకాదు గదా । మళ్ళా ప్రవేశించేటందుకు । స్థానం కాదుగదా । మా సుఖమేమో. మా దుఃఖమేమో వున్నంతశేపూ వుండవలె లేకుంటే యేమీలేము ।

3. దానికి మాకు సంబంధం వుంటే । అదీయిదీ వొక్కటే అవును । యిదిమధ్యవచ్చి । మధ్యనే యేమీలేదు । అది సర్వకాలం వొక్కతీరే । యిది యెప్పుడు విచారిస్తే అప్పుడే యేమీలేదు । అది విచారించినా విచారించకున్నా । సర్వకాలం । చెలించక । తనకు తానే స్వతశిద్ధమై వున్నది.

॥గు॥ 1. స్వతశిద్ధమైవున్నది గనుకనే । సాధనచేత సాధ్యంకాదు। అదీనేను వొక్కటే అంటే । యెవ్వరునమ్మరు । వక్కటీసరిపోదు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చంచలం । బయలు అలాంటిది గాదు । అది క్రియాసూన్యమైంది ।

2. సకల క్రియలకూ । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే మూలం ।

3. పుట్టని చావని దానియందే వున్నాను అంటివి । అందరూ అనంగా । అన్నావా । నీకు దృఢమా।

॥శి॥ అధిష్టానమని అనుకోంగా విన్నాను.

॥గు॥ అధిష్టానము వుంటే । నీకు మూలం వుండనేవుండే । మళ్ళా ప్రవేశించేటందుకు స్థానం అది కాదాయేమీ । అది ఉండగ నీకేమి భయం ।

॥శి॥ అది యేమీ । ఛీ । ఛీ । అది యేమీలేదు ।

॥గు॥ 1. నాకు మూలం వున్నదనీ అధిష్టానము ఉన్నదనీ । అంటే తలలు కొట్టించే । కొనకు ప్రవేశించేటందుకు స్థానం వున్నది అని అంటే । మెడలకువుర్లు బోయించ్చే।

2. ఛీ । ఛీ । అటువంటి అధికమైన అబద్ధాలు వెనక యెందరు కూసినా యేమీ యెదురుగా నిలబడి అనుమను । యెవ్వడు అంటే వాడే । పుట్టేవాడు । కొనకు యేమీ లేక పొయ్యేవాడు ।

3. పుట్టనిచావనిది । సంభాషణ చేస్తుందీ అని । చచ్చిన శవాల । తినేవాండ్లు । అయినా అనరు । తలలు గొరిగేవాండ్లు అయినా అనరు ।

5. బట్టలు వుతికే వాండ్లు అయినా అనరు ।

6. పుట్టని చావని దానికి వక్కటైన అలాంటి వికారంలేదు । సర్వకాలం వొక్కతీరే ।

॥శి॥ నేను దానియందే వున్నా । గాని । నాకు అధిష్టానం మర్యాదాలేదు ।

॥గు॥ యిఘయేమీ ।

॥శి॥ దానికీ నాకు యాషత్తు అయినా । సంబంధం లేకవున్నాము ।

॥గు॥ యిది సరే । యిదీ అందరకీ । సమాధానమే ।

॥శి॥ శీఘ్రంగా నాకు సూచనచెయ్యి ।

॥గు॥ లెస్సవిను । నీకు మొదలూ యేమీలేదని । నీవు యెరుగుదువు గదా । కొనకు యేమీలేదని యెరుగుదువుగదా ।

॥శి॥ ఘట్టిగా యెరుగుదును ।

## 2. గురు సూచన

॥గు॥ 1. నేను యిటువంటిది అని । నీకు సూచన చేస్తానో । నీవు అటువంటి దానిలోనే । కూర్చున్నావు । దాన్ని వుండచూడు । ఉన్న బట్టబయలును ఉండజూచిన యెరుక చేతనే యెరిగే యెరుక లేదని తెలిసితె యెరుక పనివడిశె ।

2. పుట్టనిచావనిది । మొదలు కొనాలేనిది । రాకడాపోకడా । లేనిది । సకల దేశాలయందు । సర్వకాలాల యందు సమస్తమైన వస్తువులయందు । చెలించక । సర్వకాలం । వొక్కతీరుగా వున్నది । తనకుతానే స్వతఃసిద్ధమై బట్టబయలే ఉన్నది ।

॥శి॥ సరే । సరే । యిటువంటి చెలించని దానియందే । నేనువున్న । యిందుకు అనుమానం లేదు । నాకు సుఖమైనా । దుఃఖమైనా । వుంటుంది । నేను దానికంటే । వేరే వున్నట్టూ వున్న । యిదియేమీలేక । పోయేటట్లు దృష్టాంతం చేయండి.

## 3. యెనిమిది ఉపమానములు

॥గు॥ ఆలాగే సూచన చేస్తాగానీ । యెనిమిది ఉపమానాలు చెప్పుమంటివి ।

యెనిమిది యేలాగు అంటే । ఏది ప్రత్యక్షంగా ఉన్నదో అదే పుట్టని చావని బట్టబయలు.

1. పుట్టని చావనిది వున్నాదో లేదో ।
2. రాకడపోకడ లేనిది । వున్నాదోలేదో ।
3. శరీరంలేనిది వున్నాదో లేదో ।
4. భోంచెయ్యనది వున్నాదో లేదో
5. సకలదేశాలయందు । వున్నాదో లేదో ।

6. సమస్తమైన వస్తువులయందు వున్నాదో లేదో ।

7. సర్వకాలం వొక్కతీరుగా । చెలించక । వున్నాదో లేదో ।

8. తనకు తానే స్వతఃసిద్ధమై ఉన్నదో లేదో ।

అని అనుమానం లేదుగదా ।

॥శి॥ అనుమానంలేదు గాని । మూలంలేనిది గనుక । యీ గుర్తెరిగే శరీరం అందరికీ కొనకు యేమీ లేనట్టు । మాకు ఆలాగు అయ్యేనని భయం ।

॥గు॥ నీకు యేలాగు కావలే ।

॥శి॥ గురువాక్యం యెప్పుడు వింటే । అప్పుడే ఉన్నదే వుండవలె । లేనిదియేమీలేక పోవలెను।

## మొదటి ఉపమానం

॥గు॥ మంచిది । ఆలాగే । పుట్టని చావనిది । సూర్యుడు వున్నాడో లేదో అని అనుమానం లేనట్టు వున్నది ।

॥శి॥ అదియేమీ సాయంకాలానికీ యేమీ లేదు । యిది అచలం అలాంటిది కాదు, బట్టబయలుకు ఆలాంటి గుణం యెప్పుడు లేదు,

## రెండవ ఉపమానం

॥గు॥ చంద్రుడు వున్నాడోలేడో అని । అనుమానంలేనట్టు । రాకడపోకడ లేనిది వున్నది ।

॥శి॥ అదియేమీ । తెల్లవారితే యేమీలేదు । సర్వకాలం వొక్కతీరే ఉండేది బట్టబయలు.

## మూడవ ఉపమానం

॥గు॥ భూమి ప్రత్యక్షంగా ఉన్నట్టు మొదలు కొనలేనిది ఉన్నది,

॥శి॥ ఈ భూమికి మొదలు కొన ఉన్నది, తనకు తానే స్వతఃసిద్ధమై వున్నదానికి మొదలు యెవ్వరూ చూడలేదు, కొన యెవ్వరూ చూడలేదు. గనుక బట్టబయలు స్వతః సిద్ధం, దానికి కొనలేదు, మొదలు లేదు.

## నాల్గవ ఉపమానం

॥గు॥ పుట్టని చావనిది । నిప్పు ప్రత్యక్షంగా వున్నట్టు వున్నది ।

॥శి॥ అలాగే వున్నది గాని । కట్టే లేకున్నా । పిడక లేకున్నా । నిప్పు యేమీలేదు । పుట్టని చావని బట్టబయలుకు । రెండోది యేమీలేదు । అది ఒకదాని మీద ఆధారపడి లేదు,

## ఐదవ ఉపమానం

॥గు॥ పుట్టని చావనిది । శరీరం ప్రత్యేక్షంగా వున్నట్టు వున్నది ।

॥శి॥ శరీరం వున్నప్పుడూ వుండదని కాదు । శరీరం లేకుంటే లేకపోదు అని కాదు । సర్వకాలం శరీరం లేకనె, బట్టబయలు ఉన్నది, యేమీలేనిది మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే యేమిలేదు.

## ఆరవ ఉపమానం

॥గు॥ పుట్టని చావనిది । సర్వకాలం । ముందర పెద్దఘట్టూ వున్నట్టు వున్నది ।

॥శి॥ ఘట్టూయెక్కడ వుంటే అక్కడనే వున్నది । పుట్టని చావనిది బట్టబయలు । సకల దేశాలయందు వున్నది ।

## ఏడవ ఉపమానం

॥గు॥ యీ పుట్టని చావనిదే । పెద్దచెట్టూ వున్నట్టు వున్నది ।

॥శి॥ చెట్టువంటిదికాదు । పుట్టని చావనిది గొడ్డండ్లచే ఛేదింపబడదు । నిప్పు చేత కాలనిది నీళ్ళ చేత తడువనిది । ఎండచేత యెండిపోనిది । గాలిచేత ఆరిపోనిది । ఒక్క బట్టబయలే ।

శ్లో॥ నైనం ఛిన్దన్తి శస్త్రాణి । నైనం దహతి పావకః
నచైనం క్లేదయన్త్యాపో । న శోషయతి మారుతః॥ (గీ॥ 2-23)

తా॥ యీ కేవలాత్మను ఆయుధములు నరుకజాలవు. అగ్ని దహింప జాలదు, నీళ్ళు తడుపజాలవు, వాయువు యెండింపజాలదు.

శ్లో॥ అచ్ఛేద్యోఽయ మదాహ్యోఽయ। మక్లేద్యోఽశోష్యఏవచ।
నిత్యః స్సర్వః గతః స్థాణుః । అచలోయం సనాతనః॥ (గీ॥ 2-24)

తా॥ ఈ కేవలాత్మ ఛేదింపనలవి గానిది, దహింపనలవి గానిది, తడుపనలవి గానిది, యెండింప నలవిగానిది, నాశములేనిది, అంతటను వ్యాపించి యుండునది, స్థిరరూపమగునది, చలించనిది, అనాదియైనది. ఆది అంత్యములు లేనిది

శ్లో॥ య ఏనం వేత్తి హన్తారం । యశ్చైనం మన్యతే హతమ్ ।
ఉభౌ తౌ న విజానీతో । నాయం హన్తి న హన్యతే॥ (గీ॥ 2-19)

తా॥ 1. యెవడీ కేవలాత్మను వధించుదానిగా దలంచుచున్నాడో, ఎవడు ఈ కేవలాత్మను వధింపబడుదానిగా దెలియుచున్నాడో, వారిద్దరును దెలియని వారే అగుదురు.

2. ఎందువల్లననగా నీ కేవలాత్మ వధించునదియును గాదు, వధింపబడునదియును గాదు, కర్తృత్వ కర్మత్వములు రెండును కేవలాత్మకు లేవు.

## యెనిమిదవ ఉపమానం

**గురు॥** ప్రత్యక్షంగా । స్త్రీ ముందర వున్నట్టూ । పుట్టని చావనిదీ । కండ్ల ముందర వున్నది ।

**శిష్యు॥** స్త్రీ వంటిదికాదు అచలం । అపవిత్ర వస్తువు కాదు । మూత్రపురీషాలకంటే । నీచం కాదు.

**గురు॥** మగవాడు ముందరవున్నట్టూ ఉన్నది ।

**శి॥** మగవాడు అని, స్త్రీయని లింగ బేధం లేక ఉన్నది

**గు॥** 1. అది పుట్టనిచావనిది । రాకడపోకడలేనిది । సకలదేశాలయందు । సర్వకాలాలయందు । సమస్తమైన వస్తువుల యందు । చెలించక తనకుతానే ।స్వతఃసిద్ధమై వున్నది ।

2. దానికి పేరు లేదు । ఆకారంలేదు । శరీరం కొట్టుబడ్డా ఆపుట్టని చావనిది బట్టబయలు కొట్టుబడదు।

**శ్లో॥** **నజాయతే మ్రియతే వా కదాచిధ్ । న్నాయం భూత్వా భవితా వా నభూయః**
**అజో నిత్యశ్శాశ్వతో ఽ యం పురాణో । నహన్యతే హన్యమానే శరీరే॥ (2-20)**

తా॥ 1. ఈ కేవలాత్మ ఒకప్పుడు పుట్టదు, ఒకప్పుడు చావదు, ఒకప్పుడుండి మరల మరియొకప్పుడు ఉండనిదియు గాదు -

2. మునుపు లేక వెనుక వచ్చినదియును గాదు - ఎందువల్లననగా నిది పుట్టుకలేనిది, మరణము లేనిది,

3. ఎల్లప్పుడు ఉండునది, అనాదియైనది, శరీరములు హతమైనను ఈ కేవలాత్మ హతము కాదు.

**శిష్యు॥** యదార్ధంగా వున్నది । నాకుచాలు । కొనకూ వాక్యం దయ చెయ్యండి।

**గురు॥** 1. కలలో యెనుగ మేలుకొంటే । సింహ్మం యేలాగో అలాగే । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు ।

2. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేకుంటే । యేలాగు వున్నదో ఆలాగే । సర్వకాలం అదే । పరిపూర్ణం । గనుక । యిది భ్రాంతిలేని రాజమార్గం ।

3. కల శరీరం మేలుకొంటె యెలాగో అలాగె మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేకుంటే యేమీలేని అచలం। స్వతఃసిద్ధం యేలాగు వున్నదో। అలాగే వున్నది।

4. అందుకు ప్రయత్నం। యీషత్తు లేదు। సకల ప్రయత్నములకు మూలం యీ గుర్తెరిగేదే గనుక। దీన్ని శూన్యమయ్యే యుక్తి గురుకటాక్షం వల్ల సంపాదించి విచారిస్తే। పరిపూర్ణం తనకు తానే। స్వతఃసిద్ధమై వున్నది। యిదియే భ్రాంతిలేని రాజ మార్గం॥

గద్యః

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే।
ఉత్తరభాగే ఉత్తరాల త్రయోదశ ప్రకరణం
తృతీయాధ్యాయము సమాప్తము.



# 14. సంకల్ప నివృత్తి ప్రకరణము

## ప్రథమోధ్యాయం

### 1. శిష్యుని యొక్క ప్రశ్న

1. యీలోకమందు వొకానొక అధికారి । సర్వకర్మ నిర్మితము అనిత్యమని యెరిగి । యీజరామరణ రూపమైన । సంకల్ప సంసారంనుంచి । భయపడ్డ వాడై

2. నిత్యా నిత్య వస్తు వివేకమున్ను । యీహామూత్రార్థ ఫలభోగ విరాగమున్ను । శమాది షట్కసంపత్తిన్నీ । ముముక్షత్వమున్ను । యీ నాల్గు సాధనలతోకూడుకొన్నవాడై ।

3. కానుకలు చేత । పట్టుకున్నవాడై । వేదవేదాంత శాస్త్రజ్ఞుండై అనుభవనిష్టుడై । వుపశాంతికి సిద్ధి అయిన । సద్గురువునకు । శరణు పొంది ।

4. సాష్టాంగద్వాదశ నమస్కారములు చేశి । అడుగుచూ వున్నాడు । స్వామీ ఈ సకలమైన ప్రపంచం ఏలాగున కలిగినది ఇట్టి సంకల్ప కర్త యెవరు ?

### 2. గురువు యొక్క సమాధానం

గు॥ 1. శిష్యా । ఈ గుర్తెరిగే యెరుకనే సంకల్పకర్త, యీ సంసారం దాని వల్లనే వచ్చింది, యీ యెరుక యొక్క సంకల్పమే బంధమోక్షములు అయింది ।

2. యిదే యింద్రాదిదేవతులున్ను । త్రిమూర్తులున్ను । అష్టాంగ యోగంబులున్ను । అష్టసిద్ధులున్ను । అష్టైశ్వర్యములున్ను । యెరుక యొక్క సంకల్పము వల్లనే కలిగినవి।

3. యీ సంకల్పమే మూలబీజము । యిదే మూలమాయ । యిదే । యీ గుర్తెరిగే శరీరము నానామతాలు । నానా అవతారాలు యెత్తి । తనకు తానే వుండి । తనకు తానే యేమీలేకపోతుంది ।

4. యీ సంకల్పమే యిచ్ఛ ॥శృ॥ యిచ్ఛా మాత్రప్రభో సృష్టి ॥ అని వున్నది గనుక । యీ యిచ్ఛకు మూలంలేదు । తల్లీతండ్రీ । భార్యాబిడ్డలు । సర్వమూ యీ సంకల్పము వల్లనే పుట్టిరి

శి॥ స్వామీ తమరు బోధించినది చాలానయంగా వున్నది । చాలా బాధనివృత్తి అయినది । గాని । యీ సంకల్పమే బంధమో । మోక్షమో మొదలైనవి అన్నీ అయింది అంటిరి । యిందుకు శాస్త్రం దృష్టాంతం చెప్పి సంశయం తీర్చండి స్వామి !

గు॥ అది యెంత । విను నిరాలంబ ఉపనిషత్తు ఇలాగున చెప్పినది.

## నిరాలంబోపనిషత్తు

శృ॥1. అనాద్యా । విద్యా । వాసనాయ । జాతోహతిమి సంకల్పోబంధః॥
అనాదియగు అజ్ఞానము యొక్క వాసనచే నేను జన్మించినవాడను అను సంకల్పము కలిగి యుండుటే బంధము.

2. పితృమాతృసహోదర । దారాపత్యగృహా రామక్షేత్రాది । మమతా । సంసారావరణ। సంకల్పోబంధః
తల్లి దండ్రులు, సోధరులు, భార్యబిడ్డలు, గృహము, ఉద్యానవనము, పొలము మొదలైన వాటియందు మమకారము కలిగి యుండుటయే సంసార బంధము.

3. కర్తృత్వాధ్య అహంకార సంకల్పోబంధః
కర్తృత్వాది అహంకారము ఎవని గూర్చి సంకల్పము కలిగెనో అదియే బంధము.

4. అణిమాద్యష్టైశ్వర్య, ఆశా, సిద్ధసంకల్పోబంధః ।
అణిమాది అష్టసిద్ధుల యందలి సంకల్పమే బంధము.

5. దేవమనుష్యాది వుపాసనా । కామ సంకల్పోబంధః ।
దేవతలను ఉపాసించుట మంచిదని సంకల్పించుటయే బంధము.

6. యమాది । అష్టాంగ యోగాభ్యాసాది । సంకల్పోబంధః ।
అష్టాంగ యోగాభ్యాసములు చేయుదమనిన సంకల్పమే బంధము.

7. వర్ణాశ్రమ । ధర్మకర్మ సంకల్పోబంధః । అజ్ఞాభయ సంశయాత్మ గుణసంకల్పోబంధ।
వర్ణాశ్రమాలు ధర్మము, కర్మము, ఆజ్ఞ, భయము, సంశయము అను వాని ఆత్మ గుణములని సంకల్పించుట బంధము.

8. యజ్ఞవ్రత తపోదాన । విధివిధాన జ్ఞాన । సంకల్పోబంధః ।
యజ్ఞము, వ్రతము, తపస్సు, ధానములు మున్నగు విధి విధానములు చేయవలెననే సంకల్పించుట బంధము.

9. కేవలమోక్షాపేక్ష సంకల్పోబంధః ।
మోక్షము పొందవలెనని సంకల్పించుట కూడ బంధమే.

10. సంకల్పమాత్ర, సంభవో బంధః ।
తాను సంకల్ప మాత్రమున సంభవించునదంతయు బంధమే యగును.

అని వున్నది గనుక । యీ సంకల్పరూపమైన । క్షేత్ర క్షేత్రజ్ఞులను । ఆచార్య కటాక్షం చేత

। సమూలంగా విచారించి । సంకల్పక్షయమౌటయే విచారానికి ఫలం॥

శి॥ స్వామీ నాకు చాలు । కాని । యీ ప్రపంచోత్పత్తి । యేలాగో అని సంశయం వుండే।

గు॥ మునుపే చెప్పితినే॥ అట్లైతే విను

## 3. జ్ఞానానికే ప్రపంచోత్పత్తి తోచింది.

1. యీ సంకల్పమే కారణకార్యరూపమైనది । యీ ప్రపంచం మూడింటివలన । అయినది ।యని చెప్పుచూనె యున్నారు. **మన్ను । కుమ్మరి । కుమ్మరిచక్రము** । యీ మూడు కూడి । యేరీతిగా కుండ అయినదో ।

   కుమ్మరి నిమిత్త కారణం, మట్టి ఉపాధాన కారణం, చక్రం-సాధన కారణం, ఈ మూటితో తయారు చేయబడి కుండలు కార్యరూపం । ఆయెనని నిమిత్తోపధానములు చెప్పిరి గదా!

2. అలాగే । యిక్కడ సంకల్పము కారణము । అందువల్లనే చేయబడిన వ్యవహారములు కార్యములు । యీ రెంటి యొక్క సహాయము నుంచియే । సమస్త బ్రహ్మాండములు సృష్టి అయినది అన్నారు.

3. అయితే నిర్వికారము । నిర్గుణమునగు బట్టబయలు । కారణము కాదు । కార్యము కాదూ.

4. యీ సర్వమూ । సముద్ర జలమందు అలలు వచ్చి కనపడి దానియందే లయమాయెనని అన్నారు ।

5. నూలే వస్త్రముగాను । దోచినట్లు । యీ మాయా ప్రపంచము క్రిమికీటక । వృక్షలతాదులు । యావత్తూ । నీ సంకల్ప । జ్ఞానబీజమందు । దోచుచున్నదే గాని । మరేమి లేదు ।

6. దీనిని విచారిస్తే యెండమావులయందు । జలమువలె దోచును । గాని నీరు లేదు గదా ! అలాగే ప్రపంచం లేదు, ప్రపంచానికి కారణమైన పరమాత్మ లేడు, గనుక మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదు । గుర్తెరిగే జ్ఞానం ఉంటే దోచుట సహజమే ।

శి॥ యిది దృఢమయ్యేటట్టు । వున్నది వున్నట్టుగా సూచన । చేసి । నన్ను యేలాగైనా యీచిక్కునుంచి । తేల్చండి

గు॥ 1. అట్లైతివిను । సకలదేశాల యందు। సర్వకాలాలయందు । సమస్తమైన వస్తువుల యందు మొదలూకొనాలేక సంకల్ప రహితమై । ఆదిమధ్యాంతరహితమై । యీ జగత్తు వున్నదో లేదో । యెరుగనిది । వున్నది । అదియే బట్టబయలు ।

2. బట్టబయలునకు ఉత్పత్తి లేదు । స్థితి లేదు । లయం లేదు । అటువంటిదానియందే । నీవు యెండమావుల వలె వున్నావు । దీనికే గురువాక్యం మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు యని నిశ్చయమైతే చాలు. ।

## 4. స్వప్న దృష్టాంతము

శి॥ సరే అటువంటి దానియందే । నేనువున్నా । అయితే నామూలం యేలాగుచెప్పండి।

గు॥ అట్లైతే విను । యిప్పుడు నేను సూచన చేశిన బట్టబయలు । నీకు మూలం కాదు గదా । యింక నీ వర్తమానం । కూడా విను ।

1. కలలో భూమండలం చూచినాము । అనేక దుకాణాలు । అనేకమంది ఆడవాండ్లను । అనేకమంది మగవాండ్లను చూచినాము । వారూ । మనమూ ప్రసంగాలు చేశినాము । మేలుకొంటే యేమైనది । యేమీలేదు గదా !

2. వచ్చేటప్పుడు యెక్కడ నుంచి వచ్చిరి । తిరిగి యెక్కడికి పోయిరి । యెవరు రప్పించిరి యెవరు పొమ్మనిరి । అలాగే నీ రాకడా । నీయునికీ । లేనిదాయెను । అందుకే యీ జగత్తుకు దిక్కులేదు । తావత్కాలం వుండేది । మూలంలేనిది గనుక వక విధం మర్యాదాలేదు ।

3. అందుకే । గురువాక్యం మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని తెలియుట చేత సకల సంకల్పములు నివృత్తి జరిగినది గదా !

శి॥ సరే । సరే। నా సంగతి కూకుడు । వేళ్లకు వూడిపాయె । యే ప్రసంగం చేయుటకు మూలంలేదు । గురుసాంప్రదాయం యీలాగు వుండవలె । అబద్ధాలు నాకు పట్టవు । చాలు చాలు ॥

గద్య:

ఇతి అచలగురు శ్రీశివరామ దీక్షిత ప్రభావే । వేదాంత విచారణే ।
ఉత్తరభాగే సంకల్ప నివృత్తి చతుర్దశ ప్రకరణం । ప్రథమ అధ్యాయం సమాప్తం.

# 14. సంకల్ప నివృత్తి ప్రకరణము

## ద్వితీయాధ్యాయం

### 1. శంకా నివృత్తి మార్గము

**1 శంక॥** యిదియేమో గురుస్వామికే తెలియవలె । గాని । అనరాదు ।

**నివృత్తి॥** వున్నది చెప్ప శఖ్యం కాదు గనుక । చెప్పేది వికారం గనుక । సూచన చేత కనుక్కోవలెను ॥

అది సూచన అయితే నీకు వక్క భ్రాంతీ కూడా వుండదు ।

**2 శంక॥** ఛీ । అది సూచన అయితే నేనే వుండను । నాయందు అందరిలో సమానంగా ఉంటుందేమో?

**నివృత్తి॥** భ్రాంతికి మూలంవొక్క యెరుకే గనుక । సూచనచేయగానే । సింహాన్ని చూస్తె । యెనుగ యేమీలేకపోయినట్టు । యెరుకలేక పోతుంది గనుక । యీ తోపకంల్లో తోచిన బద్ధులతో సహా సమానంగా యుండదని తాత్పర్యము ॥

**3 శంక॥** లేని యెరుకయై తనకు । వున్నదనే భ్రాంతియెన్నడూ లేదు అనగా? నేను నీవు గాని బయలును తాను అనవచ్చా ?

**నివృత్తి॥** భార్యాభర్తల వుపమానం వలె – నిర్ణయరహితమైన దానికి తనువు వేరు, తాను వేరు గనుక। తాను అనే అర్థం చెల్లును ॥

**4 శంక॥** పరిపూర్ణానికి । తనకూ వేరులేకుండా యుక్తి తెలుస్తే సరి ॥

**నివృత్తి॥** పరిపూర్ణమన్నా తాను అన్నా వొక్కటే గాని, తాను అనే పదాన్ని సందర్భోచితముగా చెప్పవలెను.

**5 శంక॥** మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అభేద్యం ॥౨॥ నాకంటె యెందరు వున్నారో అందరూ అభేద్యమే ॥

**నివృత్తి॥** యీ శరీరం వచ్చేటందుకు మూలం యేమీలేదు । కొనకు ప్రవేశించేటందుకు స్థానం యేమీలేదు । యీ తోపకంల్లో తోచీ । మెదలడం యేలాగో । ఆలాగే గనుక । దీన్ని భేదించడానికి శక్యంకాదు గనుక । అభేద్యం

నాతో సర్వం పోతుంది గనుక । నేను కానిది సత్యం గనుక । అటువంటి సత్యాన్ని

యింతా అంతా అని చెప్పడానికి శక్యంకాదు గనుక । అది అభేద్యం॥

**6 శంక॥** గుర్తెరిగే దాని యొక్క ప్రభావాన్ని । గురువాక్యంతో లేనిదని తెలిసి కూడ దానిని నమ్ముట గురుద్రోహమేనా?

**నివృత్తి॥** యెరుకను గెలిచేది కఠినం । గురుకటాక్షపాత్రుడు అయినవాడు । యాపత్తు అయినా । యీ యెరుక । సత్యమని నమ్మితే సరె । నమ్మక సర్వంలోపల దీని ప్రభావంతో గూడుకొన్న మహత్తులలో । వక్కటీ సత్యమని నమ్మినా । అదే గురుద్రోహం ॥

**7 శంక॥** సర్వానర్ధములకు మూలంగనుక । అద్వైతం । నిర్గుణం గనుక । వొకటి లేని వొకటి నిజమేనా?

**నివృత్తి॥** యెరుకే సర్వానికి మూలం గనుక । అద్వైతం । నిర్గుణం గనుక గురుకటాక్షం చేత । యెరుక యేమీలేనిదని । తాత్పర్యం । "అద్వైతమంటె ॥ తనకు తానె స్వతః స్సిద్ధమై చలించక । ఉన్నదాని యందు యేదిలేదో । అదే అద్వైతమని భావార్ధమైతే సరి"

**8 శంక॥** ఉన్నది యీ శరీరమందు లేకనే వున్నది ॥౨॥ అన్నది లేకపాయే గనుక । కావటమే లేదు॥

**నివృత్తి॥** యీ గుర్తెరిగే అహంకారం । యీ శరీరం లేక వున్నది । సత్యం యీ శరీరమందు । యీ గుర్తెరిగే అహంకారం । లేకనే వున్నది ॥

లేనిది యీ గుర్తెరిగే అహంకారమైన శరీరమే యెరుక । గనుక । యీ యెరుక ఉన్నదాని యందు లేనేలేదు । అని తాత్పర్యం ॥

**9 శంక॥** యిది చూస్తే కనుపించేది స్వభావం । చూచే శరీరం లేకుంటె చూడనిదే వున్నది గదా ।

**నివృత్తి॥** దర్పణవతు । వుంటే యేమి లేనిదేనాయను ।

**10 శంక॥** మాయసమస్తభాషా రూపిణీ, అయి వున్నది విచారించిన వారికి । విచారించని వారికి లేదు॥

**నివృత్తి॥** నిజవిచారం పొందిన వారికి । సర్వ భాషలచేత మాట్లాడే శబ్ధమంతా వొక్కటే అనిన్నీ ॥ శబ్ధం బేధమనిన్నీ తాత్పర్యం । గురువాక్యం చేత ఇద్దరు సమానమే ।

**11శంక॥** నడిచే శరీరమై వున్నాడు గనుక ।విడిచి గాభరా అయివున్న గురువు పనికిరాడు॥

**12శంక॥** చేశినా । విడిచినా । వూరికే వున్నా వొక్కటే ప్రకారం । యెరుక విడిచివుంటే చాలు ।

**నివృత్తి॥** 11, 12 శంకల సమాధానం-చేసేది । విడిచేది । ఊరికే వుండేది యెరుక వక్కటే గనుక । యిది సత్యమని బోధించే గురువు పనికిరాదు । నడిచే శరీరమైవున్న వాడే, ఉన్నది లేనిది తెలిసి చెప్పగలడు గనుక వారిని నమ్మితె మంచిదే ।

**13శంక॥** శాస్త్రం చెప్పిన వారికి । చెప్పినట్టూ నడవకుంటే కోపం ॥

నడవకుండినాసరె । నన్ను విడకుండినా సరేనా ? ।

**నివృత్తి॥** శాస్త్రవాసనలచేత వుండేవారికి నిజజ్ఞుడై । శాస్త్రాలలో చెప్పినట్టు । నడువకుండితే కోపమే ॥

తనకు నిష్ట యేలాగు అంటె । గురువాక్యం విడువక పోవడమే వారు చెప్పినట్టూ నడవక పోవడమని తాత్పర్యం ॥

**14శంక॥** చంచలమనే శరీరం చేత శరీరం యేమీ లేదు అని స్పురణ వస్తే । సర్వకాలం శరీరం యేమీలేనిదీ । తనకు తానే స్వతసిద్ధమై వున్నదేమో ?

**నివృత్తి॥** యినుముచేత యినుము యేలాగు తెగునో । ఆలాగే భ్రాంతి రూపమైన యీ శరీరం యేమీలేదు అని ।స్మారకం యీ శరీరానికే కలుగవలెనని తాత్పర్యం । ఉన్నది యెప్పుడు ఉండనే యున్నది.

**15శంక॥** యీ శరీరమందు వెతికినా । శరీరం లేనిదే వున్నది నిజమా ?

**నివృత్తి॥** యీ శరీరానికి హేతేవేలేదని । విచారించడమే । యీ శరీరమందు వెతకడమని తాత్పర్యం॥

**16శంక॥** జ్ఞానం వున్నంతశేపూ ఖర్మాలు వుండనే వుంటావని । మంగలి సంతోషపడె । రజకుడు వొప్పుకొనెనంటారు నిజమేనా ?

**నివృత్తి॥** వస్త్రం యెంత తెల్లగా ఉతికిన గాని । వాడుకోంగానే, తిరిగి మైల అంటుతుంది అనే దృఢం చాకలికి వాడికిన్నీ ఉన్నది.

మంగలి యెంత నున్నగా చేసినాగాని । మరునాడు మొలుక యెత్తుతుంది । అనే దృఢం వీడికిన్నీ । మంగలికి యేలాగు వున్నదో । ఆలాగే । యెరుక సత్యమని నమ్మినంతశేపూ । భ్రాంతులనే ఖర్మాలు వుండనే వుంటావని తాత్పర్యం ॥

**17శంక॥** చదువుకున్న విద్వాంసులకంటె । వూరికే వున్న రాళ్లునయం । గుంజలు నయం । మొద్దులు నయం । మోట్లు నయం । కండ్లు కలిగినవాడు । గుడ్డివాడూ సమానమె । ఆయె ॥

**నివృత్తి॥** సమస్తం చదివి తెలిసిన వాడున్నూ । యేమీ తెలియని వాడున్నూ । నిర్ణయరహితమైన సత్యమును తెలియక । సకల నిర్ణయాలూ చేస్తారు గనుక । అది నిర్ణయం చేయలేదు గనుక । యీ ప్రకారం చదువుకొన్న కండ్లు గలిగిన వాడూ । అట్లా యేమీ చదువుకోని గుడ్డివాడూ । యీ యిద్దరూ సమానమని తాత్పర్యం ॥

**18శంక॥** శ్రీకృష్ణభగవానులు । వైకుంతం యిటువంటిది అని । చేతచూపి పోయిరని అన్నారు ॥

**నివృత్తి॥** సూచనచేత కనుక్కోవడమందు ॥ హరి ॥ కరివతుగా ।

**19శంక॥** అద్వైతమనగా యేమి ?

**నివృత్తి॥** తనకు తానే స్వతసిద్ధమై చలించక వున్న బట్టబయలుయందు । యేదిలేదో యేది నిర్గుణ బ్రహ్మమో అదే అద్వైతమని భావార్థం । వున్నదానియందు । వంధ్యా పుత్రవత్తుగా । ఖపుష్పవత్తుగా । మరుమరీచిక వత్తుగా । దర్పణవత్తుగా । శశివిషాణవత్తుగా । యేయెరుకలేదో । ఆ యెరుకే సత్యమని నమ్మడము । లోకుల యొక్క భావార్థమని తాత్పర్యము ॥

**20శంక॥** యెరుకకు యెరుకే లేదని తెలిస్తే చాలా ?

**నివృత్తి॥** అవును జన్మరహితమనే మాటకు సార్థకము కావాలంటే మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదని ముమ్మాటికి తెలియుటే మంచిది. గనుక కల దోచిన శరీరాలు మేల్కొంటే యేలాగో మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదు, ఈ ఉత్త బట్టబయలు యేమిలేదు, యిదే సిద్దాంతం సిద్దాంతమే రాద్ధాంతము.

గద్యః

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।**
**ఉత్తర భాగే సంకల్ప నివృత్తి చతుర్దశ ప్రకరణము । ద్వితీయాధ్యాయము సమాప్తము**



ఓం

శ్రీగురవేనమః

శ్రీమద్బృహద్వాసిష్ఠ అచల సిద్ధాంత నిర్ధారణులును
శ్రీమించునచల పరిపూర్ణ బోధ ప్రతిష్టాపనాచార్యులగు
శ్రీమద్రామడుగు శ్రీశ్రీశ్రీ శివరామదీక్షితుల వారిచే రచియింపబడిన

# బృహద్వాసిష్ఠము

అను

# శ్రీ శివరామ దీక్షితీయము

## పరిపూర్ణ బోధ అచల సిద్ధాంత గ్రంథము
## జనన మరణ భ్రాంతి రహిత మార్గము



## నాలుగవ భాగము



# 15. భ్రాంతిరహిత ప్రకరణము

## ప్రథమాధ్యాయము

## 1. దేహిదేహోపాధి ద్వయదోష రహితము

### 1. స్వప్న దృష్టాంతము

శి॥ యీకలలో మళ్లా గుర్రము మీద యెక్కి ఒక మనిషివచ్చెను । గుర్రమూ మేమూ యెందులో వున్నామో । అదే పుట్టని చావనిది । అనిచెప్పి నేను యేమీలేదు । యీ గుర్రం యేమీలేదు అనెను

గు॥ 1. శాబాసు । సరె । సరే । యీలాగు వుండవద్దా । కల తప్పు విడిచి మరి ఒక అవస్తలేదు। యెంతసేపూ। యీ గుర్తెరిగే శరీరం మేలుకోక వుంటుందో। అంతసేపూకలే । కలతప్పితే యేమీలేదు ।

2. యీ శరీరం యేమీలేదు । సుషుప్తి అని । మరణం అని ప్రజలు కల్పించినారు. వున్నవే రెండు। కండ్లు మూసినా యెరుకే। కండ్లు తెరచినా యెరుకే। యెరుకలేకుంటే యేమీలేదు ।

3. సర్వకాలం శరీరం లేక వున్నదానికి । యేమివున్నదని నిర్ణయంచేయ । యేమిలేదని నిర్ణయంచేయ। మరి ఒకటి యేమీలేదు । అంతా బట్టబయలే ఉన్నది ।

### 2. నేను లేనిదే నిజము

4. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే సకల నిర్ణయాలుకు ప్రమాణం । పుట్టనిచావనిది । క్రియాశూన్యమైనది గనుక । పుట్టని చావని దానికి యెరుక లేదు । కర్మలు యెక్కడ వున్నవి ।

5. ఛీ । అందుకే యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నదన్నా పాపమె । లేదు అన్నా పాపమె । తాను పుట్టని చావని అచలం గనుక । నిర్ణయమనే పాతకం తగులకుండా మెదలవలెను ।

6. నిర్ణయం చేసేనా । శరీరం లేని వారు కారు । యెంతవారికి అంతవారిని జంట చేయవలెను । నేను శరీరం లేనివాణ్ణి అని చేసినా పాపమె । విడిచినా పాపమే, ఎందుకంటే నేను లేకపోయిన వెనుక నేనే లేనని చెప్పేది లేదు. గనుక నేననే అహం స్పురణ విడువవలెను.

శి॥ అయితే యేలాగు

గు॥ పుట్టనిచావనిది। మొదలు కొనాలేనిది। రాకడాపోకడా లేనిది। శరీరం లేకనే యేలాగు వున్నదో । సకల దేశాల యందూ । సర్వకాలాలయందూ । సమస్తమైన వస్తువుల యందు । చలించక తనకు తానే స్వతఃసిద్ధంగా । సర్వకాలం యేలాగు వున్నదో । ఆలాగే యావత్తు నిర్ణయం । అంతా అదే గనుక చూసి వూరుకొనేదే మంచిది.

## 3. మూలం లేని గుర్తెరిగే శరీరం చేత యే సిద్ధికాదు

శి॥ సిద్ధులు యేలాగు వుంటారు

గు॥ ఛీ।ఛీ। మూలంలేని యీ గుర్తెరిగే శరీరంతోటి సిద్ధియెన్నటికి కాదు । సాధ్యంలేదు । గనుకనే । సిద్ధి యెన్నటికీ లేదు

శి॥ వెనుకటివారు అందరు యేలాగు అయినారు

గు॥ ఛీ। ఛీ। యెవ్వరూ కాలేదు

శి॥ కాకుంటే యెందుకు ప్రయత్నం చేస్తారు ।

గు॥ 1. అన్ని ప్రయత్నాల వలెనా యీ ప్రయత్నం । అన్ని యిశ్చలవలెనె యీ యిశ్చ । అన్నీ చేశినట్టె యిది చేస్తారు । మొదలు పెట్టిననాటి నుంచి చెస్తూనే యున్నారు. యిప్పటికీ దరి లేదు । జ్ఞానం చేత సాధ్యం కాదు । కోటియెందుకు చెప్పవలె । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేతగాదు ।

2. యీ శరీరానికి మూలంలేదు। కొనకు ప్రవేశించేటందుకు స్థానం యేమీలేదు। లేనిది లేకపోయిన తరువాత పరిపూర్ణం వేరే। శరీరం వేరే వున్నదని యెటువంటి। పశువు అయినా అనదు । పరిపూర్ణ వస్తువ వొక్కటే వున్నది । మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమీలేదు। గనుక యేమి అనదుయని తాత్పర్యం.

3. రెప్పపాటంత శేపూ మరువక వుండవలె। వుండకపోయేనా యెంత దొడ్డ ప్రజ్ఞావంతుణ్ణి । అయినా మోసపెడుతుంది ।

4. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే విక్షేపశక్తి । ఆవరణశక్తి । విక్షేపం లేకుంటే ఆవరణంపాయ । ఆవరణంపోతే విక్షేపం పోదు। విక్షేపశక్తి ఆవరణానికి మూలం। విక్షేపించే తనే అనేక ఆవరణాలు చేస్తాది। అందుకే గురు సాంప్రదాయం। మూలంలేని యీ గుర్తెరిగే శరీరంలేని సాంప్రదాయం కావలెను ।

## 4. నేను లేనని తెలియడమే, మేల్కొ అదే జాగ్రతగాను గుర్తించుట

5. గు॥ సకల భ్రమలకు మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే । అందుకే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదు । యింతకంటే అధికం లేదు । ఇదే గురువాక్యం ।

6. పరిపూర్ణం పుట్టని చావనిది । మొదలు కొనాలేనిది । రాకడా పోకడాలేనిది । సర్వకాలం క్రియాశూన్యమైనది । సకలదేశాలయందూ । సర్వకాలాలయందూ । సమస్తమైన వస్తువుల యందు । చలించక । తనకు తానే స్వతఃసిద్ధమై । వున్నది గనుక । అందుకు ప్రయత్నం చేయడం యేమి లేదు ।

7. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదని । యెన్ని కోట్లు చేస్తే అంత దృఢం చేయడం అనగా లేదని గ్రహించుట । వున్నదానికి యిది అభ్యాసం అయిన కొద్దీ సుఖదుఃఖ రహితం అవుతుంది । యెప్పటి పరిపూర్ణం యెప్పటి వలెనే వుంటుంది ।

8. పరిపూర్ణం యే తీరుగా వున్నదో ఆ తీరుగా కుదరవలె । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని । సకల క్రియలూ చేశేనా । అది క్రియా శూన్యం కాదు । విడిచినా క్రియాశూన్యం కాదు । కొన్ని విడచి కొన్ని విడువకున్నా క్రియాశూన్యంకాదు । యిది పరమగుహ్యం । యిదే మహారహస్యం ।

9. యెంత వారికీ శక్యంకానట్టే వుంటుంది । దీనికి । కలలో యేనుగ వచ్చి వుండిమేలుకొంటే । కొంతవుండి కొంతపోతుందే । యేమీలేదా

శి॥ యేమీలేదు ।

గు॥ ఆలాగే గురువాక్యం చేత గురి ఆయెను.

శి॥ యేమి ఆయే స్వామి ?

గు॥ 1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం ఆయె । యేనుగవలె జాడలేకపోయే । పుట్టనిచావని పరిపూర్ణమె వుండే । సర్వకాలం వక్కతీరె । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । యేమీలేదు । యిది లేకుంటే ప్రసంగాలు నిలిచిపోయె. యిది మహాగుహ్యం।

2. గురుకటాక్షం తప్ప విడచి । మరివొక భ్రాంతి లేని మార్గం లేదు । యెవరూ । మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని విడిపించక బోధిస్తారో వారికి । భ్రాంతి తీరదు । పుట్టని చావని జాడ తెలియదు ॥

3. అందుకే స్త్రీ స్త్రీతో గూడి సంతోషపడ్డట్టే । పురుషుడు పురుషుడుతో సంతోషపడ్డట్టే ।

వృద్ధి లేదు । క్షయం లేదు । యెప్పుడు యెంతో । అంతే । సర్వకాలం యీ మూలంలేని । యీ గుర్తెరిగే శరీరమె । అయ్యి । భ్రాంతుడు అయ్యి ఉండి యింకో తమలాంటి వారికి బోధిస్తే ఇద్దరు ఒకే విధం వుంటాడు ।

## 5. ఎరుకయనే దరువాజను తీసే గురువు కావలెను

4. దరువాజ అంటే గుర్తెరిగే యెరుక ఈ దర్వాజా తీసే గురువుకావలె । దరువాజాతియ్యక । మంత్రాలు । సాధనలు లక్ష్యాలు చెప్పి చేయిస్తే । మూలంలేని । యీ గుర్తెరిగే శరీరమనే । దరువాజాకు । తాళంవేశినట్టు । తాళం చెయ్యి గురువు దగ్గరలేదు । ఆ గురువు వెయ్యయెరుగు । గాని తియ్యనేరడు । ఆ గురువుకు మరివొక గురువు తాళం వేశినాడు । యిది అని జాడచూపలేదు।

5. యీలాగే ఒకరికి వొకరు । తలుపుతీసి । పుట్టని చావనిది యిదియని జాడచూసి । తలుపు రెక్కలు విచ్చివేశి । యిదే రాజమార్గం అని । వకసారిసూచన అయితే । మళ్ళావాడు యెవరిని నమ్మడు । వాని తలుపుతీసి వేశిన । మార్గం వానికి దృఢమైతే । వానికి వక్కటైనా బాధలేదు । సర్వకాలం ఒక్కతీరె ।

6. అందుకే । శరీరంలేని గురుసాంప్రదాయం అరుదు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । పుట్టనిచావనిది తనకుతానే స్వతసిద్ధమై వున్నది । దానికి ప్రయత్నం లేదు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరము యేమీలేదు । అని పరిహరిస్తే సరి ।

7. వున్నది తను తానే స్వతశిద్ధమై వున్నది దానికి జ్ఞానం లేదు । ఖర్మాలు లేవు । యీ శరీరమె । జ్ఞానఖర్మాస్వరూపం । యీ శరీరం లేక మునుపే మొదలు కొనాలేక । రాకడాపోకడలేక । సకల దేశాల యందు । సర్వకాలాల యందు । సమస్తమైన వుస్తువులయందు । సర్వకాలం చలించక । వక్కతీరుగా । తనకుతానె స్వతశిద్ధమై యెన్నటికీ । శరీరం లేక వున్నది ।

8. అందులోనే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నది । యిది అదికాదు । అది యిది కాదు । పర్వతానికి ఆవగింజకు । యెంత యెక్కువ తక్కువో । అంత యెక్కువ తక్కువ ।

## 6. యెరుకకు యెరుకను తీసివేయడమే ప్రయత్నం

శి॥ 1. సరె కాని । మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి వున్న సామర్థ్యం పుట్టని చావని దానికి లేదు । చూడబోతె మొదలు । యేమీలేదు । కొనకు యేమీలేదు । వున్నంతశేపూ । అడది మొగవేషం వేశి । మగవాడిననిపించుకొన్నట్టు చేస్తుంది । మగవాడు వచ్చి

చూస్తే యెప్పటి ఆడదే ।

2. యిక్కడ గురుసాంప్రదాయం దొడ్డది । ఆయెనా । యీ మూలంలేని । యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । కలలో యేనుగ మేలుకొంటే యేలాగో అలాగే । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వాదశూన్య మాయ । యెప్పటి పరిపూర్ణం వుండె । దానికి శరీరంరాను లేదు । పోనూ లేదు ।

3. సకల భ్రమలు । శరీరంతోటి వచ్చినవి । శరీరంతోటే పోయె । వున్నంతసేపూ వక్కటీ తప్పదు । సర్వం వుంటుంది । సర్వం శరీరంతోటే పోతుంది । సర్వం శరీరం లేనిదానికి వున్నది । గనుక । లేకపోతావి । వుండి। లేదు । లేకపోలేదు ।

4. సర్వకాలం ఒక్కతీరే । కలలో యేనుగ యీ శరీరం ఒక్కటే । యిదియేమీ లేదు । అదీయేమీలేదు । రెండూ లేకుంటే వున్నదే వున్నది । శరీరం లేనిదే వున్నది

గు॥ శాబాసు। శాబాసు । సరె । సరె । చాలు । చాలు । విస్తారం కూడదు । కొంచంగా । సూచన చెయ్యవలెను । అట్లైతే నీవు యేమి ?

శి॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరమును నేను । విచారించి మీకు చెప్పడమునకు యేమి తెలుసుకొని చెప్పుదును అన్నాను.

గు॥ యేమి అంత ఆశ్చర్యము?

శి॥ గురుస్వామికె తెలియవలెగాని మళ్లా పలికేటందుకు నాకు తోచదు ।

గు॥ సరే నీవు యేది అయివున్నావో అదే నేను అన్నాను । సరే కాని నాకే । యెక్కడా తోచదు । నీవు సర్వకాలం వ్యవహారం చేస్తున్నావా । లేదా॥

శి॥ యేమి అదినాకు । లెస్సా తెలియదు

గు॥ అట్లైతె అనుమానం యెందుకు । మొదలు దొరుకదు । కొనా దొరుకదు అంతే గదా!

శి॥ మీరు యేలాగు తెలుసుకొన్నారు

గు॥ నేను తెలుసుకొన్నట్టూ నాకు తోచదు

శి॥ అట్లైతె యేలాగువున్నది। మీరు యేలాగు అయినారు

గు॥ నేను యేలాగోనా । నేను యేమీ కాలేదు ।

శి॥ అట్లైతే మీరు । యేమో అన్నా నాకు తోచదు ॥ నాచేత కాదు

గు॥ 1. అందుకు బహుసమర్థులు కావలె । చెప్పేది కాదు । చదువుకొనేది కాదు । రెండూ యీ మూలంలేని । యీ గుర్తెరిగే శరీరంచేత కాని । పుట్టని చావని పరిపూర్ణం ।

చెప్పదు । వినదు । యెరుగదు । అది శరీరం కాదు ।

2. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అది కాదు । అది శాశ్వతమైంది । యిదివున్నట్టూ వుంటుంది। అగ్నిహోత్రమువలెనె । చూస్తూ వుండంగానే యేమీలేదు ।

3. సకల దేశాల యందూ వున్నదానికి । సర్వకాలం ఒక్కతీరె । సర్వకాలాలయందు వున్నది గనుక వక్కటైనా వికారం లేదు । సమస్తమైన వస్తువులయందు లేదు గనుక । సర్వకాలం ఒక్కతీరె ।

4. వస్తువులయందు వుండేది । వస్తువులతో కూడా యేమీలేదు । అన్యవస్తువు పుట్టనేలేదు । మొదలు యేమీలేదు గనుక । కొనకు యేమీలేదు। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । అన్యవస్తువు వలెనే వున్నది ।

5. నిప్పువంటిది గనుక । వున్నంతసేపూ । కొనకు యేమీలేదు । గనుక । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అన్యంకాదు। అది కాదు । యేమీలేదు దీని సామర్థ్యం విస్తారం గనుక అబ్బా అనిపించుకొంటుంది ।

6. ధీరులకు కలలో యేనుగ మేలుకొంటే । యేలాగో । ఆలాగే । సూచన చేసేటప్పుడు యేమీలేదు । అటు తర్వాత అంతా పూర్ణమే ।

7. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం తప్ప విడచి । అంతాపూర్ణమె । యీ శరీరం చిదగ్ని గనుక । యెన్నటికి నమ్మరాదు । మహానమ్మించి । చూస్తూ వుండంగానే యేమీ లేకపోతుంది ।

8. యిది వున్నది అనుకొన్నా శక్యం గాదు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని అనుకొన్నవాడే । సకలభ్రాంతి రహితుడు అవుతాడు ।

9. పరిపూర్ణం స్వతశిద్ధమై వున్నది । దానికి యత్నం చేయడమే యెరుకకు । విఘ్నం । యత్నం చేసేదాన్ని తీసివెయ్యడమే ప్రయత్నం

శి॥ అది యేది

గు ॥ మహాగుహ్యం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు యింతకంటే అధికమైన గురువాక్యం లేదని । నిర్ణయము.

శి॥ గురుపరంపరా ప్రాప్తి అయింది । దీన్ని నిల్పేవారు । నిల్పుకొనేవారికంటే । భ్రాంతీకులు లేరు । వారే వికార స్వరూపులు । ఛీ । ఛీ । ఆ వాక్యం మాకు యెన్నటికి పట్టదు ।

గు॥ 1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు ।మూడుకాలాలయందు । మూడువేలు । కాలానికి వెయ్యిచొప్పున । ప్రతిదినం ।జపం చేయవలె । చేస్తే కృతకృత్యుడు అవుతాడు

। యిదిగాక మరిఒకటి నమ్మెనా । ముణిగితె తేలదు । యింతకంటే అధికం । లేదు ।

2. మొదలుకొనా లేనిది । పుట్టని చావనిది । రాకడా పోకడలేంది సర్వకాలం ఒక్కతీరుగా వున్నది । సకలదేశాలయందు । ఒక్కతీరుగా వున్నదే అచలం గనుక ।శరీరం యెన్నటికీ గాదు।

3. కలలో అనేక శరీరాలు వస్తావి వాటికి మూలం యెన్నటికీలేదు ।సకలదేశాల యందు వున్నది యీ శరీరానికి మూలంకాదు । సమస్త వస్తువులయందూ వున్నదీ యీ శరీరానికి మూలం కాదు।

4. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే అనేక కోటి బ్రంహ్మాండాలువున్నవని । బ్రాంతి పెడుతుంది । నాకు మూలం లేదని యెవ్వరితోటి చెప్పదు । అందరూ తానై యున్నది యింతకంటే కౌతుకం లేదు । అందుకే చూచిన గురువెల్లా పనికిరాడు ।

5. యీ శరీరానికి మూలం యేమీలేదని చెప్పే గురువు కావలె । వున్నప్పుడు వున్నట్టె వుంటుంది । చూస్తూ వుండంగానే యేమీలేదు ।

6. మొదలుకొనా లేనిది । పుట్టనిచావనిది । గనుక సర్వకాలం ఒక్కతీరె । అందుకే సకల దేశాలయందు । సర్వకాలాలయందు । సమస్తమైన వస్తువులయందు । తనకు తానే చలించక । స్వతఃసిద్ధమైనది । యెరుక లేనిది । గనుక కర్మాలు లేవు ।

7. యెరుకనుంచే కర్మాలు పుడుతావి గనుక । గుర్తెరిగే శరీరమే యెరుక । యెరుక శరీరం । వేరు వేరు అనే వెర్రిని విడువండి ।

8. యీ శరీరం రాక మునుపే పుట్టని చావనిది । మొదలుకొనాలేనిది । రాకడాపోకడా లేనిది । సకల దేశాలయందు । సర్వకాలాలయందు । సమస్తమైన వస్తువుల యందు । జ్ఞానకర్మాలు లేకనే । తనకు తానే స్వతఃసిద్ధమై చలించక । సర్వకాలం ఒక్కతీరుగానే వున్నది ।

9. గురువాక్యం చేత గుర్తెరిగే యెరుక లేదని బ్రాంతిరహితం । అయితే సరి । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । యేమీలేదు

శి॥ యిదిలేకుంటే అది స్వతసిద్ధమా ।

గు॥ వున్నదోలేదో అని అనుమానమా

శి॥ యేమీ అనుమానం లేదు వున్నదే బట్టబయలు దాని యందు ఎప్పుడు । లేనిది ఈ యెరుకనే, సంశయం లేదు.

గు॥ అందుకే దరిద్రం తీసివేస్తే ఐశ్వర్యం స్వతసిద్ధం వస్తుందో । రాదో అని యెవ్వరు ఈ దరిద్రం అనే గుర్తెరిగే యెరుకను విడువరు ।

## 7. శరీరంలో కొంత నిబద్ధి కొంత అబద్ధం అనడం చాలా అన్యాయం

శి॥ వారివలె అనుమానం యేమి లేదు

గు॥ 1. వారివలె అనుమానం లేకుంటె పుట్టనిచావనిది వుండజూచి । మూలం । లేని యీ గుర్తెరెగే శరీరం యేమీలేదని । నిశ్చయం వుంటే చాలు । యే సాధన వద్దు । యేసాధనచేశినా దేహమనే నరకం । విడువదు । యెరుక అనేనిప్పు కాలుస్తూ వుంటుంది । యెరుకకంటే వేరే నిప్పులేదు ।

2. చిత్తు అనె చింతనిప్పువలె । కాలుస్తుంది । సమస్తమైన శరీరాలు । యెరుకతో కూడా వచ్చినవి । యెరుకతో కూడా యేమీలేదు । సర్వకాలం అచలమే వున్నది ।

3. శరీరంల్లో కొంత నిబద్ధి కొంత అబద్ధం అనేది అన్యాయం అందుకే । గురువాక్యం మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదని వాక్యం వచ్చింది ।

4. చలనం లేకుంటే అచలమే సిద్ధం । చంచలం మూలం లేని యీ గుర్తెరిగే శరీరమే కాని మరిఒకటిలేదు । యీ శరీరంరాక మునుపు ఒక్కటైనా వికారం లేదు ।

5. శరీరమే వికారస్వరూపం । చెవులు ఒక్కతీరుగా వున్నవి । కండ్లు ఒకతీరుగా వున్నవి । కాళ్ళు వకతీరుగా వున్నవి । చేతులు వొకతీరుగా వున్నవి । ముక్కు వొకతీరుగా వున్నది । నోటినిండా పొక్కలు । చుట్టూ వెంట్రుకలు । లోపలనాలిక । నోరు మాట్లాడుచూ వున్నాది ।

6. యీ వికారాలు శరీరానికి । ప్రత్యక్షంగా వున్నవి । శరీరంలో వికారంలేనిది । వొక్కటైనా లేదు । కడుపులో వికారాలకు లెక్కలేదు । తలలో వికారాలు అనేకము । కాళ్ళల్లో వున్నతిప్పలు చెప్పశక్యంకాదు । యెన్ని అయినా యీ శరీరాన్ని మన్నించేటందుకు । ఆధారం లేదు ।

7. గురువు అనే సింహం । యేనుగ యనే మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని యేమీలేదు అని చెప్పి । అచలమే ఉన్నట్టు సూచన । చేసి వుండంగానే యే భ్రాంతి లేకపాయెను । అందుకే ॥

**శృ॥ నగురోరధికం । నగురోరధికం** అని శాస్త్రం మొరబెట్టింది.

8. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు ।యిది లేకుంటే యేది వున్నదో

అదేఅచలం। అది నేను కావలెనని యిశ్చవద్దు । కాకపోతిని అని దుఃఖం వద్దు । అయితినని అబద్ధాలు ఆడవద్దు । సర్వకాలం గురువాక్యం మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదని మరువకుంటే చాలు

## 8. ఈ గుర్తెరిగే శరీరం కానిదే గురుస్వరూపం

**శి॥** మొదలు గురుస్వరూపమే లెస్స వుండచూడవలెను ।

**గు॥** గురుస్వరూపం యెటువంటిది

**శి॥** శరీరంలేనిది । పుట్టనిచావనిది । మొదలూ కొనాలేనిది । రాకడాపోకడా లేనిది । సకల దేశాలయందూ । సర్వకాలాలయందూ । చలించక వున్నది । జ్ఞానఖర్మాలు లేక తనకు తానే స్వతసిద్ధమై చలించకవున్నది । గురుస్వరూపం । అటువంటిది ।

గురుస్వరూపంలోనె । మొదలూ యేమీలేదు । కొనకూ యేమీలేదు । మధ్య తనకు తానె శరీరం వచ్చి । యెక్కడా తోచక వున్నది । వుండంగానే వక మనిషి వచ్చి । యిదే గురుస్వరూపమని । కండ్లు తెరచి చూడుమనె చూచిన తర్వాత । విస్తారమైన గురు స్వరూపం వున్నది గదా అనె

**శి॥** యెక్కడ చూచినా అదె వున్నది

**గు॥** మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । యీ గురువాక్యం సర్వకాలం మరువకవుంటె సరి । యీ శరీరం చేత । యీ వాక్యం తప్ప విడిచి । మరివొకటి అభ్యాసం చేయకు

**శి॥** చాలు చాలు స్వామి.

**గు॥** సర్వకాలం వున్నదే వున్నది । దేహమును విడిచి దేహిలేకపోయెను గనుక దేహిదేహోపాధి ద్వయదోషముల కథ వడిసెను.

గద్య:

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే । వేదాంత విచారణే । ఉత్తరభాగే భ్రాంతి రహిత ప్రకరణం । దేహి దేహోపాది ద్వయదోషరహితము ప్రథమ అధ్యాయం సమాప్తం**



# 15. భ్రాంతిరహిత ప్రకరణము

## ద్వితీయ అధ్యాయం

## 2. దృక్కు దృశ్యోపాది ద్వయదోష రహితము

### 1. అందరూ దరువాజకు తాళం వేసినారు గాని ఆ తాళంచేతి అచలగురువు వద్ద ఉన్నది

**శి॥** అయ్యా నేను యేమీ అనెను ?

**గు॥** వున్నది యేతీరుగా వున్నదో ఆతీరుగా వుంటావు । శరీరం గూర్చి । గురువు యెప్పుడు సూచన చేసినాడో అప్పుడే లేదు । యేది వున్నాదో అదె వున్నది ।

**శి॥** సర్వకాలం వొక్కతీరుగా వున్న దానికి । శరీరం రానూలేదు । పోనూలేదు । బాటతొలగి వుండె । బాట రాజమార్గ ఆయెను । దరువాజతీసే గురువు కావలెను ।

**గు॥** 1. దరువాజావేస్తే బాటదొరుకదు । దరువాజాతీసే గురువుకావలెను ।శిష్యులు మూర్ఖులు కాకపోవలెను । యిద్దరూ మంచివారు అయితె బట్టబయలు సూచన అయిపాయెను

2. యిక । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు । రాజద్వారం । యీ దరువాజా వేస్తే రాజదర్శనం కాదు । యీ దరువాజా తీస్తె రాజ్యంనిండా రాజే (యిక్కడ రాజనే పదాన్ని బయలుగా చెప్పినారు) (దరువాజ వేయడమనగా యెరుకను నిలుపడం)

3. యీ దరువాజా వేసేవారేకాని । తీసేవారు లేరు । దరువాజా తియ్యలేక । అనేక కోట్లలో వున్నారు । యీ దరువాజా దాటేది । మహాకఠినం । అతి సులభం

4. గురుకటాక్షం లేక శక్యం కాదు । అదిలేకుంటే । శాస్త్రాలు । యీ దరువాజాకు అనంతమైన తాళాలు వేశి । తాళం చేతులు దాచుకొని వున్నారు ।

5. అన్ని తాళం చేతులు । నిజ గురువు దగ్గర వున్నావి । ఆయన వెయ్యాగలడు । తియ్యాగలడు ।

6. మతాలవారు యీ దరువాజాకు పూజ చేస్తూ । వున్నారు । యెన్నటికైనా దాటేమా అని నమస్కారాలు చేస్తూవున్నారు ।

7. దరువాజా లోపట వున్నాడని కొందరికి ఆశ । చెక్కలోపట వున్నాడని కొందరికి ఆశ । గడపకింద వున్నాడని కొందరికి ఆశ । తాళపు బుర్రలో వున్నాడని కొందరికి ఆశ । అనేక మందికి ఆశ వున్నది.

8. అందుకే గురువాక్యంతోటి సమానమైంది యేదీ లేదు । తాళం చేతి మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని తాళం తీయగానే దైవం బయట లోపట ఉన్నది, అదే బట్టబయలు, అచలం స్వతసిద్ధమై వున్నది.

**2. నేను యేమైన ప్రయత్నం చేసి చూస్తే అది నేనుగాను అని తెలిసెను.**

శి॥ యింకా యేమైనా ప్రయత్నం చేయవలెనా

గు॥ యేమీలేదు గుర్తెరిగే శరీరం యేమీలేదు । యేమిచేత ప్రయత్నం చేస్తావు ? స్వతః సిద్ధమై వున్నదానికి ప్రయత్నం యెందుకు చేయవలెను. ఇలాగున గురువాక్యం వింటే యే ప్రయత్నం చేయవద్దు.

శి॥ 1. బట్టబయలు నేను అవుతానా । వున్న పరిపూర్ణం గాక నేను వేరే వున్నానేమో ।

2. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను అనుకొన్నా। నేను అనుకొన్నట్టుగాక । నాకంటె మునుపే తనకు తానే స్వతఃసిద్ధమైవున్నది । చలించక వున్నది । అని నేను యెరుగను।

3. నేను అందులోనె వున్నాను । అది నన్ను యెరుగదు । నాకంటే వేరే । మొదలూ । కొనాలేక । రాకడాపోకడా లేక । పుట్టుచావులు లేక । సకలదేశాల యందూ । సర్వకాలాలయందూ । సమస్తమైన వస్తువులయందూ । గుర్తెరుగే ఖర్మాలు లేక। తనకు తానే స్వతఃసిద్ధమై చలించక । సర్వకాలం వొక్కతీరుగానె వున్నది ।

4. యీ శరీరం వున్నట్టె వుంటుంది । చూస్తూ వుండగానే యేమీ లేదు । పుట్టని చావనిది । శాశ్వతంగా అలాగే వున్నది ।

5. శరీరం వున్నప్పుడు । శరీరం నవ్వితే నవ్వదు । శరీరం యేడిస్తె యేడవదు । శరీరం తింటే తినదు । శరీరం తాగితే తాగదు । శరీరం నడిస్తే నడవదు । శరీరం మాట్లాడితే మాట్లాడదు ।

6. యీ శరీరం వున్నట్టే వున్నది । వొకవేళ యీ శరీరం లేకపోతుంది । అప్పుడో । అది యెప్పటివలెనె వుంటుంది । యీ బట్టబయలు । శరీరంవున్నా । చచ్చినా । వొక్క తీరుగానే వుంటుంది

గు॥ బట్టబయలు వుంటుందా వుండదా ।

శి॥ 1. అదే శాశ్వతంగా ఉంటుంది, యేమీ చింతలేదు । మూలంలేని యీగుర్తెరిగే శరీరం దాని సంబంధమైనది కాదు । దాని ప్రేక్ష్యం యీషత్తు అయినా లేదు। అది శాశ్వితమైనది । జ్ఞానఖర్మాలను యెరుగనేయెరుగదు।

2. యీ శరీరానికి మూలం యేమీలేదు। కొనకు ప్రవేశించేటందుకు స్తానం యేమీలేదు తావత్కాలం। వుండేటందుకు యేమీలేదు। ఆగంతుకంగా వచ్చేది। వుండేది। వెంటనే యేమీలేకపొయ్యేది।

3. తనకు తానే స్వతసిద్ధమై వున్న అచలం। వొక్కతీరుగానె వున్నది। దీని జోలి దానికి వట్టదు। దాని జోలిదీనికి పట్టదు। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు।

4. దీనికి మూలం యేమీలేదు। కొనకు యేమీలేదు। మెరుపువలె మెరిసేది। వెంటనే యేమీలేదు।

గు॥ అందుకే॥

**శృ॥ ఖద్యోతవత్। ఖపుష్పవత్। తస్మాత్ మిధ్యాజ్ఞానేన। మిధ్యాభ్రాంతి లక్షణః॥**

అని వున్నది।

1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను। అని నమ్మి వున్నవారికి సుఖదుఃఖాలు తప్పవు।

2. శరీరంలేకనే తనకుతానె స్వతసిద్ధమై నేను లేక వుంటే। వక్కటైనా భ్రాంతి వుండదు।

3. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం బట్టబయలులో లేనే లేదని తెలిసెను గదా।

శి॥ యిందుకు సంశయం యెంతమాత్రమూ లేదు। యిఘ వాక్యం దయ చెయ్యండి।

గు॥ సరె మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు। యీ వాక్యం సర్వకాలం అనుకుంటే సమస్తమైన భ్రమలూ పోతావి.

### 3. అన్నింటికి అదిష్టానాన్ని అనుకున్న యెరుకకు నోరు మూత పడింది.

శి॥ అది యెటువంటిది ?

గు॥ 1. అది పరమగుహ్యం। మహారహస్యం। తలకొట్టినా వొకరితో అనరాదు। తాను మరువకూడదు। దీనికంటె దొరవాక్యంలేదు।

2. విను। కలలో యెంతపెద్ద యేనుగ అయినా కాని శాశ్వతంగా వుండదు గదా। గట్టంత బంగారు చూచినా శాశ్వతంగా వుండదు గదా।

3. కలలో భూమండలము చూచినాము। ఆ భూమండలం శాశ్వతంగా వుండదుగదా। కలలో మహాచదువుకొన్న మగవాణ్ణి చూచినాము। ఆ మగవాడూ। ఆ చదువూ శాశ్వతంగా వుండదుగదా।

4. వచ్చిన వాటికి మూలంయేమీలేదు గదా । వున్నంతశేపూ యెవ్వరి ఆశాముందరపడదుగదా । మేలుకొనగానే అవి అన్నీ ప్రవేశించే దానికిస్థానం యేమీలేదు గదా ।

5. అలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి మూలం యేమీలేదు । కొనకూ యేమీలేదు । వున్నప్పుడు యీ శరీరానికి దిక్కుయెవ్వడూ లేడు ।

6. తనకు తానె తిప్పలు పడవలె । యీ శరీరానికి భారకుడే వుంటె । ధైర్యం వుండనేవుండు దిక్కుమాలింది । నేనే దిక్కునని చాలా శాస్త్రాలు వ్రాసిపెట్టింది.

7. యీ శరీరం కలతో వచ్చిన యేనుగను । యినుప గొలుసులతో కట్టివేసుకొంటె । వుండనట్టే । తండ్రి కొడుకును నమ్ముతాడు । తల్లిబిడ్డను నమ్ముతుంది॥ మొగడు భార్యను నమ్ముతాడు । ఒకర్ని ఒకరు నమ్ముకొని వున్నమాత్రమె । గాని విచారిస్తే యెవరికి వారే ! యమునాతీరే ।

8. కలలో విచిత్రం మేలుకొంటే యేలాగుయేమీ లేదో ।అలాగే । యేదైనా వొకరోగం మించి వస్తే । యీ శరీరం యేమీలేదు । కలలో వచ్చిన శరీరం కొంత వుండి కొంత పోదుగదా । అలాగే యీ శరీరం కొంతవుండి కొంతపోదు । వచ్చేటప్పుడు యెంత వచ్చిందో । అంతాయేమీలేదు ।

9. స్వప్నంలో వచ్చిన శరీరం । పుణ్యం పాపం చేసిందాలేదా । అన్నీ వ్రాసుకొన్నవారు యెవరు । ముందర విమర్శించే వారు యెవరు । అదివేరే యిదివేరే కాదు । వొక్కటే వ్యాపారం । వునికీ వొక్కతీరె । కొనకు యేమీలేదు । యీలాగు అన్ని శరీరాలకూ సమానమె ।

10. పుట్టినవి మళ్ళా పుట్టవు । కలకు మర్యాదా యెవరు చేసినారు । యెవ్వరూ లేరు । కలయెవ్వరి స్వాధీనం లేదు। అందుకే యీ జగత్తుకు దిక్కులేదు । యెవ్వరికి యెలాగు అనుకూలమైతె అలాగె । యెవ్వరెవరి సమ్మతమె మతం ।

11. యే మర్యాద నిలువదు । యెరుక యే అదెరువు లేనిది గనుక । న్యాయం నమ్మరాదు । అన్యాయం నమ్మరాదు । ధర్మం నమ్మరాదు । అధర్మం నమ్మరాదు । కీర్తి నమ్మరాదు । అపకీర్తి నమ్మరాదు ।

12. తనకు తానే పుట్టి । తనకుతానె యేమీలేదు । యీలాగు నిశ్చయం వుంటె । వున్నప్పుడు వ్యవహారానికి కర్తలేడు । వున్నంతశేపూ మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె కర్త ।

13. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే చేస్తుంది। సకలమైన వ్యవహారాలకూ। మూలంలేని యీ గుర్తెరిగే శరీరమేకాని। మరిఒకటి చెయ్యదు। చేయించదు।

14. మొదలూ కొనా లేనిది। రాకడాపోకడా లేనిది। పుట్టనిచావనిది। యెన్నటికీ శరీరంలేనిది। సకలదేశాల యందూ। సర్వకాలాల యందూ। సమస్తమైన వస్తువులయందూ। చలించక। తనకు తానె స్వతస్సిద్ధమై। సర్వకాలం వొక్కతీరూ వున్నదాన్ని। వుండజూచి। మూలంలేని యీ గుర్తెరిగే శరీరము యేమీలేదని దృఢం వుంటె చాలు।

15. యింతకంటే అధికం వున్నదని యెన్నడూ భ్రమపడవద్దు। యీ మార్గం సర్వకాలం। వొక్కతీరే। యిది జ్ఞాన కర్మాల వంటి కలత వాక్యం కాదు। యింతకంటె అధికం లేదు।

16. యిది నమ్మిన వారికి రాకడా। పోకడా లేదు। సర్వకాలం మొదలూ కొనలేక। చలించక యెరుగుటం। మరచుటంలేక। వక్కతీరుగానె। వుండకనె। వుంటాడు। దృక్కుగాని, చూడబడిన దృష్యము గాని దృక్కు దృష్యములకు మూలం లేని ద్రష్ట యేమి లేకపోయెను. గనుక దృక్కు దృశ్యోపాది ద్వయదోష రహితమాయెను.

గద్య:

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే। వేదాంత విచారణే। ఉత్తరభాగే। భ్రాంతి రహిత ప్రకరణం। దృక్కు దృశ్యోపాది ద్వయదోష రహితము ద్వితీయ అధ్యాయం సమాప్తం**



# 15. భ్రాంతిరహిత ప్రకరణము

## తృతీయ అధ్యాయము

## 3. జ్ఞానాజ్ఞానోపాది ద్వయదోష రహితము

### 1. సగం నిజం, సగం అబద్దం చెప్పేనా ఆయనే దొంగ గురువు

1. చెప్ప శక్యం కానిది వొక వింత వున్నది। ఆ వింతకు మొదలు యేమీలేదు। విచారిస్తె। యేమీలేదు। ఆ వింత నేను అని చింత తగిలింది। ఆ వింతను వొదిలించుకొన్నవాడు। భ్రాంతిలేనివాడు। ఆ వింత మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె కాని। మరివొకటికాదు

2. సర్వం మూలంలేని యీ గుర్తెరిగే శరీరం తోటె వున్నది। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం తోటి సర్వం యేమీలేదు। వున్నది తనకు తానె స్వతస్సిద్ధమై వున్నది గనుక। ప్రయత్నం యీ షత్తూ లేదు। గురువాక్యం కంటె యెక్కువ లేదు।

3. గుర్తెరిగే శరీరమనె దర్వాజా తీసివెయ్యని గురువు పనికిరాడు। యిది ఆత్మా। యిది అనాత్మా।అని సఘం నిబద్ధి। సఘం అబద్ధం। అని చెప్పేనా ఆయనే దొంగ గురువు జ్ఞానం దొడ్డది దేహాది పదార్థాలను యెరిగే వాడవు। నీవు అని చెప్పినాయనె అజ్ఞాని

4. నేను యెరుగుదును। నేను యెరుగ। అనె జ్ఞానికే। అజ్ఞానం వున్నది గనుక। జ్ఞానం అజ్ఞానం వొక్కటే। వుంటే రెండూ వున్నవి। లేకుంటె రెండూ లేవు। యిందుకు ॥

**శ్లో॥ జ్ఞాన మజ్ఞానినాం దృష్ట్వా। ద్వయో స్త్వజతి నిశ్చయః ॥**
**ద్వయో స్త్యజతి యద్ జ్ఞానం। తద్ జ్ఞానంచ పరిత్యజేత్ ॥**

5. అని వున్నది గనుక। జ్ఞానము అజ్ఞానము గలవానిని చూచి। జ్ఞానాజ్ఞానములయందలి నిజమును విడుచుచున్నది। జ్ఞానాజ్ఞానములనె ద్వంద్వపదములన్నియూ। నబద్ధములని। యేజ్ఞానము తెలుసుకొనుచున్నదో। అట్టి సుజ్ఞానమునున్నూ విడిచిపెట్టవలెను।

6. యెడమచెయ్యిపని బడితే రెండూ కావలె। కొనకు రెండూ యేమీలేదు। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చంచలం। మూలంలేని యీ గుర్తెరిగే శరీరంలేకుంటె। అప్పుడే అచలం స్వతసిద్ధం। అయివున్నది ॥

7. మూలంలేని యీగుర్తెరిగే శరీరం యేమీలేదు అని రాద్ధాంతం। రాద్ధాంతమె సిద్ధాంతము ॥ యీ గుర్తెరిగే శరీరానికి బీజం। వుండెనా। యీగుర్తెరిగే శరీరం ప్రమాణమె। యీ గుర్తెరిగే శరీరమునకు బీజం లేకుంటె। అప్రమాణం వేరే కాదు। అందుకే ॥

**శ్లో॥ అభీజం వృక్ష సంపన్నం । శాఖా పల్లవ వర్జితం ।**
**పుష్పం నాస్తి ఫలం నాస్తి । సంపూర్ణం వృక్ష వర్జితః ॥**

8. అని వున్నది గనుక । యీ గుర్తెరిగే శరీరం । యేమిపలికినా అప్రమాణమే ।

9. సర్వకాలం ఒక్కతీరుగా । సకలదేశాలయందూ । సర్వకాలాలయందూ । సమస్తమైన వస్తువుల యందూ । తనకుతానే స్వతసిద్ధమై వున్నదానికి । జ్ఞానకర్మాలు లేవు । ఒక్కటైనా వికారంలేదు ।

10. యీ గుర్తెరిగే శరీరం అది కాదు। అది యీ గుర్తెరిగే శరీరం కాదు । సర్వకాలం ఒక్కతీరుగానే వున్నది । బట్టబయలు మాత్రమే.

**2. చదువుకొన్న పాపాత్ముల కంటే వూరికే ఉన్న రాళ్ళు నయం, గుంజలు నయం**

శి॥ రెండూ వున్నవి గనుక ఒకదాని చేత ఒకదాన్ని సాధిస్తానని అనుకోవచ్చు ।

గు॥ 11. శరీరంలేనిది నిరాకారమై వున్నది । యీకనుపించే శరీరానికి మూలంయేమీలేదు గనుక । వున్నట్టూ వున్నాయేమీలేదు । విచారించిన వారికే యేమీలేదు ।

12. యీ గుర్తెరిగే శరీరం ఒక్క నిర్ణయమైతే । సమస్త నిర్ణయాలు ఆయె । మొదలు నిబద్ధి అయితే కొనెళ్ళానిబద్ధే । మొదలు యేమీలేకుంటే । కొనెళ్లాయేమీలేదు । యెప్పటి పరిపూర్ణమె వున్నది।

13. బట్టబయలును లేదు అన్నా వున్నది । మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని వున్నదన్నా యేమీలేదు యిఘ కూతలు నుంచి యేమిలాభమున్నది ।

14. ఉన్నది వున్నట్టూ విచారించిన వారు దొడ్డవారు । లేనిది వున్నదని వున్నది లేదని అని । అంటే । యెవ్వరికి భ్రాంతి తీరదు । తీరక క్లేశపడితే । ఏమిలాభం । వూరికే వున్నది వున్నట్టూచెప్పి । లేనిది యేమీ లేదని చెప్పితే యేమిపాయె ।

15. అందుకే చదువుకొన్న పాపాత్ముల కంటే । వూరుకే ఉన్న రాళ్ళునయం । గుంజలునయం । పశువులు నయం । ఉన్నది ఉన్నట్లు లేనిది లేనట్లు యెరుగక పాయె । కన్నులున్నవాడు గుడ్డివాడు సమానమే ఆయె గదా !

16. యిద్దరిది ఒక్కటే గుర్తెరుగటం గనుక । వున్నది । వున్నట్టూ । లేనిది యేమీలేదు । అని చదువుకున్నవాడు యెరుగకపాయే । ఛీ । వారి తెలివి నిరర్థకమాయెను ।

17. గురుసాంప్రదాయం లేని చదువు యెందుకు । యెంత వారికి దేహాభిమానం ।

మహోబలువుగా వుంటుంది । అందుకే వున్నది వున్నట్టూ పడదు మూలంలేని యీ గుర్తెరిగే శరీరంయేమీలేదని సర్వకాలం అభ్యాసం చేసేవారికి । పుట్టనిచావని బట్టబయలు । అరిచేతిలో వుశిరికాయ వున్నట్టు వున్నది ।

18. మరి ఒకటియే సాధనచేశినా యేమీలేని దేహం । వున్నట్టు వుంటుంది । శీఘ్రంగా భ్రాంతి రహితంకాదు ।

19. గురువు దగ్గరవున్నకొద్ది ఘట్టి । శరీరంలేని గురువుకావలె । శరీరంలేక యేలాగు వున్నాడో । అని చూఛి నేర్చుకోవలెగాని । అడిగిచెప్పితే సాధ్యం కాదు ।

20. అచల గురువు సహవాసం । చేయవలె । యిది యేరహస్యం । చూస్తే శరీరం వున్నట్టే వుంటుంది । అన్యదృష్టికి స్వదృష్టిచేత । యేమిలేని వారు । వారు శరీరం లేకనే సకల ప్రయోజనాలు । చేస్తారు ।

21. గురువాక్యం యందు నిష్ట నిల్పినవారు । గనుక వారే క్రియాశూన్యులు । వార్కి చేసేటందుకు శరీరం లేదు । విడిచేటందుకు శరీరం లేదు । యేమీ లేదనేటందుకు శరీరం యేమీ లేదు । సర్వకాలం శరీరం లేకనే వుంటారు ।

22. వారే పరిపూర్ణులు" వారే బంధమోక్ష రహితులు । వారే జ్ఞాన కర్మరహితులు । వారే జన్మభ్రాంతిలేనివారు । వారే పుట్టనిచావనివారు । వారే రాకడా పోకడా లేనివారు ।

23. వారే సకల దేశాలయందు చలించకవున్న దాన్ని । సర్వకాలాలయందు । ఒక్కతీరుగా వున్నదాన్ని సమస్తమైన వస్తువులయందు । వున్నదాన్ని యెరిగినవారు । సకలవస్తువులను స్పృజించనివారు। వారే కర్తలు గాక । కారయితలుగాక । వున్నవారు । వారికి బదులు యెవ్వరూ లేరు ।

24. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను అని నమ్మిన । వారి కంటే నీచులు లేరు । వారికంటే పాపాత్ములు లేరు వారే సకల కులాలవారు వారే । అన్నీ గనక । వారికి, పశువులకు సంభాషణ మాత్రమే యెక్కువ, తక్కువ । ఉన్నది.

25. పశువులు పవిత్రం । మనుష్యులు చెడిపోతే । పంచగవ్యం పుచ్చుకుంటే పవిత్రులవుతారని వున్నది । లోకాచారం ।

26. పశువులు యేలాగు నడిచినా । పాపంలేదు పశువులు చదువుకోలేదు గనక । చదువుకుంటే గాని యిది విహితం । అది అవిహితం అని తెలియదు । తెలిశి నడవ కున్నాసరే । యింతే మనుష్యులకు । పశువులకు । యెక్కువ తక్కువ । నడతసమానమె

27. మూలం యెవ్వరికీ యేమీలేదు । అవాంతరదొరతనం । యీ గుర్తెరిగే శరీరపుది । యీ శరీరానికి । మూలంయేమీలేదు । కొనకూ యేమీలేదు । వున్నంతపేపూ సకలతిప్పలు బడి । కొనకు యేమీలేదు । నానామార్గాలనడచి । నానా భ్రాంతులుబడి । కొనకు యేమీలేదు ।

28. చచ్చి మళ్ళా పుట్టదు । ఆలాగు మర్యాదా వుంటే అదిసత్తాగలది । అయి । వున్నట్టే వుండి । యేమీలేదు ।

29. పుట్టనిచావని అచలంఒకటి । పుట్టిచచ్చేది ఒకటి । అని రెండు యెన్నడూలేవు । సర్వకాలం ఒక్కటేగాని । యిది వున్నట్టూ భ్రాంతికద్దు । విచారించనివారికి । యెరుక లేనిది లేనే లేదు, ఉన్నది ఒక్క బట్టబయలు.

## 3. అందరూ గురువులు కారు, ఉన్నది ఉన్నట్టు లేనిది లేనట్లు చెప్పిన వారే నిజ గురువులు

30. అత్యంత గురుసాంప్రదాయ రహితులకు । వున్నట్టు పడదు ।

31. దొంగత్రోవలు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే చేశిపెట్టంది । వాటినన్నిటినీ తీశివేశి । దరువాజా తగులబెట్టి । రాజబాటచేసే గురువు దొరకెనా । అప్పుడే ఒక్కటైనా భ్రాంతి వుండక । కృతకృత్యుడు అవుతాడు ।

32. యే సిద్ధాంతం నమ్మినా బురదలో గుంజ వున్నట్టు । దానిని తీతామంటే బయటకు వెళ్ళకుండా । వుంటాడు । దేహమనే దరువాజా దగ్గర । కావలివాడు । అయ్యి వుంటాడు । ఆవలికి పోలేదు । గుర్తెరిగే యెరుక యనే తాళం వున్నది గనక । యీవలికి రాలేదు ।

33. కడుపులో యెముడికవలె । గుర్తెరుగుతా వుంటాడు గురుస్వామిని వెతుక్కోలేదు । అందరు గురువులె అనుకొన్నాడు॥

34. జ్ఞానం బోధించినవాడు గురువు కాదు ॥

35. భక్తి బోధించినవాడు గురువు కాదు ॥

36. వైరాగ్యం బోధించినవాడు గురువు కాదు ॥

37. దేవతా భ్రాంతి బోధించినవాడు గురువు కాదు ॥

38. మననం చెయ్యమని చెప్పినవాడు గురువు కాదు ॥

39 ధ్యానం చెయ్యమని చెప్పినవాడు గురువు కాదు ॥

40. యెన్ని అనిర్వాతు । జన్మభ్రాంతి లేకుండా । చేశినవాడె గురువు ।

41. వున్నది వున్నట్టు తెలిపినవాడె గురువు ।

42. లేనిది వున్నది । వున్నది లేదని చెప్పినవాడు పైదార్లుగాని । తమరు దాటలేరు మరివొకరిని దాటించలేరు । లోకులను చెడుస్తూ వుంటారు ।

43. ఘట్టివాడు యెవరిని నమ్మడు । చూచి । చూచి । సహవాసం చెయ్యవలె । రాజమార్గం పిల్లబాట అయింది । చూచి విచారించెనా । అటు తర్వాత యేదీ రుచివుండదు ।

44. మొట్టమొదలు । పుట్టని చావని । దాని జాడ । కనుక్కోవలె । కనుక్కొని । యీ దేహపు వర్తమానం అడగవలె । యీ రెండేగాని । మూడో ముచ్చట అడుగవద్దు ।

45. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చంచలం । యీ శరీరం దేనియందు వున్నదో । అదే అచలం

46. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అచలాన్ని స్ఫురించక, వున్నది । ఆ అచలం । లేని యీ గుర్తెరిగే శరీరాన్ని తగలక వున్నది । దాని పేక్ష్యం దీనికి లేదు దీని పేక్ష్యం దానికి లేదు

47. దానికిందిది యిది కాదు । దీని కిందిది అదికాదు । అది శాశ్వతంగా వుండేది । యిదియేమీలేదు । వెనకాయేమీలేదు । ముందరా యేమీలేదు । వున్నట్టూ వుండేది వెంటనే యేమీలేదు ।

48. విత్తనం లేని చెట్టు । యింత నమ్మదగంది । యేమీలేదు మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే అనేక అవతారాల యెత్తినది । పుట్టని చావని అచలం యెన్నటికీ । పుట్టదూ చావదూ ।

## 4. గురు శిష్య సంవాద చర్చ

**గు॥** యీ బట్టబయలు । వున్నదా లేదా **శి॥** వున్నది

**గు॥** యీ బట్టబయలుకు మొదలు కొనా వున్నదా లేదా

**శి॥** యీ బట్టబయలుకు మొదలు కొనాలేదు

**గు॥** యీ బట్టబయలుకు రాకడా పోకడా వున్నదా లేదా

**శి॥** రాకడా పోకడా లేదు

**గు॥** శరీరం వున్నదా లేదా **శి॥** శరీరం యెన్నటికీ లేదు

గు॥ చెయ్యటం చేయించటం వున్నదా లేదా శి॥ లేదు

గు॥ వొక్కటైనా వికారం వున్నదా లేదా

శి॥ వొక్కటైనా వికారం లేదు

గు॥ సర్వకాలం ఒక్కతీరుగా వున్నదా । లేక మరో తీరుగా వున్నదా

శి॥ సర్వకాలం యేలాగువున్నదో ఆలాగే వున్నది

గు॥ యీ బట్టబయలు సకలదేశాల యందు సమంగావున్నది గదా

శి॥ సమానంగా వున్నది

గు॥ ఈ బట్టబయలు యీ శరీరం వలెకాదు గదా

శి॥ యీ శరీరంవలె కానే కాదు

గు॥ 1. యీ గుర్తెరిగే శరీరాన్ని క్షణమైనా నమ్మరాదు । నమ్మినవార్ని చెరిచేది । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే బట్టబయలు ఇటువంటిది గాదు । యీ బట్టబయలు । సమస్తదిక్కులందు వున్నది । ఆబైలు చొర్రా చొర్రదు । వెళ్ళ వెళ్ళదు ।

2. అందుకే । అచలం । తనకు తానే స్వతఃసిద్ధమైవున్నది । యెన్నటికి ఒక్కతీరే । ఆకలీ లేదు । దప్పీలేదు । యెన్నటికీ । భోంచెయ్యదు । మాట్లాడదు । తలాలేదు । కాళ్ళూలేవు।

3. అందుకే । గురు వాక్యం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదని సిద్ధాంతం । సిద్ధాంతమే రాద్ధాంతం ।

4. జ్ఞానంను విడచి అజ్ఞానం ఉండదు, అజ్ఞానంను విడచి జ్ఞానం ఉండదు. ఉంటే రెండు ఉంటావి. గనుక జ్ఞానాజ్ఞానోపాధి ద్వయదోష రహితమే । సర్వభ్రాంతి రహితము.

గద్య:

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే । వేదాంత విచారణే । ఉత్తరభాగే । భ్రాంతి రహిత ప్రకరణం । జ్ఞానాజ్ఞానోపాది ద్వయదోష రహితము తృతీయ అధ్యాయం సమాప్తం**



# 15. భ్రాంతిరహిత ప్రకరణము

## చతుర్థ అధ్యాయము

## 4. సదసదుపాది ద్వయదోష రహితము

### 1. మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం అనేక అబద్ధాలు ఆడింది

1. మొదలు యేమిలేదు, కొనా యేమిలేదు । ఈ శరీరాన్ని యేలాగున నమ్మ । ఒకవేళ నమ్మితే కలలో యేనుగును ఇనుప గొలుసులతో కట్టి వేసుకొన్నట్లు ।

2. కట్టివేసి దానాపెట్టుకుంటూ చెరుకు మోపులు కొని వేసుకుంటూ ధర రావలెనని కావలి పండితే । ధర వచ్చింది । యెంతో సంతోషం కూడా వచ్చింది కాని ।

3. ధర వచ్చి రూపాయల సంచులు । అడిగినట్లు అయ్యవారు యిస్తామని రూపాయలు లెక్క బెట్టె సమయానికి మేలుకొంటే యేమి లేకపాయె । యేలాగో । ఆలాగే

4. మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యింతేగాని మనము అనుకున్నట్టు పడితేకాదు । మొదట అధెరవు లేదు కొనకు అధెరవు లేదు । వున్న బట్ట బయలుకు యీ శరీరం జోలె పట్టదు.

5. మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం అనేక అబద్ధాలు ఆడింది నమ్మకం పొయ్యేరోయేమో అని । అనేక శాస్త్రాలు చేసి యింటింట పెట్టింది.

6. మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం అనేక భాషలు నేర్చుకొని సమస్తమైన భాషల చేత గ్రంథాలు రచించి పాంచాలపు వారు కౌతుకం నగలు చేసినట్టు చేసింది, విచారిస్తే కంచు వెండి లేందె యెనిమెదో వన్నె । యేడో వన్నె । బంగారం మాత్రం యెక్కడ లేదు. ఆలాగు చేసింది.

7. మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు గనుక యిటువంటి శరీరం చేత పుట్టని చావని బట్టబయలు సాధ్యం అవుతుందని యేలాగు నమ్మాలి । గనుక గురు కటాక్షం శీఘ్రుంగా సంపాదించుకొని భ్రాంతి లేని మార్గం తెలిసి కాలం గడిపిన వాడు ధన్యుడు.

8. ఈ బట్టబయలు ఉన్నదో లేదో అని అనుమానం లేక ఉండజూచి మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదని క్షణమైన మరువక కాలం గడిపే వాడు భ్రాంతి లేని వాడని రాద్ధాంతం । రాద్ధాంతమే సిద్ధాంతం.

9. సకల శాస్త్రాలు వడియబోస్తే ఈ అభిప్రాయం బయట పడ్డది ఈ అభిప్రాయం చేతనే అనేకమంది భ్రాంతిలేని వారు అయినారు, సర్వకాలం గురువాక్యం మరవకుంటే విచారణకు ఫలమని గురు పరంపర ప్రాప్తి అయింది.

## 2. శరీరం లేని గురు సాంప్రదాయం అయితే శరీరం లేకుండా చేస్తాడు.

గు॥ యీ మార్గం గాక మరి ఒకటి నమ్మేన భ్రాంతి అధికమై సుఖదుఖ సముద్రంలో మునిగి తేలడం ఎందుకు? శరీరం లేని గురు సాంప్రదాయం చూచి వెతుక్కోవాలి.

1. శరీరానికి మూలంయేమి అని అడిగి । యీ రెండూ వుండజూచుకొని । పుట్టని చావనిది । యెక్కడ వున్నదని అడిగి । నాకు సర్వకాలం ఒక్కతీరుగా యేలాగు అయ్యేనని । అడిగి తెలసుకోవలె

2. క్రియాశూన్యం । యేలాగు । జన్మభ్రాంతి యేలాగు బాసిపోవు । సర్వకాలం శరీరంలేక । యేలాగు వుండవలెనని । అడగవలెను ।

శి॥ అడిగితిని । స్వామి ! మీరే ఆ వాక్యాన్ని దయచేయండి ।

గు॥ 1. దాందేమి । యేమీలేని బట్టబయలులో । యేమీలేక వుంటే విచారణకు ఫలం । యీ గుర్తెరిగే శరీరంతో । కొంచెం ఆశపడ్డా వికారం తప్పదు । శాస్త్రాలనే గోతిలో పడి తనను తాను ఎప్పటికి యెరుగ లేదు.

2. యేమీలేని దానిలో గురువాక్యం చేత । యేమీలేకుంటే పరిపూర్ణమే । చలించక వున్నది । పట్టావద్దు విడువావొద్దు ।

3. "యేమీలేదని యేలాగంటే ఆలాగునడువావద్దు" సర్వకాలం క్రియాశూన్యమె చేసే । గురు కావలెను.

శి॥ శరీరం యేమీలేకుంటే చేసేది యేమి స్వామి!

గు॥ చేసేది వున్నదని । గురువాక్యం వినక ముందు భ్రాంతి వుండె । యిప్పుడు గురువాక్యం। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని తెలిసితే । పరిపూర్ణమైన అచలమే వుండే ।

## 3. యెందరో వచ్చి యెందరినో పుస్తకాలనే గుంజలకు కట్టివేసినారు

శి॥ మళ్ళా అడిగేటందుకు ఆశలేదు । యీ శరీరం తీసివేశిన తరువాత యేమిచేత అడుగవలెను।

గు॥ యేమీలేని శరీరాన్ని తెచ్చుకున్న దాకా యేమి అడిగేదింకా యేమి లేదు ।

1. "మంచిగురువు । ఆయెనా మాటే ఆడడు । శిష్యుడు మూర్ఖుడు ఆయెనా మంత్రం చెప్పి తంత్రంలో కలిపితే పోయే । లేకుంటే రుద్రాక్షలు ధరింపజేశినా సరే । జపం చేసుకుంటూ ఉంటాడు.

2. దొంగ శిష్యుడు ఆయెనా । చక్రాంకితం వేశేది । మరీ ఘట్టివాడు ఆయెనా । అగ్ని హోత్రాలు చేసుకొమ్మని చెప్పేది । దేవతార్చన చేసుకొమ్మని చెప్పేది । కాశీనుంచి జగన్నాథం । జగన్నాథం నుంచి రామేశ్వరం । శీఘ్రంగా కావిడి మోసుకొమ్మని । రమ్మనేది । వారికి నేనులేని సిద్ధాంతం పట్టదు.

3. వున్నది వున్నట్టూ మొద్దులకూ । తెలుపకూడదు । యే దానా తినే వారికి । ఆదానా పెట్టవలె ।" సర్వసాధారణంగా చెప్పకూడదు । వారికి సంసార కోరికలు ఉన్నాయి గనుక వారికి నేను లేని సిద్దాంతం పడదు.

4. బట్టబయలు పుట్టని చావనిది అని । అందరికీ యదార్థమే । యెవ్వరూ యెరుగరు । అందరూ యీ బట్టబయలులోనే వుండి । యీ బట్టబయలు యింత దొడ్డదని యెరుగరు । యీ బట్టబయలు అచలమని యెరుగరు । యీ బట్టబయలులోనే అందరూ వున్నారు।

5. యీ బట్టబయలు పుట్టని చావనిదని యెరుగరు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । నేను । అని । జ్ఞానమనే అజ్ఞానం చేత । భక్తి అనే అభక్తిచేత । వైరాగ్యమనే రాగంచేత । యీ శరీరాన్ని ఘట్టిగా పుస్తకాలనే గుంజలకు కట్టివేసుకున్నారు ।

6. యింతే కాని యీ శరీరానికి । మూలం యేమీలేదని యెరుగరు । మధ్యవున్నట్టే వుంటుంది । వెంటనే యేమీలేదు । అని యెరుగరు । యేమీలేదని అందరికీ యెరుకే । వున్నాది । వున్నా గాని నిద్ర అని అబద్దాలు ఆడుతారు ।

7. యేమీలేదు గనుకనే । నిద్రకొంచం వున్నా కల అని అనిపించుకొంటుంది । గాఢా నిద్ర అంటే యేమీలేదు అనుట మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అనుట । అభిప్రాయం । ఆలాగే సార్వకాలం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు యిందుకు ॥

8. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । యేమీ లేదని నిశ్చయం గలవారు పరిపూర్ణమనే అచలమే ఉన్నదని తెలిసిన వారు । చలించే శరీరం యేమీలేదు గనుక । యీ పుట్టని చావని బట్టబయలు వలన । యీ శరీరం పుట్టనేలేదు ।

## 4. శంకరాచార్య స్వాముల వారు శరీరాలకు గుర్తెరిగే శరీరం మూలం అన్నారు

9. మరిఒకటి మూలం వుండె దాన్ని బైటబెడితే తునకలవలె చిన్నవాండ్రే తీసివేస్తారు। ఆచార్య స్వాములవారు। మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే। శరీరాలకు మూలం అని। చెప్పినారు.

10. యీ గుర్తెరిగే దానికి వికారాలు లేవని। అన్నారు.

11. యీ గుర్తెరిగే దానికి కర్మాలు లేవని। ఈ గుర్తెరిగే దానికి గుణాలు లేవని। అన్నారు.

12. గుర్తెరిగేది ఒక్కటె అని। అన్నారు.

13. గుర్తెరిగేది భోంచెయ్యదు అని। అన్నారు.

14. శరీరం వేరే అని। అన్నారు.

15. గుర్తెరిగేది వేరే అని। అందరి చేత భంగపడ్డాడు।

16. గుర్తెరిగేది అన్నం తింటుంది అన్నారు। యీ మూలంలేని। యీ గుర్తెరిగే శరీరం। అన్ని అయింది అన్నారు।

17. యీ గుర్తెరిగే శరీరం తనకు తానే వచ్చి। తనకు తానే యేమీలేదు। అని చెప్పలేదు యీ పుట్టని చావని బట్టబయలులో యీగుర్తెరిగే శరీరం వున్నట్టూ వుండేది।యేమీ లేక పొయ్యేది। స్వభావం। దీనిని నిల్పేవారు। లేరు యేమీలేని బట్టబయలులో యేమీలేని విత్తనంలేనట్టు। వున్నది।

18. గురుసాంప్రదాయం వలన విచారిస్తే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు। పుట్టని చావని బట్టబయలే వున్నది। సర్వకాలం ఒక్క తీరే। ఉన్నది.

19. గురుమూలంగా యేమీలేదు। గుర్తెరిగే శరీరం యేమీలేదు। అని అనంగానే। అచలం స్వతశ్శిద్ధం। సిద్ధమై ఉన్నదానికి। యెటువంటి బాధలేదు।

20. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని। చెప్పంగానే పుట్టని చావనిది। మొదలు కొనాలేనిది। రాకడా పోకడాలేనిది। సకల దేశాలయందూ। సర్వకాలాలయందు। సమస్తమైన వస్తువులయందు। తనకు తానే స్వతఃసిద్ధమై చలించక। సర్వకాలం శరీరం లేక వక్కతీరుగా వున్నది।

21. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నుంచి। సర్వమూ తోచింది। శరీరంతోటి అన్నీపోయినవి। వున్నదానికి తోచలేదు। పోనూలేదూ। యేలాగు వున్నదో। ఆలాగే వున్నది।

22. గురుసాంప్రదాయం దొడ్డది ఆయెనా। భ్రాంతిరహితం అవుతుంది।

23. గురు సాంప్రదాయం లేక। తన కల్పన ఆయెనా। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేత। సాధ్యంకాదు। సాధనసాధ్య పరామర్శ రహితమైంది।

24. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం। సకల కర్మాలకూ మూలం। అయ్యి అహంకారంతో ఉన్నది.

25. మూలంలేని ఈ గుర్తెరిగే శరీరమే మహాలింగం। యీ మహాలింగమే నక్కనారాయణ అందురూ యీ మూలంలేని। యీ గుర్తెరిగే శరీరమే మోసుక వున్నారు। యెన్నటికీవేసట లేదు। శీఘ్రంగా శరీరంలేక గురుసాంప్రదాయం కనుక్కోని। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేలాగు వచ్చినదని అడిగి। యదార్థంగా చెప్పెనా నమ్మి। శీఘ్రంగా కనుక్కోవలెను।

26. కనుక్కోక శరీరం నిల్పుకొని। సాధనలు చేసెనా। కోటి శరీరాల చేతనైనా। పరిపూర్ణం సాధ్యంకాదు।

27. తనకు తానే స్వతశిద్ధమై వున్నది గనుక। రెండో దానికే భ్రాంతి। అందుకే బట్టబయలు వున్నదా లేదా। అని అడిగేది। ఘట్టిగా వున్నది। అనెనా। యీ శరీరానికి మూలంయేమీ లేదు। మూలం వున్నది అని అందరూ గడ్డి తిన్నారు।

28. శంకరాచార్యులు దేహాదీ పదార్థాలను। గుర్తెరిగే క్షేత్రజ్ఞ స్వరూపమనే। పరాప్రకృతిని ఆత్మను వాచ్యార్థమందే స్థిరపరిచి। అబద్ధమాడి। యీ ఆత్మేపరబ్రహ్మ స్వరూపం నిర్గుణమని అన్నాడు ॥

29. **శృ॥"అయమాత్మా బ్రహ్మ అనే"** అబద్ధాల శృతిముందరబెట్టినాడు। ఆ అబద్ధాన్ని లెస్స విచారిద్దాము। గుర్తెరిగే క్షేత్రజ్ఞ స్వరూపమే। పరబ్రహ్మము అయితే। క్షేత్రమెందుకు। పరబ్రహ్మ స్వరూపము కాదు।

30. బ్రహ్మం జగత్కారణం గనుక క్షేత్రజ్ఞస్వరూపమైన ఆత్మకూ। బ్రహ్మకూ వేరు గానట్టె। బ్రహ్మం కార్యమైన క్షేత్రానికి వేరులేదు। సర్వం బ్రహ్మస్వరూపమే। కార్యకారణలకు భేధం యెన్నటికీ లేదు। బ్రంహ్మ సత్యం। జగత్తు లేదు అనుటయెందుకు।

31. సర్వం గుర్తెరిగే బ్రహ్మ స్వరూపమేనని। గుర్తెరిగే చైతన్యమనె। జ్ఞాన స్వరూపం నిబద్ధి అని। ఖర్మాల అబద్ధం। అని యెందుకు మొరగవలెను।

32. గుర్తెరిగే చైతన్యం నిర్గుణం । శరీరాలు సగుణం అని యెందుకు కుయ్యవలెను ।

33. దేహాది పదార్థాలను । గుర్తెరిగే బ్రహ్మ స్వరూపం శాశ్వతమైంది । దేహాలు అసత్తు యేమీలేదు అ ని యెందుకు అనవలెను ।

34. ప్రకృతికంటే పరమని యెందుకు అనవలెను ।

35. శుక్తి యందు రజితం తోచినట్టు తోచినదని యెందుకు అనువలెను ।

36. వొకటి వున్నది వొకటిలేదు అని యెందుకు అనవలెను ।

37. క్షరోపాది అని యెందుకు అనవలెను ।

38. అక్షరోపాది అని యెందుకు అనవలెను ।

39. జగత్తుకు కారణం వున్నంతశేపూ । కార్యాలు యెందుకు లేకపోతావి । సరే యీలాగు వుండనీ।

40. గుర్తెరిగే శరీరమనే పరబ్రహ్మమే । శరీరాన్ని పుట్టించిందే । పరబ్రహ్మసాన్నిధ్యం వలన । ప్రకృతి కల్పించిందే । గుర్తెరిగే పరబ్రహ్మముకు వికారాలు లేవు అన్నారు । వికారాలు యెవ్వరికి । అకర్త అన్నావు । అబోక్త అన్నావు ।

41. రెండోది యేది అబద్ధమే । రజ్జువునందు సర్పభ్రాంతి తోచినట్టు తోచింది । యేమివున్నదని భ్రాంతి । కలకు మూలం వున్నదనే వారు కలలో వారే ।

42. కలలో అన్న మాటలకూ । శంకరాచార్యుల పాండిత్యానికి । పాటి లేదు । కలలోవచ్చిన పురుషుని యేలాగున నమ్మవలె నమ్మేటందుకు । ఆశలేదు

43. అందుకే శంకరాచార్యులది । ఒక అవతారంగాని । పుట్టని చావని పరిపూర్ణులని । అనుకోరాదు । రామావతారం వలెనె । కృష్ణావతారం వలెనె । పుట్టని చావని పరిపూర్ణులు అయితే జగత్తుకు మూలం వున్నదని । యీలాగు యెవ్వరైనా మధ్యవచ్చి మధ్యనే యేమీలేకపోయే । అప్రమాణీకుడు ఆడే వాక్యాలవలె వున్నవిగాని । వున్నది । వున్నట్టూపడే యుక్తిగాదు ।

44. యిటువంటి అప్రమాణం వలన । యేమిలాభమోగాని । బహుశ్రమపడ్డాడు । దీన్నుంచి ప్రజలకు । సుఖంలేకపాయె । తనకూ మహాపాపం ఘటించె । జగత్తుకు కారణం వున్నదని । పెద్ద అబద్దం ఆడి । అందరినీ అడవిలో కలిపిరి.

శి॥ 45. వక్కటె వక్కటె అని । గుర్తెరిగే చైతన్యం నిబద్ధి అని । అందరూ వక్కటే అనిరి । దేహాలు యేమీలేవు అని । శంకరులు చేశిరి.

46. గుర్తెరిగే శరీరం వక్కటే అని। నమ్మిన వాండ్లకూ జనన మరణాల నరకం తప్పకపాయే । స్వర్గం యెటువంటిదిదో । తెలియకపోయెను.

గు॥ 47. శంకరాచార్యులవారు । జ్ఞానం । నిబద్ధి । కర్మాలు అబద్ధం అంటె । గుర్తెరిగే జ్ఞానం వున్నంత శేపూ । ఖర్మాలు వొదులనే వొదులవు । ఆచార్య స్వాములవారు మహాచదువుకొన్నవారె గాని । వారి మార్గం అబద్ధాల మార్గం అని । చాకలివాడు అయిన ఒప్పకపోయేను ।

48. చాకలివాడూ అనె। అంటే వస్త్రం యెంత తెల్లగా ఉతికినాగాని దానిని వాడు కట్టుకోగానే తిరిగీ మలినం అంటుతుంది । అనే దృఢం వీనికిన్నీ ఉన్నది. ఛీ । యీ గుర్తెరిగే జ్ఞానం వున్నంతశేపూ ఖర్మాలు పోనేపోవు అని ఎవరిది వారికే యెరుక ।

49. మంగలివాడు సంతోషపడకపోయె । అంటె యెంత నున్నగా చేశినా గాని మరునాడు మొలుకెత్తుతుంది అని వీనికీ దృఢం వుండె అయ్యో । యెంత వెర్రి మాట అన్నాడు ।

50. నేనె మాదిగవాణ్ని అని । చెప్పులు ముందర వేసుకొని । కుడుతాడు । యీ గుర్తెరిగే శరీరమె మాదిగది । నేను నేననే గుర్తెరిగే యెరుక । వున్నంతశేపూ । నా మాదిగతనం పోదు । నేను యీ గుర్తెరిగే జ్ఞానం । నేనయ్యా అంటె । యెవ్వరూ చేరనివ్వరు । అనెను.

51. యీ గుర్తెరిగే చైతన్యం చెప్పులు కుట్టికుట్టీ మూటలు మొయ్యవలె । యింతేకాని । యీ గుర్తెరిగే జ్ఞానం గవ్వకైనా । పనికి రాకపాయె । గనుక గురువాక్యం సూచనైతే గురుతే లేకపాయె.

52. రావణాసురుడు । సన్యాసివేషం వేసుకోని । స్త్రీని అపహారించుక పోయినాడు । భక్తులకు దొడ్డదిసీత ॥ భ్రాంతి రహితులకు యేమీలేదు । సీత భక్తురాలు గనుక । సన్యాసి అని భక్తిచేత వుంటే । సన్యాసి వేషంలో ఉన్న రావణాసురుడు యెత్తుకపోయినాడు ।

53. సన్యాసిని నమ్మరాదు । మనిషిని కుక్కను జేసి । రాత్రి దానితోను సంసారం చేసి । మళ్లీ కుక్కను చేస్తాడట । సర్వాత్మనా సన్యాసిని నమ్మరాదు । శరీరాలను కూడా నమ్మరాదు । తమరు చెడిమందిని చెరిచేవాండ్లు । ఛీ । ఛీ । సన్యాసులను స్మరించరాదు । యెందుకంటే భక్తి, జ్ఞానురాలైన సీతమ్మనే మోసం చేసెనని శాస్త్రమందె ఉన్నది ।

గు॥ 54. జగత్తుకు కారణం వున్నదన్నవారి పాపం । రెండో వానికి లేదు । యింత అన్యాయం । కలకు మూలం వున్నదని । అనరాదు । తమకు తామె వచ్చినారు । మనను యెరుగుదురు । మనము వార్ని యెరుగుదుము । వారు రాకున్నా । మనము యేమీలేదు వారు యేమీలేదు । కలరాకమునుపు యేలాగువున్నదో । ఆలాగే సర్వకాలం వొచ్చేటందుకు మూలంయేమీలేదు గదా

## 5. మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు గనుక జనన మరణములు భ్రాంతి జన్యములని చెప్పబడింది.

గు॥ ఉన్నప్పుడు పాలించేటందుకు యెవ్వరు ఉన్నారు ।

శి॥ అవును, యెవ్వరూ లేరు । స్వామి ।

గు॥ యిటువంటి శరీరానికి । పరబ్రహ్మం కారణమంటె యెవరు నమ్మేరు । నమ్మి చెడిపొయ్యే మాత్రమె । యీ గుర్తెరిగే శరీరం వికారాలు లేనిది అంటె । యెవ్వరు నమ్మేరు । యీ గుర్తెరిగే శరీరం వున్నాదని అంటె యేలాగు । మొదలు యేమీలేదు । కొనయేమీలేదు । ఉన్నప్పుడు యేమైనా ఆశవున్నాదేమో అని చూస్తు వుండంగానే యేమీలేదు ।

శి॥ మాటలు । వినటం చెయ్యటం । తినటం । బట్టి నిబద్ధియేమో అనిపిస్తుంది ।

గు॥ 1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి యేమి అధెరువు చూచి నమ్మవలెను । అందుకే । యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేశిన వ్యవహారానికి । మర్యాదలేదు।

2. పెద్దపులిని జూచి పశువులు వొణికినట్టు । బలవంతమైన శరీరాన్ని జూచి । బలహీనుల శరీరాలు వణుకుతావి । యింతేకాని । కేవలం న్యాయంలేదు । ఇది కేవలం అన్యాయమే।

3. చేసే కొద్దీ వ్యాపారం । అడవిలో పెద్దపులి వలె యెంతవారికీ । మూలం వున్నాదని భ్రాంతికద్దు । యీ శరీరానికి మూలం ఫలానిది అని యెవ్వరూ గెలవలేరు ।

శి॥ అబద్ధాలు నమ్మికకు రావు । అందుకే మొట్టమొదులు । బట్టబయలు వున్నదా । లేదా అని అడుగవలెను । గట్టిగా వున్నది అనెనా । అప్పుడే భ్రాంతి లేనివాడు అవుతాడు

గు॥ 1. అవుతాడుగాని । యీ శరీరానికి । మూలమేమైనా వున్నదా లేదా అని అడిగి శీఘ్రంగా తెలుసుకోవలె । తెలుసుకొంటె । మూలం వున్నది అనెనా । కలత సాంప్రదాయకం అని గ్రహించవలెను ।

2. లేదు అనేనా । దృష్టాంత పూర్వకంగా సమాధానం చెప్పండి అనేది । అంటె । యిది

యెంత । కలకు మూలం యేమీలేదు ।

3. కలలో వచ్చి యెంత ప్రతాపం చూపినా । నిబద్ధి అని నమ్మరాదు । నిబద్ధి అని నమ్మరాదు । వెంటనే మేలుకొంటె వారికి । మనము యేమీలేదు । మనకు వారు యేమీలేదు ।

4. తనకు తానే స్వతసిద్ధమై వున్నబట్టబయలు యేమీలేదు । యేలాగు వున్నది ఆలాగే వున్నది దానికి రాకడాపోకడా లేదు । వునికీ లేదు । యేమీ లేకపోవుటం లేదు ।

5. సర్వకాలం వొక్కతీరే । యిటువంటిది యేమి సాధించిన యేమీలేదు । సర్వకాలం శరీరం లేనిదే వున్నది । తనకు తానే స్వతసిద్ధమై వున్నది । యెన్నటికీ చలించక వున్నది. ।

6. సత్తు గాని అసత్తుగాని । ఈ రెంటి కూడిక లేక పోయెనా । జనన మరణాల భ్రాంతే ఉండదు । పుట్టించేది లేదు । పుట్టేది లేదు । అంతా బట్టబయలే ఉన్నది.

7. ఇట్టి సదసదూపాధి ద్వయదోష రహితమంటే కలదోచిన శరీరాలు యేలాగో ఆలాగే । మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదుయని గురువాక్యమైతే అంతా బట్టబయలే ఉన్నది ।

గద్య:

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే । వేదాంత విచారణే । ఉత్తరభాగే ।
భ్రాంతి రహిత ప్రకరణం । సదసదుపాది ద్వయదోష రహితము
చతుర్థ అధ్యాయం సమాప్తం



# 15. భ్రాంతిరహిత ప్రకరణము

## పంచమ అధ్యాయము

## 5. విద్యావిద్యోపాది ద్వయదోష రహితము

### 1. గురువాక్యం చేత సకల భ్రాంతి రహితం అవుతుంది

1. పుట్టనిచావనిది। సకల దేశాలయందూ। సర్వకాలాలయందూ। సమస్తమైన వస్తువుల యందూ। జ్ఞానకర్మాలనేవిలేక। అంతటా బట్టబయులు నిండి నిబిడి కృతమై యున్నది। తన్నుతాను యెరుగక। స్వతఃసిద్ధమై యున్నది।

**నిత్యః ॥సర్వగతః ॥ స్థాణుః ॥ అచలః ॥ సనాతనః ॥ అన్నట్లు**

అయింది యీ బట్టబయలేకాని। మరి ఒకటికాదు। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు। అనిదృఢం వుంటెచాలు। సర్వకాలం వొక్కతీరే।

2. పరిపూర్ణం తనకు తానె స్వతసిద్ధమై వున్నది గనుక। ప్రయత్నం చేయుటకు జ్ఞానమే లేదు

యేది ప్రయత్నం చేయబోతుందో। అదె యేమీలేదు। అందుకే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు। అని రెప్పపాటులో సగంకాలమైనా మరువక వుండవలె। వుండకపోయనా। అందరివంటి భ్రాంతుడే అవుతాడు।

3. యీ రుచి అభ్యాసదారుధ్యం వున్నకొద్దీ। అనాయాసం। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం ఆవరణంవలె వున్నది। గురువాక్యం చేత సకలభ్రాంతి రహితం అవుతుంది। యీ గుర్తెరిగే శరీరం చేత సాధించుదామని। సాధన చేశినా। యెన్నటికీ సాధ్యం కాదు।

4. యీ బట్టబయలు తప్పవిడిచి। రెండోది యేమీలేదు। యేమీలేనిది మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె। మొదలు యేమీ లేదు। కొనకు యేమీలేదు। వున్నప్పుడు గురువాక్యం చేత। మూలంలేని। యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు। అని వున్నప్పుడు కనుక్కొనెనా। వాడు ధన్యుడు। ఉన్నప్పుడు కనుక్కోకపాయెనా। అన్నిటి వంటివాడె। అవుతాడు।

5. శరీరం లేని గురుసాంప్రదాయం అరుదు। దాన్నుంచేకాని। సకలభ్రాంతి రహితం కాదు। ఖర్మాలకు మూలంమూలంలేని యీ గుర్తెరిగే శరీరమె కాని। మరిఒకటి మూలంకాదు।

6. యీ శరీరంలో కొంతమంచిది । అని ఆశబడితె । అదె విషం । కలలో వచ్చిన యేనుగ యొక్క దంతాలకు ఆశపడితే మేలుకొంటే యేమీలేదు । అలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని గురువాక్యంచేత మేలుకొంటె । యెప్పటిబట్టబయలె । వున్నది ।

7. యీ బట్టబయలును యధాతధంబని అనుకోవలె । యీ బయలె వుండవలె । యీ దేహభ్రాంతి నిశ్శేషంగా వొదులవలె । వదులకపోతే కంటిలో నెరుసువలె బాధపెడుతుంది ।

8. అందుకే యీ శరీరం లేని మార్గం కఠినం । బుద్ధిమంతులకు శులభం । వేషధారులకు కఠినం కోటి మాట్లకూ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని సంతతం । సర్వకాలం యిదె అనుష్టానం । చేయవలె । యింతకంటె ఎక్కు లేదు ।"

## 2. భ్రాంతిలో బడవేసే మంత్రాలు

9. గాయత్రీ మంత్రం ।

10. పంచదశీ మంత్రం । యింతకంటే తక్కువే ।

11. పంచాక్షరీ మంత్రం । యింతకంటె తక్కువ

12. అష్టాక్షరీ యింతకంటె తక్కువ । యేది యెక్కువ అంటె అది గురువాక్యం ।

13. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । మూలంయేమీలేదు । కొనకూ యేమీలేదు । ఉన్నప్పుడూ యేమీలేదు । సర్వకాలం యీ బట్టబయలు వొక్కతీరుగా వున్నది । యేమీలేని బట్టబయలులో । యేమీ లేకవున్నవారు । భ్రాంతిలేక వున్నవారు

శి॥ 14. యీ బట్టబయలుకూ తనకూ వేరుగాకుండావుంటె సరి అనుకొంటాను.

గు॥ 15. బట్టబయలు అన్నా తాను అన్నా వొక్కటే నని । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేత । అదే నేను । నేనే అది అని భావనచేస్తే మునుపటి వలెనే ఉంటావు.

16. మొదలూకొనాలేక । కేవలం బట్టబయలులో తాను లేక వుండవలె । ఇది కఠినం కాదు । గురువు కలతలేనివాడు అయితే సరి । యిదే నిజం.

17. యేలాగంటే అలాగు నడిచే గురువు పనికిరాడు

18. నడిచేశరీరమై వున్నాడు గనుక । విడిచి గాభరా అయివున్న గురువు పనికిరాడు ।

19. నడిచేది । విడిచేది । గాభరా అయ్యేది మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం వొక్కటే గనుక యీ॥ వొక్కటేఅయ్యి యెరుకసత్యమనెటి గురువుపనికిరాడు ।

20. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అయ్యి ఉండి శాస్త్రవాసనలు నమ్మిన గురువు పనికిరాడు ।

21. సర్వకాలం శరీరం చేత సాధనచేశె గురువు జపతప యజ్ఞయాగాదులు చేసే గురువు భ్రాంతిరహితం చేసేటందుకు పనికిరాడు ॥

22. యేమీలేని శరీరం నేను అని నమ్మినాడు గనుక । సర్వకాలం యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదని । నమ్మికవున్న గురువు కావలెను ।

23. యిటువంటి గురువుకు శరీరంలేదు గనుక । చెయ్యాచెయ్యడు । విడువావిడువడు । పట్టాపట్టడు । శరీరమేలేదు । చేశేది దేనితోటి

శి॥ అట్లయితే గోడవలె వున్నాడా

గు॥ గోడవలె గోడే వున్నది

శి॥ అట్లయితే శరీరంలేని గురువు యేడి

గు॥ 24. శరీరంలేని వారికి యెటువంటి భ్రాంతులకు లోనయ్యే యిచ్చే వుండదు యిచ్చలేకుంటే కేవలం తాను లేని వారయ్యి బట్టబయలే నిజమని బ్రతికే వారు । వారే భ్రాంతిరహితులు.

25. కేవలం బట్టబయలుకు రాకడాలేదు । పోకడా లేదు । లేదు లేదు అని నడచేవారు కొందరు ।

26. ఉన్నది ఉన్నది అని నడచేవారు మరికొందరు । ఉన్నారు.

27. అన్నీ విడిచి గాభరా అయ్యేవారు కొందరు । అందరికీ యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె ఆసరా అయింది. గనుక యెరుకను విడవవలెను ।

### 3. దేవుడునైన దేవతనైన మనకు దిక్కు ఉన్నారని కలలోనైన నమ్మరాదు

శి॥ శరీరం వదిలిన గురువు వున్నాడోలేడో ఏలాగు ఎరుగుదును ।

గు॥ 1. వుండెనా వారితో కూడా వుండి । చూడవలెను । చూస్తె శరీరం అయి వున్నది । శరీరం లేక వున్నదీ । తెలుస్తుంది । వారు భోంచెయ్యంగా కనిపెట్టి చూడవలె । నీళ్ళు

త్రాగంగా కనిపెట్టి చూడవలె । దేహమై ప్రవర్తించేదీ । దేహం లేక ప్రవర్తించేదీ । తెలుస్తుంది ।

2. శరీరం లేక వుండేవారి సామర్థ్యం । చెప్పశక్యం కాదు । సకల కౌతుకాలు శరీరం అయివున్న వారి దగ్గరకద్దు । వారికంటె అమాయకులు వేరేలేదు । ఛీ । యిటువంటి వారి సహవాసం । కలలోనైనా చెయ్యకూడదు ।

3. సర్వకాలం కలలో వచ్చిన దేహం మేలుకొంటె యేలాగు యేమీలేదో । ఆలాగే । "మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే నేను । యీ శరీరం శూన్య స్వరూపం"। అయినాగాని వున్నది అని కలలో వచ్చిన యేనుగను యినుప గొలుసులతో కట్టివేసుకొని కావలి పండుకొంటె । మేలుకొంటె యేమీలేదు । అని తనకు తానె దృఢం వున్నట్టు వుండెనా । యీ శరీరం మందికి చూడవున్నట్టు వుంటుంది । తనకు మాత్రం లేదు గదా ।

4. తనకు వున్నదని యెరుకాలేదు । లేదు అని యెరుకాలేదు । సర్వకాలం శరీరం లేకనే వున్నాడు గనుక । శరీరంలేని యీ బట్టబయలే సత్యం ! యని నమ్మికాయె ।

5. శరీరం వున్నదని యెరుక । యేమీలేదు అని యెరుకకే యెరుక ।

6. యీ మూడువిధాల యెరుక యీగుర్తెరిగే శరీరానికే గాని । బట్టబయలుకు ఇలాంటి యెరుక కాదు ।

7. "మూలంలేని యీ గుర్తెరిగే శరీరం కంటె పాపస్వరూపం లేదు । క్షరాక్షరోపాధి ద్వయదోష స్వరూపమని ॥ ఆచార్య స్వాములవారు । పదిహేనో అధ్యాయం భాష్యంలో అన్నారు ।

8. "క్షేత్రక్షేత్రజ్ఞ స్వరూపమనుట అభిప్రాయం । యింతేకాని । ఆత్మనిబద్ధి । అనాత్మ । అబద్ధం । అనుట కాదు । రెండు వేరేనని అనరాదు ।

9. "సర్వకాలం మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అనుట అభిప్రాయం పుట్టనిచావనిది । మరిఒకటి వున్నదని యెన్నటికీ సంశయము వద్దు" ।

10. యీ శరీరానికి దిక్కు యేమీలేదు । యీ శరీరానికి శరీరాలే దిక్కు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరాలకు । దేవుడు అయినా దేవత అయినా । దిక్కువున్నదని కలలోనైనా నమ్మవద్దు । యిటువంటి మాయ । యీ ప్రకారం వున్నట్టే వుండి । చూస్తూ వుండంగానే యేమీలేదు ।

11. కలలో ప్రపంచం తనకు తానే వచ్చింది । తనకు తానే వున్నది । తనకు తానే యేమీలేదు । గురుకటాక్షం కలిగేదాకా । వుంటుంది । తప్పున కలలోమేలుకొన్నట్టే । మేలుకొనెనా । పుట్టనిచావని బట్టబయలే వున్నది ।

12. యేమీలేని బట్టబయలులోనె । మొదలుయేమీలేదు । కొనకు ప్రవేశించేటందుకు స్థానంయేమీలేదు యీ గుర్తెరిగే శరీరం వున్నట్టే వుండి । వెంటనే యేమీలేదు । మొదలూ కొనాలేని బట్టబయలుకు । రాకడాలేదు । పోకడాలేదు । యీ బట్టబయలే అచలం ।

13. యీ బట్టబయలే సకలదేశాలయందూ । సర్వకాలాల యందూ వున్నది । సమస్తమైన వస్తువుయందూ । జ్ఞానకర్మ శూన్యమై । వున్నది । పుట్టిన శరీరాలకే జ్ఞానకర్మాలు । యీ బట్టబయలుకు యెరుకాలేదు । కర్మాలూలేవు । ఖర్మాలకు మూలం యెరుక అనే జ్ఞానమే కాని మరిఒకటిలేదు । గుర్తెరుగక వక్కటైనా ఖర్మాలు చేయబడవు । "గుర్తెరిగే జ్ఞానం వున్నంతశేపూ । ఖర్మాలు తప్పవు ।

14. గుర్తెరిగే చైతన్యమనె జ్ఞానం నేను అని । గుర్తెరుగంగానె ఖర్మాలు పారిపోవు"। జ్ఞానము లేని బట్టబయలు యేమిఖర్మాలు చేస్తుంది । గుర్తెరిగే శరీరం పుణ్యపాపాలకు మూలం । శరీరానికి మూలం । మూలం లేని యీ గుర్తెరిగే శరీరమెకాని । పుట్టనిచావని బట్టబయలు యీ శరీరాలకు మూలంకాదు । యీ బట్టబయలుకు యెరుకలేదు గనుక : ఖర్మాలు చెయ్యదు ।

15. సకల వినోదాలు మధ్యవచ్చి కాశ్శేపు వున్నట్టు వుండి । వెంటనే యేమీలేదు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యొక్క ప్రభావమే కాని । రాకడా పోకడాలేని బట్టబయలుకు । సుఖంలేదు దుఃఖం లేదు ।

**4. అద్వైతం నమ్మేనా శరీరాలనే అడివిలో కలిసి జన్మలు ఎత్తుకుంటు ఉంటాడు.**

16. మూలంలేని । యీ గుర్తెరిగే శరీరం యెన్ని తిప్పలుబడ్డా । యీ బట్టబయలు యేమీలేదు అనదు

17. యీ బట్టబయలులో తనకు తానెవొచ్చి । తనకు తానె వుండి । తనకు తానె యేమీలేదు । "గురు కటాక్షంచేత । యీ బట్టబయలు సాక్షాత్తు శివుడు అని తెలిపి । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని । నిర్హేతుక జాయామానా కటాక్షం దాసుడైన నాయందు । ప్రసరించెనా । నేను బ్రహ్మాను అనే అఘాత్యం చెడి । దాసత్వం వదలి । బట్టబయలే అవుతుంది ।"

18. అద్వైతం నమ్మేనా । అడవిలోకలశి । యమలోకమనె శరీరమందు । యముడిక అయివుంటాడు "బ్రహ్మత్వం పోవలె । దాసత్వం పోవలె । బట్టబయలు అగుపడవలె । భ్రాంతిలేకపోవలె ।

19. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను అని । యెన్నాళ్ళు నమ్మివున్నా । గురుకటాక్షం కలుగదు దేహిని నేను అనే భావన లేకుండా । యెవ్వరు చేస్తారో । వారే గురువులు"।

20. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె పరబ్రహ్మం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే దాసుడు । బ్రహ్మకు దాసత్వం కద్దు । దాసునికి । బ్రహ్మత్వం కద్దు । రెండూ సమానమే । మునుపు బ్రాహ్మణుడు రెండోసారి భిక్షువు బ్రాహ్మణుడు । భిక్షువు సమానమె । వేరే యెక్కువ తక్కువ కాదు ।

21. బ్రహ్మంను అన్నా సుఖదుఃఖాలు తప్పలేదు । దాసుణ్ణి అన్నా సుఖదుఃఖాలు తప్పలేదు । రెండూ ఒక్క యేడ్పే । భ్రాంతి రహితం బ్రహ్మత్వం చేత కాదు । దాసత్వం చేతకాదు । యిద్దరు పరతంతృలే పుట్టని చావని బట్టబయలును వీరు యెప్పుడు తెలియజాలరు।

22. జ్ఞానకర్మాలు లేని బట్టబయలుకు శరీరం । యెన్నటికిలేదు। ఛీ। "బ్రహ్మత్వం బ్రష్టదే । దాసత్వం బ్రష్టదే । రెండూ అహంకారమే । అని మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని । యీ వాక్యం గురువు చేత కనుగొంటే । అహంకారం మునిగిపాయె । పుట్టని చావని బట్టబయలు బయటబడె । యీలాగు కనుకొన్నవాడే భ్రాంతిలేనివాడు।"

23. సుఖదుఃఖాలకు మూలం మునిగిపాయె । మతం సమ్మతమాయె । అన్నీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరానివే యీ మహిమలు అన్ని అందరికీ తెలిసె । యీ కల నమ్మరాదు। ఒక్కటే కలమేలుకొంటే పుట్టనిచావని । అచలమని । వ్యాపకం । అంతేకాని రెండోది యేమి లేదు.

24. అరచేతిలో । వైకుంఠమనే । పేరుచేత । బట్టబయలు వున్నది । ఆ బట్టబయలే వైకుంఠం । ఆ బట్టబయలు చెయ్యదు । చేయించదు । ఆ బట్టబయలుకు స్వతంత్రమూ లేదు । పరతంత్రమూ లేదు । యేలాగు వున్నదో । ఆలాగే వున్నది ।

25. శరీరం ఆగాంతుకం । వున్నట్లే వుండేది । వెంటనే యేమీలేదు। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । మాట్లాడితే భోంచేస్తే యేమో । మహత్తు వున్నదని । అనిపిస్తుంది । కలలో వచ్చిన శరీరం । గుర్తెరుగదు గదా మాట్లాడదా । భోంచెయ్యదా । మేలుకొంటె యేమీ ఆయె । యేమీలేదు।

26. మూలంలేని । యీ గుర్తెరిగే శరీరమునకు వున్న సామర్థ్యం । పుట్టనిచావని బట్టబయలుకులేదు । సకలసామర్థ్యాలు మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికే । యీ శరీరానికి యితరాపేక్షలేదు స్వతంతృరాలు యిఘయేమి అంటే నమ్మరాదు ।

27. అధెరువు లేనిది గనుక । అవాంతరదొరతనం చేసినవాడు । చేయించేవాడు దొర । చెయ్యనివాడు చేయించనివాడు । దొరకాడు దొంగాకాడు । ఆ యిద్దరికీ కద్దు । యీ కలలో దొంగావచ్చినాడు । దొరావచ్చినాడు । కొనకూ యిద్దరూ యేమీలేదు । పుట్టని చావని బట్టబయలు । సర్వకాలం ఒక్కతీరుగానే యున్నది ।

28. సర్వకాలం శరీరం లేకనే వున్నది । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం అన్నీ పెట్టింది । పుట్టని చావనిది । మొదలుకొనా లేనిది । రాకడాపోకడా లేనిది । సకలదేశాలయందూ । సర్వకాలాల యందూ । సమస్తమైన వస్తువులయందూ । తనకు తానే స్వతఃశ్శిద్ధమై । ఆకాశం వలె చలించక ఉన్నది.

29. సర్వకాలం ఒక్కతీరుగా యున్నది । మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి । యీ బట్టబయలుకు కొంచమైనా సంబంధం లేదు । యీ బట్టబయలు చలించక తనకు తానె స్వతశ్శిద్ధమై వున్నది । రాకడా పోకడా లేదు । సర్వకాలం ఒక్కతీరే । యీ శరీరపు జోలి యీ బట్టబయలుకు పట్టదు । బట్టబయలు జోలి యీ గుర్తెరిగే శరీరానికి విచారించుటకు చాలా అవసరం. ।

30. యీ శరీరం యొక్క వికారాలు బట్టబయలుకు లేవు, సర్వకాలం యీ మూలంలేని గుర్తెరిగే శరీరం యేమిలేదు.

31. యీ బట్టబయలు శాశ్వితంగా ఒక్కతీరుగా ఉన్నది. వున్నదానికి ఒక్కటైనా వికారం లేదు, యెన్నాళ్ళు యీ మూలం లేని యీ గుర్తెరిగె శరీరం నేను, అని నమ్ముకున్నా భ్రాంతి పోదు యధార్థంగా యీ బట్టబయలు వున్నది అని ధృఢం ఉండవలెను.

## 5. గుర్తెరిగే శరీరాన్ని అభిమానించే వారు ఆచారమాచారం అనుకుంటు ఉంటారు

32. యీ శరీరానికి యేమి మూలం లేదని నిశ్చయం. యీ శరీరానికి కొనకు ప్రవేశించేటందుకు స్థానం ఏమిలేదని నిశ్చయం. వున్నంత సేపు యీ శరీరానికి దిక్కు యెవ్వడు లేడని ధృఢం వెంటనే ఏమిలేదు.

33. మూలం లేని యీ గుర్తెరిగే శరీరం యొక్క స్వభావం. యిటువంటిదని నమ్మి, కలలో తనకుతానే వచ్చి, తనకు తానే వుండె తనకుతానే అన్నీ తినెను.

34. దాణా తినేవి దాణా తినె, అన్నం తినేవి అన్నం తినే. గడ్డి తినేవి గడ్డి తినె. పందులు తినేవి పందులు తినెను.

35. పాలు త్రాగేవారు పాలు త్రాగిరి, సుర త్రాగేవారు సుర త్రాగిరి. మాంసం తినేవారు మాంసం తినిరి.

36. యెవ్వరి స్త్రీలతో కూడా వారు వుండిరి, వారి స్త్రీలతో వీరు, వీరి స్త్రీలతో వారు, సంతోషపడుకుంటు కొందరు ఉండిరి, గుర్రాలు తోమేవాని భార్య చక్కంది అని దొరచూచి దానితో సహవాసం చేసే,

37. గుర్రాలు తోమేవాడు లెస్సవుంటే, రాజుభార్య వానిని చూచి వానితో సహవాసం చేసుకుంటూ, కాలం గడుపుకుంటూ ఉండిరి.

38. ఆచారం అని అనాచారం అని, మందికి తెలుపుకుంటు, మేము యెక్కువ మీరే తక్కువ అని అనుకుంటూ మరికొందరు ఉండిరి.

39. మా ఆచారం దొడ్డది మా ఆడవాండ్లు నిప్పువంటి వాండ్లు, మా యింటివంటిది యెవరి యిల్లూ లేదని అనుకుంటూ కొందరుండిరి.

40. మా మొగవాండ్లకు మంచివారు అని, మా మొగవాండ్లు మహాభ్రష్టాకారి వాండ్లు అని చెప్పుకుంటూ ఉంటారు. మాతోటి మాట్లాడకుండ్రి, మమ్ము చూడకుండ్రి, మాసంగతి చొప్పున మేమె వస్తాము, మీరు మాత్రం సంగతి చొప్పున నడుచుకోండ్రి అని నిబంధన చేసుకుని యీ ప్రకారాన కలకు మర్యాద లేదు. యెరుక లేకుంటె సరి యెవరికి వారే ఈ తీరున నడిచిరి.

41. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు. గనుక యీ యేమిలేనిది తనకుతానే స్వాధీనం కాదు. మంది కూడా తనవంటివారే గనుక మందికి స్వాధీనం లేదు. వున్నంతసేపు పెడితే తినేటందుకు ఘట్టిది. సమయం వస్తే యేమీలేదు, పెట్టిపెట్టి చెడిపొయ్యేదికాని కొనకు యేమిలేదు.

42. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం తిన్నంతసేపే తిండితినె, తిండి లేకుంటె అడ్డంపడె, అందుకు మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను అని నమ్మి ఉండరాదు. మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమీలేదు. అని సతతం సర్వకాలం యెడతెగక జ్ఞాపకం వుంచుకొని, కాలం గడిపినవాడె భ్రాంతిలేనివాడు,

43. కలలో కొంత నిబద్ధి కొంత అబద్ధం అని ద్వంద్వాలు నమ్మెనా అడవిలో కలసి తోవకు యెన్నటికిరాదు.

44. సర్వకాలం యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు అని నిద్రవచ్చినదాక మరణం వచ్చినదాకా రెప్పపాటులో సగం కాలమైన మరువక ఉన్నవాడే బంధమోక్ష రహితుడు. వాడే క్రియాశూన్యుడు. ఒక్క శరీరం ఏలాగో అన్ని శరీరాలు అలాగే. మూలం లేని యీ గుర్తెరిగే శరీరంలో కొంచెం నిబద్ధి అనుకొన్నా వానికి భ్రాంతిపోదు.

45. తిండి అన్ని శరీరాలకు సమానమే. మనిషికి మాటలు యెక్కువ. మూలం లేని యీ గుర్తెరిగే శరీరం యేది అభ్యాసం చేస్తే అదికొందరికి లెస్స అభ్యాసం అవుతుంది. కొందరికి కొంచెం అవుతుంది. సూక్ష్మబుద్ధి కొద్ది యింతేకాని యీ శరీరంలో శాశ్వతమైనది కొంచెమైనా లేదు.

46. శాశ్వతమైనది మొదలూకొనలెక రాకడపోకడలేక శరీరం యెన్నటికి లేక తనకుతానే సర్వకాలం ఒక్కతీరే వున్నది. సర్వకాలాల యందు శరీరం లేకనే వున్నది. సమస్తమయిన వస్తువులయందు ప్రవేశించక తనకుతానే శరీరంలేక వున్నది, శరీరం లేదు గనుక యెరుకలేదు. కర్మాలు లేవు.

47. గుర్తెరిగిగాని కర్మాలు చెయ్యదు. కర్మాలు లేకుంటె శరీరాలు లేవు. యెరుకలేదు కర్మాలు లేవు. కలలో శరీరాలు వచ్చినవి ఆ శరీరాలు గుర్తెరుగు గనుక సకల కర్మాలు చేసినవి. గుర్తెరుగకుంటె కర్మాలు పుడుతావె ?

48. జ్ఞానంనుంచే కర్మాలు, కర్మాలకు మూలం యీ గుర్తెరిగే జ్ఞానమే. జ్ఞానం నిబద్ధి కర్మాలు అబద్ధమని యీ కలలోనే ఒక సన్యాసి అన్నాడు.

శి॥ ఆసన్యాసి అప్రమాణికుడా.

గు॥ కలను మేలుకుంటే ఆ సన్యాసి యేమాయెనో నీవే ఎరుగుదువు గదా!

శి॥ ఏమీలేదు దేని చేత ?

## 6. జ్ఞానం ఉన్నదనుకున్నంత కాలం కర్మలు తప్పవు

గు॥ యీ గుర్తెరిగే జ్ఞానమే మాయ.

1. జ్ఞానం ఏలాగు నిబద్ధి. కర్మాలు యేలాగు అబద్ధం. జ్ఞానం ఉన్నంతసేపు కర్మాలు నిబద్ధి జ్ఞానం మునిగితె కర్మాలు మునుగుతావి. అంత పర్యంతం కర్మాలు లేకపోవు.
2. జ్ఞాన భ్రాంతి వుండెనా కర్మాలు విడిచినాపోవు, జ్ఞానమే కర్మాలకు మూలం గుర్తు ఎరిగితే కాని కర్మాలు చెయ్యదు.
3. గాఢనిద్రలో మూలంలేని గుర్తెరిగె శరీరం ఏమిలేదు, అప్పుడు గుర్తెరిగే జ్ఞానంలేదు,

కర్మాలు లేవు, వ్యవహారమే లేదు, సరేకదా?

4. సర్వకాలం అలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం ఏమిలేదు లేక ఉన్నవారికి వ్యవహారం లేదుకదా?

శి॥ వ్యవహారం లేనేలేదు.

గు॥ శరీరం లేకుంటె ఏమీలేదు, వుత్త బట్టబయలే ఏమీ లేనిదానిలో ఏమిలేదు గదా.

1. ఈ శరీరంతోటె జ్ఞానకర్మాలు శరీరంలేకుంటే జ్ఞానమే లేదు కనుక కర్మాలు పుట్టనే పుట్టవు అందుకే గురువాక్యం కంటే దొడ్డది ఏమీలేదు, ఏమీలేదనేటందుకు మూలం ఏమిలేదు. వ్యవహారమే లేదు గనుక గురువులు శిష్యులకు ఏలాగు తెలుసు. గురుసేవ చేయ్యంగా చెయ్యంగా జాడ దొరకదు. జాడ దొరికినా వ్యవహారమే లేదు. అందరివలెనె ఉంటాడు.

2. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు. సర్వకాలం శరీరంలేక వున్నవారు గనుక వ్యవహారానికి మూలం యేమిలేదు, అని ధృఢం ఉన్నవారికి, ఉన్నది అని అనేటందుకు మూలం యేమిలేదు. పుట్టని చావనిది మొదలు కొనలేనిది తనకుతానే స్వతసిద్ధమై చలించక సర్వకాలం ఒక్కతీరే ఉన్నది.

3. సకల దేశాలయందు, సర్వకాలాలయందు, సమస్తమైన వస్తువులయందు శరీరం లేకనె క్రియాశూన్యమై తానుచెయ్యక చేయించక సర్వకాలం భోంచెయ్యక ఒక్కటైన వికారంలేక శాశ్వితంగా ఉన్నది.

4. వ్యవహారం లేనిదానిలో వ్యవహారం ఉన్నట్టు, మూలంలేని యీ గుర్తెరిగే శరీరంచేత తోచివుండె యిపుడు గురుకటాక్షం చేత యీ శరీరానికి కలలో వచ్చిన శరీరానికి కూడా మూలం యేమిలేదు అని చెప్పిరి.

శి॥ దేనికి మూలం యేమీలేదని చెప్పిరి

గు॥ 1. కొనకు కలలో వచ్చి శరీరాలు యెక్కడ ప్రవేశించినవో, అక్కడికే యీ శరీరాలు పోయెనని చెప్పిరి, చెప్పితే రెండూ సమానంవలెనె వుండె । మొదలుయేమీలేదని నిశ్చయమాయ । ఉన్నప్పుడు వున్నదని నాకు తోచివుండె । ఆ తోచడం కలలో వచ్చినది । వీటి వలనె యదార్థంగా వుండి । వ్యవహారం చేసి వెంటనే యేమీలేదు ।

2. ఆలాగే యీ శరీరాల యొక్క వునికీ । అనె ॥ యిప్పుడు గురుస్వామి తెలిపితె । ఆ వునికీ యీ వునికీ । సమానంగా వున్నట్టే వుండె । కొంచనైనా యెక్కువతక్కువ వున్నట్టు తోచదాయె ।

3. యిఘయేమి అంటె । అనేక భ్రమలు కద్దు । కలతో సమానమని తెలిపితె । చులకంగా

వున్నట్టు వుండేకాని । మూలంలేని । యీ గుర్తెరిగే శరీరం । కలలో శరీరం మేలుకొంటె । తనకు తానే యేమీలేదని నిశ్చయం వున్నట్టు । కావలెనని నాకు భ్రాంతికద్దు ।

శి॥ కల మేల్కొంటే ఆలాగే అయ్యే । యీ శరీరానికి మూలం యేమీలేదని దృఢం వున్నది గదా । వున్నప్పుడు నిబద్ధే అనుకోవడం భ్రాంతేకదా

గు॥ భ్రాంతే నిత్యం కలలో వచ్చేయేనుగులు । గుఱ్రాలు । లొటిపిటలు । వున్నావా !

శి॥ యేమీలేదు

గు॥ ఆలాగే యీమూలంలేని గుర్తెరిగే శరీరం యేమీలేదని నిశ్చయంవుంటెచాలు । పుట్టనిచావనిది తనకు తానె స్వతసిద్ధమై వున్నది । గనుక ప్రయత్నం యేమీలేదు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని దృఢం వుంటె చాలు

శి॥ యేమిటి చేత ప్రయత్నం చేయ ।

గు॥ 1. యే ప్రయత్నాలకూ మూలం యేమీలేదు సకలకర్మాలకూ మూలం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమెకాని । రెండోది యేమీలేదు । పుట్టనిచావని బట్టబయలుకు వక్కటైనా భ్రాంతిలేదు । భ్రమలకు మూలం కల । కలకల్పన కాకుంటె శరీరమే లేదు । గనుక భ్రాంతి లేనేలేదు ।

2. యెప్పుడు శరీరం లేకుంటె అప్పుడె భ్రాంతిలేదు । గాఢనిద్రలో మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు గనుక । వ్యవహారంలేదు । శరీరం రాంగానే కలసిద్ధం । యీ కలలోనే అనేక భ్రాంతులు సిద్ధం । గుర్తెరుగంగానే భ్రమపుడుతుంది । భ్రమవలన ఖర్మాలు చేస్తాడు । శరీరం వలన గుర్తెరగడం । ఖర్మాలు పుడుతావి ।

3. యీ వొక్క శరీరం లేకుంటె । ఖర్మాలు లేవు । జ్ఞానం లేదు । జ్ఞానానికి ఖర్మాలకూ మూలం గుర్తెరిగే శరీరమె ।

4. యీ శరీరానికి మూలం యేమీలేదు । యేమీలేని శరీరం యేమిచేశినా యేమీలేదు । శరీరం చేశిన ఖర్మాలు నిబద్ధి అయితే । గుర్తెరిగేది సర్వకాలం వుండవలె । సర్వకాలం గుర్తెరిగేది వుంటె ఖర్మాలు వుండవలె.

గనుక మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదని నిశ్చయం ఉంటే సరిపోవును, విద్య వుంటే అవిద్య ఉంటాది గనుకనే విద్యావిద్య ద్వయదోష రహితమే సకల కర్మాల యొక్క భ్రాంతి రహితము.

**గద్య: ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే । వేదాంత విచారణే । ఉత్తరభాగే । భ్రాంతి రహిత ప్రకరణం । విద్యావిద్యోపాది ద్వయదోష రహితము-**

**పంచమ అధ్యాయం సమాప్తం**

# 15. భ్రాంతిరహిత ప్రకరణము

## షష్టమ అధ్యాయము

## 6. విక్షేపావరణ ద్వయదోష రహితము

### 1. వీక్షేపావరణములతో ఉన్నవారు యెరుకకు తాళం వేస్తారు

గు॥ 1. మూలం లేని యీ గుర్తెరిగే శరీరం ఏమిలేదు అనే సిద్ధాంతమే సిద్ధాంతము.

2. మూలం లేని గుర్తెరిగే శరీరం ఆవరణం వలె ఉన్నది, ఈ ఆవరణం వేసేవారే గాని తీసేవారు లేరు, లేని వారైతే లేకుండ చేస్తారు,

3. వీక్షేపావరణాలు ఉన్నవారైతే మూలంలేని గుర్తెరిగే శరీరమనె దరువాజకు తాళం వేస్తారు.

4. చెవులో మంత్రం వేసి యోనిముద్ర చూపుతారు, యింతేకాని ఉన్నది ఉన్నట్టు సూచన చెయ్యరు.

5. మొద్దులకు అన్నం ముందర బెట్టితే భోంచేసినట్టు అనుభవం మూలంలేని ఈ గుర్తెరిగే శరీరం చేత అనుభవం కావలెనని అందరికి అభిలాష ఉన్నది।

6. మూలంలేని ఈ గుర్తెరిగే శరీరంలో కొంచెం సత్యమని ఆశపడ్డ శరీరం యావత్తు ఉంటుంది.

7. ఈ శరీరంలో కనుక్కోవలెనని ఈ శరీరమే మొర పెట్టింది, ఇది యెప్పుడు యెరుగదు.

8. విత్తనం విడువకూడదని కపట వాక్యం నమ్మినారు, ఇలాగున నమ్మినవారు భ్రాంతి లేనివారు అవుతారా ?

9. శరీరం వలన పుట్టినవి శరీరం ఉన్నంతసేపూ చప్పట్లు కొట్టి అనేక సంకేతాలు చేతుల తోటి చూపుతారు,

10. యెరుక అనేది సర్వకాలం శరీరాన్ని విడిచిలేదు పట్టుకొని లేదు, తనకుతానే ఆసుకొయ్యవలె తిరుగుతుంది, తిరుగుతుందని కల్పన చేసుకొన్నది.

11. తనకు స్వాధీనం లేదు, పుట్టినట్టె వుంటుంది. చూస్తు ఉండంగానే యేమిలేదు ! గనుక నమ్మరాదు,

12. నమ్మక మనము యేమి చేయగలము. అంటే ఈశరీరం మూలం లేనిది గనుక తెగిన గాలిపటం వలె ఉన్నది. ఇది మొదలు కొనలేని ఈ ఉత్తబట్టబయలు వలె శాశ్వితమైయింది కాదు, వుండియేమిలేదు.

13. యీ శరీరం తనకు తానె తండ్రి ఆపేక్షలేక । తల్లి ఆపేక్ష లేక । పెద్దది అయ్యి । యేనుగమీద యెక్కి । అనేక దండుతోటి తనకుతానె వచ్చి । తనకు తానె కొంతసేపు వుండి । తనకు తానె యేమీలేదు ।

## 2. ఈ గుర్తెరిగే శరీరమే అనేక నామాలతో ఉన్నది

14. యీలాగే వొక ప్రకారం । తప్పున తనవంటి స్త్రీని జూచి । తనకు తానే గుర్తెరిగి । కూడితే కడుపులోనె శరీరాకారమై పుట్టేది కద్దు ।యీ పుట్టుకకు ఒక విధం మర్యాదాలేదు।

15. నానా ప్రకారాలు । మూలంలేంది గనుక । వక విధం లేదు । అనేక ప్రకారాలు । స్త్రీ పురుష సంయోగం వల్లనే అని మర్యాదాలేదు । తనకు తానే పుడుతావి । తనకుతానే యేమీలేదు ।

16. శాశ్వతమైంది ఒక్క బట్టబయలె । యీ బట్టబయలుకు విజాతి, స్వజాతి స్వగత భేదమైన శరీరంలేదు

17. యీ శరీరమందు వున్నబేధాలు ఆ బట్టబయలుకు లేవు ।

18. శరీరం వొక్కటే గాని । దీనిలోపల వున్న బేధాలు పేర్లు అనేకాలు గలవు ॥

19. జ్ఞానం అని
20. అజ్ఞానం అని
21. యింద్రియాలు అని
22. విషయాలు అని
23. గుణాలు అని
24. అంతఃకరణ అని
25. మనస్సు అని
26. బుద్ధి అని
27. చిత్తమని
28. అహంకారమని
29. వేదాలు అని
30. శాస్త్రాలు అని
31. పురాణాలు అని
32. శృతులు అని
33. ఉపనిషత్తులు అని
34. లక్ష్యాలు అని
35. మంత్రాలు అని
36. తంత్రాలు అని

యెన్ని అని వ్రాతు ॥

37. యీ శరీరంలో స్వగతబేధాలు అనంతాలు వున్నవి ॥ తీసివేసినకొద్దీ । మొలుస్తాని । వున్నవాటికీ లెక్కలేదు । పోయినవాటికీ లెక్కలేదు । వ్రాయశఖ్యం కాదు।

## 3. గుర్తెరిగే శరీరం యేమిలేదని తెలిస్తేనే జాగ్రదవస్తకు వచ్చినట్లు

38. స్వజాతీ । విజాతీ శూన్యమైనది యీ బట్టబయలు । యీ బట్టబయలుకు బదులు లేదు । యీ బట్టబయలుకు శరీరం లేదు । గనక । స్వగత బేధాలు యెన్నటికి లేవు।

39. బట్టబయలులో । యేమీలేక వున్నవారు పరిపూర్ణులు । యీ శరీరం వున్నంతశేపూ కలేగాని । మరివొకటి లేదు । అందరూ స్వప్నావస్త చేతనే వున్నారు । మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమి లేదని తెలుసుటే జాగ్రదవస్త.

40. జాగ్రత అయితేనే కల । జాగ్రత్తలేక మునుపు యీ శరీరం యేమీలేదు । గనుక వ్యవహారమే లేదు । వ్యవహారానికి మూలం యీ గుర్తెరిగే జ్ఞానమే కాని మరిఒకటి లేదు ।

41. గుర్తెరిగే జ్ఞానం పుట్టంగానే కల । శిద్ధం యీ కలలోనె అనేక చిత్రవిచిత్రాలు పుడుతావి । వెంటనే యేమీలేదు ।

42. యెంతవారూ కలగంటూ వున్నారు । కలరాక మునుపు మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు ।

43. మొదలూ కొనాలేక తనకు తానె స్వతసిద్ధమై చలించక వున్నది । సర్వకాలం శరీరంలేకనే వున్నది । గనుక వక్కటైనా వికారంలేదు ।

44. శరీరంలేక వున్నదే క్రియాశూన్యం । క్రియాశూన్యం గనుకనే । పుణ్యాఖర్మాలు లేవు । పాప ఖర్మాలులేవు।

45. శరీరంలేని యీ బట్టబయలు చెయ్యీ చెయ్యదు । చేయించా చేయించదు, సర్వకాలం వొక్కతీరె । కోటిమాట్లకూ శరీరంలేని గురుసాంప్రదాయం కావలె । భ్రాంతిలేకపోవలె।

46. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే కాని మరిఒకటి భ్రాంతికి మూలంలేదు ।

47. సర్వకాలం శరీరంలేని బట్టబయలుకు వక్కటైనా భ్రాంతి వున్నదని । యెటువంటివాడూ అవివేకుడైన వివేకుడైన కూడా వొప్పదు ।

48. లేనిదానికి వున్నదన శఖ్యం కాదు వున్నదానికి లేదనశఖ్యంకాదు పుట్టని చావనిది । మొదలూ కొనాలేనిది । రాకడా పోకడా లేనిది । సర్వకాలం చలించక । వక్కతీరుగా తనకుతానే స్వతసిద్ధమై వున్నది ।

49. సకల దేశాల యందూ సమస్తమైన వస్తువులయందూ । ప్రవేశించక । వెళ్ళిపోక

యేది వున్నదో అదే శాశ్వతమైంది । అని నమ్మి । కారణం లేక । కార్యాలు లేక । తనకుతానే వచ్చి । తనకుతానె వుండి । తనకుతానే యేమీలేదు

50. యిటువంటి మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను అని । భ్రమచేత వున్నారు గనుక। పుట్టనిచావనిది । వృద్ధిపొందనిది । బక్కబడనిది । వున్నప్పటికైనా । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం మాయావరణం । వుండంగా । యెంతవారికీ తనకు తానే తీసివేసుకొనేటందుకు శక్యంకాదు

## 4. కొందరు జ్ఞానం నిబద్ధియని చెప్పి నరకమున బడవేసినారు.

51. జ్ఞానమనే భ్రాంతిచేత । యిశ్చవిస్తారం పుడుతుంది । కొంత ఖర్మాలు ఆచరిస్తూ వుంటాడు యింతేకాని శరీరంలేని గురుసాంప్రదాయం వున్నది అని యెరుగక । "అద్వైతమనే అడవిలో పులిని దొరికించుకొన్నట్టు యెరుకను దొరికించుకొని । గుర్తెరిగేది సచ్చిదానందం నేను, నేను అని । అనుకుంటూ ఉంటారు ।

52. మునుపటి కంటె । రాగద్వేషాలు అధికమై । అడ్విపట్టి । శరీరమనే గుహలో। పెద్దపులివలే । గుర్తెరిగే శరీరం నేను అని । లెస్సా గుర్తెరిగి । ఆవులు రాంగానే । ఆవులను గుర్తెరిగి । కదలక । మెదలక । గుండు కింద నతికి । తప్పున పశువును దొరికించుకోని । ఫలహారం చేస్తూ వున్నట్టు । ఉంటారు ।

53. యీ శరీరంలో గుర్తెరిగే చైతన్యం నేను అని । నిశ్చయం గలవారు । ప్రజలను క్లేశపెడురు । చైతన్యం చెయ్యదు । చేయించదు । అనుకొంటూ సర్వం గుర్తెరిగే ఉంటారు । సర్వం గుర్తెరిగిన తర్వాత కూడా ఆలాగే చేస్తూ వుంటారు ।

54. మధ్య మధ్య నాకు కర్తృత్వంలేదు, భోక్తృత్వం లేదు అనుకొంటూ । ఉంటారు ।

55. శంకరాచార్యులవారి సిద్ధాంతం । దొడ్డది దొడ్డది । అని అనుకొంటూ । నరకమనె శరీరంలో । గుర్తెరిగే చైతన్యం నేను అనుకోని । నమ్ముకోని । పుట్టలో పాముపవలె । వకవేళ్ళ పెట్టెలో పాముపవలె । భుస్సూ భుస్సూమని అనుకొంటూ । కాలం గడిపేవారుగా ఉంటారు ।

56. యెవ్వరైనా వొక పెద్ద మనిషి అడిగితే । యేమీలేదు । సర్వం వుపాధి ఖర్మం । నేను అసంగుణ్ని । ఖర్మాలు మిధ్య । లేనేలేవు । విహితమైన ఖర్మాలు విడువరాదు । మనకు కావలె లోకసంగ్రహార్థం । నాకు వున్నాసరే । లేకున్నాసరె చెయ్యకపోతే నలుగురూ నెత్తిన కొడుతారు" । అని చెప్పుకుంటూ ఉంటారు.

## 5. యెరుకసు నమ్మిన వారికి మూత్రమే అధికమాయెను

అసంస్కారులు కొందరు మాత్రం పనికిరాదు । అని అంటారు । మనం సంస్కారుల వలె ఉండటం మంచిదని చేసుకుంటూ ఉంటారు.

57. యెరుకను నమ్మిన వారి గతి కాశీకి పోయినా గోమూత్రమే యెక్కువ । గోదావరికి పోయినా గోమూత్రమే యెక్కువ । రామేశ్వరం పోయినా గోమూత్రమే యెక్కువ । కృష్ణకు పోయినా గోమూత్రమే యెక్కువ । గోవులది యెంత దొడ్డ పుట్టుక । గోవులను మించిన పవిత్రవస్తువలేదు । అని చెప్పుకొనిరి.

58. గోమూత్రం యెంత దొడ్డది । యీ గుర్తెరిగే యెరుక గోమూత్రం తాగితే కాని పవిత్రం కాదు । అని చెప్పుకొని త్రాగుతూ తాగిస్తున్నారు.

59. బ్రాహ్మణుడు గోవుకంటె తక్కువ । వీడేమోయీ । ద్విపాదపశువు । యెంత । గుర్తెరిగే చైతన్యం నేనని అనుకున్నా । గోమూత్రం వలె బ్రాహ్మణుడు పనికి రాకపాయె ।

60. ఛీ । గోమూత్రం యెక్కడ బ్రాహ్మణుడు యెక్కడ। మూత్రమేకాని పురీషం పనికిరాదు । పంచగవ్యం కంటె పవిత్రం యేదీలేదు । త్రాగుచు త్రాగిస్తూ ఉన్నారు.

61. గోవుల పురీషం పనికి వస్తుంది । తిన్నదల్లా అన్నమే ।వెళ్ళిందల్లా పురీషమే గాని । మనిషిది భ్రష్టది । గోవులదీ । బర్లదీ । ఎడ్లదీ । దున్నపోతులదీ । మేకలది । గొర్లది । పనికి వస్తుంది । గాని మనుషులను యెరుక అపవిత్రులను చేసేను గదా !

62. గోవులది శ్రేష్టం అని శాస్త్రం పెండ తినిపించింది । మూత్రపానం చేయించింది । చేయరానివి । యెన్నివున్నావో అన్నీ శాస్త్రాల చేత । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమేచేశి । చేయించింది । దీనికి ఏమనవలెను.

63. పుట్టని చావని బట్టబయలు । యేమీ చెప్పలేదు । యేమీ చెయ్యదు । సర్వకాలం వక్కతీరే । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం తోచకమునుపు । కేవలం । బట్టబయలు వున్నది ।

64. ఆ బట్టబయలు । ప్రవేశించదు । వెళ్ళిపోదు । యీ బట్టబయలులోనే అనేక శరీరాలు వస్తావి । తనకుతానే వుంటావి । తనకుతానే యేమీలేదు ।

65. పుట్టని చావని బట్టబయలుకు జ్ఞానం లేదు గనుక ఖర్మాలు లేవు । గనుక పుట్టనే లేదు । పుట్టవు । బేధం లేనేలేదు గనుక । కార్యకారణాలకు బేధం లేనేలేదు ।

66. ఈ వచ్చిన శరీరాలు జ్ఞానంతో కూడా వచ్చినవి । గనుక జ్ఞానంతో కూడా యేమీలేదు

। జ్ఞాన ఖర్మాలు లేవు । అని గురువాక్యం చెప్పించుకుంటే సరిపోయెను ।

67. యీ బట్టబయలుకు రాకడా లేదు పోకడాలేదు । సర్వకాలం వొక్కతీరెగనుక । యీ బట్టబయలే క్రియా శూన్యమైంది । పుట్టని చావనిది "యీ బట్టబయలుకు శరీరం వున్నదని తోచాతోచదు । శరీరం లేదని తోచాతోచదు । చేసే వారికే అన్నీ తోస్తావి" । చేసేది లేకుంటే సరిపోయెను. శరీరం నేను అని చేసే వారికి తోస్తావి । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని యేలాగు అంటే ఆలాగు చేసే వారికి । అన్నీ తోస్తావి"।

68. యధార్థంగా కలలో వచ్చిన యేనుగమేలు కొంటె యేలాగుయేమీలేదో । ఆలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । వారిది వారికే తెలియవలె గాని । యితరులకు చెప్ప శక్యంకాదు, ఇది నిజం.

69. వారితో కూడా వుండి చూడవలె । వారిజాడా కనుక్కోవలె గాని । లేకుంటె తెలియదు

## 6. పరమ రహస్యం అంటే యెరుక లేకపోవుట.

70. యిది మహారహస్యం ।యీలాగు వున్నవారికి । యిశ్చకు మూలంలేదు । యే నిర్ణయం చేశేటందుకు మూలం యేమీలేదు । వున్నది వున్నట్టూ వుండె । యిటువంటి వారే బ్రాంతికి మూలంలేని వారు । వుపాధి నుంచి అన్నీ తోచి వుండె । యీ శరీరోపాధి తొలిగిస్తే అన్నీ పోవును.

71. మూలంలేని యీ గుర్తెరిగేశరీరం । తోచినప్పటి నుండీ బ్రాంతి పుట్టింది । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । కలలో వచ్చిన మనుష్యులు । మేలుకొంటె యేలాగుయేమీలేదో ఆలాగే । శరీరానికి మూలం లేదు । వున్నప్పుడు తన సత్తాయని చాటుకుంటుంది.

72. యీ శరీరాన్ని పుట్టించింది కాదు । విడువావిడువదు యీ శరీరం తనకు తానె మధ్య వచ్చి । మధ్య పొయ్యేది ।

73. యీ బట్టబయలు శాశ్వతమైంది । మొదలూ కొనాలేదు । రాకడాపోకడా లేదు । పుట్టుకాచావూ లేదు । యెరుకాలేదు । ఖర్మాలు లేవు । వక్కటైనా వికారం లేదు । యిశ్చయెన్నటికీ లేదు । శరీరం లేదు గనుక । చలించనే చలించదు ।

74. యీ కలలో శరీరం తోచంగానే । వెంటనే క్రియాసిద్ధం । మాటలచేత కుదరదు । సాధనలు చేతకుదురదు ।

75. యిఘ యేలాగు అంటె । కలలో యెన్నికోట్ల ప్రజలు వచ్చినా । వున్నా । అనేక చిత్రవిచిత్రాలు చేశినా । అనేక పుణ్యాలు చేశినా । అనేకమైన మహాపాతకాలు చేశినా । విడువదు.

76. యెంత భాగ్యవంతులు అయినా । యెంత మంత్రవేత్తలు అయినా । యెంత దరిద్రులు అయినా। యెన్ని ఏన్గులు వున్నా యెందరు కొమారులు వున్నా । యెరుక విడువదు.

77. అనేక గోవులు వున్న । అనేక మొహిరీలు మూలన రాసులు వున్నా । యెంత చదువుకొన్నవాడు అయినా । కొత్తగా శాస్త్రాలు చేశేవాడు అయినా వెంటనే మేలుకొంటె యేమీలేదు ।

78. తనకు తానే యే సాధనా చెయ్యందే । యేలాగు దృఢం వున్నాదో । ఆలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం కొంచమైనా యేమి లేదు ।

79. సాధనచెయ్యందే దృఢం వుండెనా । వాడె పుట్టని చావని బట్టబయలు । వానికి వక్కటైనా వుపద్రవం లేదు ।

80. సర్వకాలం వొక్కతీరె । యెన్నికోట్లు శరీరాలు వున్నా యీలాగే । నోట అనేటందుకు । శరీరం యీషత్తూ రాలేదు । గనుక । నోరు యీలాగు వుండి । యిదే భ్రాంతికి మూలంలేని రాజమార్గం । సర్వకాలం వొక్కతీరె

శి॥ అట్లయితె యిటువంటివారు । కదలరా మెదలరా । భోంచెయ్యరా యేలాగు వుంటారు

గు॥ కలలో వచ్చిన ప్రజలు మేలుకొంటె యేలాగు వుంటారు ॥ యేమీ యిషత్తూలేదు । యేమీ సర్వసూన్యం । అరచేతులో బట్టబయలు వున్నట్టు వున్నది । ప్రజలు లేనేలేరు గనుక । వ్యవహారమే లేదు

శి॥ యావత్తూ ఆ శరీరాలు యేలాగు యేమీలేదో । "ఆలాగేనా

## 7. ప్రాపంచికం యెరుకే పారమార్థికం యెరుకే రెంటిని విడువాలి

గు॥ 1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేకుండా విచారించు । విచారిస్తే అదియిది సమమె । నోటప్రసంగాలు మొదలు పెడితే । బడిచదువు చదువుకో । లెస్సొ చదువు నేర్చుకోవయ్యా । నేర్చుకొని అనంతమైన వేదాలు చదువుకో । శాస్త్రాలు చదువుకో ।

2. అనేక యజ్ఞాలు చెయ్యి । చేయించు । మహాపెద్దలు అని అనిపించుకో । కుక్కలవలె మొరుగు । గాడిదవలె కుయ్యి । పందివలె చూచిందల్లా యెగబడితిను । ఆవుల ఉచ్చత్రాగు । పెండ తిను । కాశీ రామేశ్వరం పో । తీర్థాలు చేస్తూ వుండూ । కొనకు కుక్కకు యేమిగతో । నీకూ అదేగతి । పట్టగలదు ।

3. యీ భ్రాంతిలేని రాజమార్గం । సాధనలచేత । సాధ్యం కానిది । విచారంచేత అతి సులభమైంది। మొద్దుగాడిద కొడుకులకు । రెండు మొద్దులు । కట్టితే । గుంజుకుంటూ వుంటారు । మొద్దులకు మొద్దులేగతి ।

4. మహా ఆస్తికులకు । అతి సూక్ష్మప్రజ్ఞావంతులకూ ॥దృష్టాంతం యేలాగు వున్నదో అలాగు తాత్పర్యం చేసుకో। మహాగుహ్యం । మహారహస్యం వుత్కృష్టమైన గుహ్యమని । యెవ్వరితో ప్రపంచం ముచ్చట ఆడక । పారమార్థపు ముచ్చట ఆడక । మహాయుక్తి చొప్పున కాలం గడపినవాడు భ్రాంతిలేనివాడు ।

5. యిది ద్వైతం వలె లేదు । లేదు అని యెగబడి చేసె మార్గం కాదు । గుర్తెరిగే జ్ఞానం నేను అని । ఖర్మాలు లేనేలేవు అని । యెగబడిచేశె రాక్షసకృత్యం కాదు ।

6. తత్వము దొడ్డది అని । యిరువై అయిదోది । గుర్తెరిగే క్షేత్రజ్ఞ స్వరూపమనే । అవిద్యాస్వరూపమే నేను అని । చేశేది అవిద్య అని । యెగబడిచేశినట్టు కాదు ।

7. యిరువైయారోది యెటువంటిదో । అటువంటిదాన్ని కనుక్కోని । శాంతిచేత వున్నవాడే కృతకృత్యుడు । శ్రద్ధా మార్గం కావలిసిన వానికి । గురుకుల వాసం చెప్పినట్టూ ।

8. దృష్టాంతం చొప్పున సూచనచేస్తే । ద్రాష్టాంతం । వుండజూచుకొని । శాంతిచేత ఉన్నది వున్నట్టూ । పడితే సరిపోవును ।

9. కలలో వొచ్చిన శరీరాలు చూస్తూ వుండంగానే । యేలాగో ఆలాగే । మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని యేమిలేదని । తాత్పర్యం చేసుకోవలెను ।

10. అటు తర్వాత తాత్పర్యానికి మూలం వుండదు । చెప్పేవాడు లేడు, వినేవాడు లేడు ।

11. వడ్లు దంచినట్టు దంతామంటె మెదగదు । సాధ్యంకాదు । అగ్నిహోత్రాలవలె మధినిచేత । మధించినట్టుకాదు ।

12. కాశీనుంచి కావిడి మోసుకోని రామేశ్వరం పోయినట్టుకాదు అప్పుచేసి అన్నదానం చేసినట్టుకాదు।

13. వున్నది వున్నట్టూపడే యుక్తిని కనుక్కోని సర్వకాలం శరీరంలేనిదని నిశ్చయం కలిగివుంటే వారిది । జన్మభ్రాంతిలేని రాజమార్గం । అవుతుంది.

14. శాస్త్రాలు చదువుకొన్నవారు దున్నిన యెడ్లవంటి వారు ।

15. వేదం చదువుకొన్న వారి నోరు । దంచిన రోలు మెదిగినట్లు । మెదిగే మాత్రమె కాని । దృష్టాంతం చొప్పున । దార్ష్టాంతాన్ని వుండజూచుకొనే సామర్థ్యం కుదరదు ।

16. యీ శరీరం యెన్ని చదువుకొన్నా చదువుకోనిది దొరకదు । కుక్కలవలె కూశేది । నక్కలవలె వొదిరేది । యింతేకాని కలలో యెన్ని చదువులు చదువుకొన్నా మేలుకొంటె యేచదువూలేనట్టు। అయి దృఢం యేమీ లేకపాయెనా

17. యెప్పటి శరీరంలేని యీ బట్టబయలు । చలించక తనకుతానే స్వతసిద్ధమై వున్నది ।

18. యీ బయలేకదా అని చూస్తూ వుండెనా యెప్పటి కోతి చేష్టలు తప్పవు । మునుపటి వలెనే జీవాఖ్యాక్షరోపాధి అనే దోషస్వరూపమై వుంటాడు ॥

**శృ॥ జీవః॥ సర్వమలం జ్ఞాత్వా । జ్ఞానద్రష్టేతి**

**ముహ్యతి । క్షేత్రజ్ఞాఖ్య జీవోపాధిని ॥**

19. పుట్టని చావని అచలమైన తనకు । అవివేకం చేత కట్టుకోని । నేను యెరుగుదునూ అని । ఖర్మాలు చేస్తాడు ॥

**శ్లో॥ సంయోద్యంచవివేకేన । జానామీతి ప్రవర్తతే ॥**

**క్షేత్రజ్ఞాఖ్య జీవోపాధి విలయే సతి । కేవలో భవతి ॥**

20. అదే తత్వాతీతం జగత్తు। తత్వ స్వరూపమె । తత్వాతీతం మహాగుహ్యం। పరమరహస్యం । అందుకే ద్వైతా ద్వైత రహితమైన పరమరహస్యం । అనె సౌజ్ఞ ।

## 8. అచల మార్గంలో ఉన్నవారికి గుర్తెరిగే యెరుక గురుస్వరూపం కాదు, దాన్ని శాశ్వితంబని భావించరాదు.

21. తత్వాతీతం యిరవైయారోది । అదే శరీరంలేనిది । బట్టబయలు.

22. అదే పుట్టని చావనిది । అదే మొదలూ కొనాలేనిది । అదే రాకడాపోకడా లేనిది ।

23. తనకుతానె స్వతసిద్ధమై చలించక వున్నది । సర్వకాలం యేకప్రకారమే । శరీరంలేంది గనుకనే । సకల దేశాలయందూ । జ్ఞానఖర్మ భ్రాంతిలేక । వొక్క తీరుగా వున్నది ।

24. అదే సర్వకాలాలయందూ । మోక్షభ్రాంతిలేక । వొక్కటైనా వికారం లేక । ప్రవేశించక । వెళ్ళిపోక । పెద్దఘుట్టు కదలక వున్నట్టు సర్వత్రాదట్టంగా వున్నది ।

25. యెడతెగకవున్నది । అందరికీ అదికావలెనని । ఆపేక్షకద్దు । దానికి యెవ్వరిమీదా ఆపేక్షలేదు॥

26. అందరూ నాయందే వుండి । నన్ను కనుక్కోలేరు । అన్ని సాధనలచేత కట్టుబడి । జ్ఞానభ్రాంతి చేతకట్టు । బడి ఖర్మాలు తరంగాలవలె పుట్టినాకొద్దీ తీసివేసుకొంటూ । దేహాభిమానం చేత । గురువు అనె మాట మాత్రమైనా తలుపక । తాను లేనిజాడ మరిచి పోతున్నారు.

27. సమస్త దేశాలయందూ శరీరంలేక । వున్న గురురూపాన్ని । ఛీ । అని । ఉపేక్షచేసి । చచ్చినగురువుల పేర్లు చెప్పుకోని । లెస్సావందుకోని । మా గురువు పిపీలికాది బ్రహ్మపర్యంతరం సకల దేహాలలో వుండి । సమస్తం భోంచేస్తాడు । అంటూ ఉన్నారు.

28. అగ్ని హోత్రం వంటివాడు । సమస్తంతింటాడు। సకలమైనవి । తాగుతాడు । వారికి పాలూవొక్కటె । సురావొక్కటె । వారు సకల శరీరాలలో వున్నారు । అని నోరు జారుతూ ఉన్నారు. ఇది సరి అయినది కాదు.

29. వారు గుర్తెరిగే చైతన్య స్వరూపులు । అన్ని తిప్పలూ పరబ్రహ్మముకే । గుర్తెరిగే చైతన్యం పరబ్రహ్మం గనుక । గుర్తెరుగక వక్కటైనా తినడు । వొక్కటైనా తాగడు । సర్వం గుర్తెరిగే చైతన్యమె । యిటువంటి గురువు మా గురువు ॥ అని వేషదార్లు చెప్పుకొంటారు।

30. మా గురువు మహాదొడ్డవాడు । రామోపాసకుడు । వారి ఆచారం సర్వకాలం మడితోటె వుండేది । సర్వకాలం దంచేవాండ్లు నూకలు బుక్కుచున్నట్లు । సర్వకాలం నోరు వూరికే వుండదు । యేదైనా ఒక పారాయణం చేస్తూ వుండేది ।

31. సర్వకాలం దేవుని మీదనే చింత । దీపారాధన యేలాగు గడచేనని చింత । భక్ష్యభోజ్యాలు యేలాగు జరిగేనని చింత । సంసారం పెద్దదని నెత్తి కొట్టుకుంటారు । దేవతాశేషం క్షుధాశాంతి అయితేసరి । ఆలాగు చేయరాదు.

32. యేమైనా భక్తి దొడ్డది । జ్ఞానం వున్నది అన్నా నేనే జ్ఞానం లేదు లేదు అన్నాజ్ఞానం । స్వాభావికమే । భక్తి దొడ్డదనె । వైరాగ్యం దొడ్డదని నెత్తికొట్టినారు । స్వామికి వుత్సవం నడిచితేసరి । యిటువంటి వేషదార్ల జోలియేమి । యీకలలోనే అనేక వింతలు తోచిపాయే ।

33. యదార్థంగా భ్రాంతిలేనిమార్గం జూచుకోని । భ్రాంతిరహితమయ్యే యుక్తి చొప్పునవున్న వాడె ధన్యుడు । అందుకే మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదని నిశ్చయం గలిగి ఉంటే సరి.

34. గనుక విక్షేపము ఉంటేనే ఆవరణం ఉంటుంది. భ్రాంతికి మూలం అవుతుంది గనుక విక్షేపావరణ ద్వయదోషాలు విడిచితే సర్వభ్రాంతులు నశిస్తావి, అంతా అచలమే. ఇదే సిద్ధాంతం.

గద్య:

**ఇతి అచలగురు శ్రీ శివరామ దీక్షిత ప్రభావే । వేదాంత విచారణే । ఉత్తరభాగే । భ్రాంతి రహిత ప్రకరణం । విక్షేపావరణ ద్వయదోష రహితము షష్ఠమ అధ్యాయం సమాప్తం**



# 15. భ్రాంతిరహిత ప్రకరణము

## సప్తమ అధ్యాయము

## 7. క్షరాక్షరోపాది ద్వయదోష రహితము

### 1. యెరుక చేసే విచిత్రాలు చూసి కొంచం నిబద్ధి అన్న యెన్నటికి భ్రాంతిపోదు

గు॥ 1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు। యీ గుర్తెరిగే శరీరం తిన్నంతసేపే । తిండి లేకుంటె అడ్డంపడె। అందుకే। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను అని। నమ్మి వుండరాదు।

శి॥ నమ్మకయేమి చెయ్యవలెను ।

గు॥ 1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదని। సంతతం సర్వకాలం। యెడతెగక జ్ఞాపకం వుంచుకోని। కాలం గడపినవాడు । భ్రాంతిలేనివాడు । అవుతాడు ।

2. యెరుకలేని నిజం యెరిగిన వాడే పుట్టని చావని బట్టబయలును కంటాడు గాని । కలలో గన్నది కొంత నిబద్ధి । కొంత అబద్ధం । అని ద్వంద్వాల నమ్మేనా । భ్రాంతనే అడవిలో కలశి । తోవకి యెన్నటికీ రాదు ।

3. "సర్వకాలం మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని నిద్రవచ్చిన దాక । మరణం వచ్చినదాక। రెప్పపాటులో సగంకాలమైన మరువక। వున్నవాడే బంధమోక్ష రహితుడు । వాడే క్రియాసూన్యుడు ।"

4. వక్క శరీరం యేలాగో అన్ని శరీరాలూ ఆలాగే। మూలంలేని యీ గుర్తెరిగే శరీరంతో । కొంచం నిబద్ధి అనుకొన్న వారికి । భ్రాంతి యెన్నటికి పోదు ।

5. తిండి అన్ని శరీరాలకూ సమానమె। మనిషికి మాత్రం మాటలు యెక్కువ। పశువులకు తక్కువ అంతే.

6. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేది అభ్యాసం చేస్తె । అది కొందరికి లెస్సొ అభ్యాసం। అవుతుంది। కొందరికి కొంచం అవుతుంది। సూక్ష్మబుద్ధికొద్దీ। యింతేకాని । యీ శరీరంలో శాశ్వతమైంది కొంచెం కూడ లేదు ।

7. శాశ్వతమైంది। మొదలూకొనాలేక। శరీరం యెన్నటికీ లేక। తనకు తానె వొక్కతీరుగానే వున్నది । చలించక స్వతఃసిద్ధమై వున్నది । సకలదేశాల యందూ వక్కతీరె వున్నది । సర్వకాలాల యందూ శరీరం లేకనే వున్నది। సమస్తమైన వస్తువులయందూ ప్రవేశించక । తనకు తానె శరీరంలేక వున్నది। శరీరంలేదు గనుక। యెరుకాలేదు। ఖర్మాలు లేవు।

8. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । రాకమునుపు యెరుకాలేదు । ఖర్మాలులేవు ।

9. కలలో శరీరాలు వొచ్చినవి । ఆ శరీరాలు గుర్తెరుగు గనుక । సకల ఖర్మాలు చేసినవి । గుర్తెరుగకుంటె ఖర్మాలు పుడుతానే ఉంటావి. జ్ఞానం నుంచె ఖర్మాలు । ఖర్మాలకు మూలం యీ గుర్తెరిగే జ్ఞానమె ।

10. జ్ఞానం నిబద్ధి । ఖర్మాలు । అబద్ధం అని యీ కలలోనె వక్క సన్యాసి అన్నాడు । ఆ సన్యాసి అప్రమాణీకుడా కాడా । మేలుకొంటె అసన్యాశి యేమాయెను ।

శి॥ యేమీలేదు ।

గు॥ యీ గుర్తెరిగే జ్ఞానం యేమాయ ।

## 2. జ్ఞానాన్ని నమ్మితే కర్మలు తప్పవు

శి॥ యేమీలేదు । జ్ఞానం యేలాగు నిబద్ధి । ఖర్మాలు యేలాగు అబద్ధం ।

గు॥ 1. జ్ఞానం వున్నంతసేపూ ఖర్మాలు నిబద్ధే । జ్ఞానం ముణుగుతె । ఖర్మాలు ముణుగుతావి । అంతపర్యంతం । ఖర్మాలు అనేకం పుడుతానే ఉంటాయి ।

2. జ్ఞానమే ఖర్మాలకు మూలం । జ్ఞానభ్రాంతి పోయెనా । విడువ విడువదు, పట్టా బట్టదు । జ్ఞానభ్రాంతి వుండెనా । ఖర్మాలు విడిచినా పోయినట్లే అనిపించే మల్లా పుడుతాయి.

3. గుర్తెరిగే జ్ఞానం యేమిలేదని గుర్తెరుగుతే కాని ఖర్మాలు చెయ్యరుగనుక । గాఢనిద్రలో యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అప్పుడు గుర్తెరిగే జ్ఞానం లేదు । ఖర్మాలు లేవు । వ్యవహారమే లేదు । సరే కదా । గనుక సర్వకాలం ఆలాగే । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం లేక వున్నవారికి । వ్యవహారం లేదు కదా

శి॥ వ్యవహారం లేనేలేదు

గు॥ శరీరం లేకుంటె యేమీలేదు । వుత్తబట్టబయలే । యేమీలేని దానిలో యేమీలేదు గదా

శి॥ యేమీలేదు

గు॥ యీ శరీరం తోటె జ్ఞాన ఖర్మాలు ఉంటావి । శరీరంలేదు గనుక జ్ఞానమే లేదు । గనుక ఖర్మాలు పుట్టనే పుట్టవు । అందుకే గురువాక్యం కంటె దొడ్డది యేదీలేదు । యేమీ లేదనేటందుకూ మూలంయేమీ లేదు

శి॥ వ్యవహారమే లేదు । గనుక గురువులు శిష్యులకు యేలాగు తెలుపవలెను.

గు॥ 1. గురుశేవ చెయ్యంగా చెయ్యంగా కాని జాడా దొరుకదు। జాడాదొరికినా వ్యవహారమే లేదు । అందరి వలెనే వుంటాడు ।

2. సర్వకాలం శరీరం లేకవుంటారు గనుక । వ్యవహారానికి మూలం యేమీలేదు । అని దృఢం వున్నవారికి । వున్నది అని అనేటందుకు మూలం యేమీలేదు ।

3. లేదు అని అనేటందుకు మూలం యేమీలేదు । పుట్టనిచావనిది । మొదలూకొనాలేనిది । తనకు తానే చలించక స్వతసిద్ధమైవున్నది । సర్వకాలం వొక్కతీరుగానే వున్నది ।

4. సకలదేశాలయందూ సర్వకాలాలయందూ । సమస్తమైన వస్తువులయందూ । శరీరంలేకనే । క్రియాశూన్యమై తాను చెయ్యక । చేయించక । సర్వకాలం భోంచెయ్యక । వక్కటైనా వికారంలేక । శాశ్వతంగా వున్నది ।

5. వ్యవహారంలేని దానిలో । వ్యవహారం వున్నట్లు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేత తోచి వుండెను ।

6. యిప్పుడు గురుకటాక్షం చేత । యీ శరీరానికి । కలలో వచ్చిన శరీరానికి । కూడా మూలం యేమీలేదని చెప్పిరి

శి॥ దేనికి మూలం యేమీ లేదని చెప్పిరి

గు॥ కొనకు కలలో వచ్చి శరీరాలు యెక్కడ ప్రవేశించనవో, అక్కడికే యీ శరీరాలు పోయెనని చెప్పిరి

శి॥ 1. చెప్పితే రెండూ సమానంవలెనె వుండె । మొదలుయేమీలేదని నిశ్చయమాయే । ఉన్నప్పుడు వున్నదని నాకు తోచివుండెను ।

2. ఆ తోచడం కలలో వచ్చినది । వీటి వలెనే యదార్థంగా వుండి । వ్యవహారం చేసి వెంటనే యేమీలేదు । అలాగే యీ శరీరాల యొక్క వునికి కూడా అంతే ।

3. యిప్పుడు గురుస్వామి తెలిపితె । ఆ వునికీ యీ వునికీ । సమానంగా వున్నట్టే వుండెను । కొంచమైనా యెక్కువ తక్కువ వున్నట్టు తోచదాయె ।

4. యిఘయేమి అంటె । అనేక భ్రమలు కద్దు । కలతో సమానమని తెలిపితె । చులకంగా వున్నట్టు వుండేకాని । మూలంలేని । యీ గుర్తెరిగే శరీరం । కలలో శరీరం మేలుకొంటె । తనకు తానే యేమీలేదని నిశ్చయంవున్నట్టు । కావలెనని నాకు భ్రాంతికద్దు ।

శి॥ కలిగితె అలాగే । అయ్యా । యీ శరీరానికి మూలం యేమీలేదని దృఢం వున్నది కదా । వున్నప్పుడు నిబద్దే అనుకోవడం భ్రాంతేకదా?

గు॥ భ్రాంతే నిత్యం కలలో వచ్చేయేనుగలు ॥ గుర్రాలు । లొటిపిట్టలు । వున్నదా

శి॥ యేమీలేదు

గు॥ 1. ఆలాగే యీ మూలంలేని గుర్తెరిగే శరీరం యేమీలేదని నిశ్చయం వుంటెచాలు ।

2. పుట్టనిచావనిది తనకు తానె స్వతసిద్ధమై వున్నది । గనుక ప్రయత్నం యేమీలేదు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని దృఢం వుంటె చాలు

శి॥ యేమిటి చేత ప్రయత్నం చేయను.

గు॥ 1. యే ప్రయత్నాలకూ మూలం యేమీలేదు సకలకర్మాలకూ మూలం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమెకాని । రెండోది యేమీలేదు ।

2. పుట్టనిచావని బట్టబయలుకు వక్కటైనా భ్రాంతిలేదు ।

3. భ్రమలకు మూలం కల । కల కల్పన కాకుంటె శరీరమే లేదు । గనుక । భ్రాంతిలేనేలేదు।

4. యెప్పుడు శరీరం లేకుంటె అప్పుడె భ్రాంతి లేదు ।

5. గాఢ నిద్రలో మూలంలేని యీ గుర్తెరిగే శరీరంయేమీలేదు గనుక । వ్యవహారంలేదు।

6. శరీరం రాంగానే కల సిద్ధం । యీ కలలోనే అనేక భ్రాంతులు సిద్ధం । గుర్తెరుగంగానే భ్రమ పుడుతుంది । భ్రమవలన ఖర్మాలు చేస్తాడు ।

7. శరీరం వలన గుర్తెరగడం వలన । ఖర్మాలు పుడుతావి । యీ వొక్క శరీరం లేకుంటె । ఖర్మాలు లేవు। జ్ఞానం లేదు ।

8. జ్ఞానానికి ఖర్మాలకూ మూలం శరీరమె ।

9. యీ శరీరానికి మూలం యేమీలేదు । యేమీలేని శరీరం యేమిచేశినా యేమీలేదు ।

10. శరీరం చేశిన ఖర్మాలు నిబద్ధి అయితే । గుర్తెరిగేది సర్వకాలం వుండవలె । సర్వకాలం గుర్తెరిగేది వుంటె ఖర్మాలు వుండవలెను ।

శి॥ ఖర్మాలు జ్ఞానం రెండూ నిబద్ధి అయితే ఎట్లా ।

గు॥ శరీరం శాశ్వతంగా వుండవలె గదా ।

శి॥ శరీరం శాశ్వతంగా వుండనే వున్నది అంటే ఎట్లా ?

గు॥ చావకపోవలెను

శి॥ చావనేలేదు అంటే ఎట్లా ?

గు॥ తద్దినాలు పెట్టకూడదు

శి॥ తద్దినాలు పెట్టనేలేదు అంటే ఎట్లా ?

గు॥ 1. కొడుక్కు నొప్పి వస్తే తండ్రి మంచం వద్ద కూర్చుండి । ఆపద యెందుకుపడవలె । తల్లిముత్తైదే అయ్యి వుండవలె । ఛీ । ఛీ। ఆ ప్రసంగం విడువండ్రి । యీ శరీరానికి మర్యాదా లేదు ।

2. యేమీలేదు గనుక యేమీలేని శరీరానికి । యేమీలేని । శరీరమే మూలం । మూలం వున్నదని గడ్డి తిన్నారు । భంగపడ్డారు ।

3. యీ శరీరానికి మూలం వున్నదని । అందరూ మొరిగే మాత్రమే కాని । యెవ్వరిమాటా ముందరపడదు ॥

4. "స్వామీభోజనం చేస్తాడని నైవేద్యాలు చూపుదురే కాని । అన్నీ భోంచేయడమే నిబద్ధి అయితే । భోంచేసే దానికి పెట్టక । బలుపపురాతికి । యెందుకు చూపవలె ।

5. కేవలం నల్ల సెనపుగుండుకు యెందుకు చూపవలె ।

6. కట్టెకు యెందుకు చూపవలె ।

7. ప్రతిమ నిబద్ధి అయితె । ప్రత్యక్షంగా శరీరం వుండగా । యెరుక ఖర్మాలూలేని । రాగి ప్రతిమకు । యెందుకు చూపవలె ।

8. రుద్రాక్షకు యెందుకు చూపవలె ।

9. శరీరం లేనిది అని । మొండిది అని యెవ్వరికి తెలియక । శరీరాన్ని దొరికించుకొంటారు । శరీరాన్ని గూర్చి జ్ఞానభ్రాంతి ఖర్మభ్రాంతి తగిలించుకొని ఉంటారు ।

10. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని । నిశ్చయం గలవారే పరిపూర్ణులు।

11. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని యేలాగంటె ఆలాగు నడిస్తే వారికి శరీరం వున్నదనే భ్రాంతి మిక్కిలిగా ఉన్నది ।

12. అన్నీ విడిచినా వున్నది । కొన్ని దొడ్డవి । కొన్ని చెడ్డవి । అని మంచిని గ్రహించి । చెడ్డవి విడిచిన వారికి । మరీ భ్రాంతి ఘట్టిగా వున్నది ।

శి॥ ఆలాగు అయితే యేలాగు నడువ వలెను । స్వామి.

గు॥ నడిచేది యేమి

శి॥ యోమో మీరే చెప్పండి స్వామి !

గు॥ 1. అందుకే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని । దృఢం వుండవలె ॥ తనకు తానె దృఢం వుంటుంది । యిది దృఢం కావటమే నిజమైన గురుభక్తి ।

2. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె । ఆవరణం వలెనే వున్నది । వున్నది వున్నట్టె వున్నది । యీ ఆవరణం వేశే వారే కాని । తీశేవారు లేరు ।

3. లేనివారు । అయితే లేకుండా చేస్తారు ।

4. వున్నవారు । అయితే । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమనే । దరువాజాకు తాళం వేస్తారు ।

5. నోట్లో మంత్రం వేసి । చేతితో యోని ముద్ర చూపుతారు । యింతేకాని వున్నది వున్నట్టూ యెవ్వరూ సూచనచేయరు ।

6. మూలంలేని యీ గుర్తెరిగే శరీరంలో కొంచెం సత్యమని । ఆశపడ్డా శరీరం యావత్తూ వుంటుంది । యీ శరీరంలో కనుక్కోవలెనని । యీ శరీరమె మొరబెట్టింది ।

7. విత్తనం విడువకూడదని । కపటవాక్యం నమ్మినవారు । భ్రాంతి లేని వారు అవుతారా॥

8. శరీరం వలన పుట్టినది శరీరం వున్నంతసేపూ । చప్పట్లు కొట్టి అనేక సంకేతాలు । చేతులు తోటె చూపుతారు ।

9. తప్పవు । శరీర జన్యం గుర్తెరిగే జ్ఞానం । అజ్ఞానం వలన ఖర్మాలు పుడుతావి । యింతేకాని యీ శరీరంలేని బట్టబయలుకు । యెరుకాలేదు । ఖర్మాలు లేవు । సర్వకాలం వొక్కతీరే ।

10. యీ శరీరం యెటువంటిది అంటె అటువంటిది । శరీరం లేకుంటె యేలాగు వున్నాదో ఆలాగే । పరిపూర్ణం వున్నది ॥

11. అందరూ పరిపూర్ణులే । గాని మూలంలేని యీ గుర్తెరిగే శరీరమనె ఆవరణం చేత వున్నారు ।

12. యీా ఆవరణం అనాయాసంగా । కలలో వచ్చిన యేనుగ మేలుకొంటే । యేమీలేదు అని తనకు తానె దృఢం అయినట్టు । మూలంలేని యీా గుర్తెరిగే శరీరం యేమీలేదు అని దృఢం ఆయెనా । పరిపూర్ణం తనకు తానె స్వతఃసిద్ధమై చలించక వున్నది ।

13. యీా శరీరం చేతసాధ్యం కాదు । శాశ్వితమైంది ఒకటి । యేమీలేనిది ఒకటి । విత్తనములేని చెట్టు వున్నది అని । యెవడు । యెప్పుడూ నమ్మడు ।

### 3. ఫలాని దాని వలన యెరుక వచ్చింది అని ప్రమాణం లేదు.

శి॥ అట్లయితే సన్యాసి యేమి ॥ లేనివాడా । వున్నవాడా ।

గు॥ యేమీలేనివాడే సన్యాశి ।

శి॥ సన్యాసికి మూలంయేమి ।

గు॥ సన్యాసి శరీరమె గనుక । యేమీలేని సూన్యమే సన్యాసి ॥ అందుకే॥

1. శ్రీ శంకరాచార్యులవారి వాక్యములు అవి యదార్ధమైనవని కావు, అట్టి వాక్యాలు కలత వాక్యాలే. "యిప్పుడు యధార్ధంగా వినుండ్రి"

2. సంసారం అంటే మూలంలేని యీా గుర్తెరిగే శరీరం యేమీ చేస్తే అదే సంసారం । శరీరం లేక మునుపు ఉన్నప్పుడు కేవలం అచలమే వున్నది ।

3. యీా శరీరం యేలాగు వచ్చెనంటె । ఫలాని దాని వలన వచ్చిందని ప్రమాణం లేదు । యీా శరీరానికి మొదలు యేమీలేదు । మొదలు వుంటె యిది ప్రమాణమే అవును । మూలంలేని యీా గుర్తెరిగే శరీరం యెప్పుడు తోస్తే । అపుడు వున్నది ।

4. సర్వకాలం యీా శరీరం వున్నది అని యెరుగదు । లేదు అని । యెరుగదు । వ్యవహారం యెప్పుడు మొదలుబెడితే అప్పుడే । వున్నట్టు వుంటుంది । వ్యవహారం చాలించంగానే యేమీలేదు । మళ్ళా వ్యవహారం మొదలుబెడితే సిద్ధం ।

5. సర్వకాలం శరీరాన్ని విడచీలేదు । పట్టుకొనీ లేదు । తనకు తానే ఆసుకొయ్యవలె తిరుగుతుంది । తనకు స్వాధీనం లేదు । వున్నట్టె వుంటుంది । చూస్తూ వుండంగానే యేమీలేదు । గనుక నమ్మరాదు ।

శి॥ నమ్మక మనము యేమీ చేయగలము ।

గు॥ 1. అంటె యీా శరీరం మూలం లేనిది గనుక । తెగిన గాలిపటం వలె వున్నది । మొదలూ కొనాలేని యీా బట్టబయలు । వలె శాశ్వతమైంది కాదు ।

2. వుంటె వుండేది । వెంటనే యేమీలేదు । గనుక యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యిటువంటిది అని । గురు మూలంగా విచారించి । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదని పరిహరిస్తే సరి । యే సాధనావద్దు ।

3. గనుక అక్షరము క్షరానికి ఆసరగా ఉంటే । రెండు ఉంటావి, ఒక్కటి లేకపోతే రెండూ లేవు । ఇదే సత్యం. గనుక క్షరాక్షర ద్వయ దోష రహితమే తాను లేని వునిక్కి ।

గద్య:

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే । వేదాంత విచారణే । ఉత్తరభాగే ।**
**భ్రాంతి రహిత ప్రకరణం । క్షరాక్షరోపాది ద్వయదోష రహితము**
**సప్తమ అధ్యాయం సమాప్తం**



# 15. భ్రాంతిరహిత ప్రకరణము

## అష్టమ అధ్యాయము

## 8. క్షేత్ర క్షేత్రజ్ఞ ద్వయదోష రహితము

### 1. స్వప్న దృష్టాంతము

**శి॥** స్వామీ ! నాకు యదార్థంగా భ్రాంతిలేని మార్గం సూచన చెయ్యండి

**గు॥** చేస్తాను విను ఈ కలలో వొక్క మనిషివచ్చెను । వచ్చి కొంత సేపు వుండె । వెంటనే చూస్తూ వుండంగానే యేమీలేదు । యిది నీకు దృఢమా అనుమానమా

**శి॥** దృఢమేకాని । కలలోవచ్చినవి । అయోనిసంభవాలు । యిప్పుడు యోని సంభవాలు యేలాగు ఆయెను ।

**గు॥** 1. అట్లైతే విను । కలలోనే స్త్రీ పురుషసంయోగము కాలేదా అలాగే గర్భిణీ కాలేదా । ప్రసూతి అయ్యి । పిల్లలు పుట్టరా । పెద్ద వారుకారా । పండుగులు కావా । వివాహాలు కావా । మళ్ళా కొడుకులూ బిడ్డలూ పుట్టరా । దొరతనం చెయ్యరా । బిక్షం యెత్తరా । దానికి మూలం యేమీలేదు।దీనికీ మూలం యేమీలేదు నీకు యేమైనా యెక్కువ తక్కువ తోచెనా చెప్పుము ।

2. కలలో భ్రాంతి మేలుకొన్నదాకా తప్పదు । వున్నంత సేపూ యీకల నిబద్ధివలెనే । వుంటుంది । వెంటనే గుర్తెరుగు చుండంగానే । యేమీలేదు ।

3. నీవే గుర్తెరుగుదువు । కొనకు చస్తేయేమీ లేదని నీవే గుర్తెరుగుదువు । కలకూ దీనికీ యెక్కువ తక్కువ యేమి యెక్కువ తక్కువ లేదు । సరేకదా । నీకు వొక్క భ్రాంతి వున్నది । దాని పోకడ పోగొట్టుకుంటే నీకంటె అధికులు లేరు.

**శి॥** అది యెటువంటిది । సూచన చెయ్యండి ।

**గు॥** చేస్తాగాని యెక్కువ ప్రసంగాలు చెయ్యవు కదా ।

**శి॥** యింత మీకు భయంయేమి । ప్రసంగం । పుట్టకుండా సూచన చెయ్యండి.

**గు॥** నేను చెయ్యంగానే యేమీ । నీవు కనుక్కోవలెను.

**శి॥** వున్నట్టు చెప్పితే యెటువంటి మొద్దుకూ వినంగానే । తనకుతానే తోస్తుంది.

**గు॥** నీమాట సరెకాని । యీ కలలో వచ్చిన శరీరాలు । మనకు యిపుడు కనిపించే । శరీరాలు । సమానమా । యెక్కువ తక్కువా.

శి॥ యేమీయెక్కువ తక్కువలేదు । యిది ఒకసూటిదే.

గు॥ యిది అందరికీ యెరుకే కదా

శి॥ యెరుకే

గు॥ అట్లైతే నీవు యేమి

శి॥ నేనా । నేను యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరమును । కలలోవొచ్చిన శరీరములు యెవ్వరిసత్తా చేతవున్నవి

గు॥ 1. వాటికవ్వే । వీటికివే సత్తా యెవ్వరిదీలేదు । వాటివలెవీటికి యెవ్వరి సత్తాలేదు । వీటికి యివ్వే । యీ శరీరాలను రమ్మనేవారు లేరు । పొమ్మనే వారులేరు వుండుమనేవారు లేరు ।

2. విచారించని మూఢులు । వీటికి మూలం వున్నదని భ్రాంతిచేతవున్నారు ।

3. విచారిస్తే అందరికీ మూలం లేదని యెరుకే

శి॥ అట్లైతె శరీరం । కలలో వొచ్చిన శరీరాలవంటిదే । కానుపించే శరీరాలవంటిదే । యేలాగైనా వొక్కటే । కలలోవొచ్చిన శరీరం వంటిది । అయినా యేమీలేదు

గు॥ అట్లైతె నీకు శరీరం వున్నట్టా లేనట్టా

శి॥ మేలుకొంటె కొంచమైనా । యీ శరీరం యేమీలేదు

గు॥ యెప్పుడు చస్తేనా

శి॥ ఛీ। యెప్పుడు విచారిస్తే అప్పుడే । గురుకటాక్షం చేత యేమీలేదు । నిబద్దే । నిబద్దే। యిందుకు అనుమానం యేమీలేదు

గు॥ అయినా కొనకు చస్తే యేమీలేదు అంటారు

శి॥ అలాగైతే గురువు యెందుకు । విచారానికి ఫలంయేమి । చచ్చిన తరువాత భ్రాంతిరహితం యెవ్వరికి

గు॥ 1. ఛీ। అది మాట కాదు। చచ్చేది యేమి । మొదలు యేమీలేదు । కొనకూ యేమీలేదు । యీలాగు అందరికీ సమానమే ।

2. గురు మూలంగా విచారించిన వారికి । యెప్పుడు విచారిస్తే అప్పుడే । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు ।

## 2. యెరుక లేదని నిర్ణయమైతే యెంత దొడ్డ వారినైన లెక్క చెయ్యరు

శి॥ సరే । సరే। యిందుకు అనుమానం లేదు । గురు స్వామీ నాకు రెండు అబద్ధాలు తోస్తావి

గు॥ యేవి అవి? ॥

శి॥ సుషుప్తి అనే మాట ॥ మరణం అనేమాటా । అదియేలాగు

గు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేకుంటె యేమో

శి॥ సరే అది జాడే

గు॥ 1. సుషుప్తి అని మరణం అని మంది కల్పించినారు । యింతేకాని వున్నది వొక్కటె । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంతశేపూ కలే ।

2. గురు మూలంగా కలలో వచ్చిన శరీరాలు । యెరుక తోటి వుండంగానే యేమీలేదు । అని తనకు తాను యేలాగు దృఢమో ।

3. "ఆలాగే గురుమూలంగా మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదని తాత్పర్యమాయెనా । అదే మేలుకొనుట యింతే కాని వక్కటైనా అవస్త లేదు ।

4. యెరుకయనె స్వప్నావస్త నుండి గురువు మేలు కొలుపితె అదే జాగ్రత యింతేకాని నాలుగు అవస్థలు లేవు యీ శరీరం వక్కటే ।

5. నాల్గుశరీరాలు అబద్ధం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం స్వప్నావస్త । గురుకటాక్షం చేత మేలుకొంటె అప్పుడే జాగ్రత్త । యింతేకాని యెక్కువ ముచ్చట్లు యేమీలేవు"

శి॥ స్వామీ నాకుచాలు ॥ మీరు కష్టపడితిరి । శిష్యుడు మొద్దు యేమో అని । బహుభయపడితిరి ।యిటువంటి ముచ్చట యెవ్వరికైనా దృఢంకాక పొయ్యేనని । మీరు భయం విడువండ్రి । యెంత మొద్దులు అయినా అనాయాసంగా । తనకు తానె దృఢం అవుతుంది

గు॥ యేమైనా అయాసం వున్నదే

శి॥ 1. అతిసులభం ॥ యిటువంటి సులభం వున్నదని యెన్నడూ వినలేదు । మహాకఠినం వున్నదని విన్నా అనేక సాధనలు చేసేనని । విన్నా ।

2. యిప్పుడు విచారించుకొంటె । గట్టుకు మోసిన కట్టెలవలె వున్నది । వక్క సాధన అయినా అక్కరకు రాకపాయే సముద్రం కాళ్ళచేత నడిచి పోయినట్టు ఆయెను ।

గు॥ శాబాసు ॥ గురువు అంటె యీలాగు వుండవద్దా ॥

శి॥ 1. అయ్యా సత్యం యెవ్వరూ నమ్మరు । అబద్ధాలు మహానిబద్ధి అనిపిస్తుంది । వారు యెంతవారు అయిన అనిపిస్తుంది ।

2. వున్నది వున్నట్టె సాధనలు లేకుండా । అనాయాసంగా చెప్పి సూచన చేసినవారికి । యేమైనా యిత్తామంటె । ఔ । వారికి యేమికావలెను । మనకు యేమివున్నది । యెక్కడికక్కణ్నే అనిపిస్తుంది

3. యెన్నడైనా స్వయంపాకమైనా యిత్తా । మంటె । అనుకూలపడదు । అబద్ధాలు చెప్పిన వారి ఖర్మం మంచిది । గనుక బుద్ధి పుట్టింది । వారికి ప్రాప్తివున్నది

గు॥ బహువిద్యాభాత్ నహి అనివున్నది కదా!

శి॥ ఆమాట యదార్థంవలెనె వున్నది । యిది యేమోకాని అధికులకు ప్రయత్నం చేసినా । వారికి ముట్టదు । యిది యేమోకాని । వారికే ప్రాప్తిలేదో మనకే భాగ్యంలేదో । అన్నా । యీ వింత తెలియదు । స్వామీ నాకు చాలు

గు॥ యింకాయేమైనా అడుగుమా

శి॥ 1. యిశ్చలేదు । నేను యేమి అడుగుదు । శ్రవణం చేసేటందుకు మూలంయేమీ లేదు।

2. మననం చేశేటందుకు మూలంయేమీలేదు ।

3. ధ్యానం చేశేటందుకు శరీరం కొంచెమైనా లేకుండాచేశె । యేదిచేశేటందుకు మూలంయేమీ లేదు ।

4. వున్నది వున్నట్టే వుండె । సకల నిర్ణయాలు చేశెశరీరం కొంచమైనా లేకపోయెను ।

5. వున్నబట్టబయలుకు । యెరుకాలేదు । ఖర్మాలు లేవు । అని । వున్నప్పుడు అందరికీ యెరుకే । శరీరంలేనిదే వుండె । గనుక । యే నిర్ణయం చేశేటందుకు మూలం యేమీలేదు ।

6. వున్నట్టు తెలిస్తే చచ్చినట్టు పడివుండవలె । నన్న మాట కొంచం నయంవలె సూటిగా వున్నది ।

7. చస్తే శరీరం యేలాగు యేమీ లేదో । అలాగే గురు మూలంగా విచారిస్తే । కలవచ్చిన యేనుగ మేలుకొంటె యేలాగో అలాగే । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు।

8. మళ్ళా యేమీ అనేటందుకు కలలో యేనుగకొంచమైనా యేమీ లేదుగనుక । అలాగే

యీ శరీరం యేమీలేదు । అని సూచన చెయ్యంగానే యెప్పటి పరిపూర్ణం । అనె బట్టబయలు వుండె । తనకు ఆశఖ్యం ।

9. యితరులకు యేమి జాడవచ్చె యీలాగు గురుస్వామి యొక్క మహత్తు వున్నదని । యిటువంటి గురు సాంప్రదాయం । యే భాష్య శిద్ధాంతాల చేతవస్తుంది । గనుక ఇది సరిపాయె ।

### 3. యెరుకయనె బ్రహ్మ రాక్షసి పట్టి ముప్పుతిప్పల పెట్టింది

10. చదివి చదివి చచ్చేదే కాని । యేచదువుచేత యీలాగు వ్యవహారం శూన్యమయ్యేటట్టు పడదు । అందుకే అందరికీ । శరీరమనె బ్రహ్మారాక్షశి పట్టి । విభూతి కొందరికి పూయిస్తుంది ।

11. తిరుమణి చూర్ణం । కొందరికి పెట్టిస్తుంది ।

12. కొందరికి భాగవతమనె గొడ్డలివలె బొట్టు పెడుతుంది ।

13. కొందరికి నిలువెల్లా । ముద్రలు ధరింపజేస్తుంది ।

14. కొందరికి యేమీలేక । ఉత్తములనిపిస్తుంది ।

15. కొందరికి కుంకుమ పెట్టిస్తుంది । కొందరిని సన్యాసుల చేస్తుంది ।

16. కొందరిని అహితాగ్నుల । కొందరిని వుసాసకుల చేస్తుంది ।

17. కొందరిని లింగధారుల । చేసి । అందరినీ యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరమనె పరబ్రహ్మ యిన్నితిప్పలా పెడుతూవున్నది ।

18. గుర్తెరిగే చైతన్యానికి వొక్కటైనా వికారం లేదని । అనుకొంటూ । యిన్ని గుర్తెరిగే చేష్టలు చేసుకొంటూ। ఉంటుంది.

19. యిదే బ్రహ్మ అనెరాక్షసి । దీన్ని విడిపించే వారు । యెవ్వడైనా వున్నాడో లేడో । దేహమనె చెట్టుకు శంకరాచార్యులు అనె సన్యాశి । గుర్తెరిగే జ్ఞానమనె చైతన్యాన్ని । కట్టివేశినాడు । వేశిన మాత్రమె కాని । వుంటె వుంటుంది । లేకుంటె మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు ।

20. కలలోవచ్చిన శరీరం మేలుకొంటె యేలాగు యేమీలేదో । అలాగే యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు ।

21. నామరూపం లేనిది తనకు తానె చలించక స్వతసిద్ధమై సర్వకాలం। వొక్కతీరుగానే వున్నది।

22. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేక పొయ్యేది। స్వభావం।

23. యిటువంటి చంచలమైన శరీరాన్ని సత్యమని నమ్మి। మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె నేను అని। బ్రహ్మానుభవం చేత। సకల అనుభవాలూ చేస్తూ। అనుభవవేదాంతులమని చెప్పుకొంటూ ఉన్నారు।

24. అచలం యొక్క జాడా యెరుగక। అచలమందే వుండి। అచలంలోనె సంచారం చేసుకొంటూ। అచలం మాకు యెన్నటికైనా జాడదొరికేనా అని। అనుకొంటూ। ఉన్నారు।

25. సుఖ దుఃఖం సర్వకాలం అనుభవించుకొంటూ। వేదాంత కాలక్షేపం చేత। అనేకమంది క్లేశపడుచూయున్నారు।

26. శరీరంలేని గురుసాంప్రదాయం కనుక్కోని। సుఖదుఃఖరహితులము కావలెనని। యెవ్వరికీ యిశ్చలేదు।

27. శీఘ్రంగా యేలాగు భ్రాంతి లేక పొయ్యేనని। ప్రయత్నం చేయక। సాధనలచేత క్లేశపడుతూవున్నాడు

28. గురుశేవచేత। అత్యంత గురుసాంప్రదాయం గల వార్ని జూచి। విద్యాంసుల యొక్క। శిష్య సాంప్రదాయం చూచి। యే శిద్ధాంతం చొప్పునా తగులక ఉండి తెలియవలెను.

29. అచల సాంప్రదాయం। బేధాబేధ రహితమైన। గురుసాంప్రదాయం జూచి। వారిసహవాసం శీఘ్రంగా జేసి। కనుక్కొనెనా। భ్రాంతిలేని వాడు అయ్యి। సర్వకాలం యేకప్రకారంగా। యేలాగు వున్నాడో। అలాగే వుంటాడు।

30. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం చేత సాధిస్తామంటె। యిటువటి అనేక కోట్ల శరీరాలు సాధనచేసినా। పరిపూర్ణం దొరుకక। కొనకుకొన్నాళ్ళు। నేను గుర్తెరిగే జ్ఞానమనే బ్రహ్మము నేను అనుకోని। సకల సుఖదుఃఖాలు। సకల భ్రాంతులూ వదలక భంగపడుతాడు.

31. యిటువంటి దగాపనులు మా మార్గంలో లేవు। యేమీ లెస్సా। సమాధానంగా జూచి విచారించుకోని। పుట్టని చావనిది యీ బట్టబయలు అని మేముఅన్నాము।

యీ వృత్తబట్టబయలే మొదలూ కొనాలేనిది అని అన్నాము । యీ బట్టబయలే అచలము అన్నాము ।

32. యీ బట్టబయలుకు యెరుక లేదు గనుక । ఖర్మాలు పుట్టనే పుట్టవు అన్నాము । యీ బట్టబయలుకు శరీరం లేదుగనుక । సర్వకాలం భోంచెయ్యదు అన్నాము । యీ బట్టబయలే క్రియాశూన్యము అన్నాము ।

33. యీ బట్టయలు తనకు తానె స్వతసిద్ధమై సర్వకాలం వొక్కతీరుగా । సకల దేశాల యందూ వున్నది అన్నాము । యీ బట్టబయలె సర్వకాలాల యందూ । వొక్కతీరుగా వొక్కటైనా వికారంలేక । వున్నది అన్నాము ।

34. సర్వకాలాలు అంటె । యీ శరీరం రాకమునుపు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వుండంగానూ । యీ గుర్తెరిగే శరీరం యేమీలేకపోయినా । యీ బట్టబయలు వొక్కతీరుగా చలించక । సర్వకాలం వొక్కతీరుగా వున్నది అన్నాము ।

35. "యీ బట్టబయలు గాక మరిఒకటి వున్నదని । యీ బట్టబయలు యెరుగదు । యీ బట్టబయలును జ్ఞానచక్షుస్సుచేత । వుండజూచిన వాడు । భ్రాంతిరహితుడు అవుతాడు।

36. యీ బట్టబయలుకు మరి ఒక బట్టబయలు లేదు" అని అందరికీ నమ్మిక కద్దు । మనము చూడనేలేదు । యెంతదూరం పోయినాయెడ తెగక । అంతటాదట్టంగా యెక్కువ తక్కువలేక । మనము పోకమునుపే । ముందర ముందర స్వతసిద్ధమై బట్టబయలే వున్నది ।

37. యిటువంటి బట్టబయలు వున్నదో లేదో అని యెటువంటి మనిషికీ సంశయం లేదు । యీ శరీరాలు బట్టబయలు వలన పుట్టవుగదా । కదిలినా । మెదిలినా । వ్యవహారమే లేదు । యెటువంటి గడ్డి తినేవాడు అయినా । యీబట్టబయలు వలన పుట్టినదనడు।

## 4. ఈ గుర్తెరిగే శరీరం ఉన్నదనుకొన్నంత కాలం
## అనేకం తోచుట దానికి సహజ లక్షణం

శి॥ 1. స్వామీ । యీ శరీరాలు అనేక ప్రకారాలుగా వున్నవి । అది యేలాగు నిర్మాణాలు ఆయెను।

2. ఒక శరీరంవలె ఒక శరీరం లేదు । యెద్దు వొక తీరుగా వున్నది ।

3. యెనుపోతు వొకతీరుగావున్నది ।

4. గుర్రము వొకతీరుగా వున్నది ।

5. గాడిద వొకతీరుగా వున్నది ।

6. యేనుగ వొకతీరుగా వున్నది ।

7. లొటిపిటి వొకతీరుగా వున్నది ।

8. యెల్క వొకతీరుగా వున్నది ।

9. పంది వొకతీరుగా వున్నది ।

10. పాము వొకతీరుగా వున్నది ।

11. తేలు వొకతీరుగా వున్నది ।

12. కాకి వొకతీరుగా వున్నది ।

13. గద్ద వొకతీరుగా వున్నది ।

14. పక్షుల ప్రకారాలు అనేక విధాలు । వ్రాయ శఖ్యంకాదు । యిన్ని విధాలు యెవ్వరు చేశిరి । యెవ్వరినుంచి ఆయే । యెవ్వరి సత్తా చేత వుండె । కొనకు యెవ్వరి వలన లయం ఆయె ।

15. యీ ముచ్చట మాకు సమాధానం అయ్యేటట్టు । అందరూ సరే సరే అని సంతోషపడేటట్టు ।

16. వెంటనే భ్రాంతి పొయ్యేటట్టు । అనేక సాధనలు లేక । ఒక్కసారి వినంగానే । తనకుతానే దృఢం అయ్యేటట్టు ।

17. అనేక సాధనలు లేక । మళ్ళా సంశయం పుట్టేటందుకు మూలం యేమీ లేకుండా । సకల భ్రాంతులూ తోచకుండా । శీఘ్రంగా మాకు సమాధానం అయ్యేటట్టు । దయచేసి చెప్పండి ।

18. చెప్పుతూ వుండగానే । మాకు సమాధానం అయ్యేటట్టు । దయచేసి చెప్పండి । మాకు సమాధానం కావలె । మహా త్వరగా శ్రవణం చెయ్యండి.

**గు॥** నీకు మహా తీవ్రం । అధిక తెలివి గలవాడవే ।

**శి॥** తీవ్రం అంటే మీరే అనేక మాట్లు యిదేకలా । యిదేకలా । అని చెప్పితిరి గనుక । దీన్ని నమ్మరాదు అని । తప్పున మీరేమేలుకొందురో । మీవంటివారిని । యెన్నటికి చూచేమో । అనుకుంటూ వుంటిమి । తప్పున మీకు మీరే వస్తిరి । కనుక । వేగిరం చిక్కు విందామని । యిశ్చపుట్టింది

**గు॥** సరేకాని నేను మేలుకొంటె నేను యేమీలేదు । నీకు యేమి

**శి॥** నాకు వినిపించేవారు యేరి

గు॥ సరె అందుకా। అట్లైతె విను। నీవు యేమీ ?

శి॥ నేనా మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని

గు॥ సరె యీ బట్టబయలుకు వక్కటైనా యెరుక వున్నదా

శి॥ 1. దానికి యేమియెరుక లేదు। యిన్ని శరీరాలు రాకమునుపే అది వున్నది।

2. యీ శరీరాలు వచ్చింది యెరుగదు। పోయిందీ యెరుగదు। అదిఅవాంతర దొరతనం చేయదు। యెరుక ఈ బట్టబయలు వలెనె। శాశ్వతమైంది కాదు। దీనికి వొక మూలం వున్నదీకాదు।

3. యీ శరీరం తోచినప్పటినుంచి। అన్నీ కండ్లపడుచూ వున్నావి। యీ శరీరం యెప్పుడూ యేమీలేదు। అని తనకు తానె యేమీలేనట్లు। యెప్పుడు విచారిస్తే యేదీ తోచదు। యీ శరీరం తనకుతానే యేమీలేకపోవలె। కొనకు చస్తే యేమీలేదు అంటారు

గు॥ 1. ఛీ। అలాగు కాదు। చావులేకనే। యీ శరీరం యేమీలేదు। యీ శరీరానికి మూలంలేదు। కొనకు చావు యెక్కడిది?।

2. చావు అని మాట మాత్రమే। సుషుప్తి అన్నట్టు। ఛీ। ఛీ। ఆ మాటలు విడువు। యీ శరీరం యేమీలేదు।

శి॥ లేకుంటె మంది సుషుప్తి అన్నారు। మళ్ళా యేమీలేకపోతే మంది మరణం అన్నారు।

గు॥ 1. యింతేకాని విచారిస్తే యీ శరీరం యొక్క రాకడాకు మూలంలేదు। వునికికీ మూలంలేదు। పోకడకూ మూలంలేదు।

2. యీ శరీరానికి స్వభావం। వున్నట్టు వుండేది। వెంటనే। యేమీలేదు। సరేకాని। యిప్పుడు యెన్ని విధాల శరీరాలు వస్తావో। అప్పుడు కలలో యిన్ని విధాల శరీరాలు చూస్తావు గదా

శి॥ ఆహా చూడనే చూస్తా। లెస్సా గుర్తెరుగుతా। ఆ శరీరాలు నేను కొంతశేపూ ముచ్చట్లాడుతాము। యింకా వింతవింత శరీరాలు అనేక చిత్రవిచిత్రాలు। లెస్సా అని మమ్ములను గుర్తెరుగు। మేము వాట్ని గుర్తెరుగుదుము। మాకు వాటికీ కొంచమైనా యెక్కువ తక్కువ లేదు

గు॥ 1. రెండూ సమానమే। గుర్తెరుగుతూ వుండంగానే। ఆ శరీరాలు గుర్తెరిగే చైతన్యంతో కూడా యేమీలేదు। ఆ శరీరాలు యీ శరీరాలు రాకమునుపే। గుర్తెరిగే చైతన్యమనె జ్ఞానం। అనేక చిత్ర విచిత్రమైన ఖర్మాలు లేని యీ బట్టబయలు యెప్పటివలెనె వున్నది। యేలాగు వున్నది ఆలాగే వున్నది।

2. యీ శరీరం ఆ శరీరాలు యెన్ని। యెన్ని తిప్పలు బడ్డా। యేమీ అనదు। చూడబోయితే। యీ బట్టబయలులోనే ప్రపంచం వున్నది।

3. యీ ప్రపంచానికి। యీ బట్టబయలుకూ యేమీ సంబంధం లేదు। యీ బట్టబయలుతాను చెయ్యా చెయ్యదు। చేయించా చేయించదు। తానే తాను అయి వున్నది। సరెకదా

శి॥ సరే స్వామీ !

గు॥ యిప్పుడు నీకు వొక్క దృష్టాంతం చెప్పుతా విను। యీ కలలో శరీరం వస్తే భ్రాంతి

శి॥ స్వామీ వచ్చే శరీరాలు యీ శరీరంకంటే వేరేనా। యీ శరీరమె అనేక శరీరాలు అయిందా

॥గు॥ 1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి। నానా విధపు శరీరాలు తోచినవి। యీ శరీరం కంటె వేరే వేరె తోచినవిగాని। యీ శరీరం కంటె వేరేకావు।

2. యీ శరీరం అనేక చిత్ర విచిత్రాలు అయింది। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంతశేపూ। చిత్రవిచిత్రపు శరీరాలు తోస్తావి। యింతేకాని వచ్చేటందుకు మూలం యేమీలేదు।

3. మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికే కల్పించే సామర్థ్యం। యీలాగు అవాంతర పిశాచం వలె వున్నది। తల్లి గారిపిశాచం గాదు। తండ్రి గారి సంబంధం వలన వచ్చిన పిశాచం కాదు। చుట్టాలదికాదు। అత్తగారి సంబంధం కాదు।

4. కాశీకి పోంగా తోవలో అడ్డం తగిలిన బ్రహ్మారాక్షశి వలె వున్నది। బ్రహ్మారాక్షశీకాదు। మధ్య యీ కలలోనే సన్యాశివచ్చి। బ్రహ్మ అనే రాక్షసి అనే పేరు పెట్టి మందికి తగులపెట్టి పోయినాడు।

5. వున్నబట్టబయలుకు। గుర్తెరిగే జ్ఞానమే లేదు గనుక। యే ఖర్మాలు లేక। పేరూరులేక। తనకు తానే స్వతసిద్ధమై చలించక। సర్వకాలం వొక్కతీరుగా వున్నది।

6. యీ బట్టబయలుకు శరీరంలేదు కనుక। వక్కటైనా తోచదు। సకల భ్రమలకూ మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె।

7. యీ శరీరం లేని వారికి యేమీతోస్తుంది అన। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం లేని। బట్టబయలుకు యేమీ యెలాగు తోచదో। ఆలాగే దృష్టాంతం యెలాగో। ఆలాగే దాష్టాంతికమని। సూచనకాంగానే। పుట్టనిచావని బట్టబయలే వుంటుంది। అని అన్నారు

8. మూలంలేని యీ గుర్తెరిగే శరీరంలేని వారి సహవాసం చేశి చూడవలె । చూస్తే యేలాగు తోస్తుంది । విచారించవలె । "విచారిస్తే దార్ష్టాంతికం సూచన చేస్తారు ।

9. చేస్తే తాత్పర్యం చేసుకొవలె । చేసుకొంటె । మూలం లేని యీ గుర్తెరిగే శరీరం వున్నంతశేపూ తోస్తూనే వుంటుంది । తోస్తూ వున్నకొద్దీ । భ్రాంతి విడువదు ।

10. భ్రాంతి విడువకపోతే విచారానకు ఫలం యేమి । వున్న యీ బట్టబయలు తాను పుట్టదు । పుట్టించదు । యీ బట్టబయలుగాక । మరివొకటి । శాశ్వతమైందీ । వొక్కటైనా వికారంలేనిదీ । మరివొకటి లేదు ।

11. యీ శరీరం మధ్యనే తోస్తుంది । మధ్యనే యేమీలేదు ।

12. మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి । సర్వం తోస్తుంది । యీ గుర్తెరిగే శరీరం యెప్పుడు యేమీలేక పోతుందో । అపుడె యేమీ తోచదు ।

13. యీ శరీరాన్ని । కలలో వచ్చిన యేనుగ మేలుకొంటె యేలాగు యేమీలేదో । ఆలాగే యీ శరీరాన్ని చూడవలె । ఆలాగు తాత్పర్యం చేసుకోవలెను ।

14. అత్యంతశూన్యంగా విచారించవలెను । విచారించక । కలలో వచ్చిన యేనుగను పుణ్యానికి అమ్ముకొంటె । పదివేల రూపాయలు వస్తావని ఆశపడెనా । మేలుకొంటె యేమీలేదు ।

15. ఆలాగే యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరంచేత । యేమిసాధన చేశినా । కలలో వచ్చిన యేనుగకు ఆశపడితే । అమ్ముకొనేటందుకు యెంత ఆశవుండునో । ఆ ఆశవలెనే । మేలుకొంటె యేమీలేదు । తనకు తాను దురాశయని । యెరుగకనే యెరుగుము ।

16. ఆ దురాశవంటిదే । మూలంలేని యీ గుర్తెరిగే శరీరంచేత సాధించుతాను అంటే యెరుక యేమిలేకపాయె । పుట్టనిచావని బట్టబయలే ఉండె । వూరికే కలలో వచ్చినట్టు తోచింది । రానూలేదు వుండనూలేదు । యేమీలేదు

శి॥ సరె సరె । యేమీలేదు । యిది యదార్థమే । గురువు అంటె యిలాగు వుండవద్దా ॥ గనుక దృక్కు దృశ్యోపాది చేత నేనులేని నిజం తెలిసి ఈ దృక్కు దృశ్యాలకు మూలమైన ద్రష్టను వదిలితే అంతా అచలమే ఉన్నది.

గద్య: ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే । వేదాంత విచారణే । ఉత్తరభాగే । భ్రాంతి రహిత ప్రకరణం । దృక్కు దృశ్యోపాది ద్వయదోష రహితము

అష్టమ అధ్యాయం సమాప్తం

# 15. భ్రాంతిరహిత ప్రకరణము

## నవమ అధ్యాయము

## 9. ఆత్మానాత్మ ద్వయదోష రహిత ప్రకరణం

గు॥ 1. యెవ్వరైనా యిది బాటకాదని । రాజమార్గంలో పడవేస్తే । మళ్ళా చిల్లరత్రోవలనమ్మనట్టు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదని । చెప్పితె । పుట్టనిచావనిది । మొదలూకొనాలేనిది । రాకడాపోకడా లేనిది । తనకు తానే స్వతసిద్ధమై చలించక వున్నది ।

2. సర్వకాలం యేకప్రకారంగా వున్నది । దానికి ప్రబంధం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె । మరివొకటిలేదు । తనకు తానే కలతోచినట్టు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం తోచింది ।

### 1. శంకరాచార్యుల వారి సందున మా సందున బట్టతెర ఉన్నది.

3. యీ గుర్తెరిగే తెరతీసే । గురుసాంప్రదాయం కోట్లలోపల వొక్కరు వున్నాడో లేదో । వారి సహవాసం చేసి చూచే దాకా నమ్మరాదు ।

4. తెర అయితె గాలికి । యెగసి పొయ్యెను । ఈ గుర్తెరిగే శరీరాన్ని ఘట్టిగా రాళ్ళగోడవలె నిల్పేవారు కొందరు ఉన్నారు । మట్టిగోడవలె నిల్పినవారు కొందరు ఉన్నారు ।

5. అందుకె శంకరాచార్యుల సందూన మా సందూన మూలంలేని యీ గుర్తెరిగే శరీరమనె బట్టతెరవున్నది గనుక మేము పరమపదమనె వైకుంఠము బట్టతెరవేశినట్టు । ఉన్నాము.

6. మూలంలేని యీ గుర్తెరిగే శరీరంలేని । ఆచార్య కటాక్షంచేత । "నిర్హేతుక జాయమానా కటాక్షం"। గలిగేనా । యీ గుర్తెరిగే బట్టతెరదీస్తే అంతా వైకుంఠమే । రెండో ప్రతిమలేదు అంతా బట్టబయలే ఉన్నది ।

7. వైకుంఠంలోనే అనేక ప్రతిమలు వున్నావి । వైకుంఠమును యెరుగవు । బట్టతెరవున్నది । తానుతీసుకోలేడు । తనకు తాను పోదు । సామాన్యులు తియ్యలేరు । బట్టతెరవలె । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నది ।

8. యీ తెరదీస్తె । సకల దేశాలయందూ । ఈశ్వరుడు వున్నాడు । ఈశ్వరునికి కుంఠితం గాని వైకుంఠానికి వేరులేదు । సకల దేశాలయందూ వైకుంఠం వున్నది । యెక్కడను అంటే అక్కడనే విష్ణువు । వున్నాడు ।

9. యీ రహస్యం యెవ్వరికీ తెలియదు । విష్ణుమాయ యని ప్రశిద్ధికద్దు । అరిచేతులో వైకుంఠం వున్నది । ఆచార్య కటాక్షం గలిగి । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమనె తెరదీస్తె । కుంటితంగాని వైకుంఠం తనకు తానె స్వతసిద్ధమై చలించక । సర్వకాలం యేకప్రకారంగా వున్నది ।

10. యే సిద్ధాంతం నమ్మినా । మూలంలేని యీ గుర్తెరిగే శరీరంలేని రాజమార్గం వంటివి కాదు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నిల్పుకోని । యేమి జెప్పినా మునపటి గాడిద వాలకం పోదు

11. అందుకే । మొట్టమొదట బయలు వున్నది గదా అని నిత్యానూరు మాట్లు పది దినాలు చెప్పవలె । ఘట్టిగా వున్నది అని పదకొండో । నాడు అనెనా । వీడు ఘట్టివాడు అని । వాణ్ణి దగ్గర వుండు మనవలె । వుండి సేవవంచనలేక చేశేనా । భ్రాంతి లేని మార్గం సూచన చేయవలెను ।

12. మొద్దు ఆయెనా వేగిరం సూచన చెయ్యకూడదు । చేస్తె వ్యర్థం అవుతుంది । వెయ్యిమార్లు వుపదేశం చెప్పివుంచవలెను ।

## 2. అబద్దం చెప్పితే వంశనాశనమైతారని శాస్త్రం చెప్పింది.

13. శరీరంలో కొంతనిబద్ధి అని చెప్పినా ఆ గురువు పుత్రమిత్ర కళత్రాదుల తోటి నిర్మూలమై। వంశక్షయమైపోతాడు అని । "భరద్వాజులు సుకేశునితో పలికినాడు"। యేమని అంటె॥

**శృ॥ నమూలో వా ఏష పరిశుష్యతి । యోనృతమభి వదతి ।**

**తస్మాన్నార్హా మ్యవనృతం వక్తుమ్** ॥ 6వ ప్రశ్న-1-60 శ్లో॥ 'ప్రశ్నోపనిషత్' నందు వున్నది ।

అందుకే । ఛీ । అని యెవ్వరికీ అబద్దాలు చెప్పకూడదు ।

14. అధికారి అయితే నిజం సూచన చేసేది । మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి సర్వకాలం జగత్తుతోచెది స్వభావం తనకు తానె తోచింది । అందులో యెంతమంది సన్యాసులు తోచినారు । వారు గుర్తెరిగే చైతన్య స్వరూపులా మరి వొక స్వరూపులా । అందరూ గుర్తెరిగే వారే । వారూ శరీరం సమానమే ।

15. యెరుకచేత వుండంగానే వారు యెక్కడికి పోయిరి । అని చెప్పదు । తనకు తానె తోచింది । వెంటనే యేమీలేదు । తనకు తానె స్వతఃసిద్ధమైన బట్టబయలులో । తనకు తాను తోచింది । తనకు తాను వొచ్చిన శరీరం । యీ శరీరమే నేను అని అనుకొంటూ వున్నది ।

16. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వుండంగా అనేక శరీరాలు తోస్తావి । కలలో వచ్చిన శరీరాలవలెనె। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు। అని మేలుకొంటె యెవ్వరికి తోస్తావి ।

17. యీ గుర్తెరిగే శరీరం యేమీలేకుంటె యేమీలేదని తనకు తానె దృఢం వున్నది । యేమి సాధనా చెయ్యందె। తనకు తానె మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదని సరిపుచ్చుకోవలెను ।

18. యేమీ యెన్నడైనా । కలతోచిన దేహాలు యేలాగు యేమీలేదో । అలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అనిసరి పుచ్చుకున్నావా । సరిపుచ్చుకో । లేదా । యెప్పుడైనా మంది। యీ గుర్తెరిగే శరీరం। కలతోచిన శరీరం మేలుకొంటె యెలాగు యేమీలేదో । అలాగే యేమీలేదు ।

19. వున్నదానికి శరీరం యేమీలేదు గనుక । దానికి తోచనె తోచలేదు ।

20. అందుకే మూలంలేని యీ గుర్తెరిగే శరీరముకు। తోచిన శరీరాలు వెంటనే యేమీలేదు । అని। దృఢం వున్నట్టు వుంటె చాలు

**శి॥** స్వామీ యిందుకు యేమైనా చెయ్యవలెనా ।

**గు॥** యే సాధన చేయందే కలదోచిన శరీరాలు యేమీలేదు అని దృఢం అయింది గదా । తనకు తానె దృఢం వున్నది ।

**శి॥** యిక్కడ దృఢంతో కూడా యేమీలేదు ।

**గు॥** అలాగే కలదోచిన శరీరాలకు దృఢం వున్నదా మళ్ళా మళ్ళా యేమీలేదని అనుకొంటూ వున్నావా

**శి॥** వున్నంతశేపూ వున్నట్టు వున్నావి వెంటనే యేమీలేదు

**గు॥** అలాగే గురుమూలంగా యెప్పుడు మేలుకొంటె అపుడె కొంచెమైనా శరీరం లేక । కలతోచిన దేహాలవలె । వెంటనే యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । యీషత్తు ఆశపడ్డా అంతా వుంటుంది

## 3. యెరుక యొక్క పెద్దరికం, అబద్ధమని బయట పడింది.

**గు॥** 1. కలదోచిన దేహాలూ యీ దేహాలూ చుట్టాలు । వీరికీ వారికీ మహా స్నేహం । నిత్యా మీరులెస్సా వున్నారు గదా అని । అన్యోన్నం యేకాంతాలు కద్దు । మీకు యేమీవిపత్తు లేదు గదా ।

2. నీ కలతోచిన వారు అడిగితే । మీకు మీరెదిక్కు । మాకు మేమే దిక్కు అని వీరూ వారూ సమాధానం చేసుకొంటారు ।

3. కాని మనము చేశిన పుస్తకాలు చూస్తారు గదా । చూస్తారు గాని । మనలోనె పోటీలు వున్నావి అదేమి వీరూ వారూ సమానమె । అని । గులగుల పుట్టింది । యిఘయేలాగు అన్నా । మనకు మూలం యేమీలేదు అని పుట్టింది । అంతా యీ కలతోచిన దేహాలు యేమీలేదు కదా । ఆలాగే । యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని కొందరు అనుకుంటూ వున్నారు ।

శి॥ "అట్లైతె మణిగె । వెళ్ళి వచ్చినట్టే వుండెను । యీలాగు వున్నది । యే సంతోషం యేమీలేదు । యింతమర్మం యెవరు చెప్పిరి । మనలో స్వామిద్రోహులు వున్నారు । అట్లయితే దేవతాభ్రాంతి అయినాలేదా

గు॥ 1. నీవే యేమీలేకుంటే । నీకు దేవతా భ్రాంతి యెక్కడ వున్నది ।

2. ఆలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని సరిపుచ్చుకుంటె యే భ్రాంతికి మూలం యేమీలేదు ।

శి॥ అట్లైతె మన పని కూకుడు వేళ్ళతో వూడిపాయె । యెప్పటికి అలాగే వున్నది । ఔ యెంత అయినా యీ శరీరంలో గ్రహించినా । కదలక మనమంతా వుందుము ।

గు॥ దరువాజా తగులబెడితే అందరిది ఒకేబాట ఆయెను । యెవ్వరి తరం మొదలూ కొనాలేని బట్టబయలు । వెయ్యిమార్లు వుపదేశం చెప్పేది । కలదోచిన శరీరాలు వెంటనే యేలాగు యేమీలేదో । అలాగే । యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని తాత్పర్యమైతె । యెప్పటి పరిపూర్ణం తనకు తానె స్వతసిద్ధమై వున్నది

శి॥ మనకు చాటుయేది । మెదల శఖ్యం కాకుండా ఆయె । యిక మీద వుపద్రవమె। మాకు చాడీలు చెప్పినట్లుగాను । వెంటనే యేమీలేదు । మిమ్ములను చూచేవాండ్లు మీజాడా కనుక్కొనిరి । మీరు జాగ్రత చేతవుండరాదు

గు॥ 1. మీకు మీరే దిక్కు మాకు మేమే దిక్కు। వెనకా యేమీలేదు । ముందరా యేమీలేదు । మొగుడులేని ముత్తైదవ తనం । యెంతకని అవతరం । కాని యేలాగైతే ఆలాగు మన స్వభావమే యేమీలేదు । మనము దేనియందు వున్నామో । అదే లేకపోదుగదా । సర్వకాలం వొక్కతీరె ।

2. యీ శరీరాన్ని యెంత నమ్మినా యేమీలేదు । శీఘ్రంగా యీ బట్టబయలు వున్నదని నమ్మి । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదని తాత్పర్యం చేసుకోవలెను ।

3. యీ గుర్తెరిగే శరీరం చేత లేదు లేదు అంటె । యీ శరీరమె అవుతుంది । కలతోచిన శరీరం కొంతవున్నాదా । యేమీలేదు ।

4. ఆ శరీరాలు యేమైనా అనుకొనుచున్నావా । యేమీలేదు । యేమి అనుకొంటావి । ఆలాగు మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని తాత్పర్యం చేసుకొంటె । పరిపూర్ణం తనకు తానె స్వతఃసిద్ధమై చలించక వున్నది విచారంచేతనే గాని । సాధనచేత సాధ్యం కాదు । శ్రమ మాత్రమే

శి॥ అట్లైతె యెందుకు శ్రమపడవలెను.

గు॥ పుట్టని చావని బట్టబయలు తనకు తానె స్వతఃశిద్ధమై చలించక వున్నది గదా

శి॥ యీ బట్టబయలు శాశ్వతంగా వుండనే వున్నది

గు॥ యిఘయేమి అంటె మూలంలేని యీ గుర్తెరిగే శరీరం ఆగాంతకం । కలతోచినట్టు దేహంతోస్తూ వున్నది । యిందుకు యుక్తి ॥

1. కలతోచిన దేహాలు వెంటనే యేమీలేదు । యీ రెండు దేహాలు వొక్కటె । రెంటికీ మూలంయేమీలేదు । అని । తాత్పర్యం అయితే సరి । యీ రెంటికీ మూలం యేమీలేదు । మధ్యవచ్చి । మధ్యపొయ్యె వాటికి మధ్యనే తోచింది । మధ్యనే యేమీలేదు ।

2. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం లేకుంటె । యేమీతోచదు । సకలభ్రాంతులకూ మూలం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె । యీ శరీరంలో కొంత సత్యమని ఆశపడ్డా । అంతా యెప్పటివలెనె వుంటుంది । శరీరం పుట్టకమునుపే । మొదలూకొనాలేని యీ బట్టబయలు తనకుతానె స్వతసిద్ధమై వున్నది ।

3. వుండి తాను పుట్టదు । రెండో దాన్ని పుట్టించా పుట్టించదు । సర్వకాలం చెయ్యక । చేయించక । తనకుతానె జ్ఞాన ఖర్మసాధన ద్వయం యొక్క ఆపేక్షలేక । జ్ఞానం చేత । ఖర్మాలు చేత సాధ్యంకాక । వొక్కతీరుగా వున్నది । సాధనసాధ్యపరామర్శ రహితమైంది । తనకుతానే స్వతశిద్ధమై వున్నది ।

4. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని తనకు తానే విచారంచేత । కలలో వచ్చిన శరీరాలు వెంటనే తనకు తాను యేమీలేదు అని । దృఢం అయినట్టు

। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం ఆలాగు కొంచమైనా యేమీలేదు ।

అని తాత్పర్యం లెస్సా అయితె । యెప్పటి బట్టబయలె । స్వతసిద్ధమై వున్నది ।

5. ఆత్మా అనాత్మా అనే అడవిలో వుండెనా । నరఅడవి తప్పదు । సకల భ్రాంతులకూ మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె గనుక । అది ద్వైతాద్వైత రహితమైన పరమతత్వాతీతంబను అచలమే ఉండెను !

6. అందుకే ఆత్మానాత్మ ద్వయదోషము గురువాక్యంచేత లేనిది లేనట్లు యదార్థమాయె గనుక యేభ్రాంతి పుట్టదు అంతా అచలమే ఉండును ।

గద్య:

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే । వేదాంత విచారణే । ఉత్తరభాగే ।
భ్రాంతి రహిత ప్రకరణం । ఆత్మానాత్మ ద్వయదోష రహితము
నవమ అధ్యాయం సమాప్తం



# 15. భ్రాంతిరహిత ప్రకరణము

## దశమ అధ్యాయము

## 10. ఆత్మబ్రహ్మోపాధి ద్వయదోష రహితము

గు॥ 1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని కలలో వచ్చిన శరీరాలవలెనే । యేమీలేదు । అని సాధనలు చెయ్యందె । తనకు తాను భ్రాంతి రహితం ఆయెనా । పుట్టని చావనిది । రాకడా పోకడా లేనిది । తనకు తానే స్వతసిద్ధమై వున్నది

2. సర్వకాలం వొక్కతీరుగా వున్నది । యెన్నటికి శరీరం లేనిది । జ్ఞానఖర్మ శూన్యమైంది। బేధాబేధరహితమైంది । ఆత్మబ్రహ్మ నామరహితమైంది జ్ఞానభక్తి వైరాగ్య శూన్యమయింది । శరీరాలలో ప్రవేశించనిది । వెళ్ళిపోంది । సకలదేశాల యందూ ఉన్నది ।

3. సర్వకాలాలయందూ । సమస్తమైన వస్తువులయందూ । ఏమాత్రంలేక । తనకుతానె । తనంతది రెండోది లేక । తన సంబంధంగాని శరీరాలు గాక । తనకు తానె । ఆ శరీరాల యందు వున్న । అనేక బేధాలు గాక । సర్వకాలం భోంచెయ్యక ఉన్నది ।

4. ఉదక పానమైనా చేయక । సుఖదుఃఖాల యొక్క గంధమాత్రమైనా లేక । మహాద్వైతమనే నామమును ధరించక । నామమూ రూపమూలేక । సర్వకాలం సంతతం వొక్కటైనా వికారంలేక । చదువుకోక । లింగత్రయం గాక । యేలాగు వున్నదో అలాగే వున్నది ।

5. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వక్కటె గాని । రెండో శరీరం లేదు । శరీరం వున్నంతశేపూ స్వప్నావస్తేగాని । రెండో అవస్తలేదు । వక్కటే దేహం । వక్కటె అవస్త । నాలుగుదేహాలు । నాలుగవస్తలూలేవు।

6. గురుమూలంగా దృష్టాంతంవలె మేలుకొంటె । అప్పుడే జాగ్రత । అంతపర్యంతం కలె । భ్రమకు మూలం వక్క గుర్తెరిగేజ్ఞానం । రెండోది యేమీలేదు । దీని పాదు తొలిగించవలెను.

### 1. యోని సంభవులు అయోని సంభవులు రెండు సమానమే.

శి॥ 1. అయ్యా । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్న కాశ్శేపూ। అయోని సంభవుల గుర్తెరుగుతుంది । కాశ్శేపు యోని సంభవుల గుర్తెరుగుతుంది ।

2. వెంటనే మూలంలేని అయోనిసంభవులు తోచి । యెరుకవుండంగానే యేమీలేదు ।

3. యోని సంభవులు ఆలాగే । నేను గుర్తెరుగంగానే యేమీలేదు ।

4. యీ కలతోటె అయోని సంభవులు తోచిరి । కలతోటే యోని సంభవులు తోచిరి । వారూ యేమీలేదు । వీరూ యేమీలేదు ।

5. నాకు తనకు తానే దృఢం వున్నగాని । నా వర్తమానం కల్లగా వున్నది ।

5. అదేమో । నేను యోని సంభవుణ్ణో । అయోని సంభవుణ్ణో । కాశ్శేపు వారు వస్తేవారి వలెనే యున్నా। వీరిని చూస్తే వీరివలెనే యున్నా। విచారిస్తే। ఆ దేహాలకూ మూలం యేమీలేదు।

6. యీదేహాలకూ మూలం యేమీలేదు । రెండూ సమానమె అవి శాశ్వతమైన యీ బట్టబయలు వలెకావు ।

7. యివి శాశ్వతమైన యీ బట్టబయలు కావు । వాటికి మొదలూ కొనా వున్నదే వీటికి మొదలూ కొనా వున్నదే । వాటికి రాకడా పోకడా కద్దు ।

8. వీటికీ రాకడా పోకడా కద్దు । అని నాకు తోస్తుంది । మంది అనుకోంగా వింటాను

గు॥ 1. యదార్ధంగా విచారిస్తే । తోచడం మాత్రమే కాని । ఆ దేహాలకూ మూలం యేమీలేదు । యీ దేహాలకూ మూలం యేమీలేదు ।

2. ప్రవేశించేటందుకు స్థానం యేమీలేదు మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను అని అనుకొన్నంత శేపూ । యీ ప్రకారాన తోస్తూ వుంటుంది ।

3. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యిప్పుడు యేమీలేకపోతే। అప్పుడే యేమీ తోచదు । తోచకుంటె సుఖం యేమీలేదు । దుఃఖం యేమీలేదు ।

శి॥ అట్లయితే సర్వశూన్యమా। అట్లయితె శరీరంలో కొంత వుంచుకోనా। వుంచుకోవలెనా

గు॥ వుంచుకొంటె శరీరం యావత్తు వుంటుంది

శి॥ వుంటె యేమి। చల్లలో వెన్నవుంటె బాధయేమి? అది యేమీ। పెరుగుతరిస్తే పెరుగులోనే పుట్టింది। చైతన్యం దేహం వలన పుట్టింది అని నేను యెన్నడూ వినలేదు పెరుగు కవ్వంచేత తరిస్తే వెన్నపుట్టింది । అని అందరికీ యెరుకే ।

గు॥ దేహంలో వున్నది గుర్తెరిగే జ్ఞానం । దేహం వలన పుడుతుంది । త్రిగుణాత్మకం । దేహాది పదార్థాలను గుర్తెరిగే జ్ఞానం । సత్వగుణం వలన పుడుతుంది ॥

శృ॥ పదార్ధవాచ జ్ఞానస్య । సత్వకార్యత్వాత్ । సత్వాస్సంజాయతే ।
జ్ఞానం । యితి శృతేః । జాగ్రదవస్తాయాంచ । జ్ఞానాధిక్యాత్ ॥

**శృ॥ చిజ్జడంనామ । యోదృష్టాః సోచ్యుతః ।** అని శృతి వున్నాది ।

నాశనరహితమైంది అచ్యుతుడు । అని వున్నాది । అట్లయితే ।

**"జాతస్యహి ధృవోమృత్యుః॥"** అని వున్నాది గనుక । శరీరంతో కూడా యేమీలేదు ।

**శి॥** అబ్బా । యిది అందరూ అనుకొంటూ వుంటారు । గాఢనిద్రలో మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని లెస్సా ప్రశిద్ధికద్దు ।

**గు॥** శరీరం వున్నంతశేపే । శరీరం లేకుంటే యేమీలేదు

**శి॥** అట్లైతే సర్వశూన్యమా

**గు॥** తనకు తానే యేమీలేదు ।

**శి॥** నన్నేమంటావు । శరీరానికి మూలం యేమీలేకుంటే దాని బ్రతుకు యేమీ । యిప్పుడు నాకే అయోని సంభవాలు । కలలో అనేక శరీరాలు తోచినావి ।

గుర్తెరిగే జ్ఞానంతో కూడా తోచినవి । వెంటనే యేమీలేదు । మన ఆశచేత । శరీరాన్ని కొంత కట్టి వేశుకొంటె । వుండదలచిందా యేమి అట్లయితె జ్ఞానం దొడ్డది అని ప్రశిద్ధి యెందుకు వున్నది।

## 2. అబద్దాని పోషించుట యెరుక యొక్క లక్షణం

**గు॥** లోకంలో పాపాత్ముడు ధర్మంచేస్తే । మహాదొడ్డవాడు అని ప్రశిద్ధి వలె కొంచెం సుగుణం వుంటే ప్రసిద్ధి । వాడేనని అంటారు, నిరంతరం ధానం చేసే వాన్ని యేదో ఒక విధంగా నింద చేస్తారు.

**శి॥** అబద్ధానికి జీవనం ప్రశిద్దేనా ।

**గు॥** రాళ్ళు దేవతలని ప్రశిద్ధి లేదా । పూజలు చెయ్యరా । దాందేమి । పంచితంతాగరా । పెండతినరా । యీలాగే లోకవాడికె । వారు చూసింది గాదు, విన్న మాటకే అంత ప్రసిద్ధి ఆయెను.

**శి॥** యీ బట్టబయలు పారిపోతుందా యేమి । మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికీ । యేమి సాటి । యేమీలేని యీ గుర్తెరిగే శరీరంలో । కొంత నిబద్ధి । కొంత అబద్ధం అని । కుక్కల వలె మొరిగిందాకా యేమి । గాడిదవలె కూసిందాకా యేమి । నక్కవలె వొల్లిందాకా యేమి । పశువులకు నోరు లేదా యేమి ।

గు॥ 1. మనుష్యులు మూలంలేని యీ గుర్తెరిగే శరీరాలలో కొంత నిబద్ధి కొంత అబద్ధం । అని అనుకోంగా విని । ఛీ । వారివలె మనము మాటలు ఆడవద్దు । అని వూరుకే వుంటూ వున్నవి

2. మనుష్యులు యెంత భ్రాంతులు లని అనుకోను । మాటె అబద్ధమని । నోరుమూసుకోని । మొదలూకొనాలేని దానిలో పడుకొంటావి ।

3. అవి పుట్టని చావనిదాని యందే వున్నావి। దాన్ని యెరుగవు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని దృఢంగా యెరిగి వూరుకుంటే చాలు ।

శి॥ వున్నప్పుడు మనుష్యులతో । సర్వం । సమానం ।

గు॥ సమానమేగాని । అబద్ధాలు ఆడవు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరంలో । కొంత నిబద్ధి । అనేది యెందుకు । అనుకొన్నవు ।

శి॥ వాదించేటందుకు వాదానికి మూలం । యెరుకే గదా ।

గు॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె । మూలం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరంయేమీలేదని । మేలుకొంటె వాదంయేమీ । బేదమేమియు లేదు గదా !

శి॥ వాదం యేమీలేదు । వున్న పరిపూర్ణం వాదించదు గదా ।

గు॥ వాదించనే వాదించదు । దానికి యెరుక అనే జ్ఞానమే లేదు । ఖర్మాలు యేలాగు పుడుతావి ।

శి॥ జ్ఞానఖర్మరహితమైంది పరమసత్యమైనది బట్టబయలు మాత్రమే ।

## 3. ఇది తత్త్వ మార్గము కాదు, లక్ష్యం లేని మార్గం

గు॥ యిది తత్వం వంటిది కాదు యిది ద్వైతాద్వైతరహితమైనది । జీవభావ జగద్భావములు లేనిది॥ యీ మార్గం లక్ష్యం లేని మార్గం ।

శి॥ లక్ష్యం వుంటె ఏమి జరుగును ?

గు॥ అన్ని లక్షణాలే ఉంటావి, లక్ష్యం చేతనే అన్నీ లక్షణాలు తోస్తూ వున్నవి । లక్ష్యంలేని యీ బట్టబయలుకు । యేమి భ్రాంతి వున్నది । లక్ష్యభ్రాంతికి మూలం । ఈ గుర్తెరిగే శరీరమే

శి॥ అందుకే లక్ష్యంయనె యెరుక ఉంటే కార్యకారణాలు ఉన్నట్టేనా ?

గు॥ 1. లక్షణాలు అనే స్వరూపానికి । మహాకోపం । అందుకే లోకంలో గురియనికద్దు । లక్ష్యం వుండెనా । లక్ష్యం తనకుసూటిగా లక్షణమును కల్పిస్తుంది ।

2. పెండచేత తాను కొట్టెటందుకు లక్షణమంటె స్వరూపం । స్వరూపాన్ని కల్పించేది లక్ష్యం । లక్ష్యం వున్నంతశేపూ అనేక లక్షణాలు అనేక స్వరూపాలు తోస్తావి ।

3. అందుకే లక్ష్యం లక్షణం వొక్కటె । కార్యకారణాలకు బేధం లేదు గనుక । "భ్రాంతికి మూలం అన్యోన్యం । లక్షణమనె స్వరూపం లేకుంటె లక్ష్యం సూన్యమె"।

4. లక్ష్యం జ్ఞానం । లక్షణం చేశేది ఖర్మాలు । జ్ఞానఖర్మాలు మోక్షసాధనాలని ప్రశిద్ధికద్దు । లక్ష్యలక్షణ రహితమైంది । పరిపూర్ణం ।

5. లక్షణం క్షేత్రం । లక్ష్యం క్షేత్రజ్ఞ స్వరూపం । లక్షణ జన్యం లక్ష్యం॥

**శృ॥ సత్వాత్సంజాయతే జ్ఞానం ॥** అని వున్నది గనుక । లక్షణాపేక్షయే లక్ష్యం ।

6. విషయం వుంటెనే విషయీ । దేహం వుంటేనే దేహి । దృశ్యం వుంటేనే దృక్కు । పోనీ ఆ ముచ్చటయేమి । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంతశేపూ వ్యవహారం । యెప్పుడూ ఉంటుంది. యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదని సరిపుచ్చుకొంటె । అపుడే పరిపూర్ణము తనకు తానె స్వతసిద్ధమై వున్నది ।

7. గనుక ఆత్మబ్రహ్మముల జోలి మానితే సరిపోయెను । ఆత్మ వుంటే అనాత్మ వున్నది, ఆత్మ లేక పోవలెను. అనగా ఆత్మయనే బ్రహ్మము నిరాకారమని తెలియవలెను । అప్పుడే జననమరణ భ్రాంతి రహితము, అందుకే ఆత్మబ్రహ్మోపాధి ద్వయదోష రహితము చెప్పబడెను.

గద్య:

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే । వేదాంత విచారణే । ఉత్తరభాగే ।
భ్రాంతి రహిత ప్రకరణం । ఆత్మబ్రహ్మోపాది ద్వయదోష రహితము
దశమ అధ్యాయం సమాప్తం



# 15. భ్రాంతిరహిత ప్రకరణము

## ఏకాదశ అధ్యాయము

## 11. జీవేశ్వర ద్వయదోష రహితము

### 1. యెరుకను కొంచం నమ్మిన నట్టేటిలో ముంచును.

1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం జీవుడు ।
2. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం ఈశ్వరుడు ।
3. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె ఆత్మబ్రహ్మము ।
4. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేకుంటె । యేమీలేని పరిపూర్ణం । తనకు తానె స్వతసిద్ధమై వున్నది ।
5. అది యెటువంటిది అంటె । జ్ఞానం ఖర్మశూన్యమైనది । పుట్టనిచావనిది । రాకడాపోకడా లేనిది । సర్వకాలం వొక్కతీరుగానే వున్నది ।
6. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంతశేపూ । వున్నదని భ్రాంతి । అనేక శరీరాలు తోస్తూ వుంటావి ।
7. పరిపూర్ణానికి శరీరంలేదు గనుక । యేమీతోచదు ।
8. కలతోచినా తనకు తానె యేమీలేదు । అని దృఢం వున్నట్టు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । అని దృఢం సంపాదించి । వాటివలె । అత్యంత శూన్యంగా । మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని తాత్పర్యం చేసుకోవలెను ।
9. కల తోచినవి యేమీ అనుకోక । యేలాగు సర్వం శూన్యమై పోయెనో । ఆలాగే యీ మూలంలేని గుర్తెరిగే శరీరాన్ని తాత్పర్యం చేసుకొని సరిపుచ్చు కోవలెను ।
10. తానుయేమీలేక పోవలె । అది కఠినం కాదు । మూలం యేమీలేదు । కొనకు ప్రవేశించేటందుకు స్థానం యేమీలేదు ।

గు॥ కలతోచినది యేలాగో అలాగే । శరీరాన్ని సరిపుచ్చుకోవలె ।

శి॥ సరిపుచ్చుకొంటె యేమి లాభం ।

గు॥ శరీరాన్ని కొంచం వుంచుకొన్నా । అంతా యెప్పటివలెనే । భ్రాంతిలో బడవేయుట కాయం.

"పరిపూర్ణం యెన్నటికీ జాడ తెలియదు । యీ శరీరం వున్నట్టు వున్నది గనుక । యిదే బట్టతెర వున్నది । దీనికి వున్నదనే భ్రాంతి

శి॥ యే యుక్తి చేత తెలియవలెను ।

గు॥ 1. శరీరంలేని పరిపూర్ణం । తాను గనుక । గ్రహణం పట్టె విడిచె అన్నాడు । పట్టాలేదు । విడువాలేదు । సర్వకాలం వొక్కతీరుగానే వున్నది । వున్నది మరువకుంటె యీ శరీరం యేమీలేదు। యీ శరీరం యేమీలేకుంటె । వున్నదే అది ।

2. వున్నది ఈ ఉత్త బట్టబయలు యేమిలేదు అని సర్వకాలం మరువక వుంటావా । మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమీలేదని సరిపుచ్చు కొంటావా ।

శి॥ ఈ ఉత్త బట్టబయలు యేమిలేదు యని అనుకుంటూ వుంటే మంచిదా? మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదని వూరుకుంటే మంచిదా ।

గు॥ ఈ ఉత్త బట్టబయలు యేమిలేదని అనుకుంటూ వుంటే నీవు ఉండవలసి వస్తుంది, గనుక నీవు గట్టివాడవే మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం । యేమిలేదని వూరుకుంటేనే చాలా మంచిది.

శి॥ సరే సరే యేమిలేదని వూరుకుంటాను.

గు॥ కలదోచిన శరీరాలు యేమీ ఆయెను

శి॥ యేమీలేదు

గు॥ అలాగే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు

శి॥ యీలాగు అనుకోనా

గు॥ అనుకొంటూ వుంటె । యీ శరీరం వున్నట్టా ? లేనట్టా ?

శి॥ అనుకొంటూ వుంటె వున్నట్టే !

గు॥ కలతోచిన శరీరాలు మేలుకొంటె యేమైనా వున్నవా ?

శి॥ యేమీలేదు

గు॥ యేమీలేకుంటె యీ శరీరాలు యేమనుకొంటావి ?

శి॥ యేమీ అనుకోవు

గు॥ యిఘ అడుగకు

శి॥ నాకూ వ్యాసట వస్తుంది

గు॥ సరెకాని । నాకు మహాశ్రమ తోస్తుంది

శి॥ తోస్తె నీవు యెట్టివాడవు

గు॥ నేను యేమి లేను.

శి॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । కలతోచిన శరీరం వలెనె । సూచన చేస్తిరి

గు॥ ఆలాగే శరీరం వెంటనే యేమీలేదు

శి॥ కులం దేనికి । గోత్రం దేనికి । యెప్పుడుయేది వున్నదో । అదే వున్నది

గు॥ అట్లయితె సరె । మరీసులభంగా వున్నది

1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం పుట్టక మనుపు కలతోచలేదు । యీ భూమి తోచలేదు । తోచేటందుకు మూలం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే

2. యీ శరీరాలకు శరీరాలే మూలం గనుక ఒకవేళ లేకుంటె । తనకుతానె స్వతసిద్ధాలు।

3. కలలో తోచినట్టు । వీటికి వొకతీరు మర్యాదాలేదు । యీ జగత్తు అవాంతరం ।

4. సర్వకాలం తనకుతానె స్వతసిద్ధమై వున్నపూర్ణం । చలించక వున్నది । దానికి । యీ శరీరాలకూ । కొంచెమైనా సంబంధంలేదు ।

5. తనకు తానె వచ్చేది । తనకు తానె వుండేది । వెంటనే యేమీలేదు ।

6. "మొట్టమొదట బట్టబయలు వున్నదని దృఢం చేసుకోని । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని తాత్పర్యం చేసుకొంటె । కలతోచదు ।

7. యీ భూమీ మొదలయినవి తోచవు।" సర్వకాలం మొదలూ కొనాలేని యీ బట్టబయలు వుంటుంది

శి॥ యిది సరె । మరీ చుల్కనే । కలతోచినవి యేమీలేదు । అని తోచినా । వున్నంతశేపూ వున్నట్టే తోస్తుంది । కలతోచేటందుకు । మూలం యీ శరీరమె గనుక యీ శరీరం మొదలు యేమీలేదని । మేలుకొంటె నయంవలె వున్నది ।

## 2. స్వామీ మీవలె మాకు నమ్మిక అయ్యేటట్లు చేయండి.

శి॥ స్వామీ। యిన్ని మాకు యెందుకు। మీకు యేమార్గం చేత భ్రాంతి లేకపోయిందో। అదేమాకు సూచన చెయ్యండి। మీ వలె మాకు భ్రాంతి లేకుంటె సరిపోవును।

గు॥ నావలె నీకు నమ్మిక వుండవలెగదా

శి॥ అవును, నమ్మిక। అయ్యేటట్లు సూచన చెయ్యండి

గు॥ అట్లయితే। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు। యేమీ లేకుంటె యేమీ కలదు

శి॥ అట్లయితే సర్వశూన్యమా

గు॥ ఆహా మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేకుంటె। యేలాగో ఆలాగే

శి॥ యేమీలేదని యెరుకైతే ఊరుకోమంటావు గదా !

గు॥ 1. అట్లయితే మావాడవే। అదేజాడ। యిది వక్కటే భ్రాంతికి మూలంలేని మార్గం। యిటువంటివాడు శ్రవణం చెయ్యరు। మననం చెయ్యరు। ధ్యానం చెయ్యరు। అదె అంటె వున్నది వున్నట్టే వున్నది। లేనిది లేకనేపాయె। యిఘ యేమి చేసెటందుకూ। మూలంయేమి వున్నదని భ్రమపడను యిదే పెద్దల యొక్క విచారం।

2. యింతకంటె దొడ్డమార్గంలేదు। అని అనేక మంది శాంతి పొందినారు। అందరివలెనె వుంటారు। వారిజాడ వారిఅంతవారికే గాని। మరివొకరికి తెలియదు।

3. యే సిద్ధాంతం నమ్మినా। మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే చేశింది గనుక। అనేక కోట్లల్లోపల విచారిస్తే। మూలంలేని యీ గుర్తెరిగే శరీరంచేత తనకు తానే స్వతసిద్ధమై చలించక వున్నది। యెన్నటికీ లేకపోదు। యీ శరీరంలేక మునుపు। తనకుతానె స్వతసిద్ధమై, చలించక వున్నది।

4. వొక్కటైనా వికారం లేదు। "పరిపూర్ణమైన బట్టబయలునకు। చలనం యెన్నటికీ లేదు। యెన్నటికీ పుట్టదు చావదు। అనేక బ్రహ్మాండాలు వొచ్చె।వెంటనే యేమీలేదు। యీ మాయ వున్నది అంటె। సర్వం యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరాలు అయ్యి। యీ శరీరాలకు తోస్తూ ఉంటుంది.

5. భాగ్య విశేషంచేత। తనకు తానే శరీరంలేని గురుసాంప్రదాయం దొరికెనా। ధనార్జనం కొరకు। సిద్ధక్రియవలె ఉన్నది, వేరు త్రోవబోతే। ఆ చెట్టు క్రిందనే। అనేక కోట్ల మొహిరీలు బారిగా దొరికినట్లు ఉన్నది।

6. మొదలూ కొనాలేనిది । రాకడాపోకడాలేనిది । పుట్టనిచావనిది । తనకు తానే స్వతసిద్ధమై చలించక వున్నది । సకల దేశాల యందూ । సర్వకాలాల యందూ । సమస్తమైన వస్తువులయందూ।

7. లోపటాబైటా అనే మర్యాదాలేక । తన మాత్రమే । రెండోది అయిన శరీరాన్ని యెరుకగక । స్మరించక । యెందులో ప్రవేశించక । వెళ్ళిపోక యేలాగు వున్నదో అలాగే ।శాశ్వతంగా వున్నది"

8. మేమే యెక్కువ । మేమే తక్కువ । అని అనేక కులములను చేసి । నమ్ముకోని । వండుకోని । తినుకొంటూ । మాలవాణ్ణి మాదిగవాడు । అంటుకొంటూ । మాదిగదాన్ని మాలవాడు అంటుకొంటూ । యీ కలతోటె కాలం గడిపిన । వారాకి । యేగతో అదేగతిగాని । యీ పుట్టని చావని దానిజాడ దొరుకక । యెరుక యందే నిలిచి యున్నారు.

9. ఆలాగే ఈ గుర్తెరిగే దేహిని నేను శాశ్వితునని కొందరు దేహమే నేను అనినమ్మివున్న వారివలె వుండక । శీఘ్రంగా శరీరం । లేని గురుసాంప్రదాయం గలవారిని జూచి । యీ శరీరానికి మూలం యేమి అని । శీఘ్రంగా పుట్టని చావని జాడ । యదార్థంగా కనుక్కోవాలి.

10. దేహభ్రాంతి కొంచమైనా లేకుండా । దృష్టాంతం చేత । సూటిబడ చూచుకొని । సర్వకాలం శరీరం లేక । పరిపూర్ణం వున్నది వున్నట్టూ పడితె । విచారానికి ఫలం" ।

**శి॥** 1. యీ శరీరానికి మూలం యేమీలేదని । మీరు అంటిరి । కొనకు ప్రవేశించేటందుకు స్థానం యేమీలేదు అంటిరి ।

2. వున్నప్పుడు వున్నది యేమో అని । అందరూ అనుకొంటె మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమిలేదు । అని మీరే శ్రవణం । చేస్తిరి ।

3. యీలాగు నిర్ణయమైన తరువాత యేమి భయం

**గు॥** అట్లైతె యీలాగు నీకు దృఢమేనా

**శి॥** వున్నది వున్నట్టూ పడెను స్వామి ।

**గు॥** 1. యీలాగు దృఢం వుంటె సరి । తనకు తానె స్వతసిద్ధమై చలించక వున్నది । సర్వకాలాలయందూ వున్నది । సకలదేశాలయందూ । సమస్తమైన వస్తువులయందూ । దేనిలోనూ ప్రవేశించక । వెళ్ళిపోక । శరీరాలు గాక ఉండెను ।

2. శరీరాలను పుట్టించక। శరీరాలను గుర్తెరుగక। శరీరాలకు ఆధారముగాక। శరీరాలను స్పృజించక । జగత్తు వున్నదనీ లేదనీ యెరుగక ఉండెను.

3. "సర్వకాలం వొక్కతీరుగా వున్నదాన్ని । కుండను ప్రత్యక్షంగా చూచినట్టే । లెస్సా వుండజూచి" యీ శరీరానికి మూలంయేమీ అని అడిగితే । యీ శరీరానికి మూలం యేమీలేదని చెప్పినా। యేలాగో దృష్టాంతం అడిగి। దృష్టాంతం లెస్సావిని। దృష్టాంతం చొప్పున సమాధానం చేసుకోని । శాంతి అయ్యేది గురుసాంప్రదాయం ।

4. యింతేకాని మూలం। లేని యీ గుర్తెరిగే శరీరంచేత । సాధన చేసి సాధించుతామంటె । కోటి శరీరాల చేతనైనా గాని । సాధ్యం కాదు ।

5. యీ శరీరం మూలంలేనిది । కొనకు ప్రవేశించేటందుకు స్థానం యేమీలేనిది । వున్నప్పుడు వున్నట్టే వుండి । వెంటనే యేమీలేనిది । అని చూచే ప్రజలకు అందరికీ నిశ్చయం కద్దు ।

6. తనకు వున్నంతశేపే । కాని । కొనకు యేమీలేదు । అని నిశ్చయం తనకు । లేనేలేదు।

7. మూలంలేని యీగుర్తెరిగే శరీరం వున్నంతశేపూ । అనేక శరీరాలు తనకుతానే తోచేటి స్వభావం కలతోచినట్టె। మేలుక రానంతశేపూ తోస్తావి। మేలుక అంటేనే గురుకృపా।

8. కలతోచేటందుకు। మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె మూలంగనుక। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదని తాత్పర్యమాయెనా । యేమీ తోచదు ।

9. తోచేటందుకు । మూలంయేమీలేదు । గనుక । తనకు తానె స్వతసిద్ధమై వున్నది । వున్నట్టు పడితే సరి । ఉన్నది వున్నట్టూ పడితే । వక్కటైనా యిశ్చ వుండదు ।

10. వున్నది వున్నట్టూ పడ్డందుకు యిదే చూచుకోవలె । యిశ్చ యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె కాని । తనకు తానె స్వతసిద్ధమై వున్నదానికి । యిశ్చ యెన్నటికీ లేదు ।

11. మీరు విచారించండి। యీ బట్టబయలుకు యేమీ యిశ్చ వున్నది। యీ బట్టబయలుకు యెరుకలేదు గనుక । యిశ్చలేదు । గనుక సంసారమనె కర్మలేదు । గనుక తాను పుట్టాలేదు । రెండో దాన్ని పుట్టించాలేదు । తాను పుట్టకపాయె । రెండోదాన్ని పుట్టించకపాయెను.

శి॥ యీ శరీరం యెక్కడనుంచి వచ్చెను.

గు॥ యీ బట్టబయలును అడుగుతావా నన్ను అడుగుతావా

శి॥ యీ బట్టబయలుకు। శరీరంలేదు గనుక। దాన్ని యేలాగు అడుగ। అది యేలాగు

చెప్పుతుంది। దానికి వ్యవహారమే లేదు

గు॥ సరిగదా యెవ్వరిని అడుగుతావు॥" శి॥ మిమ్ములను

గు॥ నేను యేమీ లేను శి॥ మీరు మాకు చూచేటందుకు వున్నట్టు వున్నది.

గు॥ నీకు గుర్తెరిగే శరీరం వున్నదని తెలిసేనా లేదని తెలిసేనా।

శి॥ లేదని తెలిసే। గు॥ లేదని యెరిగితే చచ్చినట్లు పడివుండు।

## 3. గుర్తెరిగే శరీరం లేదని తెలిసిన వారికి, జ్ఞానులు అజ్ఞానులు ఎవరు లేరు.

శి॥ మీకు వున్నట్టు వున్నది॥ "మీరు శరీరం యేమీలేదని సూచనచేస్తూ వున్నారు। గనుక। శరీరం లేకపోవడం యెలాగో। అని నాకు ఆశ్చర్యం అవుతుంది। యిది యేమి అని అనిపిస్తుంది॥"

గు॥ 1. శరీరం వున్నదని మీకే కాదు॥ నన్ను యెదురు చూచేవారందరికీ। శరీరం వున్నదని యెరుకే। చూచినవారికల్లా శరీరపు వర్తమానం। వారి వారి మనస్సులో పేరుక పోయింది.

2. శరీరం లేని వర్తమానం తెలిస్తే। మూఢులు యేరి। అజ్ఞానులు యేరి। మూర్ఖులు యేరి। ప్రత్యక్ష ప్రమాణమని వాదించే ఆచార్యులు యెక్కడ బోయిరి.

శి॥ అట్లయితె మేము మూఢులుమా

గు॥ 1. దేహాలకు మూలం యేదో అది। మీకు యదార్థంగా తెలిసినా సరె। మీ తండ్రిగారికి తెలిసినా సరె। మీ తాతగారికి తెలిసినా సరె। మీ ముత్తాతగారికి తెలిసినా సరె। 'మీకు యెవ్వరైనా గురువులు వుంటె వారికి తెలిసినా సరె'। యిప్పుడు మీరు విచారించి చెప్పినా సరె। శరీరం ఫలానిది అని తాత్పర్యం చేసుకొంటె। నేనూ మీరూ। అందరమూ మూఢులమె। అందరం జ్ఞానులమే। అజ్ఞానులమే। అందరం సమానమే। యిది వున్నట్టు తెలియకుంటె। చాకలి చదువు। కోటి విద్యలూ కూటికొరకే। అని చాకలివాడు అంటూ వున్నాడు।

2. మళ్ళా అందరికీ దాసుడై యున్నాడు। అందరికీ శేవకుడు గనుక। నిత్యుల వలెను। యెక్కువ అనుకోడు। మిత్రులవలె మేము తక్కువ అనుకోడు।

3. అందుకే "బ్రహ్మ కమ్మరివాడు। విష్ణువు సాలివాడు"। మహేశ్వరుడు చదువుకొన్నవాని కంటె యెక్కువవాడు। అందరూ సమానమే। యెవ్వరి కులధర్మం వారు విడువక। స్వధర్మాల చేతవున్నారు గనుక। అందుకే శరీరం వున్నది అని దృఢం వున్నది। అనుమానమా।

4. వున్నది యెప్పుడు పోతుందో అని అందరికీ ధైర్యము కద్దు । యీ గుర్తెరిగే శరీరాలు । యేలాగు అంటె ఆలాగేవిని । వున్నంతశేపూ భ్రాంతుల తోటె వుండి । కొనకు సకల శరీరాలూ యేమీలేవు।

5. యెక్కడి నుంచి వచ్చె యెక్కడికిపాయె । అని యెవ్వరికీ విచారం పుట్టదు । పుట్టెనా అనేక దొంగత్రోవలే గాని । రాజమార్గం వొక్కటీ గాదు

శి॥ మాకు యిన్ని యెందుకు । యీ శరీరం యందుచేత పుడుతుంది । లోకంలో అనేక మాటలు అనుకొంటారు । మీరు మాకు వున్నది వున్నట్టూ సూచన చెయ్యండి

గు॥ చేస్తా విను । మీ తల్లీ దండ్రీ నీకు మూలం । నాకూ ఆలాగే । వారి స్వరూపం మనము యెంతో వారుకూడా అంతే”

శి॥ అట్లయితే । వారు యెక్కడినుంచి వచ్చిరి

గు॥ యీలాగు వారికి వారూ వారికి మనం వచ్చినట్లు ఆయె.

శి॥ అట్లయితే సర్వకాలం యీ ప్రకారాన వుండెనా?

గు॥ 1. వుంటె యేమి । యెన్నడు లేకపోయింది । సర్వకాలం నీ శరీరం నా శరీరం వున్నంత శేపూ । సర్వం వున్నట్టె తోస్తుంది । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం భోంచేస్తె అన్నరసం శుక్లం అవుతుంది । నీళ్ళు త్రాగితే యీ శరీరంలో ప్రవేశించి । రక్తం పుడుతుంది ।

2. మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి యిశ్చ పుడుతే రతి ఖర్మ చేస్తుంది । పాలుకాచి తోడుపెట్టిన పెరుగువలె ఘట్టిపడ్డట్టు । పడి । శరీరాకారమై పుట్టి । కొంతశేపు యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । యెరుకచేత వున్నంత శేపూ। కల । వెంటనే మేలుకొంటె యేమీ లేదు ।

3. యెరుక వున్నంతశేపూ । అనేక చిత్రవిచిత్రాలు । అయోని సంభవుల గుర్తెరుగుతాడు । తనవంటి యోని సంభవులు గుర్తెరుగుతాడు । శాశ్వితమైంది యేది అని । యెవ్వరినీ అడుగడు । యీ దేహాలకు దేహాలే మూలం । స్వామి నిర్మాణం చేస్తాడా అని యెవ్వరినీ అడుగడు

శి॥ అయ్యా యీ శరీరం వున్నట్టే వుండి । వెంటనే । అడ్డం పడుతుంది । చాలా శేపు యేమీలేదు । అప్పుడు యీ శరీరం యెక్కడికి పోతుంది

గు॥ యీ శరీరం కాంగానే అయోని సంభవులు వొచ్చినట్టు । అవుతుంది । అందులోనే

అనేక యేనుగలు । గుఱ్రాలు । రధాలు । అనేక । మంద స్త్రీలు । వచ్చివున్నట్లే వుంటారు । యెరుక వుండంగానే యేమీలేదు । అంతలోనే యోనిసంభవుల గుర్తెరుగుతా।

"ఈలాగు కొంతశేపు వుండంగా । యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు ।'

2. "యీ శరీరంతో పుట్టె కల । యీ శరీరం యేమీలేకుంటె మంది సుషుప్తి అన్నారు । లేకుంటె మరణం అన్నారు ।

యింతేకాని । మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి । మూలం యెరుక" మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । ఫలానిదానియందు । ప్రవేశిస్తుంది అని యెవ్వరూ యెరుగరు।

3. యిటువంటి మూలంలేని యీ గుర్తెరిగే శరీరం వున్నంతశేపూ । నానాకూతలు మనము కూస్తాము। మనతో కూడా వచ్చిన వారూ కూస్తారు । దీనికి ధరి । యెవ్వరూ యెరుగరు। యెక్కడ వున్నరో । అంతా అమావాస్య చీకటిలోనే యున్నారు । సరేకాని । వొక్క శరీరం వొక్క నిర్ణయమైతె । అన్ని నిర్ణయాలు పుడుతావి

శి॥ "యేమో అందరూ తల్లీతండ్రీ అంటారుగాని నాకు సమాధానం కాదు । వారు పుట్టకమునుపు యెక్కడ నుండిరి । అని తోస్తుంది । అది మహాచిక్కువలె వున్నది । యీ చిక్కు అతి సులభంగా తెలుపువలె । యిది తెలిస్తే గాని మబ్బు విడదు?

గు॥ అట్లయితే మరివొక ప్రకారంగా సూచనచేస్తా విను

శి॥ చెయ్యండి

గు॥ యీ శరీరం పుట్టక మనుపు । యీ బట్టబయలు మాత్రం । వున్నది । యీ శరీరం యేమీలేదు

శి॥ యిదే సరి

గు॥ 1. శరీరం పుట్టిన తరువాత వున్నట్టె వుండి । సమస్తమైన వ్యవహారాలు చేశి । వెంటనే । నిద్రపేరు చెప్పి । యేమీలేకపోతుందీ । యీమూడు నాలుగు గడియలు । వొకవేళ రెండు ఝాములు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు ।

2. ప్రతిదినమందూ యీ శరీరం యెప్పుడు మేలుకొంటే అప్పుడే కల । కొన్నాళ్ళు యీలాగు । ప్రతిదినమూ సుషుప్తి యేమీలేక పోయినట్టు । యేమీలేదు । అది మరణమన్నారు । శరీరం పుట్టక మునుపు యేమీలేదు । కొనకూ యేమీలేదు ।

3. యిది లెస్సా । యీ బట్టబయలు వుండనే వున్నది । వున్నప్పుడు యేలాగు । యీ రెండు విధాలు నీకు సమాధానమె । పుట్టకమునుపు శరీరం యేమీలేదు । యిది

అందరికీ దృఢమే"

శి॥ యీ శరీరం యావత్తూ యేమీలేదా

గు॥ కొంచెం వున్నదా। యీ శరీరం పుట్టకమునుపు। కొంచెం వున్నదా అది యేమీలేదా

శి॥ యేమీలేదు

గు॥ మరియేమి వున్నది

శి॥ 1. యీ బట్టబయలు వున్నది। యీ బట్టబయలు తప్ప విడిచి। శరీరం యేమీలేదు। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం పుట్టక మునుపు। యేలాగు యేమీలోదో చచ్చిన తరువా యేలాగు యేమీలేదో। ఆలాగే వున్నప్పటికిన్నీ। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు।

2. "కలతోచిన శరీరాలు। యెరుకతోకూడా। యీ వల యెరుక వుండంగానే। యేమీలేదు। అని తనకు తానె దృఢం వున్నట్టు మూలంలేని యీ గుర్తెరిగే శరీరమున్నూ। యేమీలేదు అని। తనకు తానె తాత్పర్యమైతే మళ్ళా తోచేటందుకు మూలంలేంది గనుక। శరీరాన్ని గుర్తెరుగని బట్టబయలు। తనకు తానె స్వతసిద్ధమై యెన్నటికీ చెలించక। వున్నదేవున్నది

గు॥ యిది శరీరం లేని గురుసాంప్రదాయం। యిదే మహాద్వైతం। యిదే అద్వైతరహితమైనది॥ అందుకే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీ లేదని వాఖ్యం వచ్చింది। యింతకంటె అధికం లేదు। యిది భ్రాంతికి మూలంలేని విచారణ ఇదే నిజం.

జీవుడు వుంటే దేవుడు ఉన్నాడు, ఆ జీవున్ని నేనైతాను నేను ఉంటే నానుండి జనన మరణాలు ఉంటావి, గనుక మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం అయిన నేను యేమి లేదని గురుసూచన అయితే కథ ముగిసినట్లు. ఇదే సిద్ధాంతం, సిద్దాంతమే రాద్ధాంతము।

గద్య:

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే। వేదాంత విచారణే। ఉత్తరభాగే।**

**భ్రాంతి రహిత ప్రకరణం। జీవేశ్వర ద్వయదోష రహితము**

**ఏకాదశ అధ్యాయం సమాప్తం**



# 15. భ్రాంతిరహిత ప్రకరణము

## ద్వాదశ అధ్యాయము

## 12. పరాపరప్రకృతి ద్వయదోష రహితము

## 1. కలలో రామక్రిష్ణులను నమ్మే మార్గం కాదు.

1. అద్వైతమంటె విశిష్టా ద్వైతమె ॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు గనుక వ్యవహారమే లేదు । శ్రీభాష్యకారుల వారితాత్పర్యం అబద్ధమో నిబద్ధో। నిబద్ధి అని శంకరాచార్యులవారు వాదించినారు । నేను చదువుకొన్నాను గనుక । వారికి నాకు తోచినంత ఉత్తరం చెప్పినాను

2. వారు ఆనందమేమో విశిష్టమయినది । కేవలం జ్ఞానమైంది । శుద్ధమార్గం । ఆచార్యకటాక్షంచేత । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమనె తెరదీశేన వారికి । విశిష్టాద్వైతమూలేదు । అద్వైతమూలేదు । రెండూ లేకుంటె ద్వైతవార్త లేనేలేదు । సర్వకాలం విష్ణువనే వ్యాపకమే । వున్నది అదే గుణాలు లేనిది॥

**శృ॥ వికార రహితో విష్ణుః ॥** ఆకార సాకారాలు లేక నిరాకారమై నిండి ఉన్నది.

3. కలతోచిన రామకృష్ణుల వలెకాదు । తెరయీవల తెర ఆవలా వున్నది వైకుంఠం । అఖిలాండకోటి బ్రహ్మాండాలకూ నేనుదాసుణ్ణి । అని ఆచార్య స్వాములవారు అన్నవాక్యం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె । పరబ్రహ్మం । జ్ఞానమె నిర్గుణమన్నారా లేదా । అదె । నేను ఆలాగు అంటె మూలంలేని యీ గుర్తెరిగే శరీరమె పరబ్రహ్మం అవుతుంది । గనుక దాసత్వమెక్కడ దైవత్వం ఎక్కడ ।

4. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం స్వతంత్రం గనుక పరబ్రహ్మమే అయితే । అందరూ అందరికి సేవకులై । నీళ్ళు యెందుకు మోస్తారు । వండి యెందుకు పెడతారు । అగ్ని హోత్రాలు యెందుకు చేస్తారు । మాదిగ వాండ్లవలె । మాలవాండ్లవలె । మేమేబ్రాహ్మలమని కులమతాలపై యెందుకు అనుమానం వుండవలెను

5. అందుకే మాయా వాదుల మార్గం విచారించండి । మా సిద్ధాంతం మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు అని తీసివేస్తె। అంతా వైకుంఠమే । అంతా పరమపదమె । గనుక మేము నేను బ్రహ్మమని చెప్పలేము, అధిష్టానము కాము దాసులము గాము, మాకు మేమే విచారించాము, విచారిస్తే మీరన్న బ్రహ్మం లేదని తెలిసింది గనుక సరిపుచ్చుకున్నాము.

అందుకే యీ మూలంలేనిది । అందరికీ చూపేటందుకు । **ఉత్తమ పురుషస్త్వన్యం ః** । మూలంలేని యీ గుర్తెరిగే శరీరంలేకుంటే । వున్నది అనే తాత్పర్యం ॥

**శ్లో॥ యస్మాక్షరమతీతోహం । మక్షరాదపిచోత్తమః ।**
**అక్షరాదపిచ । అహంవుత్తమః । ఉత్కృష్టతమః ।**
**అక్షర పరబ్రహ్మణోపి । క్షరాక్షరా భ్యాం అన్యః ॥**

6. అందుకే మూలంలేని యీ గుర్తెరిగే శరీరం । యేమీలేదు, యీ బట్టబయలే । యింతకంటె యెక్కువ లేదు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం కంటె తక్కువలేదు । యీ బట్టబయలు వున్నది ।

7. యిది భ్రాంతి లేని రాజమార్గం । శరీరం వున్నదనే భ్రాంతిచేతనే । అనేకభ్రాంతులు వున్నవి । వున్నదానికి లేక పాయె । లేనిది యేమీలేదు అందుకే వసిష్టులవారు రామస్వామికి ఇలాగున చెప్పినారు॥

**శ్లో॥ భ్రమేనాహం భ్రమే త్వం । భ్రమేణోపాసకోజనాః ।**
**భ్రమేణీశ్వర భావత్వం । భ్రమమూల మిదంజగత్ ॥**

అందుకే యీ వుత్తబట్టబయలుకు । వొక్కటైనా భ్రాంతిలేదు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । యిఘభ్రాంతి యేమిటికి । ఉన్న యీ బట్టబయలుకు యేమీలేదు।

8. యేమిలేని గుర్తెరిగే యీశరీరం యేమీలేదు । వొక్కతీరె వ్యవహారం వొడిశె । చించివేశిన పత్రం యెవరివద్ద వున్నాయేమీలేదు । భయంతీరిపోయే । తీదీపులు వొడిశె । లెక్కతీర్పటం కాకుంటె యెవేళ్ళకైనా ముఖం నలుపే । "యిప్పుడు యెక్కడ నిలపడ్డా భయంలేదు

శి॥ చచ్చేదియేమి । బ్రతికేది యేమి ?

గు॥ 1. తాను ఉంటే చస్తాడు తాను లేకుంటే యేమి చచ్చేది । నేను యేమీలేదు । నీవు యేమీలేదు । వున్నదానికి యేజోలీ పట్టదు । వున్నది పుణ్యంచెయ్యదు । పాపంచెయ్యదు । నేనూ నీవూ యిద్దరం యేమీలేకుంటె । ఉన్నదివున్నట్టావుండె । వుత్తభ్రాంతి గదోయీ॥"

2. యీలాగు అందరూ అనుకొంటారు లెస్సావిచారించి లెక్క తీర్పడం అయితే భయం వుండదు । విచారించకుంటె యేమి రంకో అనిపిస్తుంది । విచారించితే వున్నది వున్నట్టెవుండె । యేమీలేనిది యేమీలేకపాయె ॥

## 2. మా మార్గం యెరుక లేదని నిర్ధారించి బట్టబయలే శాశ్వితం అంటాము.

శి॥ యిదియేమి స్వామి ?

గు॥ 1. యీ బట్టబయలు పుట్టదు । పుట్టించదు । యీ బట్టబయలు భోంచెయ్యదు గనుక । శుక్లంలేదు । నీళ్ళుత్రాగదు గనుక నెత్తురు లేదు । యీ బట్టబయలుకు యెరుక లేదు గనుక । రతిక్రీడ చెయ్యదు

2. అందుకే యీ బట్టబయలు క్రియాశూన్యమైంది । యీ బట్టబయలుకు పుట్టుకలేదు గనుక ఆడదీకాదు । మొగవాడు కాడు । నపుంసకంకాదు ।

3. అందుకే వొక్కటైనా వికారంలేదు । యీ బట్టబయలుకు శరీరం లేదు గనుక । రాకడాలేదు । పోకడాలేదు । అందుకే అచలమంటే కదలక । మెదలక । సర్వకాలం వొక్కతీరుగానె వున్నది । అంతా యీ బట్టబయలె కాని రెండోది యేమిలేదు ॥

4. 'యీ బట్టబయలే॥' అచ్ఛేద్యం । అదాహ్యా । అక్లేద్యం । అశోష్యం । సరెవోయీ । యిన్నీసూటి బడుతావోయీ । వోయీ । యీ బట్టబయలేనిత్యం । యిదే సర్వగతం యిదేస్థాణువు । యిదే అచలం । యిదే బహుకాలానిది । అన్నీసరిపోతాయి ।

5. యీ బట్టబయలు కొట్టేది కాదు । కొట్టబడేది కాదు । యీ బట్టబయలు యెవర్ని కొడుతుంది । యీ బట్టబయలుకు । యెరుకలేదు । యెరుకలేని దానికి యిశ్చపుట్టనేపుట్టదు

శి॥ యీ యెరుక బట్టబయలు అవునా యేమి ?

గు॥ 1. అడిగినా చెప్పదు గదా । దాని అంతవాడుదాన్ని అడుగవలె । దాని అంతది అదే కాని, యెరుక దానంతది యెప్పుడు కాదు । యీ బట్టబయలుకు బదులులేదు । యీ బట్టబయలు నేను వున్నానని యెరుగదు । యీ శరీరాలు లేవని యెరుగదు ।

2. అన్నీకలలో సకల ముచ్ఛట్లు చెప్పి । యీ యెరుకలేదు గనుక । వొక్కటైనా వికారంలేదు । యీ బట్టబయలు వొక్కజోలి అయినా యెరుగదు ।

3. మొదలే యీ బట్టబయలు వున్నది అని । అనుకొంటె వక్కటైనా భ్రాంతి పుట్టదు । యీ బట్టబయలు మొదలు తనకుతానె స్వతసిద్ధమై చలించక వున్నది ।

4. యేమీలేనిదే వున్నదనుకోని । భ్రాంతిలేని భ్రాంతి వున్నదనుకోని । వున్నది అని తీసి వేసినకొద్దీ । యేమీ లేనిది మళ్ళా మళ్ళా వున్నట్టె । తోస్తూవుంటుంది । గనుక ।

మొదలే యీ బట్టబయలు వున్నది అని। సర్వకాలం మరువక వుంటె। యేమీబాధలేదు।

5. మూలం పట్టకుంటె లెస్సాగాని। యేమీలేనిది యేమీలేదు। అని అనుకొన్నకొద్దీ। వున్నది వున్నట్టూ వుంటుంది గనుక। పొట్టు। దంచుకొన్నట్టు వుంటుందిగాని। యేమీబాగులేదు। మొదలు యీ బట్టబయలే వున్నది

శి॥ యీబైలు వున్నదని అభ్యాసం చేస్తె। చాలానయంవలెవున్నది

గు॥ సరెకాని। యీ బట్టబయలు। నేను వున్నానని। అనుకొంటూవున్నదా

శి॥ యేమీలేదు। ఉన్నది అంటెలేదు అనబడుతుంది

గు॥ వూరికే నామాటవినండి ఉన్నదానికి వొక్కటైనా సాధనలేకనే। తకుతానే స్వతసిద్ధమై చలించక సర్వకాలం వొక్కతీరుగా వున్నది। వొక్కటె యుక్తి। యీ శరీరం పుట్టకమునుపు। శరీరం వున్నదా

శి॥ యేమీలేదు

గు॥ యీలాగు తనకుతానే దృఢమా। సాధన చెయ్యలెనా

శి॥ యేమీలేదు। తనకే దృఢం

గు॥ చచ్చిన తరువాత శరీరం యేమీలేదని। తనకుతానేదృఢమా। యేమైనా అనుమానమా

శి॥ యేమీలేదు। తనకుతానే మొదలు యీ శరీరం యేమీలేదు। కొనకూ యీ శరీరం యేమీలేదని దృఢమే। ఉన్నప్పుడు వున్నదని ఆశకద్దు

గు॥ సరె॥ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యెరుకచేత వుండంగానే యేమీలేదు। అనేకమంది। రథాలు। యేనుగులు। గుఱ్ఱాలు। లొటిపిటలు। కలలోవచ్చినట్టు। వున్నట్టూ। ప్రసంగాలు చేసినట్టూ। వుంటుందిగాని। యెరుక వుండంగానే యేమీలేదు। యిదితనకు తానె దృఢం కదా

శి॥ యిది దృఢమే

గు॥ అలాగే వున్నప్పటికిన్నీ। మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు। అని సరిపుచ్చుకుంటె। వున్నది తనకుతానె యేమీలేదు। తనకుతానె వున్నది। యింతకంటె అధికమైన మార్గంలేదు। యిదే భ్రాంతిలేని రాజమార్గం। భ్రాంతికి మూలంయేమీలేదు.

శి॥ నేను యీలాగు కనుక్కోన్నాను.

గు॥ యేమీలేకుంటే దేనిచేతకనుక్కుంటావు

శి॥ సరె । మీదయ

గు॥ యింకాయేమైనా సంశయం వుంటె అడుగు

శి॥ అడుగుదామన్న దానికి । యెరుకలేదు గనుక సంశయం లేదు

గు॥ 1. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు గనుక । యేమీలేదు । యేది వున్నదో అదే వున్నది । అంతా అదె । అదె అంతా ।

2. సర్వకాలం వొక్కతీరె । యిందుకు ॥ విద్యారణ్య మునిస్వాముల వారు నిర్ణయం । చేసినారు । యీ శరీరం పుట్టకమునుపు నిర్ణయం యేమీలేదు । వున్నప్పుడు యీలాగే అన్నాడు । అది యేది అంటె ॥

**శ్లో॥ అవ్యక్తః పూర్వమస్త్యేవ । నవశ్యాశ్చ వినాశతః ।**
**అధావంతె చ యాంనాస్తి । వర్తమానోఽ పితత్తథా॥**

అని సిద్ధాంతం చేసినారు । యిదే భ్రాంతికి మూలంలేని మార్గం అన్నారు । యిదే బంధ మోక్ష భ్రాంతి లేని మార్గం । భ్రాంతికి మూలం లేదు ।

శి॥ బంధం యెవ్వరికి

గు॥ పుట్టనిచావనిది । చలించక తనకుతానేస్వత సిద్ధమై వున్నది పుట్టేది । చచ్చేది । వున్నదానికి । యెరుకలేదు । యెరుకకే వున్నదని భ్రాంతి వచ్చివుండెనే గాని విచారిస్తే యేమిలేదు ।

**3. యెరుకను నమ్మిన వారు జ్ఞానాఖండ ఉపానా ఖండ కర్మాఖండలను నమ్ముతారు**

శి॥ ఆ భ్రాంతి యెవ్వరికి

గు॥ 1. దేనికి వచ్చి వుండెనో అది యేమీలేదు । యిఘ భ్రాంతి యెవ్వరికి । వక్క శరీరం వంటివే అన్ని శరీరాలు । వక్క శరీరం తోటి అన్ని శరీరాలు వున్నవి । అన్ని తోచినవి । వొక్కశరీరం యేమీలేకుంటె । యేమీలేదు ।

2. భూమిని యెవడు యెరుగు । నిప్పువున్నదని యెవడు యెరుగు। యిది మహారహస్యం । పరమగుహ్యం । వున్నట్టు విచారమైతే । తనకు తానె సరిపుచ్చుకోవలెను ।

3. మూలంలేని । యీ గుర్తెరిగే శరీరం యేమీలేదు । సర్వకాలం వొక్కతీరె అని తాత్పర్యం। అయితె। ప్రసంగానికి మూలం యేమీలేదు । వున్నది అనేది యేమీలేదు

శి॥ అనేది యేమి స్వామి

గు॥ 1. ఉన్నది । మాటే ఆడదు । లేనిదియేమీ లేదు । నిర్ణయానికి మూలం యేమీలేదు । సర్వకాలం వొక్కతీరె । యీ ముచ్చట రెండో దానితో । అనరాదు । విచారించని ద్విపాదపశువులు మూలంలేని । యీ గుర్తెరిగే శరీరం తోటి యేమి అనుకున్నా ఉపాసనే అవుతుంది ।

2. గాయత్రి మంత్రం ఉపాసనే । కాదా । పంచాక్షరీ మంత్రం ఉపాసనే కాదా యేమీ అష్టాక్షరీ మంత్రం ఉపాసనే కదా । పాలు త్రాగినా ఉపాసనే ।
పంచితం తాగినా ఉపాసనే । పెండతిన్నా ఉపాసనే । అన్నం తిన్నావు ఉపాసనే ।

3. శాస్త్రం పాలు త్రాగమని చెప్పింది । సురా తాగమని చెప్పింది మూత్రం తాగమని చెప్పింది । అన్ని తిప్పలకూ మూలం । మూలం లేని యీ గుర్తెరిగే శరీరమే । గాని మరోటి గాదు ।

4. యీ గుర్తెరిగే శరీరమె అన్ని చెపుతుంది । అన్ని తిప్పలూ బెడుతుంది ।

5. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను అని భ్రాంతి వున్నంతశేపూ । తీశివేశిన కొద్దీ మొలచినట్టు । అనేకాలు పోతాయి । అనేకాలు పుడుతావి ।

6. యీ గుర్తెరిగే శరీరం వున్నంతశేపూ । యిదే ప్రయోజనం । అందుకే ॥శీఘ్రంగా । పుట్టని చావని పరిపూర్ణం మేలు కొంటె చాలు॥" రెండోదాని జోలే పట్టదు । వున్నదానికి యెరుకలేదు । ఖర్మాల జోలేలేదు ।

శి॥ అదియెటువంటిదో నాకు సూచన చెయ్యండి

గు॥ 1. యిది మహాగుహ్యం । మహా రహస్యం । అనేక కోట్లల్లో వొక్కరువున్నారోలేరో । యీ వ్యాళ్ళదాకా చెప్పిన మార్గం అనేక మంది సాధించి । శాంతిచేతవున్నారు ।

2. యిప్పుడు యీ ప్రకారంలో ఆ ప్రకారం సూచన చెయ్యకూడదు। అది ప్రత్యేకం బాటవున్నది । అది మరీ అతి సూక్ష్మం । అది దీన్ని మించిన మార్గం । యీ శాస్త్రాలవంటిది కాదు ।

3. తలకిందు మార్గం లేనిదే ఉన్నది. అని లేనిదానికే తోచింది, కనుక ఆ నిర్ణయం తీసివేసే కొరకు ప్రకరణం. అది మొదలు యేలాగు వున్నదో ఆలాగు పట్టితే భ్రాంతి లేని మార్గం అవుతుంది.

4. అది మహా కుశాగ్ర బుద్ధిమంతులకు మొదలే ఉన్నది ఉన్నట్లు, పడే మార్గం

5. యీ ప్రకరణం మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను అని వాదించేవారిని లేకుండా చేసే రాజమార్గం.

6. లేనిదే వున్నదని లేనిదానికే తోచింది గనుక । ఆ నిర్ణయం తీసివేసే కొరకు ప్రకరణం చేసినాము. ప్రకరణం అంటే సులభోపాయముగా వివరించుట.

7. అది మొదలు యెలాగు వున్నదో । అలాగే ఉన్నది ఉన్నట్టు చేసే । భ్రాంతిలేని మార్గం మహాకుశాగ్ర బుద్ధి మంతులకు మొదలె వున్నది । వున్నట్టు పడె మార్గం ।

8. యీ ప్రకరణం । మూలంలేని యీ గుర్తెరిగే శరీరం నేను అని । వాదించే వారికి లేకుండా చేసే మార్గం । మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు అనే సిద్ధాంతమే సిద్ధాంతము.

ఈ ఉత్త బట్టబయలే సత్యమనే సిద్ధాంతమే సిద్ధాంతము అదే రాద్ధాంతము.

1. యేమీలేనిదీ నేను జీవుణ్ణీ । అని,

2. నేను యీశ్వరుణ్ణి । అని

3. నేనే ఆత్మను । అని అగాయిత్యం చేత । అన్ని మాయకూతలూ కూశి । భ్రాంతిలో పడవేసినారు.

4. యేమి లేనిదే । నేను జీవుణ్ణి । నేను యీశ్వరుణ్ణి అని జ్ఞానమనె భ్రాంతి । చేత, భక్తి అనే భ్రాంతి చేత, వైరాగ్యమనె భ్రాంతి చేత ఉన్నారు । మూలంలేని యీ గుర్తెరిగే శరీరానికి వ్రేలాడబడితే వదిలించుకొనే నేర్పులేక । బహుక్లేశపడుతూ ఉన్నారు ।

5. కుక్కలవలె కూశి కూశి । అందరినీ । అడవి లోకలిపినారు ।

6. తమరూ అనేకమైన భ్రమలచేత । కాళ్ళకు బేడీలు వేసుకొని । భార్య అనె గుదియ మెడగట్టుకొని । కాళ్ళు ఆడక । సుఖమనె స్వర్గానికి ఆశపడితే । దుఃఖప్రాప్తి అయితే । లింగమూర్తికీ క్లేశమే । తనకూమహాక్లేశమే ।

7. గుర్తెరిగే మహాలింగమై వున్నాడు గనుక । అందరూ గుర్తెరిగే వారే । విష్ణుభక్తులు ।

8. యీ గుర్తెరిగే చిత్తును విష్ణువని । చిద్రూపమే నారాయణుడని । అనే మాత్రమే కాని । స్వర్గనరకములు లింగమూర్తికీ । నారాయణునకూ । సమానమే ।

9. బియ్యానకు అనేక పేర్లువున్నట్టు । వున్నమాత్రమే కాని సకల తిప్పలూ బియ్యానకు యేలాగో । ఆలాగే । మూలంలేని యీ గుర్తెరిగే శరీరాన్ని । తప్పించుకొనె యుక్తి యెవ్వరికీ గూఢంగానే వున్నది

10. శరీరం పుట్టకమునుపు శరీరం యేమీలేదు । చచ్చిన తరువాత శరీరం యేమీలేదు । వున్నంతశేపూ మందికూతలు విని । అనేక భ్రమలచేత । అనేక మందివున్నట్టే । తానూవుండి । కొనకుతానూ యేమీలేదు ।

11. యీలాగే అనేకమంది రానూ వుండి మళ్ళా యేమీలేదు చచ్చినవారు మళ్ళాపుడుతారు అనేటందుకు యేమీలేదు గనుక । యిది మళ్ళాపుడుతుంది అని । యేలాగు అన । అనేకాలు తనకుతానే తోచి । తనకుతానే యేమీలేదు-యిటువంటి దాన్ని వున్నదని భ్రాంతిపడే మాత్రమేకాని । ఉన్నది వున్నట్టూ పడదు

12. ప్రసూతి అయితే చిన్నపిల్లకు చంటిమీద ఆశ వున్నదని । తల్లికి ఆశ వుండే మాత్రమే కాని । మహోవుపద్రవం వస్తే యెవ్వరి ఆశ ముందరపడదు । తల్లికి తల్లే పిల్లకు పిల్లే । యెవరు చన్ను యిస్తే । వారిమీదనే పిల్లకు ఆశతగులుతుంది ।

13. యీలాగే కాని । యేమీలేని దానికి । మర్యాదాయేమిలేదు । పుట్టని చావని పరిపూర్ణానికి । యేమిభ్రాంతిలేదు ।

14. అందుకే దొంగ గురువు కాకుండా । మాయవేషాలు గాకుండా । శరీరంలేని గురుసాంప్రదాయం విచారించి । శరీరంలేని పరిపూర్ణం వున్నది వున్నట్టూ ఆయెనా । వొక్కటైనా భ్రాంతి పుట్టదు ।

15. భ్రమలకు మూలం మూలంలేని యీ గుర్తెరిగే శరీరమే కనుక అందుకే శరీరం పుట్టక । మునుపు శరీరం యేమీలేదు । చచ్చిన తరువాత యేమీలేదు ।

16. అలాగే యీ మూలంలేని గుర్తెరిగే శరీరం । యేమీలేదని । తనకుతానే దృఢం వుండెనా వాడే । భ్రాంతిలేనివాడు । ఇంతకంటె అధికమైన మార్గం లేదు ।

17. యిది అందరికీ సమాధానమే । స్త్రీలకూ పురుషులకూ । యిదే భ్రాంతిలేని రాజమార్గం । వున్నది । తనకు తానే స్వతస్సిద్ధమై వున్నది చలించక వున్నది । వున్నట్టు పడకుండా ప్రయత్నమే విఘ్నం

18. మూర్ఖులు నమ్మకపోయిరా । భ్రాంతి తొలుగదు। అందరి వలెనే ఆశచేత । క్లేశపడుతాడు।

19. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం। లేదు లేదు । అన్నా సాధనే । గనుక సూచన చేసినప్పుడె గ్రహిస్తే చాలు

20. యీ గుర్తెరిగే శరీరం నిబద్ధి । యీ శరీరం అబద్ధం అన్నా సాధనే అవుతుంది.

21. మూలంలేని యీగుర్తెరిగే శరీరం యేమిలేదనేది । సాధనలచేత సాధ్యం యెన్నటికీకాదు।

22. మూలంలేని యీ గుర్తెరిగే శరీరమునకు । మూలంయేమీ లేదు । గనుక । మధ్య తనకు తానే వున్నానని భ్రాంతి । చేత వున్నాది

23. ఆచార్య కటాక్షంచేత । మూలంలేని యీ గుర్తెరిగే శరీరమనె తెరదీశి । వైకుంఠాన్ని అరచేతులో చూపినట్టు చూపెనా ఒక్కటైన భ్రాంతి ఉండదు.

24. సర్వకాలం సంతతం చెలించక । మొదలూకొనాలేక । రాకడా పోకడాలేక । తనకు తానే స్వతఃసిద్ధమై । యితర లోకాంతరస్మరణలేక । ఉండటం మంచిది.

25. ఆచార్యకటాక్షం గలిగి । మూలంలేని యీ గుర్తెరిగే సచ్చిదానందమనే దేహభ్రాంతి తీసి వేసి । యెవ్వరైనా సూచన చేస్తారా అని। చింతచేత కైలాసమనే లోకాంతర భ్రాంతి చేత । ఉన్నాడు ।

26. యితర లోకాలవారికీ। వైకుంఠం యొక్క ఆపేక్షకద్దు । వైకుంఠం వున్నది వున్నట్టూ । జాడ సూచన అయితే । యిశ్చయెన్నటికీ పుట్టదు ।

27. వైకుంఠం పుట్టనిచావనిది గనుక । దానికిబదులులేదు । యితర స్థానాలు యెక్కడ వుంటే । అక్కడనే సర్వత్రాలేవు ।

28. యీ వైకుంఠం అయితే । సకల దేశాలయందూ వున్నది । సర్వకాలాలయందూ వున్నది । సమస్తమైన వస్తువులయందూ వున్నది

29. మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేకుండా । సూచన ఆయేగనుక వైకుంఠం మాత్రమే వుండె ।

**శ్లో॥ అచ్ఛేద్యోయ। మదాహ్యోయ। మక్లేద్యో శ్యోష్యయేవచ ।**
**నిత్యఃస్సర్వగత స్థాణు । రచలోయం సనాతనః ॥**

అని ॥ శ్రీ కృష్ణ భగవానులు ॥ వైకుంఠం యిటువంటిది అని చేత చూపిపోయినాడు । యిటువంటిది యేలోకమూకాదు । అందరికీ గురుకటాక్షం చేత సూచన అయితే । వైకుంఠం మాత్రమే వుండెను.

30. గురుకటాక్షం లేక । గుర్తెరిగే శరీరమనె తెర అయి వున్నాడు గనుక । అన్ని శరీరాలు వైకుంఠ మందె । నివశించి యున్నవి । వైకుంఠం యెరుగరు ।

31. వైకుంఠం జాడ సూచన కాకుంటె । అన్ని శరీరాలు సమానమె । అన్ని శరీరాలు మూలం లేని యీ గుర్తెరిగే శరీరాలే గనుక । అందరూ గుర్తెరిగే జ్ఞానస్వరూపులే ।

32. వైకుంఠంలో వున్న విశేషంచేత ఉన్నారు । అందుకే ।

**శ్లో॥ వుల్కాహస్తో యధా కశ్చిత్ । ద్రవ్యమాలోక్యతాంత్యజేత్ ।**
**జ్ఞానేనజ్ఞేయమాలోక్య । పశ్చాద్ జ్ఞానం పరిత్యజేత్ ।**

33. "జ్ఞాని । కిం ప్రయోజనం" । వైకుంఠాన్ని చూచి । యీ గుర్తెరిగే జ్ఞానాన్ని పరిత్యజించవలెనని । సిద్ధాంతం । "పశ్చాద్ జ్ఞానం పరిత్యజేత్ ॥" ఉత్తర గీతలయందు భగవానులే అన్నాడు ।

34. క్షేత్ర క్షేత్రజ్ఞుడు । భగవానులు గనుక । అందరూ భగవానులే । పుట్టని చావని భగవానులు కాదు।

**శృ॥ ఆత్మైవ మాయా ।**

35. ఆత్మ అనే మాయ చేతను । భ్రాంతి రహితంగాక । అద్వైతమనే భ్రాంతిచేత । అక్షరోపాధి అనే పరబ్రహ్మభ్రాంతి తగిలి । బ్రహ్మ అనేదోష స్వరూపంచేత । వుండెనా । సర్వకాలం । దోష స్వరూపుడే అవుతాడు.

36. మూలంలేని యీ గుర్తెరిగే దోష స్వరూపాన్ని । అద్ధంలో కానుపించే । శరీరం అద్దంలో యెలాగూ । అద్దంలో లేదో ।

37. అలాగే యీ మూలంలేని గుర్తెరిగే శరీరం అద్దంవలెనె స్వఛ్ఛంగాయున్న నేత్రాలయందు । చూస్తే కానుపించే మాత్రమే కాని । శరీరం వున్నదని యెరుగదు । వున్నదే తాను గనుక । తాను శరీరాన్ని యెరుగదు ॥

38. **శృ॥ క్షరాక్షరోపాధిద్వయం దోషేణా స్పష్టః ।**

రెండు ద్వయదోషాలు అని శంకరాచార్యులవారు అన్నారు ।

39. అందుకే రామానుజాచార్యుల వారు । సమ్మతపడి । అద్వైతం ఖండించినారు । విశిష్టాద్వైతమని యుక్తి చేసినారు ।

40. తనకుతానే స్వతసిద్ధమై వున్నది । పుట్టనిచావనిది గనుక । వ్యవహారములేనిదీ । వ్యవహారం కల్పించింది గనుక । యిది చదువుకొన్న పాండిత్యం । అని నేను చదువుకొన్నాను గనుక । విశిష్టాద్వైతం వున్నదని । వారిదాని మీద నాకు తోచింది ।

41. పండితులజాడ । పండితులకే తెలియవలె నని । నా చేత చేతనైనంత । కల్పించినాను । వారిది వున్నంతశేపూ । మా విశిష్టం తప్పదు ।

42. జగత్కారణం చైతన్యమైతే । విశిష్టం యేలాగు పుడుతుంది । కార్యకారణాలకు బేధం లేదు । అని అందరికీ యెరుకే ॥

**శృ॥ మృత్తేఘటం । ఘటే మృత్తుః॥**

43. గుర్తెరిగే చైతన్యమే । సమస్తవస్తువులు । చైతన్యం వలన తోస్తూ యున్నది గనుక । చైతన్యమే యీ గుర్తెరిగే జ్ఞానం । గుర్తెరిగే చైతన్యముకూ । జగత్తుకూ వేరులేదు ।

44. శిలవంటిది । శరీరం వలన గుర్తెరిగే జ్ఞానం పుట్టింది "గుర్తెరిగే చైతన్యంవలన । శరీరం పుట్టింది ।

45. తనకుతానె స్వతసిద్ధమై వున్నది । పుట్టనిచావనిది గనుక । అది శరీరం యెన్నటీకీకాదు । విచారించని యెక్కువ కులం మాలవాండ్లకూ । శరీరం వున్నదని భ్రాంతి కద్దు ।

46. గురుమూలంగా విచారించని తక్కువ కులం అనె మాదిగవాండ్లకూ వున్నది । అనె నిశ్చయమె వున్నది । యీ శరీరం యెవ్వరి వలన పుట్టింది అంటే । మూడులోకాల వారూ యెరుగరు" ।

47. శంకరాచార్యులు । వున్నదని లేదని అని రెండు మాటలు అన్నాడు ।

48. రామానుజాచార్యులు ప్రవాహారూపేణా । సర్వకాలం వున్నదే అన్నాడు ।

49. శ్రీ కృష్ణ భగవానులు। చాలా చెప్పినారు గాని, ఈ ఒక్క మాట బాగున్నది. "కదాచిత్ । నజాయత్ । నమ్రీయతే" అన్నాడు । పుట్టని చావనిది యెరుగునో యెరుగదో । అచలం । అదే గుణాలులేనిది । అదే క్రియాశూన్యమైనది అన్నారు ।

50. అదే సర్వకాలం వొక్కతీరుగా వున్నది । అదే చెయ్యంది । చేయించంది । అది సత్యమని గ్రహించదు అసత్యమని గ్రహించదు । పుట్టని చావనిది గనుక । దానికి తోచనే తోచదు ।

51. యేమి తోచినా గ్రంథాలు యెవరు చేసినారో । వారికే అన్నీతోస్తావి । శ్రీక్రిష్ణ స్వామి॥

**శ్లో॥ నవద్వార పురేదేహి । నైవకుర్వం నకారయన్** ॥ అని అన్నాడు ॥ ఆచార్యస్వాముల వారు । ఇలాగున అన్నారు.

**52.** శృ॥ సాత్వాత్మనః కర్తృత్వం కారయితృత్వంవా॥
కర్తృత్వం కారయితృత్వం లేనిదీ అన్నాడు

క్షేత్ర క్షేత్రజ్ఞ స్వరూపమంటె యెవ్వరికి సమాధానం కాదు । పుట్టని చావనిదియేదో । అది సూచన చేస్తే । దానికి సరిపోవలెగాని । యీ క్షేత్రజ్ఞుడు అభోక్త అంటె యెవ్వరికి

సమాధానంకాదు।

53. అట్లయితే క్షేత్రజ్ఞుడు లేకుంటే కర్తృత్వం లేదు కారయితృత్వంలేదు । యీ క్షేత్రం వున్నంత శేపూ । క్షేత్రజ్ఞుడు లేకపోడు । యీ కలలో క్షేత్రక్షేత్రజ్ఞులు లేకనే తోచిరి.

శి॥ ఔ । రెండూ కూడుకొని వచ్చినవి ।

గు॥ 54. అలాగే । క్షేత్రం । క్షేత్రజ్ఞునితో కూడా లేదని । సూచన చేసే గురు సాంప్రదాయం అయెనా । యెన్నటికీ భ్రాంతి పుట్టదు ।

55. అందుకే । విద్యారణ్య ముని స్వాముల వారు ఇలాగున చెప్పినారు.

**శ్లో॥ సదా విచార యేతస్మాత్ । జగజ్జీవ పరమాత్మనః ।**
**జీవభావ జగద్భావ । భావైతాత్మైవ విశిష్యతే ॥**

జీవ జగత్తులు రెండూ లేకుండా గురు సూచన ఆయెనా। పుట్టని చావని బట్టబయలు వున్నదని । వొప్పుకున్నారు"।

56. తనకు తానే స్వతసిద్ధమై వున్నది । సర్వకాలం వొక్కతీరే । వున్నదానిలో స్త్రీఆకారం తోచదు । పురుషాకారం తోచదు । శరీరం వున్నదానిలో లేనట్టూ తోస్తుంది ।

57. యేమైనా మూలంలేని యీ వ్యాపారంచేత । శంకలు తోస్తావి । వున్నదానికి నిశ్చయం లేదు । సంశయంలేదు । యీ శరీరంలేదు గనుక । సర్వకాలం శరీరంలేకనే వున్నది । గనుక వక్కటైనా వికారంలేనిది ।

58. అందుకే వికారం లేదు । ఆత్మానాత్మల వ్యవహారమే లేదు ॥ అందుకే ॥

**శ్లో॥ "క్వచ ద్వైతం క్వచాద్వైతం ।**
**స్వేమవాస్తీతి । తస్యమె । కృపారబ్దాదా కర్మాణి॥"**

59. యీ శరీరమే లేదుగనుక । వ్యవహారమే లేదు । పుట్టని చావనిది వున్నదోలేదో అనికల తోచిన శరీరాలకు సంశయంకద్దు । మేలుకొంటె వున్నదే వున్నది ।

60. శరీరం మందికి తోచినా । తనకు వెతికినాలేదు । సర్వకాలం శరీరం లేకవున్నవాడు । భ్రాంతి లేక వున్నవాడు । కోట్లకొద్దీ కలలో వచ్చినా । శాశ్వితంగా వుండనే వుండవు।

61. అలాగే సమస్తమైన అవస్తలు । క్షేత్ర క్షేత్రజ్ఞులకే కాని । తనకు తానే స్వతసిద్ధమై । చలించక వున్నదానికి । యే అవస్తాలేదు । సర్వకాలం శరీరం లేక వున్నది । శరీరం

లేక వున్నది యెరుగదు । లేనిదీ యెరుగుదు ।

62. శరీరం లేకనే తనకు తానే తోచి । తనకు తానె యేమీలేదు । ఆలాగుకాదు । యీ గురు సాంప్రదాయం । శరీరం లేని సాంప్రదాయం । శరీరం లేని సాంప్రదాయం మహాగుహ్యాం ।

63 వేదశాస్త్రాల యొక్క నిర్ణయం చెయ్యంది । అదే అంటే కలతోచక మునుపు వ్యవహారమే లేదు ।

64. "కలతోచంగానే వారూ పుస్తకాలు తెచ్చినారు । వీరూపుస్తకాలు తెచ్చినారు । వారూవీరూ ప్రసంగాలు చేశినారు । వేదం స్వస్తిచెప్పినారు । అనేక దేవాలయాలు చూచినారు ।

65. అనేక మంది లింగదార్లను చూచినారు ।

66. అనేక మంది అయ్యవార్లు అనేక మందిబూడిద పూసుకొన్న వారూ ।

67. అనేక మంది । తిరుమణి శ్రీచూర్ణం పెట్టు కొన్నవారు ।

68. అనేక మంది తురకలు ।

69. అనేక మంది బేగరవాండ్లు ।

70. అనేక గుర్రాలు ।

71. అనేక యేనుగులు ।

72. అనేక వ్యభిచార్లు ।

73. అనేక బోడివాండ్లు ।

74. అనేక మంది ఫకీర్లు ।

75. అనేక మంది సన్యాసులు

76. అనేక సముద్రాలు ।

77. అనేక మంది వుపాసకులు ।

78. అనేక ఆయితాగ్నులు ।

79. అనేక మంది చుట్టలు తాగే వాండ్లు ।

80. అనేక మంది బారీ భంగలు తాగే వాండ్లు ।

81. అనేక మంది శూద్రులు ।

82. అనేక మంది కోమట్లు ।

83. అనేకమంది గొల్లవాండ్లు ।

84. అనేక మంది రాజులు ।

85. అనేక కుక్కలు ।

86. అనేక పందులు అనేక గాడిదలు ।

87. అనేక మంది చదువుకొన్న మనుష్యులు ।

88. అనేక గోవులు । అనేక బర్లు ।

89. అనేక దుకాణాలు ।

90. అనేక మాదిగ వాండ్లు । వీరు అందరూ । పుస్తకాలు ముందర వేసుకొని । యీ శరీరం యేలాగు పుట్టింది । అని విచారించుచున్నారు"।

91. అందులో మహాచదువు కొన్న చిందువాడు । యిది యెంత అనె । ఆడదాని మీద మొగవాడు యెక్కితే । అన్నీ పుడుతావి । అనె । అయితె । దేవుడు పుట్టిస్తాడని। అనుకొంటారు ।

92. దేవుడు అనేది మరుగుమాట । దేవుడు తింటాడు యెలాగో । అలాగే అబద్ధం తినెవాడు ఆయనే। పుట్టించేవాడు ఆయన్నే పుట్టించే వాడు దేవుడే । అయితే । దేవుడికి యేమితిన్నా తప్పులేదు ।

93. దేవుడు సంసారంచేసే వాడు అయితె పుట్టించే మగగాడిద దేవుడు । ఆడగాడిద దేవత । నపుంసకం గాడిద పరబ్రహ్మము । యీలాగే । పితృదేవతలు యిలాగే వుండంగా । అన్ని దేవతాస్వరూపాలే । అన్నీ పుట్టిస్తూనే వున్నవి । అన్నీ భక్షిస్తూనే వున్నవి । తినేది పుట్టించేది ।

అన్నీ దేవతా స్వరూపాలే । యింతకంటె వేరే యేమీలేదు । అని నమ్మిక వుండే । వాండ్లకూ దేవునికీ । వేరుయెన్నటికీ లేదు ।

94. సర్వకాలం తింటారు । శరీరాకారమై । శరీరాలతో । యే దేవతా । ప్రయోజనాలో చేస్తారు ।సర్వకాలం యిదే ప్రయోజనం । పుట్టని చావనిది । వున్నదో లేదో । యని విచారించ నేరదు.

95. సర్వకాలం పుట్టేది చచ్చేది । వున్నది । సర్వం శ్రీమన్నారాయణ స్వరూపమే । శరీరాలకూ । శ్రీమన్నారాయణునకూ । వేరుయెన్నటికీ లేదు ।

96. వుంటె ఆరగించేవారు యెవ్వరు। దేవతాఖర్మాలు చేసే వారు యెవ్వరు । శరీరాలకు । శ్రీమన్నారాయణునకు । వేరుయెన్నటికీ లేదు ।

97. శ్రీమన్నారాయణుడు । శరీరం కలసేవున్నది । అద్వైతంవలె దేహం అబద్ధం । దేహినిబద్ధి అన్నట్టుగాదు । సర్వకాలం దేహానికి దేహికీ వేరు యెన్నటికీ కాదు ।

98. "గుఢమధురవత్" । బెల్లాన్ని విడచి తీపి లేదు, తీపిని విడిచి బెల్లం ఉండనట్లు యీలాగే దేహంను విడచి దేహి లేదు, దేహిని విడచి దేహం ఉండదు.

99. దేహం లేకుంటె వ్యవహారానికి మూలం యేమి । అని నిర్ణయం చేయ । సర్వకాలం యేకప్రకారమే । అవుతుంది । శరీరం యెవరివలన పుట్టిందో । ఆ నిర్ణయం మొదలు కల్తలేకుండా విచారించవలె । విచారిస్తే యీ శరీరానికి మూలం యేమీలేక పాయె ।

100. పుట్టని చావనిది । తనకుతానే స్వతసిద్ధమై చలించక । సర్వకాలం వొక్కతీరుగావున్నది । "ఉన్న దానికి వున్నదని తోచదు । లేదనీ తోచదు । యేమితోచినా శరీరం వున్నదనే భ్రాంతులకే । తోచుతుంది । శరీరం లేకుంటే యేమీతోచదు ।

101. చదువుకొన్న యెక్కువ కులమైన మాలవాండ్లకూ । చదువుకొని తక్కువ కులం । అయిన మాదిగవాండ్లకూ । అనుమానం లేదు । అందుకే । శరీరం సర్వకాలం తీసివేశే గురువు దుర్లభం॥

## 4. గురువాక్యం తెలిస్తే పుట్టుకా భ్రాంతి రెండూ సమానమే.

**102. శ్లో॥ దుర్లభం చిత్త విశ్రాంతి । వినాగురు కృపాంపరాం ॥**

అని వున్నది । అంతా వున్నట్టే వుండవలె । సర్వకాలం క్షేత్రక్షేత్రజ్ఞుడు । లేకపోవలె । అది గురు సాంప్రాదాయం । చూస్తే అందరివలెనే వుంటాడు కనుక । అనేక కోటి బ్రహ్మాండాలు । అరచేతులోనే వున్నవి । తనయందు । పుట్టుకాలేదు చావూలేదు । సర్వకాలం పుట్టని చావని తానే తాను స్వతః సిద్దమై ఉన్నది ॥"

**103. "శృ॥ క్షరా క్షరోపాధిద్వయ దోషేణా స్పష్టః ।**

క్షేత్ర క్షేత్రజ్ఞ స్వరూప దోషద్వయం ।తనకు వెతికినాలేదు । సర్వకాలం ఒక్కతీరే ఉన్నది

**శృ॥ సద్రూపం నాస్తిసర్వత్ర । చిద్రూపంనాస్తి సర్వదా ।**
**ఆనందరూపకం నాస్తి । అచలం చాస్తి సర్వదా ॥**

**శ్లో॥ సర్వానంద విహీనశ్చ । అచలోయం సనాతన ।**

**ఆనంద రహితమచలం । కర్తృకార్య వివర్జితం**

**శ్లో॥ జ్ఞానమానందగం బ్రహ్మ । యిత్యుక్తం మూఢమానవైః ।**

**జ్ఞానాస్సంజాయతోనందో । ఆనందో భ్రాంతిలక్షణః॥**

**శ్లో॥ సత్యజ్ఞాన మనంతంచా॥ మాయాగుణమిదంశృణు ।**

**నిర్గుణం నిశ్చలం పూర్ణం । సర్వకాలేషు సంస్థితం ॥**

**శ్లో॥ జాగ్రస్వప్నసుషుప్త్యాది నిర్మలం శుద్ధం । అచలం శబ్ద వర్జితం ।**

**తేజోంధకార రాహిత్యం । గోప్యం బ్రహ్మ నసంశయః ॥**

104. అని వున్నది గనుక । వున్నది గ్రహించదు । నిషేదించదు । లేని క్షేత్రజ్ఞ స్వరూపమే । వున్నదానికి వ్యవహారమే లేదు । శరీరం లేదు గనుక । వున్నది । శరీరంలేదు అని యెరుగదు ।

105. లేని శరీరం యెరుగదు । గురు సాంప్రదాయం । క్షేత్రంలేని సాంప్రదాయం గనుక । క్షేత్రజ్ఞునికి । చోటు లేదు । వున్నది పుట్టని చావనిది గనుక । క్షేత్రస్వరూపం కాదు।

106. సర్వకాలం క్షేత్రం లేనిది గనుక । యే నిర్ణయంచేయదు । పుట్టనిచావనిదానికి । ఆకారం లేదు గనుక । చూడదు । వినదు । గుర్తెరుగదు । చెయ్యదు । చేయించదు । వినదు । లిప్తంకాదు । యిటువంటి దాన్ని । మూలంలేని యీ గుర్తెరిగే శరీరంతోనే కనుక్కోవలె"॥

**107. శృ॥ అయం । జీవాఖ్యోపాధి విలయేసతి కేవలో భవతి ॥**

క్షేత్రం లేకుంటే । క్షేత్రజ్ఞుడు లేనేలేదు । గనుక గురుకటాక్షం యెప్పుడు అయితే । అప్పుడే ।యేమిలేదు

**శృ॥ క్షరాక్షరోపాధి ద్వయదోష రహితః । అస్పృష్టి ఇతి కేచిత్ । తదసత్ ॥**

సృష్టిలేదు । అంటె వున్నట్టె వుంటుంది । వున్నదే వున్నది । ఉన్నదానియందు వున్నది కాదు । యెప్పుడు । యేలాగు వున్నదో ఆలాగే వున్నది ।

108. విచారించని గాడ్దుల వంటి మనుష్యులకు । సంకరంగా వుంటుంది । భ్రాంతి విస్తారం అవుతుంది । గనుక । యింతేకాని । యే సిద్ధాంతంలోనూ తనకు తోచదు ।

109. గురుమూలంగా విచారించినవారికి భ్రాంతి యెన్నటికీ లేదు। విచారించని మూర్ఖులు

। బురదనీళ్ళవలె । వుంటారు । కుక్కలు చచ్చినట్లు చస్తారు । యింతేకాని ।

110. మనుష్యులకూ కుక్కలకూ । గాడిదలకూ । పందులకూ । విచారించకపోతే । యెక్కువ తక్కువలేదు । పుట్టుకా భ్రాంతిసమానమే । ఇందుకు యించుకైన సందేహం లేదు.

111. చదువుకొంటె యేనుగకు ప్రశిద్ధి వున్నట్టు ప్రశిద్ధి మాత్రమే । కొనకు రెండూ వక్కటె । యెత్తుమాత్రమే యెక్కువ । విచారించినవాడు సింహం వంటివాడు ।

112. దేహంలేక వున్నవారు । దీరులు । శుద్ధం యీ దేహమందు వున్నది అని । గురుసాంప్రదాయం వున్నది । సర్వకాలం దేహంలో వెతికినా లేదు । దేహం పుట్టక మునుపు యేలాగు వున్నదో । ఆలాగే వున్నది । దేహం లేకుంటె యేబాధలేదు ।

113. ఉన్నదానికి సర్వకాలం వొక్కతీరె । దానియందు క్షేత్రం లేదు గనుక క్షేత్రజ్ఞుడు యెక్కడ వున్నాడు । అందుకే । వున్నదానికి వొక్కటైనా వికారం లేదు ॥

114. **జీవేశ్వరైఖ్యోపాధి విలయేసతి । కేవలోభవతి ।**

క్షేత్రం లేకుంటె । క్షేత్రజ్ఞుడు లేనేలేదు గనుక । సర్వకాలం కేవలాత్మే వున్నది ।

**శ్లో॥ సర్వకర్మాణి మనసా సన్న్యస్యాస్తే సుఖం వశీ ।**
**నవద్వార పురేదేహి । నైవ కుర్వాన్ నకారయన్ । 5-13**

తా॥ అంతఃకరణమును అదుపులో ఉంచుకొని సాంఖ్యయోగమును ఆచరించు పురుషుడు కర్మలను ఆచరింపకయే ఆచరింపజేయకయే నవ ద్వారములు గల శరీరమందు సమస్త కర్మలను మానసికముగా విడిచియు పరమాత్మ స్వరూపమున స్థితుడై లేని స్థితిలో నుండును.

115. గురుసాంప్రదాయరహితుడు । క్షేత్రక్షేత్రజ్ఞుడు అంటాడు । క్షేత్రం వున్నదని చెప్పే గురువు సాంప్రదాయకుడు కాడు । ఉన్నదానియందు క్షేత్రం మందికి తోస్తుంది । తనకు వెతికినా లేదు । తోచనే తోచదు । కల్తలేని గురువు ఆయేనా । క్షేత్రం లేకుండా సూచన చేస్తాడు । చేసెనా । క్షేత్రంలేకుంటె । క్షేత్రజ్ఞుడు యెక్కడ వుంటాడు ।

116. గురువు క్షేత్రం లేకుండా సూచన చెయ్యనివాడు । గనుక । యీదోషం గురువులదే కాని । శిష్యులది యెన్నటికీ కాదు । సకల సిద్ధాంతాలు ।విచారించిన తరువాత ।

యీ మూలంలేని యీ గుర్తెరిగే శరీరం యేమీలేదని సూచనచేస్తే । ప్రపంచభ్రాంతి యెన్నటికీ పుట్టదు । సర్వకాలం శరీరం లేకనే వున్నది గనుక । వికారం లేదు ।

117. శరీరం లేక వున్నవారు । వున్నదని నిర్ణయం చేయరు । యెలాగు వున్నదో ఆలాగే వుండక వుంటారు । మందికి శరీరం వున్నదని తోస్తుంది । తనకు శరీరం లేదు గనుక । యేమీలేదు ।" మొదలు చక్కనైతే కొనవెళ్ళా చక్కనె । సకలకల్తలూ గురువులకే గాని । శిష్యులకు మునుపు యేమీ కల్తలేదు ।

**5. అద్వైతం వేదమందే కలదు కనుక వేదమార్గం అంతా యెరుక మార్గమే.**

118. గురువు । నామరూపాలు లేనిదానికి । ఆత్మ అని । బ్రహ్మ అని । జ్ఞప్తి అని । కలత సూచన చేశినాడు । పుట్టని శరీరాన్ని పుట్టింది అని అనుకొన్నాడు । ఉన్నది పుట్టించదు । పుట్టదు । సర్వకాలం వొక్కతీరె । వున్నది వుండీ । చెయ్యదు చేయించదు । సర్వకాలం వొక్కతీరే ।

**'నకరోతి। నలిప్యతే । నైవకుర్యం । నకారయన్ ।** అని భగవానులు అన్నాడు'।

119. అందరికీ । యీ శరీరమందు శుద్ధం వున్నది । యీశరీరమే । క్షరాక్షరోపాధి ద్వయదోష స్వరూపమని ।శరీరమందు చెయ్యనిదీ । చేయించనిదీ । ఉన్నది అని అన్నారు।।"

120. యీ శరీరమందె పుట్టనిది । పుట్టించనిది । వున్నది అని అన్నారు । ఆత్మ । బ్రహ్మఅనె । గుర్తెరిగే చైతన్యాన్ని యెరుగనిది । యీ శరీరమందె శరీరం లేక వున్నది అని అన్నారు ।

121. యీ అనుభవము ప్రజ్ఞలేనివారు అయితేనేగాని । తాత్పర్యంకాక పోవలెను । యీ శరీరమందు శరీరం లేక ఉన్నవారికి । వికారంయెన్నటికీ లేదు । యీ సాంప్రదాయం సులభం । కఠినం । శరీరం లేకుంటె । శరీరం లేనిది యెలాగు వున్నదో । ఆలాగే । వున్నది ।

122. బట్టబయలుకు వ్యవహారం యెన్నటికీ లేదు । శరీరం యెన్నటికీ లేదు । ఈ గుర్తెరిగే శరీరం లేని వారికి శరీరం యెన్నటికీ తోచనే తోచదు । క్షేత్రక్షేత్రజ్ఞ రహితులు గనుక । మహారహస్యం సర్వకాలం వొక్కతీరుగా । వుండే మార్గాన్ని । చలించే మూర్ఖులకు । సూచన చెయ్యరు ।

123. కనుకునే వారికి చేస్తే జగద్భ్రాంతి వుండదు । జీవభ్రాంతి వుండదు । అందుకే జ్ఞానోపదేశమనే । కౌతుకంచేత వున్నది । అనేక దృఢం చేసి । సూచనచేస్తే । బహుచులకన । అందుకే గురుకులవాసం సర్వకాలం వుండవలె । ఉండకపోయెనా । యావత్తు మర్మమూ తెలియదు ।

తెలియక పోయెనా । జగత్తు తోస్తూనే వుంటుంది । వున్నదానికి తోచదు గనుక । యేమితోచినా శరీరానకే । శరీరం జడం కాదు । అన్ని శరీరాలు । గుర్తెరిగే ప్రవర్తిస్తావి । గుర్తెరిగే శరీరం లేదు గనుక । లేనిది యీ శరీరమందె వున్నది । ఉన్నది వున్నట్టా మహాఆస్తికులకు । అయితే మహాసూక్ష్మం । అదే వారికి తపస్సు । సర్వకాలం శరీరం లేకనే చేస్తారు ।

124. గుర్తెరిగే శరీరం తోటే పోతుంది । పుట్టకమునుపు శరీరం లేదు గనుక । యెరుకలేదు । సర్వకాలం వొక్కతీరే"। ఆత్మానాత్మ వివేకం । "ఆచార్య స్వాములవారు । అద్వైతం కల్పించేటందుకు యుక్తి చేశినారు ॥

**శృ॥ ఆత్మాకిం సదృశః । స్థూల సూక్ష్మ కారణ శరీరోభ్యో వ్యతిరిక్తః ॥**
**పంచకోశాతీత ః । అవస్థా త్రయ సాక్షిః ।**

**శృ॥ చతుర్వింశతీ తత్వాధారః॥ మాయయా ప్రతీయ మానాభ్యాం ।**
**జీవేశ్వరాభ్యాం । భిన్నః । సచ్చిదానంద రూపస్సం । యస్మిన్ తిష్ఠతి సఆత్మా॥**

గుర్తెరిగే చైతన్యం బ్రహ్మ స్వరూపం అన్నారు । రెండు గుర్తెరుగుటాలు లేవు । అందుకే । యీ గుర్తెరిగే క్షేత్రజ్ఞస్వరూపమనే । ఆత్మే బ్రహ్మే అని పలికింది । వేదం చొప్పున । వారిసిద్ధాంతం కల్పించినారు ।

125. అద్వైతమంటె । తనకు తానే స్వతసిద్ధమై॥ వున్నదానియందు । యేదిలేదో అదె అద్వైతమని భావార్థం వున్నది"। యీ గుర్తెరిగే కారణం వున్నది । అన్నాడు । వారు యెటువంటి వారో । యేదివున్నదో అదే వారు

**శి॥** అంటే । క్షేత్రం । క్షేత్రజ్ఞం వారు అనుకోనా

**గు॥** యీ రెండూ లేని వారు అయితే । వ్యవహారమే లేదు

### 6. భ్రాంతి లేకుండా సూచన చేస్తే సర్వకాలం శరీరం లేకనే వ్యవహారం చేస్తారు

**శి॥** రెంటికీ మూలం యేమి?

**గు॥** 126. పుట్టని చావనిది యీ శరీరం మందె వున్నదిగాని । యీ శరీరం లేదు । యీ క్షేత్రజ్ఞుడు లేదు । యీ రెండూ లేకనే చలించక వున్నది । అందుకే శరీరమందు । క్షేత్రజ్ఞ రహితమైంది । బ్రతికి వున్నప్పుడు యేలాగు వున్నదో । ఆలాగే చలించక వున్నప్పుడూ వున్నది । "సర్వకాలం పరిపూర్ణం గనుక । చలించక వున్నది । పుట్టుకా లేదు । చావూలేదు ।

127. శరీరం వున్నదనే భ్రాంతి । అందుకే యీ దేహం వుండంగానే । భ్రాంతిలేకుండా సూచన చెయ్యవలె । చేస్తే సర్వకాలం శరీరం లేకనే । వ్యవహారం చేస్తారు । వారి వ్యవహారం మందికి మహాబాధ । వారు చెయ్యరు చేయించరు గనుక । వారికి వొకటైనా బాధలేదు ।

128. పుట్టని చావనిది గనుక । అత్యంత నిర్మలం । అత్యంత స్వఛ్ఛం । వొక్కటైనా రూపంలేదు । సర్వకాలం అద్దంవలె స్వఛ్ఛంగా వున్నది । అందులోకానుపించే మాత్రమే కాని । అందులో చొర్రాలేదు । వెళ్ళిపోదు । చూస్తే కానుపించేది స్వభావం ।

129. చూచే శరీరం లేకుంటే । చూడందే వున్నది చూడని । దానికి తోచనే తోచదు । యెక్కడ సకలం తోచిందో అక్కడనే సకలం లేకపోవలెను । అందుకే అతీతం గనుక । దాన్ని పరబ్రహ్మ స్వరూపం పరబ్రహ్మం అంటే లేనియెరుకనె గనుక అట్ల అనరాదు.

శృ॥ **పంచ వింశతి తత్వగుం ఆత్మాభవతి** । అని శృతివున్నది ।

గుర్తెరిగే క్షేత్రజ్ఞ స్వరూపం ఆత్మ గనుక । ఆత్మ కంటే వేరే పరబ్రహ్మ స్వరూపం లేదు॥

శృ॥ **అయమాత్మా బ్రహ్మ** ॥ ఈ ఆత్మయే బ్రహ్మమని శృతి అబద్ధమాడించింది । ఛీ ఛీ । ఆలాగు అనరాదు । వేద వాక్యం మహాప్రమాణమైంది । యీ గుర్తెరిగే క్షేత్రజ్ఞస్వరూపమనె । పరాప్రకృతి అధిష్ఠానం గనుక । యీ గుర్తెరిగే చైతన్యమనె । చిత్ ప్రకృతి సాక్షిణీ

130. యీసాక్షిణీ అనేమాయ । యిన్ని చిత్రవిచిత్రాలు కల్పించింది । యీగుర్తెరిగే సాక్షిణీ మాయకంటె । వేరే పుట్టనిచావనిది । తనకు తానే । స్వతసిద్ధమై చలించక । వున్నది । యీ గుర్తెరిగే సాక్షిణీకి మూలం యేమీలేదు । సర్వకాలం వొక్కతీరుగానే వున్నది ।

131. "గురువు అనె సాందీపుడు । శిష్యుడు అయిన శ్రీ క్రిష్ణస్వామికి । యే ప్రకారం వుపదేశం చేసినాడో । ఆ ప్రకారం శ్రీధరస్వామికే గాని । మరి వొఘరికి । యీ రహస్యం । తెలియదు । భగవద్గీతల రహస్యమయితె । జ్ఞానేశ్వర్లు గారికే తెలుసు ।

132. శ్రీ భాగవతం యొక్క రహస్యం । శుకుల వారికే తెలుసు । పృధ్వియందు । శ్రీకృష్ణస్వామి యొక్క నిజస్వరూపం । శ్రీధరస్వామికే గాని । మరివొఘరు యెరిగేటందుకు తోచదు।

133. అందరికి శంకరాచార్యులు చేశిన అద్వైతమందు ఆశకద్దు । అద్వైతమే గుర్తెరిగే సాక్షిణీ అనె మాయ । అని యెంతవారికీ । సూచనకాదు । ఆచార్య స్వాముల వారిజాడ । రామానుజాచార్యులకే గాని । మరి వొకరికి తెలియదు ।

134. మహేంద్రజాలి యొక్క మాయ । యింద్రజాలికే గాని । రెండో వారికి తెలియదు । మహా ఆశకద్దు । అందరికి ఆశమాత్రమే కాని వున్నది వున్నట్టూ పడదు ॥

## 7. మతాచార్యుల వారి భావార్థము యెరుగండి

1. అద్వైతం వాదం కొరకే । గాని భ్రాంతి రహితం కాదు ॥
2. శ్రీధరస్వామి । సాందీపుని యొక్క భావార్థం యెరుగు ॥
3. భగవానులు యొక్క భావార్థం యెరుగు ॥
4. శ్రీ శుకులు వారి భావార్థం యెరుగు ॥
5. శంకరాచార్యుల వారి భావార్థం యెరుగు ॥
6. వ్యాసుల వారి యొక్క భావార్థం యెరుగు ॥
7. రామానుజాచార్యులవారి భావార్థం యెరుగు ॥

   అందరి భావార్థం యెరిగిన వారు శ్రీధరస్వామేగాని । మరివొకరికి తోచదు । అయితే యిక్కడ యెరుగు యెరుగు అని వచ్చినందుకు వారు ఏమి యెరిగినారో మీరు యెరుగండి.

8. శ్రీ కృష్ణస్వామికి తగ్గ గురువు । సాందీపుడే గాని । మరివొకరు లేరు ।
9. సాందీపునికీ । వశిష్టుకూ । చాలా యెక్కువ తక్కువ వున్నది । గురుభావాం ।
10. శ్రీ క్రిష్ణస్వామి అయిన శిష్యుడు । యెరుగు శిష్యునియొక్క ప్రభావం సాందీపుడే యెరుగు । యిద్దరి యొక్క ప్రభావం । శ్రీధరస్వామి యెరుగును ।
11. యీ ముగ్గురి యొక్క ప్రభావం । యీ పుస్తకం వ్రాసినవాడు యెరుగును । 000 ॥
12. యీ పుస్తకం చూచి । చదువుకొన్నవారికి । యీ నలుగురి ప్రభావం । 0000 । తెలుస్తుంది । శీఘ్రంగా భ్రాంతిలేని వారు అయ్యి । 000 । వుంటాడు ।
13. యీ అభిప్రాయం । గురుముఖంగా । విచారించినవారికి । యే శిద్ధాంతం । రుచి వుండదు । జ్ఞానఖర్మాల యొక్క భ్రాంతి పుట్టదు । 0000 ।
14. యింతకంటే యెక్కువ వున్నదని । ఆశ పుట్టదు । యీ శరీరమందు । 000 । శరీరం లేనిది । సూచన అయితే । సర్వం శరీరంతో పోయెను ॥" వున్నదానికి । యెరుకాలేదు । మరపూలేదు ।
15. సర్వకాలం వక్కతీరె । శరీరంలేనిది । సకలదేశాలయందూ । సర్వకాలాల యందూ । సమస్తమైన వస్తువుల యందూ । వక్కటైనా వికారంలేక । గుణాలు లేక । వక్కతీరుగానే । వున్నది ।

16. ఆత్మ అన్నా । బ్రహ్మము అన్నా । యిరువై అయిదోదానికే సౌజ్ఞ । గుర్తెరిగేది వక్కటే గనుక । ఆత్మ అనే ఆశ । బ్రహ్మమనే ఆశ । రెండూ వక్కటే

17. పుట్టని చావని దానికి పేరు లేదు । జ్ఞానంలేదు । అందుకే । ఖర్మాలు లేవు । శరీరం లేకుంటే యేబాధలేదు । యీ శరీరమందు వెతకినా । శరీరంలేనిది । వున్నది । శరీరం లేకుంటే యెరుకలేదు ఖర్మాలు లేవు । సర్వకాలం । చెయ్యక చేయించక । ఆత్మ । బ్రహ్మలనే । వ్యవహారం లేక వున్నది।

18. సకల సంశయాలు । యెక్కడ తోచినవో । అక్కడనే లేకపోవలె । అని । యీ శరీరమందె । నిర్వికారం నిర్గుణం వున్నది । అని సూచన చేసినారు । వొక్కదిక్కు । శాస్త్రార్ధం । నిర్ణయమైతే । సర్వత్రా । రాద్ధాంతమనికద్దు । జ్ఞానంకంటె । వేరే వున్నదని । సూచనచేశే గురువు । కదాచిత్ । కద్దు ।

19. ఆత్మ బ్రహ్మల కంటె వేరే । అంటె । యెవ్వరికి అనుమానంలేదు గనుక । లోక సమానార్ధము గాని । వున్నది వున్నట్టా గాదు । లోకులకు । లోకంలో వున్న వేదాంత వాఖ్యాలలో । వున్న చొప్పున చూపవలె । పలుకవలె । సమాధానం । కావలె కాకుంటె । మళ్ళా సంశయం పుడుతుంది ।

20. అందుకే "శ్రీ క్రిష్ణస్వామి । యీ ఆత్మనూ యెరుగడు । బ్రహ్మమునూ యెరుగడు । యీ ఆత్మబ్రహ్మల । కూటస్థుల కంటె మునుపే వున్నాడు । స్వతసిద్ధమై వున్నాడు । మొదలూ కొనాలేక । చలించక వున్నాడు । యీ ప్రజలకు । క్లేశపెట్టే కొరకు । దేహములేని తాను । దేహమందే వున్నాడని చెప్పినాడు ।

21. గురుసాంప్రదాయం । ఆలాగు కాదు । మహాగుహ్యం । మహారహస్యం । మహాప్రకటం ఆత్మ బ్రహ్మలు లేకుండా । శరీరాలు లేకుండా । సూచన మూఢులకు । మూర్ఖులకూ । శ్రద్ధలేనివారికి । జ్ఞానభ్రాంతి ఖర్మభ్రాంతి వున్నవారికి సూచనచేస్తే ముందర పడదు।

22. శీఘ్రంగా సూచన చెయ్యరు"। సర్వకాలం దేహానికి । మూలం వున్నదనే భ్రాంతి చేత । బ్రహ్మభ్రాంతి అయినా । కర్మభ్రాంతి అయినా । ఘట్టిగా నమ్ముకోని । యీ దేహం వున్నది । చచ్చినదాక తప్పదు । అనుకొంటూ । భ్రాంతి చేత వుంటారు ।

23. సర్వకాలం శరీరం లేనేలేదు । పుట్టని శరీరం యేలాగు వున్నదని అనుకొందును । అని బిడియము లేక । యీ గుర్తెరిగే క్షేత్రజ్ఞ స్వరూపమనె । ఆత్మభ్రాంతి చేత ।

బ్రహ్మభ్రాంతి సంపాదించుకోని । కలతో సమానంగా చూచుకోనేరక । గుర్తెరిగే సాక్షిణీమాయ । సహవాసం విడువలేక । యీకలలో వుంటారు ।

24. గురువాక్యం చేత మేలుకోక । సర్వకాలం మొగుడు విడచిన ఆడదాని వలె । యదేచ్ఛంగా । వుంటుంది । మొగుణ్ణి విడచిన । ఆడదీకాదు । మొగుడు విడచిన । ఆడదీ కాదు । అవాంతర । పిశాచం । అంటె । యీ గుర్తెరిగే సాక్షిణీ మాయ । అనే । ఆత్మఅనే । బ్రహ్మ స్వరూపం ।

25. యీ గుర్తెరిగే చైతన్యంచేత । సర్వత్రాచైతన్యం । వున్నదని । నమ్మి । యీ గుర్తెరిగే జ్ఞానం । సమస్తమైన వస్తువులయందూ । వుండజూచి । యీ జ్ఞానం యేలాగు వున్నదో । చూచిన తరువాత ఆలాగే । జ్ఞానాతీతము । వున్నదని నమ్మి ।

26. యీ జ్ఞానం దేహం వల్ల పుట్టింది । యీ దేహం లేకుంటే । జ్ఞానం లేనేలేదు । యీ దుఃఖం యేమియని । సర్వకాలం । దేహంలేని యుక్తిచేత । అచలమై యుండెనా । సర్వకాలం పుట్టని చావనివాడే । అవుతాడు.

27. నానావిధాల యే యుక్తిచేత । క్షేత్రక్షేత్రజ్ఞులు లేరో । ఆయుక్తి దొడ్డదని నమ్మెనా । వారికి సర్వకాలం । జాగ్రత లేదు । స్వప్నం లేదు । సుషుప్తి లేదు । తుర్యం అనే ఆత్మలేదు । బ్రహ్మలేదు । శరీరము లేక యేలాగు వున్నదో । ఆలాగే వుంటాడు ।

28. వున్నదాంట్లో మునుపు శరీరం లేదు । పుట్టదు చావదు । శరీరం వున్నదనే భ్రాంతులకు । గురుమూలంగా శరీరంలేదని నిశ్చయమయ్యి । సర్వకాలం శరీరం లేదని । దృఢం వుండెనా । శరీరమే లేదు ।

29. శరీరము లేదు గనుక । కన్నులు లేవు । కన్నులు లేవు గనుక । కంటిలోపాప । గుర్తెరిగే ఆత్మలేదు । ఆత్మలేకుంటె పరబ్రహ్మ స్వరూపం లేదు । పరబ్రహ్మ స్వరూపం లేకుంటే । బ్రహ్మానుభవం లేదు ।

30. బ్రహ్మానుభవం లేకుంటే యే అనుభవం లేదు । యే అనుభవంలేకుంటే వక్కటైనా వికారంలేదు । వికారంలేకుంటే గుణాలు లేవు । గుణాలు లేకుంటే శరీరంలేదు । శరీరం లేకుంటే గుర్తెరిగే జ్ఞానం లేదు ।

31. గుర్తెరిగే చైతన్యానికి । సత్వగుణం కారణం ॥

**శృ॥ సత్వం సంజాయతే జ్ఞానం ।**

అని॥ భగవానులే । గుర్తెరిగే జ్ఞానానికి । సత్వగుణం కారణ అన్నాడు ॥ గుణాలు లేకుంటే గుర్తెరిగే జ్ఞానం లేదు । శరీరం లేదు । యెప్పటి ప్రపంచం । లేనిదే । సమస్త భ్రాంతులు । సమస్త వ్యవహారాలూ । శరీర భ్రాంతి తోటే పోయెను. ॥

32. ఇదే సత్యం, ఇంతకన్న యెక్కువ లేదు, కలదోచిన శరీరాలు యేలాగో ఆలాగే, మూలం లేని ఈ గుర్తెరిగే శరీరం యేమిలేదు, ఈ ఉత్తబట్టబయలు యేమిలేదు, ఇదే సిద్ధాంతం. సిద్ధాంతమే రాద్ధాంతము. ఇది గురుశిష్య న్యాయము చేతనే బోధ పడగలదు.

గద్య:

**ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే । వేదాంత విచారణే । ఉత్తరభాగే ।**

**భ్రాంతి రహిత ప్రకరణం । పరాపరప్రకృతి ద్వయదోష రహితము**

**ద్వాదశ అధ్యాయం సమాప్తం**



**శ్రీ శివరామ దీక్షిత అచలగురు చరణారవిందార్పణమస్తు**

# 16. సంశయ నివృత్తి

## భావార్థ దీపిక మరియు అనుభవామృతము

1. సర్వదా । మాం । అహం । ప్రత్యక్ష్ తన్యాఖ్యః । మాయారహిత త్వాత్ తస్మాత్ । కదాచిత్ । మాయానవేదితం । ఆదర్శన । స్వభావాత్ । అవ్యక్తమితి ।

2. ప్రశిద్ధమేవ । అవ్యక్తంనామ । అదర్శనం । అదర్శనాత్ । పునర్దర్శనం గతా । ఇతిశృతే । విద్యుదభ్రమ। నిమేషవత్ ।

3. పురుషవత్ । పాషాణాగ్నివత్ । వసంతకాలేగహినే । అగ్నిజాతవత్ । ఖద్యోతవత్ । తస్మాత్ । సర్వదా । అంతరేనాస్తి । బాహ్యేనాస్తి । ద్వైతాపేక్షయా ।

4. కాష్ఠాది సహాయేన సామధ్యత్వేన జాత చిదగ్నివత్ । స్వయంప్రకాశమానత్వాత్ ఊష్ణస్వభావాత్ । దాహకసామధ్యత్వాత్ । యావత్పర్యంతమస్తి ।

5. తావత్ త్పర్యంతమేవ ।ప్రగల్బః । తత్ । చిదగ్నిః । తస్యమూలంనాస్తి । ఆగంతుకత్వాత్ । సామర్థ్యత్వేన ప్రశిద్ధిః ॥ యావదస్తి । తావత్పర్యంతమేవ ।

6. అస్తితిభ్రమ । విచారరహిత త్వాత్ । విచారేణ అస్తితి ।సర్వశూన్యమేత గర్జితవత్ । శంఖనాదవత్ । బేర్యాది వాయిద్య విశేషవత్ । అష్ఠహాసవత్ । దుఃఖవత్ ।

7. వుదరరోగవత్ । తద్వత్ । కథాచిత్కమేవ । చిదగ్నిః । అసదృశత్వాత్ । శశివిషాణవత్ । వంధ్యాపుత్రవత్ । ఖపుష్పవత్ । నరశృంగవత్ ।

8. తస్మాత్ । మిధ్యాజ్ఞానేన । మిధ్యాభ్రాంతిః । మిధ్యాజ్ఞానస్య లక్షణం । క్షేత్రాదికో నామకా శరీరాదికిం జానాతి । వేత్తివిజానాతి । విజ్ఞానంచ ప్రశిద్ధమేవ ।

9. ప్రత్యగాత్మేతి । ప్రకృతి। పురుషేతి । కూటస్తేఇ । బ్రహ్మేతి । ఆత్మేతి । క్షేత్రజ్ఞేతి । సచ్చిదానందేతి । పరమాత్మేతి। పరమేశ్వరేతి । ద్రష్టేతి । శృతేతి ।

10. యేవాది నిమిత్త జ్ఞాన స్వరూపిణి । జ్ఞానమేవ । జీవోపాధి : । తస్యైవ అద్వైత । సౌజ్ఞా । నిర్గుణ సౌజ్ఞామాయా విజ్ఞేతి సౌజ్ఞా । తస్మాత్ । వేదేనవేదితం ।

11. మిధ్యేతి దృఢాభ్యాసః । తధాచిత్ । జడభ్రాంతిరహితః । జన్మాదిభ్రాంతి రహితస్య । సర్వశూన్యత్వాత్ । సర్వశూన్యమితి । దృఢనిశ్చయమేవా । విచారస్యఫలం।

12. సయేవ బంధమోక్షరహిత ః। జ్ఞానాజ్ఞానరహితత్వాత్ ।అతీతంకోవేద । అంధపురుషవత్।
అలంవిస్తారభయాత్ । సుఖోనహమస్మీతి। వేదరహితేనవేద । తత్సమయే ।

13. అహంవృత్తి శూన్యత్వాత్ । సుఖం । కోవేద । దుఃఖం కోవేద ।
జ్ఞానస్యమూలంకిం । అజ్ఞానస్యమూలం । కింకోవేద । అహంవృత్తేః ।

14. జీవోపాధి ః । విలయేసతి । సమస్తవేదః । కోవేతి । అహం మాయేతి ।
తథామదితి । అహమితి । త్వమితి జ్ఞానమితి । అజ్ఞానమితి । భేదమితి బ్రాహ్మణోహం।

15. ఖండాలోహమితి । సగుణ నిర్గుణ వ్యవహారే । నివృత్తిస్వభావా ః పురుషసమయే ।
పటాటోపవత్ । స్వకాలే సత్యవద్భాతి । అగ్నివత్ । చంద్రవత్ । తత్వత్కదా ।

16. చిత్కమేవ । జ్ఞాపక ః । కదాచిత్కమేవ అంధకారవత్ । జ్ఞాపక రహితః ।
విచార రహిత ః । వుభయ రహితః । అహంవృతాత్యక్యజ్ఞాపక రహితత్వాత్ ।

17. సర్వశూన్యమస్తితి । నిశ్చయం । అహమేవ । జీవోపాధి । సహితః ।
తస్మాత్ తద్విచారవత్ । సర్వదా ఇదమేవ । విచారః । ఇదమేవ గురూపదేశః ।

18. వ్యవహారకాలే । భోజనకాలే । తదృఢాభ్యాసః । అయమేవచిత్ । జడరహితః
క్షేత్రక్షేత్రజ్ఞ రహితః । సగుణ నిర్గుణరహితః । ప్రకృతి పురుష రహిత।

19. జగజ్జీవ రహిత ః । సదసద్రరహితః జ్ఞానాజ్ఞాన । రహిత ః । బేధాబేధరహితః ।
పుణ్యాపాపరహితః । ధర్మాధర్మ రహితః । ప్రవృత్తినివృత్తి రహితః ।జీవేశ్వర రహితః

20. కూటస్థ బ్రహ్మ రహితః । బాహ్యేసర్వశూన్యమితి శృతిః । అంతరే ।
సర్వశూన్యమితి శృతిః అయమేవ సర్వేషాం । భావాభావ రహితః ॥

గద్యః

ఇతి అచలగురు శ్రీశివరామదీక్షిత ప్రభావే వేదాంత విచారణే ।
సంశయ నివృత్తి ప్రకరణం దీపిక షోడశ అధ్యాయం సంపూర్ణం

శ్రీశివరామదీక్షిత అచలగురు
చరణారవిందార్పణమస్తు

# గ్రంథ ముద్రణ విరాళ దాతలు :

| | | |
|---|---|---|
| శ్రీ జ్ఞానానంద కంద్యానం జంగయ్య గౌడ్ | నర్సప్పగూడ | రూ॥ 10,000/- |
| శ్రీ అలువాల నారాయణ గౌడ్ గారు | రంగాపూర్ | రూ॥ 10,000/- |
| శ్రీ దయానంద సిహెచ్ రాము గౌడ్ గారు | ఎల్బీనగర్ | రూ॥ 10,000/- |
| శ్రీ దయానంద వటపత్రశాయి గారు | మల్లేపల్లి | రూ॥ 5,000/- |
| శ్రీ భూమానంద బంటారం నారాయణ గౌడ్ గారు | నర్సప్పగూడ | రూ॥ 5,000/- |
| శ్రీ సత్యానంద యేనుగు రామచంద్రారెడ్డి గారు | గాజులగూడెం | రూ॥ 5,000/- |
| శ్రీ నిత్యానంద పెద్దోళ్ళ మాణిక్యరెడ్డి గారు | గాజులగూడెం | రూ॥ 5,000/- |
| శ్రీ కంద్యానం రామస్వామి గౌడ్ గారు | చందనవెల్లి | రూ॥ 5,000/- |
| శ్రీ కలాల్ వెంకటస్వామి గౌడ్ గారు | మాద్వార్ | రూ॥ 5,000/- |
| శ్రీ కలాల్ శ్రీనివాస్ గౌడ్ గారు | యాద్గిర్ | రూ॥ 5,000/- |
| శ్రీమతి లక్ష్మీ నారాయణ గారు | సైదాపూర్ | రూ॥ 5,000/- |
| శ్రీ గన్నోజు నిరంజనమ్మ నారాయణచారి గారు | పరిగి | రూ॥ 5,000/- |
| శ్రీ సహజానంద గంగుల రవీందర్ రెడ్డి గారు | జక్లపల్లి | రూ॥ 5,000/- |
| శ్రీ నిర్గుణానంద ప్రభాకర్ రెడ్డి గారు | పర్వేద | రూ॥ 5,000/- |
| శ్రీ నిర్గుణానంద బంగారు వీరన్న శిష్యబృందం | రంగారెడ్డిపల్లి | రూ॥ 5,000/- |
| శ్రీ గుల్లె వీరేశలింగం గారు | ఐనాపూర్ | రూ॥ 5,000/- |
| శ్రీ పూర్ణానంద రాగాల నాగేశ్వర్‌రావు గారు | సికింద్రాబాద్ | రూ॥ 5,000/- |
| శ్రీ పట్లూర్ బాల్‌రాజ్ గౌడ్ గారు | సిరిపురం | రూ॥ 5,000/- |
| శ్రీ మల్లయ్య కురుమ గారు | గాజులగూడెం | రూ॥ 5,000/- |
| శ్రీ మహేందర్ గౌడ్ గారు | చీమల్‌దరి | రూ॥ 5,000/- |
| శ్రీ తోట చంద్రయ్య గారు | రంగాపూర్ | రూ॥ 5,000/- |
| శ్రీ శాంతానంద శంకర్ లింగం గారు | తాండూరు | రూ॥ 3,000/- |
| శ్రీ భావానంద రాంరెడ్డి గారు | బన్నూరు, కర్నాటక | రూ॥ 2,500/- |
| శ్రీ సహజానంద నల్ల నాగిరెడ్డి గారు | చంద్రవంచ | రూ॥ 2,500/- |
| శ్రీ గంచం పోపతి బాయి గారు | గోయల్, గుజరాత్ | రూ॥ 2,500/- |
| శ్రీ గంచం ఊర్వశి గారు భీంజివాల | గుజరాత్ | రూ॥ 2,500/- |
| శ్రీ పూర్ణబోధాచార్య పాండురంగం గౌడ్ గారు | కమ్మెట | రూ॥ 2,500/- |
| శ్రీ వింజమూరి విఠలయ్య గౌడ్ గారు | గొల్లగూడెం | రూ॥ 2,500/- |

1978

| | | |
|---|---|---|
| శ్రీ శ్రద్ధానంద భారలింగం చారి గారు | కొండాయపల్లి | రూ॥ 2,500/- |
| శ్రీ పరమానంద సాయప్ప గారు | మాటూరు | రూ॥ 2,500/- |
| శ్రీ దన్నన్నోళ్ళ ప్రభాకర్ రెడ్డి గారు | గాజులగూడెం | రూ॥ 2,100/- |
| శ్రీ నిత్యానంద ముత్యాల పెంటయ్య గారు | తాళ్ళపల్లి | రూ॥ 2,000/- |
| శ్రీ కావలి రాజయ్య గారు | బస్తెపురం | రూ॥ 2,000/- |
| శ్రీ బేలె ముత్యాలు గారు | పటాన్‌చెరు | రూ॥ 2,000/- |
| శ్రీ సేవానంద వెంకటయ్య గౌడ్ గారు | గుముడాల | రూ॥ 2,000/- |
| శ్రీ నిత్యనిర్గుణానంద ఆనంద్ గౌడ్ గారు | కొండాయపల్లి | రూ॥ 1,600/- |
| శ్రీ మైసగల్ల వెంకటయ్య గారు | వెన్నచేడ్ | రూ॥ 1,500/- |
| శ్రీ శాంతానంద నారాయణ గౌడ్ గారు | గొండ్ల్యాల్ | రూ॥ 1,200/- |
| శ్రీమతి జవార్ బాయి గారు భీంజివాల | గుజరాత్ | రూ॥ 1,200/- |
| శ్రీ గోరెంక రవి గారు | కేరెల్లి | రూ॥ 1,116/- |
| శ్రీ సత్యానంద తిప్పన్న గారు | షేక్‌పేట్ | రూ॥ 1,116/- |
| శ్రీ పరమానంద గంతల శరణప్ప గారు | వెన్నచేడ్ | రూ॥ 1,116/- |
| శ్రీ శ్యామయ్య గారు | మాటూరు | రూ॥ 1,100/- |
| శ్రీ నిశ్చలానంద నారాయణ గౌడ్ గారు | ఖానాపురం | రూ॥ 1,100/- |
| శ్రీ నర్సింహ్మారెడ్డి గారు | మక్తగూడెం | రూ॥ 1,100/- |
| శ్రీ నిర్భయానంద జొన్నాడ దుర్గారావు గారు | సికింద్రాబాద్ | రూ॥ 1,000/- |
| శ్రీ పూర్ణానంద కాళిదాస్ గారు | క్యాతంపల్లి | రూ॥ 1,000/- |
| శ్రీమతి చిలకలపల్లి భారతమ్మ గారు | సంగారెడ్డి | రూ॥ 1,000/- |
| శ్రీ భక్తానంద కోట్ల ఆనందం గారు | కార్వాన్ | రూ॥ 1,000/- |
| శ్రీ విమలానంద విజయ్ కుమార్ గారు | ఈర్లపల్లి | రూ॥ 1,000/- |
| శ్రీ సహజానంద మొగులయ్య గారు | చంద్రవంచ | రూ॥ 1,000/- |
| శ్రీ సహజానంద వెంకటయ్య గౌడ్ గారు | భోగారం | రూ॥ 1,000/- |
| శ్రీ పూర్ణానంద కిష్టయ్య గారు | సాయిపూర్ | రూ॥ 1,000/- |
| శ్రీ విమలానంద సదానందం గారు-బృందావని | నర్సప్పగూడ | రూ॥ 1,000/- |
| శ్రీ శ్రీనివాసులు గారు | జంగంరెడ్డిపల్లి | రూ॥ 1,000/- |